# విష్ణు సహస్రనామ స్తోత్రమ్

## రహస్య ప్రకాశము

(టీకా తాత్పర్య సహితము)

ఆంగ్ల మూలము

కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య

తెలుగు వ్యాఖ్యానము

ఫిడూరు జగన్మోహనరావు

ది వరల్డ్ టీచర్ ట్రస్టు

హైదరాబాదు.

ప్రథమ ముద్రణ అక్టోబరు 1987
ద్వితీయ ముద్రణ ఆగష్టు 1995

వెల : రూ. 58/-

ది వరల్డ్ టీచర్ ట్రస్టు
వేదభూమి
12-2-417/ఎ/8, జయనగర్,
గుడిమల్కాపూరు, హైదరాబాదు - 500 028.

ముఖచిత్రం :
**బుజ్జి**

ముద్రణ :
**సాయిబాబా గ్రాఫిక్స్**
కె.బి. కాంప్లెక్స్, విద్యానగర్, హైదరాబాదు.

# అంకితం



జననం : 20-2-1952 కైవల్యం : 6-6-1995

ప్రియ సోదరుడు, ప్రేమశీలియైన

శ్రీ కె. వి. యన్. సోమయాజులు

చిరునవ్వులు చిందిస్తూ సల్లాపాలతో అందరినీ మరపించి

తాను ఆనందమయ లోకాలలోనికి అస్తమించిన ధన్యజీవికి

ఈ గ్రంథము సమర్పణం.

# ముందు మాట

(ప్రథమ ముద్రణ)

"ఓం" కారమే ఈ సమస్త సృష్టికి బీజము. కనుకనే ప్రణవము వేదమునకు మూలమై యున్నది. అట్లు ప్రణవముగా నుచ్చరింపబడిన ఈ సృష్టి మొట్టమొదట పరా, పశ్యంతి, మధ్యమ, వైఖరీ వాక్కులను నాలుగు స్థితులుగా సృష్టికర్తయైన బ్రహ్మచేనుచ్చరింపబడినది. ఇవియే నాలుగు వేదములనియు, బ్రహ్మయొక్క నాలుగు ముఖములనియు కీర్తింపబడినవి. ప్రణవమునందు సృష్టి మొత్తము బీజమైయుండి, అది సృష్టిగా విస్ఫారితయే పురుషసూక్తమునందు గానము చేయబడినది. మరల ఈ అంశమే మరింత విస్తృతముగా, నారాయణుని అస్తిత్వము, ఆయన సృష్టియందు వ్యక్తమగు రీతులను గూర్చి వేదమునందు అనేక ఋక్కులలో ముఖ్యముగా పంచోపనిషత్తుల యందలి నారాయణము లేక మహానారాయణోపనిషత్తునందు విశేషముగా గానము చేయబడినది. ఇందలి ఋక్కులయందు నారాయణుడు ఇంద్రుడు, సోముడు, వరుణుడు, అగ్ని మున్నగు దేవతల రూపమున వ్యక్తమైన విధానముతోబాటు నారాయణుని ధ్యానము చేయవలసిన విధానము. ఈ సమస్త సృష్టియందు నారాయణుడు జీవులు, దేవతలు మున్నగు రూపములతో ఆయా లోకములయందు వర్తించుచున్న విధానము, మిక్కిలి విస్తృతముగా గానము చేయబడినది. (ఇది మహానారాయణోపనిషత్తు అను పేర వేరుగా వ్యాఖ్యానముతో ప్రచురింపబడినది) మరల ఈ అంశమే వేదవ్యాసునిచే విష్ణుపురాణమను పేర నారాయణుని అవతార కథలుగా, సృష్టి క్రమముగా అవే విషయములు మరింత వివరములతో వర్ణింపబడినవి. ఈ వస్తువే తిరిగి మహాభాగవతమను పేర అనేక ఉపాఖ్యానములతో నారాయణుని అవతార కథలుగా వర్ణింపబడినది. ఈ మహాభాగవతము కేవలము చదువుట చేతనే జీవుని కైవల్య స్థితియందుంచ గల్గిన సద్గ్రంథము. ఇదే వస్తువు అంతకుముందు విష్ణు సహస్రనామ స్తోత్రముగా మహాభారతమునందు భీష్మునిచే ధర్మరాజునకు ఉపదేశింపబడినది.

అట్లు ప్రణవమను బీజమునుండి మహా భాగవతము వరకు వట వృక్షముగా విస్తరించి, వ్యాపించిన ఒకే అంశమే నారాయణుడు. హృదయమున నేనను ప్రజ్ఞగా మేలుకొనిన నారాయణుడు, బుద్ధిగా, మనస్సుగా, ఇంద్రియములుగా, భౌతిక దేహముగా అందలి అవయవములు మరియు ధాతువులుగా మన విస్తరించెను. ఇదియే సూక్ష్మముగా వేదమున ప్రతిపాదింపబడి, పురాణములయందు కథలుగా విస్తృతి చెందినది. సకల జీవుల భౌతిక దేహములు, నారాయణుని విగ్రహములుగా సేవించి, అర్చించువాని జీవితమే వేదము లేక ప్రణవ నాదము. ఈ ఒక్క అంశము జీవులకు ఉపదేశించుటయే పెద్దల సంకల్పము. వారే మహర్షులు, పరమ గురువులు. సృష్టియందలి బీజము, వృక్షము, మరల బీజము అను చక్రాకార గమనముగా వర్తించుచున్న పరమాత్మ యొక్క అస్తిత్వమే చక్రమని చెప్పడినది. ఇదియే విష్ణు చక్రము. అందు విష్ణువును గమనించి ధ్యానించువారికి ఇది అభయమునిచ్చి మోక్ష స్థితియందు నిలుపును. అట్లు గమనింపలేనివానికి ఇదియే కాలమను పేర విష్ణుచక్రమై పరిస్థితులు, వ్యక్తులు, రాగద్వేషములను రూపమున శిక్షించును.

ఇట్టి చక్రాకారమైన సుడిగుండమునబడి నశించు జీవులకు విష్ణువు నుపాసించుటయే తరుణోపాయము. అట్టి మార్గమే ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమున ప్రతిపాదింపబడినది. ఇందలి నామములన్నియు సృష్టియందు మనము గమనించు వ్యక్తులకు, పరిస్థితులకు ప్రతిరూపములు. కనుక ఒక్కొక్క నామమును ధ్యానము చేయువానికి అట్టి పరిస్థితులలో విష్ణువు వాని హృదయమున మేలుకొని మాయనుండి రక్షించును. కనుక విష్ణుమాయను తరింపవలె నన్నచో విష్ణువు నుపాసించుటయే మరల మార్గమగు చున్నది. ఇట్లు విష్ణువును సమస్త సృష్టిగా, అందలి వస్తువులుగా, వ్యక్తులుగా ధ్యానముచేయు విధానమున విష్ణువు యొక్క నామములు సూత్రీకరింపబడి, విష్ణు సహస్రనామ స్తోత్రమనుపేర గ్రంథస్థము చేయబడినవి. ఇందొక్కొక్క నామము తీసుకొని. అందలి అంతరార్థమును, మనస్సు దానిపై నిలిచినంత కాలము ధ్యానము చేయవలెను. ఇది కొన్ని నిముషములో గంటలలో, రోజులో కావచ్చును. ఇట్లు అన్ని నామములు ధ్యానము చేయవలెను. అట్లు ధ్యానము చేయుటకు దినమంతయు కదలకుండ కూర్చొననక్కరలేదు. దైనందిన కార్యక్రమములను చక్కబెట్టుకొనుచునే మనస్సులో ధ్యానము చేసుకొనవచ్చును. ఏదైన ఒక నామమునందు మనస్సు పూర్తిగా నిల్చినచో, ఆ నామమునే నిరంతరము ధ్యానము చేయవలెను. మిగిలిన నామములను గూర్చి ఆతురత పడనక్కరలేదు.

విష్ణువు మనకా నామమునే ధ్యానము చేయమని చెప్పెనని అర్థము. ఇట్లు ధ్యానము చేయుటకనువుగా ఇందు వివరణ ఇవ్వబడినది.

ఈ గ్రంథమునకు ఆంగ్లమున గురువర్యులైన కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య గారిచే వ్యాఖ్యానము వ్రాయబడినది. ఆయన వేద వేదాంగములను, పురాణములను ఆకళింపు చేసుకొని, వానియందలి విషయము సామాన్య జనులకు అందింపవలెనని పరితపించి దీక్ష వహించెను. అనేక గ్రంథములు రచించి, వేద వాఙ్మయమును పామర జనులకు అందుబాటులోకి తెచ్చెను. బ్రహ్మవిద్యను ఇట్లు పామరులకు సహితము కరతలామలకమగునట్లు చెప్పగలిగెనన్నచో, ఆయన నారాయణుని అంశగా వచ్చెననుటకు వేరుగా ఋజువేమి కావలయును. ఆయన ఆంగ్లమున మిక్కిలి సూక్ష్మముగా చిత్రముగా, వినూత్న పద్ధతిలో దీనికి వ్యాఖ్యానము నిచ్చెను. ఆయన వ్యాఖ్యానమొక హిమవత్పర్వతమైనచో, అందుండి అందలి మంచు కరిగి నీటి ప్రవాహమై రాగా అట్టి ప్రవాహమునకు ఆనకట్టలు కట్టి కాలువలు తీయ ప్రయత్నము వంటిది, నేను తెలుగునందు చేసిన ఈ వ్యాఖ్యానము. ఆయన ఇచ్చిన విషయము ఏ సహస్రాంశమైనను నా యీ వ్యాఖ్యానమునందు ప్రతిబింబించినచో నాయీ ప్రయత్నము సఫలీకృతమైనట్లే. ఇందు విషయమనగా పదములు, అర్థము, భావము, విశేషాంశములు మున్నగునవిగాక అవి చదువుచున్నప్పుడు మనయందు కలుగు తన్మయత్వము అనగా విష్ణుభక్తితో పరవశించుట. ఇది ప్రతిబింబింపని గ్రంథ మేదియైననూ ఎట్టి గొప్ప గ్రంథమైననూ నిరుపయోగము.

ఇందలి వ్యాఖ్యానము నేను తెలుగునందు పూర్తిగా స్వతంత్రముగా చేసితిని. అనగా ఇది అనువాదము సూటియైన కాదు. నేను భావమును మాత్రమే తీసుకొని భాషా వ్యక్తీకరణ, వివరణ మున్నగు వానియందు పూర్తి స్వతంత్రము వహించితిని. కాని ఇందు చెప్పబడిన అంశములన్నియు కులపతి యొద్ద విన్నవి, నేర్చుకొన్నవేకాని స్వతంత్రములు కావు. ఇంకొక అంశమేనగా ఈ వ్యాఖ్యానమునందు నేను చాలా వరకు వ్యావహారిక భాషనే ఉపయోగించితిని. చాలా చోట్ల వ్యాకరణ దోషములను పట్టించుకొనకపోవుటకు క్షంతవ్యుడను. దీనికి కారణము ఈ గ్రంథము మిక్కిలి పామరులు సహితము చదువుకొనవలెనను తాపత్రయమే కాని వేరు కాదు.

ఈ గ్రంథము నేను వివరించుచుండగా వ్రాసిపెట్టినవారు అనేకులు కలరు. వారిలో ముఖ్యులు సోదరి శ్రీమతి డి. కమలమ్మగారు. రాత్రింబగళ్ళు

శ్రమించి ఎప్పటికప్పుడు వ్రాసిపెట్టి సహకరించినది. అట్లే శుద్ధ ప్రతిని కూడ అంతే శ్రద్ధతో వ్రాసిపెట్టిన మరియొక సోదరి శ్రీమతి కె. ఆనందమయిదేవి. ఈ గ్రంథము పుస్తక రూపములోనికి వచ్చుటకు సారధియై నిలిచినవారు శ్రీ జటావల్లభుల కృష్ణసోమయాజులుగారు. అన్ని బాధ్యతలు తానే స్వీకరించి నాతో '' ఇట్టి సద్గ్రంధములు, విషయములు వ్రాయుట. వివరించుట మాత్రమే మీరు చేయవలసిన పని. మిగిలినది మేము చూచుకొందు''మని ఆయన నన్ను శాసించెను. గ్రంథము అచ్చుగుటయందు ఒడుదుడుకులు ఏర్పడి ఆలస్యము కాగా, అచ్చువేయుట తాను స్వయముగా పర్యవేక్షించి శరవేగమున పుస్తకము సిద్ధము చేయించిన మరియొక సోదరులు శ్రీ ఆర్టు ప్రింటర్స్ ప్రొప్రైటర్ శ్రీ డి.వి. పురుషోత్తమరావు గారు. ఇంకను సువర్ణ ప్రింటర్సు వారును. రాత్రింబవళ్ళు శ్రమించిరి. ఈ గ్రంథము అచ్చుగుటకు రాత్రింబగళ్ళు నిద్రాహారములు మాని ''ప్రెస్''లో పనివారితో కలసి మెలసి పనిచేసినవాడు చిరంజీవి డి. పాండురంగ విఠలు, ఇందు మరియొక విచిత్రమేమనగా నా వివరణ మొట్టమొదట గ్రంథస్థము చేసిన శ్రీమతి డి. కమలమ్మగారు తల్లికాగా ఆమె కుమారుడైన డి.పి. విఠల్ దానికి పుస్తక రూపము కల్పించెను. నారాయణుడు కల్పించు వినోదములలో నిదియొకటి. ఇట్లు తల్లి కొడుకులు, తండ్రి కుమారులు కుటుంబములు కుటుంబములుగా ఒకే ధర్మమును ఆచరించుటయే సంప్రదాయమనబడును. ఇట్టి సత్సాంప్రదాయములతో కూడిన కుటుంబములే భారతదేశ సర్వస్వము.

ఇది కాక ఈ గ్రంథ ప్రచురణకు అనేకులు ధనసహాయము చేసిరి. మరికొందరు ప్రచురణ పూర్వ మూల్యములను వసూలుచేసిపెట్టి సహకరించిరి. ఇట్లు ఇంకను ప్రత్యక్షముగా, పరోక్షముగా సహకరించినవారు అనేకులు కలరు. వీరందరు నాకు సహకరించిన విధానము చూడగా విష్ణువు ఇన్ని రూపములతో వర్తించుచున్నాడని నాకు జ్ఞానోదయమైనది. వీరందరి యందును గల విష్ణువు వీరి జీవితములను సుఖమయములు, ఆనందమయములుగా చేసి, ఇందరుగానున్న ఇన్ని వెలుగులను ''తాను'' అను ఒకే వెలుగున నిలుపుకొనును గాక.

హైద్రాబాద్
ప్రభవ భాద్రపద శుక్లపాడ్యమి
25-8-1987

ఇట్లు
విధేయుడు
**పిడూరు జగన్మోహనరావు**

యుగముల తరబడి మానవునకు ప్రసాదింపబడిన శాశ్వత జ్ఞానమును వెదజల్లుటకై స్థాపించబడినదీ గ్రంథ ప్రచురణ సంస్థ. ఈ గ్రంథముల వలన కలుగు ఆదాయము ఇట్టి గ్రంథముల పునః ప్రచురణ చేసి సత్యమును వెదజల్లుటకై మాత్రమే వినియోగింపబడును.

పొత్తూరి వెంకటేశ్వరరావు
హైదరాబాదు.
ఎడిటర్ ఆంధ్రప్రభ,

# అభివందనం

ఉన్న దనుకొని సాధన చేస్తేనే ఆత్మను తెలుసుకోవటం సాధ్యమవుతుంది. అలా సాధన చేసేవారు ఆస్తికులు. '' ఆస్తిత్యేవోపలబ్ధవ్యః'' అన్న శృతి వాక్యాన్ని పెద్దలు ఈ సందర్భంలో జ్ఞాపకం చేస్తారు. సాధన మార్గాలలో ఒకటి, స్తోత్ర పఠనం. గీతాపఠనమూ సాధన మార్గమే.

స్తోత్రం అంటే అంతటివాడవని. ఇంతటి వాడవని, పొగడడం కాదు. అది వాడుకలోకివచ్చిన అర్థం. అది అసలు అర్థం కాదు. స్తోత్రాలు భగవంతుడిని తెలుసుకొనడానికి సాధనాలు. దైవం గమ్యమైతే స్తోత్రం తన్మార్గం.

స్తోత్రాలను జపాభ్యాసం కోసం కొందరు స్వీకరిస్తే. జ్ఞాన ప్రధానమైనవిగా మరికొందరు స్వీకరిస్తారు. భగవద్గీతను, సుందర కాండను, విష్ణుసహస్ర నామాలను పారాయణం చేసేవారిలోనూ కొందరు ఐహిక ప్రయోజనాలను కోరితే, మరి కొందరు పారమార్థికాన్ని ఆశిస్తారు. ఇది ఎప్పటినుంచో జరుగుతూ ఉన్నదే.

పరంపరానుగతంగా మనకు ఈ పుణ్యభూమిలో లభించిన జ్ఞాన ఖనుల నుంచి ఎవరి శక్తి కొలది వారు జ్ఞాన సముపార్జన చేయవచ్చు. ఎవరెంత తవ్వినా ఎప్పుడూ తరగని ఖనులవి.

భగవద్గీతకు అసంఖ్యాకంగా వ్యాఖ్యానాలు వచ్చాయి. ఎవరి దృక్కోణం వారిది. అద్వైత, ద్వైత, విశిష్టాద్వైతమతాల వారి వ్యాఖ్యానాలు అందులో ఉన్నాయి. సుందరకాండకు అన్ని వ్యాఖ్యానాలు రాలేదు కాని స్వల్ప సంఖ్యలో దానికీ వచ్చాయి. అంతకంటే తక్కువ సంఖ్యలో విష్ణుసహస్రనామాలకు వ్యాఖ్యానాలు వచ్చాయి.

విష్ణుసహస్రనామాలకు శంకర భాష్యం ప్రసిద్ధమైంది. అది అద్వైతమతానుగుణమైనదని అన్యమతావలంబకుల అభిప్రాయం, రామానుజుల ఆదేశానుసారం పరాశర భట్టారులు ఒక వ్యాఖ్యరాశారు. భాషాగ్రంథాలలో దానికొక గౌరవ

స్థానం లభించింది. శ్రీ సత్యసంధతీర్థుల విష్ణుసహస్రనామ భాష్యం సైతం అలాగే ప్రసిద్ధమైనది.

శ్రీ కృష్ణుని సమక్షంలో భీష్ముడు ధర్మరాజుకు చెప్పిన శ్రీ విష్ణు సహస్రనామాలు ఎంత అర్థవంతమైనవో ఈ మూడు భాష్యాలు చదివితే తెలుస్తుంది. చదివితేనే గాని వాటి అధ్యాత్మిక రహస్యాలు అవగతంకావు.

మహామనీషి ఆచార్య ఎక్కిరాల కృష్ణమాచార్యగారు (మాస్టర్ ఇ.కె.) త్రిమతాలకు అతీతంగా శ్రీ విష్ణు సహస్రనామాలకు అర్థం చెప్పారు. వివరణలు ఇచ్చారు. అందులోని నిగూఢ సందేశాలను వెల్లడిచేశారు. అది ''రహస్య ప్రకాశము''. 'ఇ.కె.' గారు ఇంగ్లీషులో చేసిన రచనను శ్రీ పిడూరు జగన్మోహనరావుగారు తెలుగులోకి అనువదించారు. జగన్మోహనరావు గారి అనువాదం చదివితే అది సహజ రచన అనిపిస్తుందేగాని ఒక భాషలో నుంచి మరొక భాషలోకి మార్చినదని అనిపించదు. 'ఇ.కె.' ఇంతకు ముందే రాసిన భాగవత వ్యాఖ్యాన గ్రంథాలను చదివినవారు ''విష్ణుసహస్రనామ స్తోత్రం'' రహస్య ప్రకాశాన్ని తెలుగులో చదివితే ''అదే భాష, అదే శైలి'' అనిపిస్తుంది. శ్రీ జగన్మోహనరావు గారు ఎంతో సాధన చేసి వుంటేనే గాని ఇది సాధ్యం కాదు.

''ఇ.కె.'' గారి వ్యాఖ్యానాన్ని గురించి నేను వ్యాఖ్యానించడం సాహసమనిపించుకొంటుంది. అది దివ్యవాణి, '' ఇ.కె.' వాణిని తెలుగులో వినిపించిన శ్రీ జగన్మోహనరావు ధన్యులు.

**పొత్తూరి వెంకటేశ్వరరావు.**

మల్లాది చన్ద్రశేఖర శాస్త్రి
''పౌరాణిక సార్వభౌమ''
''పురాణోపన్యాస కేసరి''

తిరుపతి
19-9-87

మానవునికి మోక్షసాధనములలో శ్రీ విష్ణు సహస్ర నామస్తోత్రము చాలా శ్రేష్టమైనదిగా చెప్పబడినది. ఐహికాముష్మికములకు ప్రధాన సాధనముగా చెప్పారు. అందులో విశేషించి కలియుగములో చాలా సులభ సాధనముగా చెప్పారు.

''కిం జపన్ముచ్యతే జంతుర్జన్మ సంసార బంధనాత్''

అని ధర్మరాజు భీష్ముని అడుగుటచే ఇది జపించ దగినదనియు ఉపాసనమునకు చాలా ముఖ్యమనియూ కన్పడుచున్నది.

''కోధర్మ స్సర్వధర్మాణాం భవతః పరమోమతః''

ఏ ధర్మము అన్ని ధర్మములకూ శ్రేష్ట ధర్మము? అని అడిగియుండుటచే ధర్మములలో పరమ ధర్మమనియూ గోచరించుచున్నది. భీష్ముడంటాడు.

''జగత్ప్రభుం దేవదేవ మనంతం పురుషోత్తమం
స్తువన్నామ సహస్రేణ నిత్యం భక్తి నమన్వితః''

జగత్తులకు ప్రభువు దేవదేవుడు. ఆది మధ్యాంతరహితుడగు పురుషోత్తముని భక్తితో స్తోత్రము చేయదగినది అంటాడు. కాన ఇది ముఖ్యముగా పారాయణ గ్రంధము. ఉపాసించదగినదిగా గోచరించుచున్నది. ఇది కలిలో యదాధికారముగా భావించి, అనుష్ఠించి ఉపాసించి, జపించదగుననుట పెద్దలందరి కభిమతమైనది. మతాచార్యులందరూ దీనిని పరమోత్కృష్టమైనదిగా భావించారు.

శ్రీ శంకర భగవత్పాదులు ఇది మోక్ష విద్యయనియూ ఈ నామములు పరబ్రహ్మను సూచించుచున్నట్లుగా వ్యాఖ్యానించారు. అయిననూ ఇది పారాయణమునకు చాలా ముఖ్యమైనదిగా చెప్పియున్నారు.

''గేయం గీతానామసహస్రం ధ్యేయం శ్రీపతిరూపమజస్రం'' భగవద్గీత

ఈ విష్ణు సహస్రనామము నంతతము గానము చేయదగినట్లు స్పష్టము చేసినారు - పరబ్రహ్మ సూచనలలో తత్వరహస్య భావన చేయవచ్చును గానీ,

ఉపాసించునది సాక్షాత్తు బ్రహ్మ స్వరూపముగాదు. అన్ని ఆశ్రమములకు అన్ని వర్ణములకూ ఆదరణీయమైన మహోత్తమ గ్రంథముగా శోభించుచున్నదీ విష్ణు సహస్రనామ స్తోత్రము. దీనిని భావించువారి బుద్ధిబలమునుబట్టి అనేక విధములుగా రాణింపవచ్చును. అందులో చాలా పరిశ్రమించి ఈ రహస్య ప్రకాశము తయారుచేసినారు. మూలగ్రంథమును రచించిన శ్రీ కృష్ణమాచార్యుల గారి బహుముఖ ప్రజ్ఞ అమూల్యము, అద్భుతము. ఇందు రూఢ్యర్థములు గాని, యౌగికార్థములనుగానీ పూర్వులుపయోగించినవే గ్రహించక, సందర్భమునుబట్టి వారి ప్రజ్ఞాపాటవములు స్పష్టము చేసినారు. ఇందు స్థాలీపులాకములుగా కొన్ని చూపించుచున్నాను.

''స్వయంభూశ్శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః''

ఈ నామములలో స్పష్టముగా వ్యక్తమగుచున్న స్వయంభూ పదమునకు బ్రహ్మ, శంభు పదమునకు శివపారమ్యమును వదలి వారు నిర్దేశించదలచిన తత్త్వము రహస్యమునే స్పష్టము చేసి నారాయణ ప్రధానముగా నిరూపించారు. ఇది చాలా గొప్ప ప్రతిభ.

''సద్గతి స్సత్కృతి సత్తా సద్భూతి స్సత్పరాయణం''

అన్నప్పుడు గూడా సత్తా అను దానికి సన్మార్గమున జీవించుట అని వ్రాశారు. ఇలా చాలా విశేషములను మనకు చూపించారు. శ్రీ కృష్ణమాచార్యులవారి భావనాపాటవమును బాగా జీర్ణించుకొననిచో ఈ గ్రంథమును అనువదించు పని సామాన్యముగా దుర్లభము - అసలు భాషాంతరీకరణమే చాలా కష్టమైనపని. ఇట్టి మహోత్కృష్ట గ్రంథమందు రహస్యములను ప్రకాశింపచేయుట చాలా క్లిష్టమైనపని.

ఈ పనిని చాలా శ్రమచేసి గ్రంథకర్త భావమును మథించి తమ రచనా విధానమున దానిని పరిపుష్టము చేసిన శ్రీ పిడూరు జగన్మోహనరావు గారు బహుధా ప్రశంసనీయులు. నేను గ్రంథమును సాకల్యముగా చూడలేక పోయిననూ అందలి గాంభీర్యస్ఫోరక రచనా విధానము బాగా ఆకట్టుకొనినది.

విద్వద్విధేయుడు

**మల్లాది చన్ద్రశేఖర శాస్త్రి**

# శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రమ్

ఓం నమో నారాయణాయ

ఓం నమోభగవతే వాసుదేవాయ

శ్రీ విష్ణవేనమః

శుక్లాంబరధరం విష్ణుం శశివర్ణం చతుర్భుజమ్
ప్రసన్న వదనం ధ్యాయేత్ సర్వవిఘ్నోపశాంతయే ॥
యస్య ద్విరదవక్త్రాద్యాః పారిషద్యాః పరశ్శతమ్
విఘ్నం నిఘ్నంతి సతతం విష్వక్సేనం తమాశ్రయే ॥
వ్యాసం వశిష్ఠనప్తారం శక్తేః పౌత్రమకల్మషమ్
పరాశరాత్మజం వందే శుకతాతం తపోనిధిమ్ ॥
వ్యాసాయ విష్ణురూపాయ వ్యాసరూపాయ విష్ణవే
నమోవై బ్రహ్మనిధయే వాసిష్ఠాయ నమో నమః ॥
అవికారాయ శుద్ధాయ నిత్యాయ పరమాత్మనే
సదైకరూపరూపాయ విష్ణవే సర్వజిష్ణవే ॥
యస్య స్మరణమాత్రేణ జన్మ సంసార బంధనాత్
విముచ్యతే నమస్తస్మై విష్ణవే ప్రభవిష్ణవే ॥
ఓం నమో విష్ణవే ప్రభవిష్ణవే

*********

శ్రీ వైశంపాయన ఉవాచ :

శ్రుత్వా ధర్మా నశేషేణ పావనాని చ సర్వశః
యుధిష్ఠిరః శాంతనవం పునరేవాభ్యభాషత ॥ 1

యుధిష్ఠిర ఉవాచ :

కిమేకం దైవతం లోకే కింవాఽప్యేకం పరాయణమ్
స్తువంతః కం కమర్చంతః ప్రాప్నుయుర్మానవా శ్శుభమ్ ॥ 2

కో ధర్మః సర్వధర్మాణాం భవతః పరమో మతః

కిం జపన్ముచ్యతే జన్తుర్జన్మ సంసార బంధనాత్ ॥ 3

శ్రీ భీష్మ ఉవాచ :

జగత్ప్రభుం దేవదేవమనంతం పురుషోత్తమమ్
స్తువన్నామసహస్రేణ పురుషః సతతోత్థితః ॥ 4

తమేవ చార్చయన్నిత్యం భక్త్యా పురుషమవ్యయమ్
ధ్యాయంస్తువన్నమస్యంశ్చ యజమానస్తమేవచ ॥ 5

అనాదినిధనం విష్ణుం సర్వలోకమహేశ్వరమ్
లోకాధ్యక్షం స్తువన్నిత్యం సర్వదుఃఖాతిగో భవేత్ ॥ 6

బ్రహ్మణ్యం సర్వధర్మజ్ఞం లోకానాం కీర్తివర్ధనమ్
లోకనాథం మహద్భూతం సర్వభూతభవోద్భవమ్ ॥ 7

ఏషమే సర్వధర్మాణాం ధర్మో ఽధికతమో మతః
యద్భక్త్యా పుండరీకాక్షం స్తవైరర్చేన్న రస్సదా ॥ 8

పరమం యో మహత్తేజః పరమం యో మహత్తపః
పరమం యో మహద్బ్రహ్మ పరమంయః పరాయణమ్ ॥ 9

పవిత్రాణాం పవిత్రం యో మంగళానాం చ మంగళమ్
దైవతం దేవతానాంచ భూతానాం యో ఽవ్యయః పితా ॥ 10

యతస్సర్వాణి భూతాని భవంత్యాది యుగాగమే
యస్మింశ్చ ప్రళయం యాంతి పునరేవ యుగక్షయే ॥ 11

తస్యలోక ప్రధానస్య జగన్నాథస్య భూపతే
విష్ణోర్నామసహస్రం మే శృణు పాపభయాపహమ్ ॥ 12

యాని నామాని గౌణాని విఖ్యాతాని మహాత్మనః
ఋషిభిః పరిగీతాని తాని వక్ష్యామి భూతయే ॥ 13

ఋషిర్నామ్నాం సహస్రస్య వేదవ్యాసో మహాముని

ఛందో 2నుష్టుప్తథా దేవో భగవాన్ దేవకీసుతః ॥ 14

అమృతాంశూద్భవో బీజం శక్తిర్దేవకీనందనః
త్రిసామా హృదయం తస్య శాంత్యర్థే వినియుజ్యతే ॥ 15

విష్ణుం జిష్ణుం మహావిష్ణుం ప్రభవిష్ణుం మహేశ్వరమ్
అనేకరూపదైత్యాంతం నమామి పురుషోత్తమమ్ ॥ 16

అస్య శ్రీ విష్ణోర్దివ్యసహస్రనామ స్తోత్రమహామంత్రస్య శ్రీ వేదవ్యాసో భగవానృషిః। అనుష్టుప్ఛందః। శ్రీ మహావిష్ణుః పరమాత్మా శ్రీ మన్నారాయణోదేవతా। అమృతాంశూద్భవో భానురితిబీజమ్। దేవకీ నందనః స్రష్టేతిశక్తిః। ఉద్భవః క్షోభణోదేవ ఇతి పరమో మంత్రః। శంఖభృన్నందకీ చక్రీతి కీలకమ్। శార్ఙ్గధన్వా గదాధర ఇత్యస్త్రమ్। రథాంగ పాణిరక్షోభ్యః ఇతి నేత్రమ్। త్రిసామాసామగస్సామేతికవచమ్। ఆనందం పర బ్రహ్మేతియోనిః। ఋతుస్సుదర్శనః కాల ఇతి దిగ్బంధః। శ్రీ విశ్వరూప ఇతిధ్యానమ్। శ్రీ మహావిష్ణు ప్రీత్యర్థే సహస్రనామజపే వినియోగః ॥

ధ్యానమ్ :

క్షీరోదన్వత్ప్రదేశే శుచిమణివిలసత్సైకతే మౌక్తికానాం
మాలాక్లప్తాసనస్థః స్ఫటిక మణినిభైర్మౌక్తికైర్మండితాంగః।
శుభ్రైరభ్రైరద భ్రైరుపరివిరచితై ర్ముక్తపీయూషవర్షై
రానందీ నః పునీయాదరినళినగదాశంఖపాణిర్ముకుందః ॥

భూఃపాదౌ యస్యనాభిర్వియదసురనిలశ్చంద్రసూర్యౌచ నేత్రే
కర్ణావాశాశ్శిరోద్యౌర్ముఖమపి దహనోయస్యవాస్తే యమబ్ధిః।
అంతస్థం యస్య విశ్వం సురనరఖగగోభోగిగంధర్వదైత్యైః
చిత్రం రంరమ్యతేతం త్రిభువనవపుషం విష్ణుమీశం నమామి ॥

శాంతాకారం భుజగశయనం పద్మనాభం సురేశం
విశ్వాకారం గగనసదృశం మేఘవర్ణం శుభాంగమ్ ॥
లక్ష్మీకాంతం కమలనయనం యోగిహృద్ధ్యానగమ్యం
వందే విష్ణుం భవభయహరం సర్వలోకైకనాథమ్ ॥
మేఘశ్యామం పీతకౌశేయవాసం

శ్రీవత్సాంకం కౌస్తుభోద్భాసితాంగమ్ ।
పుణ్యోపేతం పుండరీకాయతాక్షం
విష్ణుం వందే సర్వలోకైకనాథమ్ ॥

॥ హరిః ఓమ్ ॥

*********

విశ్వం విష్ణుర్వషట్కారో భూతభవ్యభవత్ప్రభుః
భూతకృద్భూతభృద్భావో భూతాత్మా భూతభావనః ॥ 1
పూతాత్మా పరమాత్మా చ ముక్తానాం పరమాగతిః
అవ్యయః పురుషః సాక్షీ క్షేత్రజ్ఞో 2క్షర ఏవ చ ॥ 2
యోగోయోగవిదాం నేతా ప్రధానపురుషేశ్వరః
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥ 3
సర్వః శర్వః శివః స్థాణుర్భూతాదిర్నిధిరవ్యయః
సంభవో భావనో భర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥ 4
స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః
అనాదినిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ॥ 5
అప్రమేయో హృషీకేశః పద్మనాభో 2మర ప్రభుః
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥ 6
అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః
ప్రభూత స్త్రికకుబ్ధామ పవిత్రం మంగళం పరమ్ ॥ 7
ఈశానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్య గర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥ 8
ఈశ్వరో విక్రమీ ధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతిరాత్మవాన్ ॥ 9
సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః
అహః సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః ॥ 10
అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః
వృషాకపిరమేయాత్మా సర్వయోగవినిస్సృతః ॥ 11
వసుర్వసుమనాః సత్యః సమాత్మా సమ్మితః సమః

అమోఘః పుండరీకాక్షో వృషకర్మా వృషాకృతిః ॥ 12

రుద్రో బహుశిరా బభ్రుర్విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వతస్థాణుర్వరారోహో మహాతపాః ॥ 13

సర్వగః సర్వవిద్భానుర్విష్వక్సేనో జనార్దనః
వేదో వేద విదవ్యంగో వేదాంగో వేదవిత్కవిః ॥ 14

లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షఃకృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రశ్చతుర్భుజః ॥ 15

భ్రాజిష్ణుర్భోజనం భోక్తా సహిష్ణుర్జగదాదిజః
అనఘో విజయో జేతా విశ్వయోనిః పునర్వసుః ॥ 16

ఉపేంద్రో వామనః ప్రాంశురమోఘః శుచిరూర్జితః
అతీంద్రః సంగ్రహః సర్గో ధృతాత్మా నియమో యమః ॥ 17

వేద్యోవైద్యః సదా యోగీ వీరహా మాధవో మధుః
అతీంద్రియో మహామాయో మహోత్సాహోమహాబలః ॥ 18

మహాబుద్ధిర్మహావీర్యో మహాశక్తిర్మహాద్యుతిః
అనిర్దేశ్యవపుః శ్రీ మానమేయాత్మా మహాద్రిధృత్ ॥ 19

మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసః సతాంగతిః
అనిరుద్ధః సురానందో గోవిందో గోవిదాంపతిః ॥ 20

మరీచిర్దమనో హంసః సుపర్ణో భుజగోత్తమః
హిరణ్యనాభః సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥ 21

అమృత్యుః సర్వదృక్సింహః సంధాతా సంధిమాన్ స్థిరః
అజో దుర్మర్షణః శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥ 22

గురుర్గురుతమో ధామః సత్యః సత్యపరాక్రమః
నిమిషో 2 నిమిషః స్రగ్వీ వాచస్పతిరుదారధీః ॥ 23

అగ్రణీర్గ్రామణీ శ్రీమాన్ న్యాయో నేతా సమీరణః
సహస్రమూర్ధా విశ్వాత్మా సహస్రాక్షః సహస్రపాత్ ॥ 24

ఆవర్తనో నివృత్తాత్మా సంవృతః సంప్రమర్దనః
అహస్సంవర్తకో వహ్నిరనిలో ధరణీధరః ॥ 25

సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృడ్విశ్వభుగ్విభుః

సత్కర్తాసత్కృతః సాధుర్జహ్నుర్నారాయణో నరః ॥ 26
అసంఖ్యేయో ఽప్రమేయాత్మా విశిష్టః శిష్టకృచ్ఛుచిః
సిద్ధార్థః సిద్ధసంకల్పః సిద్ధిదః సిద్ధిసాధనః ॥ 27
వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వా వృషోదరః
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తః శ్రుతిసాగరః ॥ 28
సుభుజో దుర్ధరో వాగ్మీ మహేంద్రో వసుదో వసుః
నైకరూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ॥ 29
ఓ జస్తే జోద్యుతిధరః ప్రకాశాత్మా ప్రతాపనః
ఋద్ధః స్పష్టాక్షరో మంత్రశ్చంద్రాంశుర్భాస్కరద్యుతిః ॥ 30
అమృతాంశూద్భవో భానుః శశబిందుః సురేశ్వరః
ఔషధం జగతస్సేతుః సత్యధర్మపరాక్రమః ॥ 31
భూతభవ్య భవన్నాథః పవనః పావనో ఽనలః
కామహా కామకృత్కాంతః కామః కామప్రదః ప్రభుః ॥ 32
యుగాదికృద్యుగావర్తో నైకమాయో మహాశనః
అదృశ్యో ఽవ్యక్త రూపశ్చ సహస్రజిదనంతజిత్ ॥ 33
ఇష్టో విశిష్టశ్శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః
క్రోధహా క్రోధకృత్ కర్తా విశ్వబాహుర్మ హీధరః ॥ 34
అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదో వాసవానుజః
అపాం నిధిరధిష్ఠానమప్రమత్తః ప్రతిష్ఠితః ॥ 35
స్కందః స్కందధరో ఽధుర్యో వరదో వాయువాహనః
వాసుదేవో బృహద్భానురాదిదేవః పురందరః ॥ 36
అశోకస్తారణస్తారః శూరః శౌరిర్జనేశ్వరః
అనుకూలః శతావర్తః పద్మీ పద్మనిభేక్షణః ॥ 37
పద్మనాభో ఽరవిందాక్షః పద్మగర్భః శరీరభృత్
మహర్ధి రృద్ధో వృద్ధాత్మామహాక్షో గరుడధ్వజః ॥ 38
అతులః శరభో భీమః సమయజ్ఞో హవిర్హరిః
సర్వలక్షణలక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః ॥ 39
విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరః సహః

మహీధరో మహాభాగో వేగవానమితాశనః ॥ 40

ఉద్భవః క్షోభణో దేవః శ్రీగర్భః పరమేశ్వరః
కరణం కారణం కర్తా వికర్తాగహనో గుహః ॥ 41

వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః
పరర్ధిః పరమస్పష్టస్తుష్టః పుష్టః శుభేక్షణః ॥ 42

రామోవిరామోవిరజోమార్గోనేయో నయో ऽనయః
వీరః శక్తిమతాం శ్రేష్ఠోధర్మోధర్మ విదుత్తమః ॥ 43

వైకుంఠఃపురుషః ప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః
హిరణ్యగర్భః శత్రుఘ్నో వ్యాప్తోవాయురధోక్షజః ॥ 44

ఋతుః సుదర్శనః కాలః పరమేష్ఠీ పరిగ్రహః
ఉగ్రః సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥ 45

విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయమ్
అర్థో ऽనర్థో మహాకోశో మహాభోగో మహాధనః 46

అనిర్విణ్ణః స్థవిష్ఠో ऽభూర్ధర్మయూపో మహామఖః
నక్షత్రనేమిర్నక్షత్రీ క్షమః క్షామః సమీహనః ॥ 47

యజ్ఞ ఇజ్యోమహేజ్యశ్చ క్రతుః సత్రం సతాం గతిః
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥ 48

సువ్రతః సుముఖః సూక్ష్మః సుఘోషః సుఖదః సుహృత్
మనోహరో జితక్రోధో వీరబాహుర్విదారణః ॥ 49

స్వాపనః స్వవశోవ్యాపీనైకాత్మా నైకకర్మకృత్
వత్సరో వత్సలో వత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥ 50

ధర్మగుబ్ధర్మ కృద్ధర్మీ సదసక్షరమక్షరమ్
అవిజ్ఞాతా సహస్రాంశుర్విధాతా కృతలక్షణః ॥ 51

గభస్తినేమిః సత్త్వస్థః సింహో భూతమహేశ్వరః
అదిదేవో మహాదేవో దేవేశో దేవభృద్గురుః ॥ 52

ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞానగమ్యః పురాతనః
శరీరభూతభృద్భోక్తా కపీంద్రో భూరిదక్షిణః ॥ 53

సోమపో ऽమృతపః సోమః పురుజిత్పురుసత్తమః

వినయో జయః సత్యసంధో దాశార్హః సాత్త్వతాం పతిః ॥ 54

జీవో వినయితా సాక్షీ ముకుందో ऽమితవిక్రమః
అంభోనిధిరనంతాత్మా మహోదధిశయో ऽంతకః ॥ 55

అజో మహార్హః స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః
ఆనందో నందనో నందః సత్యధర్మా త్రివిక్రమః ॥ 56

మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞో మేదినీపతిః
త్రిపదస్త్రిదశాధ్యక్షో మహాశృంగః కృతాంతకృత్ ॥ 57

మహావరాహో గోవిందః సుషేణః కనకాంగదీ
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః 58

వేధా స్వాంగో ऽజితః కృష్ణో దృఢః సంకర్షణో ऽచ్యుతః
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షో మహామనాః ॥ 59

భగవాన్ భగహా ऽనందీ వనమాలీ హలాయుధః
ఆదిత్యో జ్యోతిరాదిత్యః సహిష్ణుర్గతిసత్తమః ॥ 60

సుధన్వా ఖండపరశుర్దారుణో ద్రవిణప్రదః
దివిస్పృక్సర్వదృగ్వ్యాసో వాచస్పతిరయోనిజః ॥ 61

త్రిసామా సామగః సామ నిర్వాణం భేషజం భిషక్
సన్న్యాసకృచ్ఛమః శాంతో నిష్ఠాశాంతిః పరాయణం ॥ 62

శుభాంగః శాంతిదః స్రష్టా కుముదః కువలేశయః
గోహితో గోపతి ర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥ 63

అనివర్తీనివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః
శ్రీవత్సవక్షాః శ్రీవాసః శ్రీపతిః శ్రీమతాం వరః ॥ 64

శ్రీదః శ్రీశః శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః
శ్రీధరః శ్రీకరః శ్రేయః శ్రీమాన్ లోక త్రయా శ్రయః ॥ 65

స్వక్షః స్వంగః శతానందో నందిర్జ్యోతిర్గణేశ్వరః
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్న సంశయః ॥ 66

ఉదీర్ణః సర్వతశ్చక్షురనీశః శాశ్వతః స్థిరః
భూశయో భూషణో భూతిర్విశోకః శోకనాశనః ॥ 67

అర్చిష్మానర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః

అనిరుద్ధో ఽప్రతిరథః ప్రద్యుమ్నో ఽమితవిక్రమః 68

కాలనేమినిహా వీరః శౌరిః శూరజనేశ్వరః
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ॥ 69

కామదేవః కామపాలః కామీ కాంతః కృతాగమః
అనిర్దేశ్యవపుర్విష్ణుర్వీరో ఽనంతో ధనంజయః ॥ 70

బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మః వివర్ధనః
బ్రహ్మవిద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణ ప్రియః ॥ 71

మహాక్రమో మహాకర్మా మహాతేజో మహోరగః
మహాక్రతుర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥ 72

స్తవ్యః స్తవప్రియః స్తోత్రం స్తుతిః స్తోతా రణప్రియాః
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః ॥ 73

మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥ 74

సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః
శూరసేనో యదుశ్రేష్టః సన్నివాసః సుయామునః ॥ 75

భూతావాసో వాసుదేవః సర్వాసునిలయో ఽనలః
దర్పహా దర్పదో దృప్తోదుర్ధరో ఽథాపరాజితః ॥ 76

విశ్వమూ ర్తిర్మహా మూర్తిర్దీప్తమూర్తిరమూర్తిమాన్
అనేకమూర్తిరవ్యక్తః శతమూర్తిః శతాననః ॥ 77

ఏకోనైకః సవః కః కిం యత్తత్పదమనుత్తమమ్
లోకబంధుర్లోకనాథో మాధవో భక్తవత్సలః ॥ 78

సువర్ణవర్ణో హేమాంగో వరాంగశ్చందనాంగదీ
వీరహా విషమః శూన్యో ఘృతాశీరచలశ్చలః ॥ 79

అమానీ మానదో మాన్యో లోకస్వామీత్రిలోకధృత్
సుమేధామేధజోధన్యః సత్యమేధా ధరాధరః ॥ 80

తేజో వృషోద్యుతిధరః సర్వశస్త్రభృతాం వరః
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః ॥ 81

చతుర్మూర్తిశ్చతుర్బాహుశ్చతుర్వ్యూహశ్చతుర్గతిః

చతురాత్మా చతుర్భావశ్చతుర్వేదవిదేకపాత్ ॥ 82

సమావర్తో ఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥ 83

శుభాంగో లోకసారంగః సుతంతు స్తంతువర్ధనః
ఇంద్రకర్మా మహాకర్మా కృతకర్మా కృతాగమః ॥ 84

ఉద్భవః సుందరః సుందో రత్ననాభః సులోచనః
అర్కో వాజసనః శృంగీ జయంతః సర్వవిజ్జయీ ॥ 85

సువర్ణబిందు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥ 86

కుముదః కుందరః కుందః పర్జన్యః పావనో ఽనిలః
అమృతాంశో ఽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః ॥ 87

సులభః సువ్రతః సిద్ధః శత్రుజిచ్ఛత్రుతాపనః
న్యగ్రోధోదుంబరో ఽశ్వత్థశ్చాణూరాంధ్రని షూదనః ॥ 88

సహస్రార్చిః సప్తజిహ్వః సప్తైధాః సప్తవాహనః
అమూర్తి రనఘో ఽచింత్యో భయకృద్భయనాశనః ॥ 89

అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణో మహాన్
అధృతః స్వధృతః స్వాస్థ్యః ప్రాగ్వంశో వంశవర్ధనః ॥ 90

భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః
ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణో వాయువాహనః ॥ 91

ధనుర్ధరో ధనుర్వేదో దండోదమయితా దమః
అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః ॥ 92

సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్య ధర్మపరాయణః
అభిప్రాయః ప్రియార్హో ఽర్హః ప్రియకృత్ప్రీతి వర్ధనః ॥ 93

విహాయసగతి ర్జ్యోతిః సురుచిర్హుతభుగ్విభుః
రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః ॥ 94

అనంతః హుత భుగ్భోక్తా సుఖదోనైకదో ఽగ్రజః
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥ 95

సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః

స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తి దక్షిణః ॥ 96

అరౌద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః
శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః ॥ 97

అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః
విద్వత్తమో వీతభయః పుణ్య శ్రవణ కీర్తనః ॥ 98

ఉత్తారణో దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః
వీరహా రక్షణః సంతో జీవనం పర్యవస్థితః ॥ 99

అనంత రూపో ऽనంత శ్రీర్జితమన్యుర్భ యాపహః
చతురశ్రో గభీరాత్మా విదిశో వ్యాదిశో దిశః ॥ 100

అనాదిర్భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాంగదః
జననో జనజన్మాది ర్భీమో భీమ పరాక్రమః ॥ 101

ఆధార నిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః
ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ॥ 102

ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణజీవనః
తత్త్వంతత్త్వ విదేకాత్మా జన్మ మృత్యుజరాతిగః ॥ 103

భూర్భువస్స్వస్తరుస్తారః సవితా ప్రపితామహః
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥ 104

యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః
యజ్ఞాంతకృద్యజ్ఞగుహ్యమన్న మన్నాద ఏవచ ॥ 105

ఆత్మయోనిః స్వయంజాతో వైఖానస్సామగాయనః
దేవకీనందనః స్రష్టా క్షితీశః పాపనాశనః ॥ 106

శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదాధరః
రథాంగపాణిరక్షోభ్యః నర్వప్రహరణాయుధః ॥ 107

శ్రీసర్వ ప్రహరణాయుధ ఓన్నమ ఇతి ॥

వనమాలీ గదీ శార్ఙ్గీ శంఖీ చక్రీచ నందకీ
శ్రీమాన్నా రాయణో విష్ణుర్వాసుదేవో భిరక్షతు ॥ 108

శ్రీ వాసుదేవో భిరక్షతుఓంనమ ఇతి ॥



## ఉత్తరపీఠిక

ఇతీదం కీర్తనీయస్య కేశవస్య మహాత్మనః
నామ్నాం సహస్రం దివ్యానామశేషేణ ప్రకీర్తితమ్ || 1

య ఇదం శృణుయాన్నిత్యం యశ్చాపి పరికీర్తయేత్
నా ఽశుభం ప్రాప్ను యాత్కించిత్సో ఽముత్రేహ చ మానవః || 2

వేదాంతగో బ్రాహ్మణః స్యాత్ క్షత్రియో విజయీభవేత్
వైశ్యోధనసమృద్ధః స్యాచ్ఛూద్రః సుఖమవాప్నుయాత్ || 3

ధర్మార్థీ ప్రాప్ను యాద్ధర్మమర్థార్థీ చార్థమాప్నుయాత్
కామానవాప్ను యాత్కామీ ప్రజార్థీ చాప్ను యాత్ప్రజాః || 4

భక్తిమాన్ యః సదోత్థాయ శుచిస్తద్గతమాననః
సహస్రం వాసుదేవస్య నామ్నా మేతత్ప్రకీర్తయేత్ || 5

యశః ప్రాప్నోతి విపులం యాతి ప్రాధాన్యమేవ చ
అచలాం శ్రియమాప్నోతి శ్రేయః ప్రాప్నోత్యనుత్తమమ్ || 6

న భయం క్వచిదాప్నోతి వీర్యం తేజశ్చ విందతి
భవత్యరోగో ద్యుతిమాన్ బలరూపగుణాన్వితః || 7

రోగార్తోముచ్యతే రోగాద్బద్ధో ముచ్యేత బంధనాత్
భయాన్ముచ్యేత భీతస్తు ముచ్యేతాపన్న ఆపదః || 8

దుర్గాణ్యతితరత్యాశు పురుషః పురుషోత్తమమ్
స్తువన్నామసహస్రేణ నిత్యం భక్తిసమన్వితః || 9

వాసుదేవాశ్రయో మర్త్యో వాసుదేవపరాయణః
సర్వ పాపవిశుద్ధాత్మా యాతి బ్రహ్మ సనాతనమ్ || 10

న వాసుదేవభక్తానామశుభం విద్యతే క్వచిత్
జన్మ మృత్యుజరావ్యాధిభయం నై వోపజాయతే || 11

ఇమం స్తవమధీయానః శ్రద్ధాభక్తిసమన్వితః
యుజ్యేతాత్మా సుఖక్షాన్తి శ్రీధృతిస్మృతికీర్తిభిః || 12

న క్రోధో నచ మాత్సర్యం నలోభో నా శుభా మతిః
భవన్తి కృతపుణ్యానాం భక్తానాం పురుషోత్తమే || 13

ద్యౌః సచంద్రార్కనక్షత్రం ఖం దిశో భూర్మహోదధిః ॥
వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః ॥ 14

ససురాసురగంధర్వం సయక్షోరగరాక్షసమ్
జగద్వశే వర్తతేఽదం కృష్ణస్య సచరాచరమ్ ॥ 15

ఇంద్రియాణి మనో బుద్ధిః సత్త్వం తేజో బలం ధృతిః
వాసుదేవాత్మకాన్యాహుః క్షేత్రం క్షేత్రజ్ఞ ఏవ చ ॥ 16

సర్వాగమానామాచారః ప్రథమం పరికల్పితః
ఆచార ప్రభవో ధర్మో ధర్మస్య ప్రభురచ్యుతః 17

ఋషయః పితరో దేవా మహాభూతాని ధాతవః
జంగమాజంగమం చేదం జగన్నారాయణోద్భవమ్ ॥ 18

యోగోజ్ఞానం తథా సాంఖ్యం విద్యాః శిల్పాదికర్మ చ
వేదాః శాస్త్రాణి విజ్ఞానమేతత్సర్వం జనార్దనాత్ ॥ 19

ఏకో విష్ణుర్మహద్భూతం పృథగ్భూతాన్యనేకశః
త్రీన్ లోకాన్ వ్యాప్యభూతాత్మా భుంక్తేవిశ్వభుగవ్యయః ॥ 20

ఇమంస్తవం భగవతో విష్ణోర్వ్యాసేన కీర్తితమ్
పఠేద్య ఇచ్ఛేత్పురుషః శ్రేయః ప్రాప్తుం సుఖాని చ ॥ 21

విశ్వేశ్వరమజం దేవం జగతః ప్రభుమవ్యయమ్
భజంతి యే పుష్కరాక్షం నతే యాంతి పరాభవమ్ 22
నతే యాంతి పరాభవమోన్న మ ఇతి ॥

**అర్జున ఉవాచ :-**

పద్మపత్రవిశాలాక్ష పద్మనాభ సురోత్తమ
భక్తానామనురక్తానాం త్రాతా భవ జనార్దన ॥ 23

**శ్రీ భగవానువాచ :-**

యో మాం నామసహస్రేణ స్తోతుమిచ్ఛతి పాండవ
సో ఽహమే కేన శ్లోకేన స్తుత ఏవ న సంశయః ॥ 24
స్తుత ఏవ న సంశయః ఓన్నమ ఇతి ॥

**వ్యాస ఉవాచ :-**

వాసనాద్వాసుదేవస్య వాసితం తే జగత్త్రయమ్
సర్వభూతనివాసో ఽసి వాసుదేవ నమో స్తుతే ॥ 25

శ్రీ వాసుదేవ నమో స్తుత ఓన్నమ ఇతి ||

**పార్వత్యువాచ :-**

కేనోపాయేన లఘునా విష్ణోర్నామ సహస్రకమ్
పఠ్యతే పండితైర్నిత్యం శ్రోతు మిచ్ఛామ్యహం ప్రభో || 26

**ఈశ్వర ఉవాచ :-**

శ్రీరామ రామ రామేతి రమే రామే మనోరమే
సహస్రనామతత్తుల్యం రామనామ వరాననే || 27
శ్రీరామ నామ వరానన ఓన్నమ ఇతి ||

**బ్రహ్మోవాచ :-**

నమో ఽస్త్వనంతాయ సహస్రమూర్తయే
సహస్రపాదాక్షిశిరోరుబాహవే |
సహస్రనామ్నే పురుషాయ శాశ్వతే
సహస్రకోటీయుగధారిణే నమః || 28
|| శ్రీ సహస్రకోటీ యుగధారిణే ఓన్నమ ఇతి ||

**సంజయ ఉవాచ :-**

యత్ర యోగేశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతిర్ధ్రువా నీతిర్మతిర్మమ || 29

**శ్రీభగవాను ఉవాచ :-**

అనన్యాశ్చింతయంతో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ || 30

పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతామ్
ధర్మ సంస్థాపనార్థాయ సంభవామి యుగే యుగే || 31

ఆర్తా విషణ్ణాః శిథిలాశ్చభీతాః ఘోరేషు చ వ్యాధిషు వర్తమానాః |
సంకీర్త్యనారాయణ శబ్ద మాత్రం విముక్త దుఃఖాః సుఖినోభవంతి || 32

ఇతి శ్రీమహాభారతే శతసాహస్రికాయాం సంహితాయాం వైయాసి క్యాం అనుశాసనిక పర్వణి భీష్మయుధిష్ఠిర సంవాదే శ్రీవిష్ణోర్దివ్యసహస్ర నామస్తోత్రం నామ ఏకోనపంచాశ తధికద్విశతతమో ఽధ్యాయః ||

శ్రీ కృష్ణార్పణమస్తు

# ప్రవేశిక

ఈ సహస్రనామ స్తోత్రములు సంస్కృతమున వేలు కలవు. వాని యన్నింటిలోనికి మిక్కిలి ప్రశస్తమై, ఫలదాయకము లైనవి ప్రధానముగా మూడు అవి :

1) విష్ణు సహస్రనామము

2) శివ సహస్రనామము

3) లలితా సహస్రనామము

ఇందులో మొదటి రెండును వేద వ్యాసునిచే మహాభారతమున నిబద్ధము చేయబడినవి. మూడవది లలితా సహస్ర నామము బ్రహ్మాండ పురాణమునందు నిబద్ధమై యున్నది. ఈ మూడింటి ఉపాసనల వలన పరమాత్మ యొక్క దర్శనము మూడు స్థితులుగా కలుగును.

**1) విష్ణు సహస్రనామము :** సృష్టియందు తానుగా విష్ణుత్వము చెందునట్టి లేక వ్యాపకమ్ము చెందునట్టి ఒక స్థితి.

**2) శివ సహస్రనామము :** పరమాత్మ యొక్క లయాత్మక మయిన ప్రజ్ఞను గూర్చి తెలియజేయును. అనగా సర్వమును తనయందు లీనము చేసుకొని వాటి అస్తిత్వము నశించి తానొక్కడే వెలుగునట్టి స్థితి. ఇదియే భౌతిక లోకములలోను, శక్తిమయ లోకములయందు, ప్రజ్ఞామయ లోకములందును ప్రళయముగా వర్ణింపబడినది. అందుచేతనే శివుడు **''త్రిపురారి''** అని పిలువబడుచున్నాడు. ఇట్లు ప్రజ్ఞామయ లోకములయందు తాను అను ఒకే వెలుగుగా దర్శనమగు స్థితినే శివము అందురు.

**3) లలితా సహస్రనామము :** పరమాత్మ వేరువేరు రూపములుగా అస్తిత్వము చెందుటను వర్ణించును. ఇది సాంసారిక జీవులకు ''మాయ'' అనియు యోగులకు (అనగా దీనిని సున్నితముగా, లలితముగా, నిత్య జీవితము నందు ఆచరణలో నుంచుకొనువారికి) ''లలిత'' అను ఆచరణ రూపిణి, వాత్సల్య రూపిణి యగు తల్లిగా దర్శనమగును.

ఇందు విష్ణు సహస్ర నామము జీవితమునందు ప్రశాంతత కోరువారిచే అనుదినము పఠింపబడుట వలన జన్మ సంసార బంధముల నుండి విముక్తులను చేయుచున్నది. శివ సహస్ర నామము అన్ని లోకములయందు అఖండముగా

వెలుగుచున్న తేజోమూర్తియందు జీవుని లీనమగునట్లు చేయును. లలితా సహస్ర నామము జీవులు ప్రకృతిని శక్తిగా ఉపాసించి సకల జీవుల సంక్షేమమునకు ఆ శక్తిని ఉపయోగించుకొనునట్లు చేయును. కాని మనసు పరిపక్వము చెందని వారికి లలితా సహస్ర నామమును సద్వినియోగము చేయు సామర్ధ్యముండదు. అట్టివారు తమకు కలిగిన ఈ శక్తిని తమ స్వార్థమునకై దుర్వినియోగమొనర్చి కష్టముల పాలగుచున్నారు. అందుచే ఈ మూడింటియందును విష్ణు సహస్ర నామమే సకల జనులచే అన్ని కాలములయందును అభిలషణీయమై, అనుష్టింపదగియున్నది.

**కథా సందర్భము** : మహాభారత యుద్ధము పూర్తి అయిన పిదప అంప శయ్యపై ఉన్న భీష్ముని చూచుటకు శ్రీ కృష్ణునిచే ప్రేరితుడై ధర్మరాజు తన సోదరులతోను, మహర్షులతోను, కలసి వచ్చెను. సకల ధర్మముల రహస్యములు విన్న తరువాత ధర్మరాజు భీష్ముని అడిగెను. మానవులందరు ఏ దేవతను అర్చన చేయుట చేత ఒకే ప్రజ్ఞయందు లీనమగుచున్నారు? ఎవరిని జపించుట చేత జన్మ సంసార బంధముల తొలగిపోవుచున్నవి? ధర్మములన్నిటియందును పని చేయుచున్న పరమ ధర్మము ఎవరు ? ఎవరిని పూజించుట చేత మానవులందరు శుభము కలిగి జీవించగలరు? అని అడిగెను.

భీష్ముడు ఇట్లు చెప్పెను ''సకల లోకములకు ప్రభువైన వానిని ధ్యానము చేయుము. ఆయన దేవతలకు దేవుడు, పురుషులలో కెల్ల ఉత్తముడు. వేయి నామములతో తెలియబడువాడు. ఆయనను మాత్రమే నిరంతరము భక్తితో పూజింపవలెను. ఆయనను నిరంతరము స్తోత్రము చేసి నమస్కరించి ధ్యానము చేయుచుండవలెను. ఆయన మొదలు లేనివాడు. అటు ఆయన గూర్చి వినుటచే పాపము, భయము, నశించును. అనగా పాపము చేయుట, భయము పొందుట అనునవి లోకమునందు పరమాత్మను కాక యితరములను చూచువానికి మాత్రమే జరుగును. అట్లుకాక సకలము విష్ణువు యొక్క అస్తిత్వముగా ధ్యానము చేయువానికి పాపము, భయము, పొందుట ఉండవు. మహాత్ములు, ఋషులు, దేనిని ధ్యానము చేసి, గానము చేసిరో అట్టి నామమును చెప్పుచున్నాను. ఓ రాజా! వినవలసినది (అనగా ఈ నామములను ధ్యానము చేయువాడు యితరులను రక్షించి, పోషించు కోరికగల వాడైనచో రాజుగాగాని, మిక్కిలి ఉన్నతాధికారిగా గాని నిస్సంశయముగా నగును అని అర్థము. అంతే

గాక రాజనగా ప్రకాశించువాడని కూడా అర్థము కలదు. విష్ణువు అను వెలుగును ధ్యానము చేయుటచేత ప్రకాశించువాడని అర్థము.)

ఆ విష్ణువును సకలము జయించువానిగా, సృష్టి యందంతటను నిండియుండుటయేగాక భౌతిక సృష్టికి అక్షర రూపమయిన మహత్తుగానున్న వానికిని, జీవుల అస్తిత్వము తానే అయినవానికి, సృష్టిని అధిష్టించి నడుపు వానికి, పురుషులందరి యందును (పురుషుడనగా పురమునందున్న వాడు లేక దేహమునందున్నవాడు) 'తాను'గా నిలిచియున్నవానికి నమస్కరించి చెప్పుట ప్రారంభించుచున్నా'' నని భీష్ముడు ధర్మరాజుకు చెప్పుచున్నాడు.

## విష్ణు సహస్రనామములు - కొన్ని విశేషములు :

1. ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము మిగిలిన స్తోత్రముల కన్న సులభము మరియు ధారాళమగు శైలిలో వ్రాయబడినది. తన సిద్ధాంతములను ఆచరణీయ మార్గమున బోధించు ఉద్దేశ్యము రచయిత కున్నట్లు కనిపించుచున్నది. ఎందుచేత ననగా ఇందలి నామములు క్లిష్టమగు శైలిలో గాక మిక్కిలి సులభముగా గ్రహించునట్లు వ్రాయబడినవి. అంతేగాక ఈ శైలి ఆలోచించి వ్రాసినట్లుగాక దర్శించి వ్రాసినట్లున్నది. కనుక చదువు వారికి కూడా అట్టి దర్శనము కలిగించుననుటలో సందేహము లేదు.

2. ఈ స్తోత్రము ''విశ్వం, విష్ణుః'' అను రెండు నామములతో మొదలయినది. విశ్వము అనగా ప్రపంచము మరియు విష్ణుః అనగా అట్టి విశ్వము యొక్క స్థితికి కారకుడై అందుండువాడు. యిట్టి ధ్యానముతో ప్రారంభమయిన ఈ స్తోత్రము భక్తితో చదువుకొనువారిని సూటిగా భగవద్గీతలో పదకొండవ అధ్యాయమున చెప్పబడిన విశ్వరూప సందర్శనము అను స్థితి యందుంచును.

ఈ స్తోత్రము నందలి చిట్ట చివరి నామము వాసుదేవుడు. అనగా ''వాసనా ద్వాసు దేవస్యవాసితంతే జగత్రయం సర్వ భూతనివాసోసి వాసుదేవ నమోస్తుతే'' అను శ్లోకముననుసరించి అందరు జీవులలోను వసియించు వానిగా చెప్పబడినది. ఇది వేదవ్యాసుడు ''శ్రీ మద్భాగవతము'' నందు సకల జీవుల తరుణోపాయమునకై చెప్పిన మూడు సోపానములలో నొకటి. అందు మోక్షము పొందుటకై జీవులు పరమాత్మను మూడు విధములుగా ధ్యానము చేయవలసినదిగా చెప్పెను.

**1) విష్ణూపాసన** : అనగా నామము, రూపము కరగి సృష్టి

యందలి వస్తువులుగా జీవులుగా పంచభూతములుగా వ్యాపించియున్న భగవత్తత్త్వము నుపాసించుట.

**2) వాసుదేవోపాసన :** అనగా జీవులుగా, వారి ప్రవర్తనలుగా, చేష్టలుగా తెలియబడుచున్న సర్వాంతర్యామియైన పరమాత్మ నుపాసించుట.

**3) నారాయణోపాసన :** జీవునికి జీవత్వము తొలిగి పరమాత్మ యందు లీనమగు స్థితి.

ఇందు మొదటి దాని వలన జీవుని మనస్సు, చిత్తము, ఇంద్రియములు నిర్మలమై పరమాత్మ సాన్నిధ్యమును పొందును. రెండవ దాని వలన కామము, క్రోధము, భయము మున్నగు ఉద్రేక భావములు స్వస్థత చెంది ప్రశాంతస్థితి లభించును. అనగా మొదటి స్థితి పరిస్థితులు తన కనుకూలముగా నున్నపుడు మాత్రమే నిలచును. దేవాలయమున దేవుని విగ్రహమును చూచి భక్తి పారవశ్యము చెందుట, సద్గ్రంథ పఠనము, సంకీర్తనము చేయునపుడు తన్మయత్వము కలుగుట, మున్నగునవి విష్ణూపాసనము.

నాస్తికులను చూచి కోపగించుట, వారితో ఘర్షణ పడుట, తనను నిందించువానిపై కోపము కలుగుట మున్నగునవి వాసుదేవోపాసన వలన నశించును. అనగా వారియందు గల వాసుదేవుడే తన మనస్సును పరీక్షించుచున్నాడని తెలియును. నారాయణోపాసనయందు పై రెండు సాధనల వలన నిర్మలమయిన జీవాత్మ పరిపూర్ణత చెంది పరమాత్మ యందు లయమగును. ఈ స్తోత్రమునందలి మొదటి రెండు నామములైన ''విశ్వము, విష్ణువు'' అను రెండును చివరి మూడు నామములైన ''నారాయణ, విష్ణు, వాసుదేవు'' లను మూడు ఉపాసనలతో కలిపిన ఈ నామములనే మంత్రములుగా ధ్యానము చేయుట వలన ఈ ఉపాసనలు సిద్ధించునని తెలియుచున్నది.

ఇంకొక చిత్రమేమనగా ఈ స్తోత్రము నందలి చిట్ట చివరి పదమైన ''అభిరక్షతు'', అనగా నిరంతరము ఏమరుపాటు లేక కాపాడువాడు అని అర్థము వలన ఈ మొత్తము స్తోత్రము ఒకే వాక్యమగుచున్నది. ''విష్ణువు, విశ్వము ..... శ్రీమన్నారాయణుడు, విష్ణువు, వాసుదేవుడు, నిరంతరము మమ్ములను కాపాడుచుండును'' అని ఈ వేయి నామములు గల పరమాత్మను రక్షకునిగా సంకల్పించి ప్రార్థన చేయుటచే అది వరమగును. ఇంకొక విశేషమేమనగా ఒక్కొక్క నామమునకు ''అభిరక్షతు'' అను పదము చేర్చినచో అది ఒక్కొక్క మంత్రమగును. యిట్లు వేయి నామములను వేయి మంత్రములుగా

ఉపాసన చేయవలెను.

సంధ్యావందనమునందు ఆచమనము చేయునపుడు చెప్పుకొను కేశవ, నారాయణ, మాధవ మున్నగు నామములు ఈ వేయి నామములందు కలవు. కనుక ఈ స్తోత్రము చేయువారిచే అప్రయత్నముగా గాయత్రి ఉపాసింపబడుచున్నది. ఈ గాయత్రియే పురుష పరముగా చెప్పబడినపుడు సూర్యాంతరవర్తియైన సవితృనిగా చెప్పబడినది. కనుక అట్టి సవితృడు కూడ ఉపాసింపబడుచున్నాడు.

కొన్ని ప్రాచీన గ్రంథములలో పరమాత్మ యొక్క ఇరువది నాలుగు నామములను ఒక ఉపాసనగా చెప్పబడినవి. అవి కూడా యిందులో భాగములే.

''నారాయణ కవచము'' అను పేర కొన్ని మంత్రములను వేదవ్యాసుడు ఒకచోట కూర్చి మహాభాగవతమునందు నిబంధించెను. దీనిని ధ్యానము చేయుట వలన శస్త్రాస్త్ర పూరితమయిన ఒక కవచము సృష్టిలో ఏర్పడును. అట్టి నారాయణ కవచమునందలి మంత్రములు ఈ వేయి నామములందు యిమడ్చబడినవి.

వాల్మీకి రామాయణమునందు ''ఆదిత్య హృదయము'' అను పేర మరియొక మంత్రకవచమున్నది. దీనిని ధ్యానము చేసి వారికి సూర్యుని ప్రజ్ఞతో సంబంధ మేర్పడుటయేగాక తమ హృదయము నందలి సర్వాంతర్యామి యందు మేలుకొలుపు కలుగును. అట్టి మహామంత్రము గూడ ఈ స్తోత్రము నందు నిబద్ధము చేయబడినది.

**మంత్ర ప్రాముఖ్యత :**

భగవద్గీత భగవానునిచే స్వయముగా ఉచ్చరింపబడి అర్జునునకు బోధింపబడినది. కాని విష్ణు సహస్ర నామము అట్లు కాదు. ఇది భగవద్భక్తునికి, భగవంతుని సాన్నిధ్యమున ఉచ్చరించి బోధింపబడినది. ఈ విష్ణు సహస్రనామ స్తోత్రము భీష్ముడు ధర్మరాజుకు బోధించునపుడు, భగవానుడు శ్రీ కృష్ణుడు స్వయముగా అచ్చటనే యుండెను. అనగా దీనికి శ్రీ కృష్ణుని ఆమోదముద్ర కలదని వేరుగా చెప్పనక్కర లేదు. స్వయముగా తాను చేయవలసిన పనులు తన భక్తులచే చేయించుట భగవంతుని లీలా విశేషములలో నొకటి. అతడు తాను స్వయముగా అవతారమెత్తి చేయుటకంటే తన భక్తులచే చేయించుటకు ముచ్చట పడుచుండును. జరాసంధాదులకు ఓడిపోయినట్లు నటించి శ్రీకృష్ణుడు వారిని భీముడు మున్నగువారిచే సంహరింప చేయుట ఆయన లీలలో నొకటి.

నవీన యుగములలో కూడా యిట్టి ఉదాహరణలు అనేకములు. శ్రీరామకృష్ణ పరమహంస తన శిష్యుడయిన శ్రీ వివేకానందునిచే ఖండాంతర పర్యటన చేయించి పాశ్చాత్యులకు భారత ధర్మమును గూర్చి బోధ చేయించుట యొక ఉదాహరణము. శ్రీ రామకృష్ణ పరమహంసకు స్వయముగా అట్లు చేయగల సామర్థ్యము లేదని చెప్పలేము కదా ! ఇట్టిదే యామునాచార్యుల వృత్తాంతము కూడా !

భీష్ముడు, ధర్మరాజుకు బోధించునపుడు సకల వేదశాస్త్ర పురాణవేత్త యగు వ్యాసుడు అచ్చటనే యుండెను. అనగా దీనిని వ్యాసుడు అంగీకరించెనని వేరుగా చెప్పనక్కర లేదు. వ్యాసుడు దానిని యధాతథముగా మహాభారతము లోనికి నిబద్ధము చేయుట దీనికి తార్కాణము. అందుచేత ఇది ప్రపంచము నందలి సకల పురాణములు, స్తోత్రములు, యోగ శాస్త్ర గ్రంథములయందు మిక్కిలి ప్రముఖ స్థానము వహించి యున్నదనుటలో సందేహము లేదు. ఇట్లు నిర్ణయించుట కేవలము గుడ్డి నమ్మకముతో కాదు. ఈ స్తోత్రము నందలి మంత్రములు ధ్యానము చేసి దాని వలన కలుగు వివేచన, విచక్షణ, సత్యత్వము మున్నగు స్థితులను పొందిన సత్పురుషులు, పెద్దలు దీనికిట్టి స్థానమిచ్చిరి.

ఈ విష్ణు సహస్రనామ స్తోత్రమునకు సంస్కృతమున అనేక కోణములలో పరిశీలనము, దర్శనము, తాదాత్మ్యము కలిగింప గలిగిన వ్యాఖ్యానములు అనేకములు కలవు. జగద్గురు శ్రీ శంకరాచార్యులవారు చక్కని వివరణ ఇచ్చిరి. భగవద్రామానుజాచార్యులు తమ విశిష్ట శిష్యుడగు పరాశర భట్టును మిక్కిలి వివరణతో వ్యాఖ్యానింపుమని ఆజ్ఞ ఇచ్చిరి. ఇట్లు పెక్కు విద్వాంసులు, పండితులు తమ ప్రతిభా విశేషము ననుసరించి వ్యాఖ్యానములు ఇచ్చిరి. ఇట్టి వ్యాఖ్యానకర్తలైన పెద్దలకు సవినయముగా నమస్కరించి విన్నవించవలసినది ఒక్కటి యున్నది. వీటన్నిటియందు విష్ణు నామములకు పరిపూర్ణమయిన సూక్ష్మమయిన వివరణ యున్నది. కాని వానియందలి ఏకత్వము స్మరింపబడలేదు. ప్రస్తుత వివరణలో ఈ ప్రయత్నము చేయబడినది. నామముల యందలి విశిష్టతను, రహస్యార్థములను వ్యాఖ్యానము చేయుచు ఈ నామముల వరుసయందు గల పరమార్థము లేక ఏక సూత్రత ప్రధానముగా స్మరింపబడినది.

ఇట్టి ఈ ప్రయత్నము సవినయముగా, భక్తులకు సమర్పణముగా చేయబడుచున్నది గాని, అన్నింటికన్నా యిదియే మిన్న అను అహంకారము చేతకాదు.

# స్తోత్ర రచనాకాలము

ఈ స్తోత్రపాఠము మహాభారతమునందలి 13వ పర్వమయిన ''అనుశాసనిక'' పర్వమునందలిది. మహాభారత యుద్ధము పూర్తి అయిన వెంటనే భీష్ముడు దీనిని ఉపదేశించెను. ఈ మహాభారత గ్రంథము యుద్ధము జరిగిన కాలముననే వ్రాయబడినట్లు తెలియుచున్నది. దీనిని రచించిన వేదవ్యాసుడు యుద్ధకాలమునాటికి జీవించియుండెనని తెలియుచున్నది. జ్యోతిషశాస్త్ర గణితమును బట్టి భారత యుద్ధకాలమునందలి సంఘటనలను ఆధారముగా గుణించినచో ఈ యుద్ధము కలియుగ ప్రారంభమున మొట్టమొదటిలో జరిగెనని తెలియును. కనుక సంప్రదాయము నెరిగిన పండితులందరిచే ఏకగ్రీవముగా దీని రచన క్రీ.శ. 1978 నాటికి సరిగా 5117 సం. వెనుక జరిగెనని తెలియును.

మహాభారత యుద్ధమును గురించి చరిత్రకారులు యిచ్చిన కాలములు పరస్పర విరుద్ధములై లెక్కలకు సరిపోవుట లేదు గనుక అవి తప్పని తేలుచున్నది.

నిర్దుష్టముగా జ్యోతిష శాస్త్ర గణితము ననుసరించి తేలిన పై కాలనిర్ణయము నేటికిని వాడుకలోనున్న యుధిష్టిర శకము. అదికాక పంచాంగముల యందలి లెక్కలతో సరిగా సరిపోవుచున్నప్పుడు అవి తప్పులెక్కలెట్లగును? కనుక ఈ కాల నిర్ణయము ననుసరించి మరికొన్ని సంఘటనలు ధృవీకరించబడినవి.

1. శ్రీకృష్ణుడు శ్రీముఖనామ సంవత్సరము శ్రావణ మాసము కృష్ణ పక్షము అష్టమి తిథినాటి అర్ధరాత్రి 12 గంటలకు జన్మించెను. ఇది క్రీస్తు వెనుక 3228 జూలై 19వ తేది రాత్రి 12 గంటలకు (తెల్లవారితే 20వ తేది) న జన్మించెను.
2. ఆయన చాంద్రమాన ప్రమాధినామ సంవత్సరం ఉగాదినాడు సూర్యోదయము కాగానే శరీరము విడిచెను. అది ఫిబ్రవరి నెల క్రీస్తు వెనుక 3102. అప్పటికి ఆయనకు 126వ సంవత్సరము జరుగుచుండెను.
3. మహాభారత యుద్ధము శ్రీకృష్ణుని 89వ సంవత్సరమునందు జరిగెను. అది క్రీస్తు వెనుక 3139కి సరిపోవును.

# రహస్య ప్రకాశము

ఈ స్తోత్రమును ధ్యానము చేయగా ఇట్లు దర్శనమగును :-

విశ్వముగను, దాని ఉనికిగను, వ్యాపించి నిండియుండువాడు పరమాత్మ. అతడు భూత, భవిష్యద్వర్తమానము లను మూడింటి యందును ఒక్కటిగా నుండువాడు, అతడు జీవులు లేక భూతములకు జన్మకారకుడు. రక్షించువాడు. సత్‌గా నిలిచియుండు వాడు, తానే ఆత్మయైనవాడు. పరిశుద్ధమయిన ఆత్మగా నిలిచియుండువాడు. జీవులందరకూ లక్ష్యము మరియు వెలుగుగా తానొక్కడే అయి యుండువాడు. జీవులలో సాక్షిగా, తెలుసుకొనువానిగా, యోగిగా, యోగులను యోగమార్గమున నడుపు నాయకునిగా, స్థిరత్వము, మంచితనము, అను గుణముల తత్త్వము తానే అయినవానిగా, రూపముల పుట్టుకకు అంతమునకు ఆధారమయినవాడుగ, శాశ్వతుడుగ తన నుండి తానే పుట్టుచున్నప్పటికినీ, తనకు మాత్రము చావు పుట్టుకలు లేనివాడుగ, (పద్మము విశ్వమునందలి మహత్తునకు, దాని నుండి లోకముల పుట్టుకను సూచించును.) మరియు పద్మమును ధరించియున్నాడు.

గ్రహించుటకు అతీతమైనవాడు. తేజస్సును, ప్రాణమును, రూపమును, పృథివి యందలి వైభవములుగ తన గర్భమున ధరించి యుండు వాడు. అంతర్యామియై జీవులకు అంతరాత్మగా తానే అయియున్నాడు. ఆయన కోరికలకు అతీతమైన అందలి విశ్వాసము లేక శ్రద్ధగ, జీవులయందు పని చేయుచున్నాడు.

ఆయననుండి దేవతలు పుట్టుచుండగా ఆయన సృష్టికి బీజము మరియు శరణ్యము అయియున్నాడు. ఆయన అనంతుడు. సంవత్సరము, దినములు మున్నగువానికి ఆధారమయిన కాలమను సర్పముతానే. ఆయన అర్థిగా మరియు అర్థమునకు లేక ప్రయోజనమునకు, మూలముగా నున్నాడు. సూర్యునిగ, మేఘములను సృష్టించి వర్షములు కల్పించి జీవులకు, జీవమును కలిగించుచున్నాడు. ఆయన సత్యము, విభూతి అనువానిగ ఉన్నాడు. పరమాత్మ

అనేక రూపములుగా మేల్కొనుటయే సృష్టి కనుక, ఈ సృష్టియందు ఉపేక్షింప దగినది లేదు. ఆయన ప్రతివానియందలి ఏకాగ్రత, ధ్యానము, తపస్సుగా, వ్యాపించి యున్నాడు. ఆయన అన్ని లోకములయందును, దేవతల యందును, సృష్టి ధర్మములయందును కర్మములయందును అధ్యక్షుడై యున్నాడు. ఆయన చతుర్భుజుడై ఆనందమయ స్థితియందు సృష్టిగా ప్రకాశించుచున్నాడు.

ఆయన ఏ విధానము కాకున్నను, తాను అన్నిటికి, విధాత. ఆయన తనకు తానే సహాయకుడిగా దేవతల రూపమున దిగివచ్చెను. వామనుడై లేక అణువై తన చుట్టు తాను (పొరలు అనేకములు లోకములుగా) చుట్టుకొన్ననూ, తన సృష్టి కతీతముగా ప్రకాశించుచున్నాడు. అన్ని సమస్యలకు ఆయనయే పరిష్కారము. పరాక్రమము, సంతోషము, సంకల్పము, కార్యశూరత మరియు శక్తి అనునవి తాను అను సముద్రమునందలి అలలు. ఆయన సమస్తమునకు యజమాని మరియు ధనికుడు. ఆయన అన్నిటికి రక్షకుడు, పాలకుడు కనుక ఆయనయే నిజమయిన రాజు. ఆయనయే పరమహంస మరియు సుపర్ణుడు. ఆయన మహాసర్పమై కాలము మరియు పరిణామముగా తెలియబడుచున్నాడు. ఆయనయే శ్వాసగానున్న గరుత్మంతుడు. (గరుత్మంతునకు సర్పములు ఆహారము) ఆయన మృతి చెందు వారిలో మృత్యువుగా నున్నాడు. ఆ మృత్యువే జీవులందరిని సామ్యస్థితిలో నుంచును. ఆయనే విధి మరియు విధాయకుడు. సృష్టికి ప్రారంభము మరియు అంతము తానే. ఇంకను అనిమిషుడు. సహస్రాంశుడు లేక వేయి అను సంఖ్యకు అధిపతి. ఆయన నిరంతరమును సుడియై దాని నుండి వాయువుగా పిల్లతెమ్మెరగా పుట్టుచున్నాడు. సంఖ్య ఆయననుండి పుట్టినది గనుక ఆయన విభూతి సంఖ్య కందునదిగాదు. ఆయన అన్నింటిని గర్భస్థులుగా చేసి, పెంచి శబ్దతరంగములవలె వ్యాప్తి చెందించువాడు. సృష్టి యందలి ఘనమైన రూపములను ఉచ్చరించువాడు. ఆయన జీవుల హృదయములందు ''ఓం'' కారము నుచ్చరించువాడు. మరియు దాని వలననే ప్రతివాని చేతనూ తెలిసికొనబడుచున్నాడు. ఆయన సూర్యునిగా, చంద్రునిగా తారలుగా వచ్చుచున్నాడు. ఆయన కోరికగా పుట్టుచూ, ఆ కోరికను తీర్చుటయేగాక, తన విచక్షణా జ్ఞానముచే తొలగించుచున్నాడు. ఆయన సత్యముగానూ, మరియు అన్నింటినీ తనలోనికి స్వీకరించు ''అసత్'' గాను

తెలియబడుచున్నాడు. ఆయన మనద్వారా చూచును గనుక, ఆయనను చూచుటకు సాధ్యముగాదు. ఆయన జీవులలో కోపముగా వ్యక్తమై, మరల తొలగించుచున్నాడు. ఆయన ఎల్లప్పుడు మేలుకొని యుండుటయే గాక, తాను శ్వాసకు వాయువువలె వాహనముగా నున్నాడు. ఆయన సుముఖుడై యుండుటవలన, విచారము లేని వాడు. ఆయన తనకు తాను అభివృద్ధి పొందువానిగా, అసమానునిగానున్నాడు. అన్ని కారణములకు పుట్టుకగా మరియు, మనస్సుకు మించిన వేగముగా నున్నాడు. ఆయన కారణముగా, సాధ్యముగా, కర్మ చేయు వానిగా, మరియు చేయని వానిగా నున్నాడు. ఇది యంతయయూ తన సంకల్పమే. ఆయ పరిపూర్ణమగు సంకల్పముగా, హిరణ్యగర్భునిగా లేక బంగారు రంగు గోళముగా నున్నాడు. ఇదియే సృష్టి. ఆయన సుదర్శన చక్రముగా, మరియు కాలము, చోటు, అను కిరణములుగా నున్నాడు. తారకల మండలములను త్రిప్పువానిగా ఈ విశ్వమను రథమును నడుపువానిగా నున్నాడు. ఆయన యుగములుగా జీవులందరికి తండ్రిగా నున్నాడు., ఆయనయందు జీవులు మేలుకొనుచూ, నిద్రించుచున్నారు. ఆయన వేయి కిరణములను సృష్టించుచూ, తారకలకూ, గ్రహములకూ కారణమగుచున్నాడు. సృష్టి అంకురమునకు, నిర్మాణమునకు కారణమయిన వృషభముగా నున్నాడు. ఆయన ఉత్తముడు, వినయవంతుడు. సత్యముగా నున్నాడు. మరియు వాటి రుచి, అనుభవము తెలిసినవాడు. ఆయన ''సత్'' అను పాల సముద్రముపై సృష్టియను పాము చుట్టలపై విశ్రమించియున్నాడు. ఆయన సత్యము మరియు ధర్మము అను వాని యందున్న ఆనందముగా నున్నాడు. ప్రజ్ఞామయము, శక్తిమయము, ద్రవ్యమయము అను మూడు లోకములను మూడడుగులతో వామనుడై ఆక్రమించెను. ఆయన ద్రష్ట మరియూ సంఖ్యలుగా జీవులను పుట్టించు కపిల మహర్షి. ఆయన సృష్టియందలి అన్ని లోకములూ తనయందు భాగములుగా కలిగియున్నాడు. చోటుయందలి అంతర్లీనముగా యున్న వెలుగు తానై యున్నడు. వాక్కు యొక్క మూడు స్థితులూ తానే. జీవులను తప్పులనుండి నివారింపగల వాక్కు లేక వాణి తానే. ఆయనయే శాంతి మరియు శాంతిని నెలకొల్పువాడు. ఆయనయే గమనము. గమనించుటకు సాధ్యముగాని వాడు. ఆయన కాంతుల, రంగుల, వైభవము.

ఆయన సృష్టియొక్క సంపదగా, భూమిపై పవళించి యున్నాడు. సమస్తము ఆయనకు సమిధయగుచున్నది. ఆయన వ్యాపించువాడు, మరియు సృష్టి విజ్ఞానము తెలిసినవానిగానున్నాడు.

ఆయన జయించువానిగా, జయముగా తానే యున్నాడు. ఈ సృష్టి యను యజ్ఞమునకు సృష్టియే సమిధ యగుచున్నది. ధ్యానింపబడు వానిగా మరియు ధ్యానముగా ఆయనయే యున్నాడు. ఆయన తన జీవితమను వెలుగునకు ఆధారమై, రూపమై తానేయందు నివసించి యున్నాడు. ఆయన అనేక రూపములు తన యందు కలిగిననూ, వాటి సమాహార రూపము తానుగా నున్నాడు. ఆయన తనలోనే తానుండి, మరల వెలుపల యున్నాడు. ఇందరిలో తానొకడుగానే యున్నాడు. మరియూ మనయందలి ప్రశ్నగా సమాధానముగా తానే యున్నాడు. తానెవరు? తానేమి చేయుచున్నాడు? అను వానికి సమాధానము తానే. సృష్టియందలి ప్రళయముగా తానేయున్నాడు. గౌరవ మనగా తానే గనుక తన కాత్మగౌరవము లేదు. కానీ ఇతరులను వారి యందలి ఆత్మలను గౌరవించువానిగా నడుపును. సరియైన వివేకము, సత్యజ్ఞానము ఆయనయే. మరియు అందలి సారాంశము తానే. ఆయనయే ప్రకాశము, ప్రకాశించువాడు. అన్ని కొలతలు ఆయన ఆయుధములే. అన్ని ఆయుధములను, కిరణముల రూపమున ధరించుచున్నాడు. ఆయన ప్రతిదానిని పరిపాలించును. మరియు ఆయనకు నాలుగు రూపములు. నాలుగు భుజములు, నాలుగు వాహికలు, నాలుగు మార్గముల నుండి దిగివచ్చును.

ఆయన జీవుని యందలి, చతుర్ముఖ బ్రహ్మ అను రూపము, నాలుగు పాదములు గల వేదము ఒక పాదముగా భౌతిక రూపమున వ్యక్తమగుచున్నది. అట్లు వేదము తెలిసినవాడు నారాయణుడు. నేను అను సూత్రము వలన, సృష్టియందు వ్యక్తమైయున్న సమస్త లోకములనూ, తన దేహభాగములుగా ఉచ్చరించువాడు. అతడు రాజులలో కర్తవ్యము నిర్వహించువానిగా మరియు వాని కర్తవ్యముగా, కర్మను సంస్థాపన చేయువానిగా యున్నాడు. ఆయన తానే బాధ్యతగా, కాంతులన్నిటిని మించిన కాంతితో రత్నముగా, ప్రకాశించుచున్నాడు. ఆయన తానే జ్ఞానము గనుక, సమస్తమునూ

తెలిసియున్నాడు. మరియు విజయము తానే. హిరణ్య రేతస్సు అను మొట్టమొదటి బంగారు రంగులో నున్న వెలుగు రవ్వగా మేల్కొను చున్నాడు. మరియు వాక్కునకు అధిపతులగు దేవతలకందరికి తానే అధిపతిగా నున్నాడు. అట్టి సుడిలోనికి సకలము వచ్చుచు పోవుచునున్నవి. ఆయన మర్త్యము అనగా మృతిపేర తన అమృతత్వమును వ్యక్తము చేయుచున్నాడు. ఆయన సమస్తమును వ్యాపించియున్నాడు గనుక ధ్యానమునందు సులభముగా గోచరించుచున్నాడు. శత్రువులయందలి శత్రుత్వము తానే గనుక, శత్రువులందరిని నశింపజేయుచున్నాడు. వట, పిప్పల, ఉసిరిక వృక్షములు, ఆయన యొక్క స్థిరత్వమును, అంకుర శక్తిని తెలియజేయును. ఆయన అగ్ని కనుక వేల వాహికలు మరియు జిహ్వాలు కలవాడు. ఆయన రూపములు నిర్మించుచున్ననూ రూపములు లేనివాడు. భయపడువారిలో భయము కూడా తానే. ఆయన అందరియందునూ తానుగా నున్నాడు. అణువుగనూ, విశ్వముగనూ, సూక్ష్మముగనూ, స్థూలముగనూ యున్నాడు. ఆయన గుణాతీతుడు అయినను గుణములను పుట్టించుచున్నాడు. ఆయన సమస్తమును భరించుచున్ననూ, ఒక్కడుగా నున్నాడు. ఆయన అన్ని కులములకు మొదటివాడు. కులములు ఆయన వ్యాప్తి వలన వృద్ధిపొందుచున్నవి.

సమస్తమునకు యోగమను భారమును వహించుచున్ననూ ఆయన యోగ విద్య కధిపతియైయున్నాడు. వాయువున కధిపతియై జీవుల శ్వాసయను పేర, జీవశక్తిని పుట్టించుచున్నాడు. గరుత్మంతునిపై కూర్చుండి, ''శ్వాస'' యను పేర, జీవులలోనికి వచ్చుచూ పోవుచున్నాడు. ఆయన ధనుర్విద్య కధిపతి గనుక, పైన బోర్లించినట్లున్న ఆకాశమను ధనుస్సును ధరించియున్నాడు. శిక్ష, శిక్షింపబడువాడు, శిక్షించువాడు అను మూడును తానే.

ఆయన సమత్వమందలి సామ్యస్థితి సత్యత్వమందలి సత్యము తానే. అందరయందలి ప్రేమయను సత్యముగా నున్నాడు. చోటునందు విష్ణువుగా వ్యాపించి యున్నాడు. వాయువునందు వహ్నివలె, ప్రయాణము చేయుచున్నాడు. తేజస్సుగా తనను తాను వెదజల్లుకొనుచున్నాడు. సూర్యుడను కన్ను ద్వారా వ్యక్తమగుచున్నాడు, ఆయన సమస్తమును భక్షించు అగ్ని యైననూ,

అందరియందలి సంతోషమును వెచ్చదనముగా నున్నాడు. ఆయనకు గందరగోళము, నిర్వీణ్ణుడగుట, మున్నగునవి లేవు. ఆయన అన్ని లోకముల యందునూ ధర్మమను పేర నిలిచియున్నాడు. ఆయన ఆశ్చర్యముగా నున్నాడు గనుక ఆశ్చర్యపడుట లేదు. శాశ్వతము నందలి శాశ్వతత్వము తానే. మరియూ కపిలుడను పేర ఆయన సాంఖ్యమై సమస్తమునూ సంఖ్యలుగా, మరియు జీవులయందలి సాంఖ్యమను జ్ఞానముగా నున్నాడు. సుదర్శనమను చక్రమును ధరించి విక్రముడై యున్నాడు. ఆయనకు భయపడుట అనునది లేదు. మాటల కతీతుడైననూ, పదములచే స్తోత్రము చేయబడుచున్నాడు. రాత్రిని సృష్టించి, అందు చల్లదనముగా తానే యున్నాడు. ఆయన అక్రూరుడు. మృదువు మరియు సన్నితమైనవాడు. ఆయన సామర్థ్యము, అభిమానము కలవాడు. ఆయన స్తోత్రము కోరదగినదియై యితరులకు సుఖము కలిగించును. ఆయన ధ్యానము అయిష్టమును తొలగించి జీవులయందలి లోపములను తొలగింపజేయును. ఆయనను ధ్యానించుటవలన దుస్స్వప్నములు నశించును. ఆయన వైభవమును, అనంతమైన మూర్తిని ధ్యానము చేయుటచే భయము నశించును. అన్ని దిక్కులయందునూ, మూలల యందునూ, కోణముల యందునూ ఆయనయే యున్నాడు. ఆయనకు ప్రారంభము లేదు. ద్రవ్యముగను, శక్తిగను, ప్రజ్ఞగను యున్నాడు. ఆయన పుట్టుక మరియూ పుట్టుకకు కారణముగానున్నాడు. ఆయన వైకుంఠమునకు అధిపతి. అనగా సమస్తమునకు తానే ఆధారము. ఆయన మందస్మితము సృష్టికి తొలి ఉషస్సు. ఆయన ఓంకార రూపమగు ప్రణవముగనుక, స్థూలమునుండి సూక్ష్మమునకు ప్రయాణము చేయుచున్నాడు. ఆయన సమస్తమునకు ధామము, వాహనము, పరిణామముగానున్నాడు. ఆయన ఒక్కడే, పుట్టుక, ముసలితనము, మృత్యువు అనువానిని దాటించుచున్నాడు. ఆయన తండ్రులకు తండ్రి గనుక, అందరకూ పితామహుడైయున్నాడు.

ఆయన సృష్టియందలి యజ్ఞముగా తననంతాను సమర్పించుకొనుచున్నాడు. ఆయన యజ్ఞము చేయువాడు కూడా. ఆయన యజ్ఞశేషము, యజ్ఞమునకు వాహిక మరియు అగ్నిగానున్నాడు. ఆయన కర్త, యజమాని, అనుభవించువాడు మరియు నిర్వహించువాడు. తన యజ్ఞమునకు

అంతము కూడా తానే. నిజమునకు ఆయన ఆహారమునూ అన్నము తినువాడు రెండునూ తానే గనుక, యజ్ఞ రహస్యము కూడా తానే. ఆయన తనకి తాను పుట్టువాడు. తన పుట్టుక తానే యైనవాడు. సామముగా తనని తాను వ్యక్తము చేసుకొనుచున్నాడు. ఆయన సృష్టి కర్త, మరియూ దేవకీ కుమారుడై జీవులను వృద్ధి చేయుచున్నాడు. శంఖము, చక్రము, ధనుస్సు, గద, ఖడ్గము ధరించి నిలిచి యున్నాడు. ఆయన చక్రముతో సమస్తమునూ నిస్పందేహముగా నశింపజేయుచున్నాడు. ఆయన వైజయంతిమాలను ధరించి, సమస్తమునందునూ అంతర్యామిగానున్న నారాయణుడుగా, అంతటనూ వ్యాప్తి చెందిన విష్ణువుగా, అందరియందునూ, తన ప్రవర్తనగా వసించియున్న వాసుదేవునిగా, నిలచియున్నాడు. ఆయన అన్నిదిక్కుల నండి మనను కాపాడుగాక.

# విష్ణు సహస్రనామ స్తోత్రమ్

## రహస్య ప్రకాశము

1. శ్లో॥ విశ్వం విష్ణు ర్వషట్కారో భూత భవ్యభవత్ప్రభుః
భూత కృ ద్భూత భృద్భావో భూతాత్మా భూతభావనః ॥

**ప్రతిపదార్థము** :- 1. విశ్వం = ప్రపంచము, 2. విష్ణుః = వ్యాపించుట అను గుణము కలవాడు, 3. వషట్కారః=ప్రపంచమే తానుగా వసించువాడు, 4. భూత=జరిగిపోయినది, భవ్య = జరుగనున్నది, భవత్=జరుగుచున్నది, 5. ప్రభుః=పాలకుడు, 6. భూతకృత్=జీవులను సృష్టించువాడు, 7. భూతభృత్=జీవులను భరించువాడు, లేక పోషించువాడు, 8. భావః = అస్తిత్వమునకు కారణమయిన వాడు, 9. భూతాత్మా=భూతములకు (జీవులకు) ఆత్మయైనవాడు, 10. భూతభావనః = జీవులను కల్పన చేయువాడు.

**తాత్పర్యము** :- ఈ సృష్టియంతయు విష్ణువుచే వ్యాప్తిచెందియున్నది. అతడు విశ్వమంతయు నిండి అందు నివసించి యున్నవాడు. అతడే జరిగినది, జరుగబోవునది మరియు జరుగుచున్నది అను కాలము. అతడు ఈ సృష్టికి పాలకుడు కనుక జీవులకు సృష్టికర్త. అతడు భూతములకు ఆత్మయైనవాడు. కనుక వానిని భరించి పోషించుచున్నాడు. తన ఉదరమందే జీవులను కల్పించుచున్నాడు.

**వివరణము** :- 1. విశ్వం :- విశ్వమును భగవంతుని యొక్క రూపముగ ధ్యానము చేయవలెను. యోగసాధనమునందు ఇది మొదటి మెట్టు. ఏ సంప్రదాయమునకు చెందిన సాధనయైననూ, ఈ సాధన లేనిచో వ్యర్థమగును. లేక వామాచారాది తాంత్రిక విద్యలలోనికి దిగజారు ప్రమాదమున్నది. ఎవరికైననూ యోగ సాధన ప్రారంభముకాకపూర్వము తాను, ఈ సృష్టియందలి సజీవములు, నిర్జీవములైన విషయములన్నియు కలిపి సత్యమనిపించును. అది వానిలోనున్న అజ్ఞానముచే కలుగుచున్నది. అట్టి అజ్ఞానము తొలగవలెనన్నచో సాధన మొట్టమొదట ప్రారంభించినపుడు పరమాత్మను విశ్వరూపునిగా ధ్యానము చేయవలెను.

2. విష్ణుః :- అట్లు పరమాత్మను గూర్చి ధ్యానము ప్రారంభించి, పిదప ఆయనను అన్నింటిలోనికిని వ్యాపించియుండువానిగా మరల ధ్యానము చేయవలెను. మొదటి మెట్టునందు ప్రతి వస్తువును పరమాత్మగా ధ్యానము చేయుట జరుగును. రెండవ మెట్టున పరమాత్మనే ఒక్కొక్క వస్తువుగా ధ్యానము చేయవలసి యుండును. అనగా మొదటి పద్ధతియందు ఒక్కొక్క వస్తువునే లేక రూపమునే జ్ఞప్తికి తెచ్చుకొని ఆయా వస్తువులయందు పరమాత్మ ఉన్నాడని ధ్యానము చేయవలెను. అటు పిమ్మట పరమాత్మనే ధ్యానముచేయుచు అతడే ఒక్కొక్క వస్తువుగా, జీవిగా, రూపము కట్టుకొని మన యెదుట నున్నాడని ధారణ చేయవలెను. ఇట్లు చేయుట వలన, ఆయా వస్తువుల యొక్క నామ రూపాదులు మనకు నశించి ఆ వస్తువుల యొక్క ప్రయోజనము మాత్రమే వాటి అస్తిత్వమునకు సంకేతముగా నుండును. దీని వలన జీవులకు విశ్వరూపుడైన పరమాత్మయందు స్థానము కలుగును.

3. అవ్యక్తము నుండి సృష్టి వ్యక్త స్థితిలోనికి ఉచ్చరింపబడును. అట్లు ఉచ్చరింపబడిన సృష్టిని ''వషట్'' లేక వసతి అందురు. అనగా వసియించుచున్నదని అర్థము. క్రతువులలోను, హోమములయందు, హోతచే ఈ వషట్కారము ఉచ్చరింపబడును. అట్లుచ్చరించుట వలన అతడు తాత్కాలికముగా సృష్టికర్త యగుచున్నాడు. దీనిని ధ్యానము చేయుచు ఉచ్చరించువాడు పరమాత్మయందు మేలుకొనుచున్నాడు.

4. భూతము, భవిష్యత్తు, వర్తమానము అను మూడును కాల పురుషుని అంగములు. ఇవి భౌతిక జగత్తు లేక వ్యవహారిక జగత్తునందు ప్రవర్తించుచున్న మనస్సునకు మాత్రమే కలవు. అట్టి మనసునకు ఆధారమయిన తాను అను ప్రజ్ఞకు ఈ మూడు లేవు. ఆ మూడును వర్తమానమే యగును. ఇది యెట్లనగా భూమిపైనున్న జీవులకు సూర్యోదయము, మధ్యాహ్నము, సూర్యాస్తమయము అను మూడు స్థితులున్నవి. అట్లే పగలు, రాత్రి, సంధ్య అను మూడు సమయములున్నవి. ఇవి భూమియందున్న మనకు సత్యములే కాని సూర్యునికి అసత్యములే కదా! సూర్యుడు నిరంతరము ప్రకాశించుట అను వర్తమానమున ఉన్నవాడు. ఆయనకు నిన్న, రేపు, ఎండాకాలము, వర్షాకాలము, చలికాలము మొదలగునవి లేవు. అతడు ఎప్పుడును ప్రకాశించుట

అను వర్తమానమునందే యుండును. అట్లే తాను అను వెలుగు ప్రకాశించుచుండగా, మనస్సు ఇంద్రియములందు ఊహలుగా, కోరికలుగా వక్రీభవనము చెంది నిన్న, నేడు రేపు అను రంగులు సృష్టింపబడుచున్నవి. ఈ రంగులు పోయి, వక్రీభవనము లేని తానను వెలుగు కిరణములు సూటిగా పడుటకు, ధ్యానము చేయవలెను. అది యెట్లనగా నిన్న, నేడు, రేపు అను మూడు శిరస్సులు ధరించిన కాలపురుషునిగా ధ్యానించవలెను. ఆయననే త్రిమూర్తి అందురు. ఈ ముగ్గురినే బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని కూడా అందురు. కావున అట్టి మూడు శిరస్సులు ధరించిన ఒకే కాలపురుషుని రూపమును ధ్యానము చేయుము.

5. ఈ సృష్టియంతయు నొక మహాశక్తిపై నాధారపడి నిలిచి యున్నది. అట్టి మహాశక్తియే జీవులుగా, దేవతలుగా తారలుగా, గ్రహముల ప్రజ్ఞలుగా, జీవ ప్రజ్ఞలుగా దిగివచ్చినది. అట్లు దిగివచ్చిన వెలుగులు, ఆయా వ్యక్తులు, దేవతలు, గ్రహములు మున్నగునవిగా చరించుచున్నవి. వాటి అస్తిత్వము, వాటి వెనుక ఉన్న మహాతేజస్సుపై ఆధారపడి ప్రకాశించుచున్నది. రాత్రులందు చంద్రుని వెన్నెల, పగటి పూట ఇండ్లలో గల వెలుతురు, సూర్యుడను వెలుగునుండి లభించినవే కదా! ప్రత్యక్షముగా సంబంధము లేనట్లు కనిపించినను, పరోక్షముగా అంతయు ఒకటే వెలుగు. అట్టి ఒకే వెలుగును మనయందు వెలుగుచున్న ప్రభువుగా ధ్యానింపవలెను.

6. సృష్టి అవ్యక్తము నుండి వ్యక్తముగా దిగివచ్చుటకు సృష్టికర్తకావలెను. అనగా అవ్యక్తముగానున్న పరమాత్మ సృష్టికర్త, సృష్టింపబడునది, అను రెండుగా వ్యక్తమగుచున్నాడు. అట్టి సృష్టికర్తను ‘‘బ్రహ్మ’’ అందురు. ఆయననుండి వాక్కుగా సృష్టి దిగివచ్చెను. కనుక అట్టి వాక్కునే సరస్వతి యందురు. సుపర్ణ సూక్తమునందు ఈ రెండును సుపర్ణుని రెండు రెక్కలుగా చెప్పబడినవి. అశ్వినీ సూక్తమునందు వీనినే అశ్వినీ దేవతలుగా గానము చేసిరి. సృష్టికి పూర్వమున్న స్థితిలో ఆయననే నారాయణుడు అని అందుము. అట్టి నారాయణుడు తానే సృష్టికర్తగా, సృష్టిగా, దిగివచ్చును. నీటియందు మంచు ముక్కలు తేలుచున్నపుడు, మంచుముక్కలు తాత్కాలికముగా నీటినుండి వేరగుచున్నవి కదా! అదే విధముగా నేను అను పరమాత్మ యొక్క వెలుగునందు, సృష్టికర్త,

సృష్టియను ప్రజ్ఞలు తేలుచున్నవి. ఇట్లు సృష్టికర్త లేక ప్రభువు నారాయణుడే అగుచున్నాడు.

7. అట్లు సృష్టిగా దిగివచ్చిన పరమాత్మ జీవులను తానే భరించువాడు లేక పోషించువాడు కూడా అగుచున్నాడు. అతడే ఆహారముగా కూడా దిగివచ్చెను. భూమి యందలి ఖనిజముల, లవణముల రూపమున నుండి వృక్షములకు ఆహారమును సమకూర్చుచున్నాడు. అట్టి వృక్షములను, ఫలాదులను ఆహారముగా స్వీకరించి, జంతువులు, మానవులు వృద్ధి పొందుచున్నారు. ఇట్లు పరమాత్మ తానే ఆహారముగాను, ఆహారము తీసుకొను వారుగను, దిగి వచ్చెను. ఆహారము తీసుకొనువారిలో, అట్టి ఆహారమును జీర్ణము చేసుకొని, దహన క్రియ ద్వారా పుట్టించు శక్తిగా (Metabolism) పని చేయుచున్నాడు. దీనినే వైశ్వానరాగ్ని యందురు. దీనిలో పరమాత్మ దేహమును పోషించువాడు కూడా అగుచున్నాడు.

8. అస్తిత్వము (Existence) అనునది ఒక అద్భుతమైన విషయము. జీవులు కాని, గ్రహగోళాదులు కాని, అట్లు నిలిచియుండుటకు కారణమును ఇంతవరకు శాస్త్రవేత్తలెవరును కనుగొనలేకపోయిరి. అట్లు సృష్టి నిలిచియుండుటకు ''నేను'' అను ప్రజ్ఞయే కారణము. మన శరీరము కూడా మనకు అట్లే నిలిచియున్నది. శరీరమునందు జీవప్రజ్ఞ శరీరమును విడిచిన తక్షణమే అందలి ధాతువులు కణములుగను, అణువులుగను విడిపోయి పంచభూతములందు లయమగుచున్నవి. అట్లే సూర్యుడు మున్నగు తారలు కూడా నిలిచియున్నవి. ఈ మొత్తము నేను అను మహాప్రజ్ఞయందు నిలిచియున్నది.

9. సృష్టియందలి జీవులలోనెవరి వ్యక్తిత్వము వారికున్నది. ప్రతి జీవికిని తానితరులకన్న వేరుగా నున్నానని తెలియుచున్నది. ఇట్లు వేరుగానుండుట వలననే జీవుల నామరూపాదులు, స్వభావములు వేరువేరుగా నున్నవి. జీవిచుట్టును మనస్సు, ఇంద్రియములు, భౌతిక దేహము మున్నగునవి పొరలు పొరలుగా చుట్టుకొని యున్నవి. ఈ పొరల వెనుక గల తానను ప్రజ్ఞయందు, జీవికి మెలకువ యుండదు. తాను ఫలానా వారికి తండ్రి ననియు, ఫలానా స్త్రీకి భర్తననియు, ఫలానా ఇంటికి, పొలమునకు, ధనమునకు యజమానిననియు

గుర్తుంచుకొనును. కాని తానొక జీవినని మాత్రము జ్ఞాపకముండదు. తాననగా శరీరములో నున్న జీవుడని తెలియుటకు చాలాకాలము పట్టును. అటు పిమ్మట క్రమేణా తన శరీరములో నున్న జీవప్రజ్ఞ, తానను అసలు వెలుగునుండి పుట్టినదేనని తెలియును. ఈ అసలు వెలుగునే " ఆత్మ" అందుము. అట్లు పరమాత్మ సర్వభూతముల యందు ఆత్మగా వెలుగుచున్నాడు.

10. పరమాత్మ జీవులను కల్పించుచున్నప్పటికిని కల్పించుట లేదనవలెను. ఇది యెట్లనగా ఒక కవి సముద్రతీరమునకేగి అచ్చటి ప్రకృతి సౌందర్యమును చూచి తన్మయత్వము చెందుచున్నపుడు, అప్రయత్నముగా కొన్ని భావములు కలుగును. ఆ భావములు ఒక రూపము దాల్చును. ఆ రూపమే ఒక కావ్యముగనో, నొక గ్రంథముగనో ఆ కవినుండి వచ్చును. ఇచ్చట ఆ కవికి కల్గిన భావములు వాటంతట అవియే కలిగినవిగాని కవి ముందుగా తన కట్టి భావములు కలుగవలెనని కోరుకున్నవి కాదు. అట్లే పరమాత్మ నుండి జీవులు, లోకములు, కల్పింపబడుచున్నారు కాని పరమాత్మ కల్పించుటలేదు.

2. శ్లో॥ పూతాత్మా పరమాత్మాచ ముక్తానాం పరమాగతిః
అవ్యయః పురుష స్సాక్షీ క్షేత్రజ్ఞోఽ క్షర ఏవచ ॥

**ప్రతిపదార్థము** :- 1. పూతాత్మా = నిర్మలమయిన ఆత్మ కలవాడు, 2.పరమాత్మా= ఆత్మకు ఆధారమయిన వాడు లేక వెలుగునకు వెలుగైనవాడు, చ = మరియు, 3. ముక్తానామ్ = మోక్షము పొందినవారికి, పరమా= ఉత్కృష్టమయిన (ప్రధానమైన) గతిః=మార్గము లేక లక్ష్యము, 4. అవ్యయః = వైభవము తరగనివాడు, 5. పురుషః = దేహము నందుండు ప్రజ్ఞ, 6.సాక్షీ=చూచువాడు లేక గమనించువాడు, 7. క్షేత్రజ్ఞః = క్షేత్రమునందుండి తన భావములను, ఆలోచనలను ఉపాధిని తెలిసినవాడు, 8. అక్షరః = నాశనములేనివాడు, ఏవచ = ఆ విధముగానున్నాడు కదా!

**తాత్పర్యము** :- పరిశుద్ధమైన ఆత్మ కలవాడు. గొప్ప ఆత్మయైనవాడు. మోక్షము పొందిన జీవులకు ప్రధాన లక్ష్యముగా నున్నవాడు. తరుగుట యనునది లేనివాడు. దేహమునందున్న ప్రజ్ఞలన్నింటిని గమనించువాడు, ఉపాధియందుండి తెలిసికొనువాడు, నాశము లేనివాడు కదా!

**వివరణ :-** పరమాత్మను నిర్మలమయిన ప్రజ్ఞగా ధ్యానము చేయవలెను. నిజమునకు ఆత్మ నిర్మలమే, కాని సృష్టియందలి పంచభూతములు, మనస్సు ఇంద్రియములు, భావములు, ఊహలు, విశ్వాసములు మున్నగునవన్నియు పరిశుద్ధము కావలసి యుండును. ఇవి పరమాత్మయను వెలుగులోని భాగములే గనుక, స్వయముగ నిర్మలములే. కాని భౌతిక లేక ద్రవ్య జగత్తులోనికి వచ్చినవి కనుక తాత్కాలికముగా మలినములనబడును. వానియందలి ఈ మాలిన్యము ద్రవ్యజగత్తు అను స్థితికి సంబంధించినది కాని, వానిది కాదు. మంచు గడ్డకున్న గట్టిదనము, ఆకారము మున్నగునవి నీటికి లేవు కదా! అట్టి భౌతిక జగత్తుయందలి సంసర్గమువలన కలిగిన మాలిన్యము తొలగుటకు, యమము, నియమము మున్నగు సంస్కారములు నిరంతరము అభ్యాసము చేయవలయును. అట్టి అభ్యాసము వలన, సంస్కారముల వలన క్రింది కోశములు నిర్మలములై ఆత్మయను వెలుగునందు ప్రవేశించును. కాని ఇది యంతయు పరమాత్మ అనుగ్రహముచేతనే సిద్ధించునని మరచిపోరాదు. అందుచేతనే ఆయనను పూతాత్మా అని పిలుచుచున్నాము.

2. పరమాత్మ అనగా ఆత్మకు అతీతమయినవాడు లేక అన్ని ఆత్మలు తానే అయినవాడు. పరమాత్మయను పెద్ద వెలుగునుండి దిగివచ్చిన కిరణములే జీవాత్మలను చిన్నచిన్న వెలుగులు.

3. మోక్షము పొందిన జీవుల మోక్ష స్థితియు, వారి మార్గమును, తానే అయి యున్నవాడు. ముక్త స్థితి అనగా మనస్సు, ఆలోచనలు, ఇంద్రియ వృత్తులు, మున్నగు కెరటములను (అలలను) శాంతింపజేయుట. ఇది పరమాత్మ సాన్నిధ్యమును పరిసరములయందు గుర్తించుటతో మొట్టమొదటగా ప్రారంభమగును. అట్లు ప్రారంభమగుట ఒక్కొక్కరికి ఒక్కొక్క విధముగా నుండును. స్థూలముగా అవి నాలుగు రకములని చెప్పబడినవి. ''ఆర్తో జిజ్ఞాసు రర్థార్థీ జ్ఞానీచ భరతర్షభ'' - అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పెను. ఇంకను శ్రీకృష్ణుడు భగవద్గీత 2వ అధ్యాయములో యిట్లు చెప్పెను.

''నాసతో విద్యతే భావో నాభావో విద్యతే సతః
ఉభయోరపి దృష్టో౽ న్త స్త్వన యోస్తత్వ దర్శిభిః''

అ) జీవితమున దాటరాని మహాపదలు సంభవించినపుడు ఎంతటి వాడునూ నిస్సహాయుడగును. నమ్మిననూ, నమ్మకున్ననూ అట్టి స్థితిలో భగవంతుడుతప్ప ఇక ఎవ్వరూ తనను రక్షించలేడనిపించును. ఒకవేళ అట్టి భగవంతుడు నిజముగనున్నచో తనను రక్షించినచో బాగుండుననిపించును. ఎట్టి వాడైననూ, ఆపదలో స్మరించినచో, పంరంక్షణవుననే అట్టివాడు రక్షింపబడుచున్నాడు. ఇట్లు కొందరు ఆర్తులై భగవంతుని గూర్చి తెలిసికొనుచున్నాడు.

ఆ) మరికొందరు కుతూహలము చేత, విచికిత్స చేత, సృష్టియందలి రహస్యములను తరచి చిట్టచివరకు అన్నింటికి ఆధారమైయున్న పరమాత్మయను చేరగలుగుచున్నారు.

ఇ) ఏదియో ఒక ఉపయోగము లేనిచో ఎవరికిని ఏ పనిచేసి పెట్టని వారు కొందరున్నారు. అనగా తమ స్వార్థమునకో, ప్రయోజనమునకో మాత్రమే యితరులను ఆశ్రయించుట, గౌరవించుట చేయుదురు. ఆశ్రయించినవారు తమ చుట్టు తిప్పుకుని చివరకు మొండిచేయి చూపించుటయు, ఆశ్రయింపనివారు అకారణముగా సహకరించి సహాయముచేయుటయు, ఒక్కొక్కసారి తాను శత్రువులనుకున్నవారు సహాయపడి పనులు చేసి పెట్టుటయు జరుగును. దానితో పనులు జరుగుట తమ ప్రయత్నమును బట్టి గాదనియు, సిద్ధించుట, సిద్ధించకపోవుట అనునది తమచేతులలో లేని విషయమనియు తెలియును. అట్లు క్రమేణా వారు పరమాత్మయందు మేలుకొనుచున్నారు.

ఈ) వీటన్నిటికన్నా సూటి అయిన మార్గము జ్ఞానము. తనలో తెలిసికొను ప్రజ్ఞగా ఉన్నాడనియు, అతడే చరాచర జగత్తుగా తెలియబడుచున్నాడనియు తెలిసికొని దానిని నిత్య జీవితములో అనుక్షణము ఏమరుపాటు లేక ఆచరించువాడు బంధ విముక్తుడగును. సంసార తాపత్రయమున మునిగి తేలుచున్న జీవులకు, పరమాత్మ ఇచ్చిన తరుణోపాయమే జ్ఞానము. ఇది సకల జీవులకునూ వారి హృదయములయందే గ్రంథస్థమై యున్నది. ఇది చదువుకొనదలచిన వారికి ఎపుడునూ తెరువబడియే యుండును. దీనికి లభించు వరమే మోక్షము.

పై నాలుగు స్థితులును వేరువేరు జీవులకు సంబంధించినవే అయిననూ, నిజమునకు సాధనలో గల నాలుగు దశలు. కనుక నారాయణుడు జీవుల ముక్తి మార్గమును, దాని లక్ష్యమును తానే ఐ ఉన్నాడు.

4. పరమాత్మ తరుగనివాడు. అది యెట్లనగా మన చుట్టూ చోటుగలదు. ఆ చోటునుండి జీవులు, గ్రహముల, తారలు పుట్టుచుండును. మరల ఇవన్నియు ఆ చోటులోనే కలిసి పోవుచున్నవి. కనుక ఈ జీవులు మున్నగు వానికన్నా చోటు శాశ్వతమయి యున్నది. అనగా ఇంతమంది జీవులు పుట్టుచున్ననూ, గ్రహములు పుట్టుచున్ననూ చోటు తరగిపోవుట లేదు. అట్లే భగవంతుని నుండి లోకములు పుట్టుచున్ననూ అతడు తరగని వాడై అట్లే యున్నాడు.

5. పురుషుడనగా పురమునందుండు వాడు. లేక దేహమునందుండు వాడు. ఇతడే భగవద్గీతలో క్షేత్రజ్ఞుడని చెప్పబడినది. పురుష సూక్తమునందు ''సహస్ర శీర్షా పురుషః సహస్రాక్ష స్సహస్ర పాత్, స భూమిం విశ్వతో వృత్వా'' అని వర్ణింపబడినది. జీవులకు గల వేలకొలది కన్నులు, పాదములు, ఈయనవే అని చెప్పుటచేత ఈయన జీవులందరిలోను ఉన్నవాడని చెప్పబడినది. అంతేకాక అతడు భౌతిక జగత్తు అంతనూ చుట్టియున్నాడని కూడా చెప్పబడినది. ఆయననే ఈశ్వరుడు అందురు. అట్టి ఈశ్వరుని నుండియే మన మనస్సు, పంచేంద్రియములు, బుద్ధి, భౌతిక దేహము మున్నగునవి కలుగుచున్నవి. అట్లే విశ్వము నందలి అణువు మొదలు సూర్యగోళము వరకు ఈ పురుషుడు వ్యాపించి యున్నాడు.

6. పరమాత్మ అట్లు వ్యాపించుటయే గాక లోనుండి చూచువాడుగా కూడా ఉన్నాడు. అతడు మనలోనున్ననూ మన మనస్సుతోనూ, ఇంద్రియములతోనూ జోక్యము పెట్టుకొనడు. జీవుడేది చేయుచున్ననూ అతడు గమనించుచునే యుండును. ఇది ఎట్లనగా పని చేయుచున్న వాని మనస్సు పంచేంద్రియముల ద్వారా పరమాత్మయే దానిని చూచుచుండును. కనుక ఎట్టివారైననూ తాను చేయుచున్నది మంచిదైననూ, చెడ్డదైననూ, వాని ఫలితముల నుండి తాను తప్పించుకొన చూచుచుండును. పనులు చేయుచున్నవాడే చాటుగా చేయుటవలన అది చేయకూడనిదని తానే నిర్ణయించువాడగుచున్నాడు. అందుచే

దానివలన కలుగవలసినఫలితములను తానే అప్రయత్నముగ నిర్ణయించుచున్నాడు. సర్వాంతర్యామి అయిన పరమాత్మ ఇట్టి విషయములును గమనించునే గాని వాని వలన కలుగు సత్ఫలితములు, దుష్ఫలితములను తన యందు కల్పించుకొనడు. వానిని జీవునకే వదలి, తాను మాత్రము జీవుడు తనను స్మరించు వరకు సాక్షియై వేచియుండును.

7. క్షేత్రమనగా ఉపాధి, మానవుడు తన శరీరమే క్షేత్రముగా పని చేయుచున్నాడు. అందుగల మనస్సు, భావములు, ప్రాణశక్తి మున్నగునవన్నియూ కలసి క్షేత్రముగా ఏర్పడుచున్నది.

ఇదం శరీరం కౌంతేయ, క్షేత్ర మిత్యభిధీయతే
ఏ తద్యో వేత్తి తం ప్రాహుః క్షేత్రజ్ఞ ఇతి తద్విదః

అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పినట్లు ఈ క్షేత్రమును గూర్చి ఎవరయితే తెలుసుకొనుచున్నాడో అతడే క్షేత్రజ్ఞు డగుచున్నాడు. తన పొలమును గురించి సరియయిన రైతునకు ఎట్లు తెలియునో అట్లే తన శరీరము మనస్సు మున్నగు ఉపకరణములను గురించి తెలిసికొనిన వాడు చక్కని రైతువలె, సత్కర్మలను వ్యవసాయము వలన, సత్ఫలితములు లేక మోక్షమను పంటను సాధించుకొనుచున్నాడు.

8. అట్లు సాధించుకొనుట వలన నాశములేని పరమాత్మయందు ప్రవేశించుచున్నాడు. నశించుట, కరిగిపోవుట అనునవి భౌతిక దేహమునకు, వస్తువులకు, మతములకు, రాజకీయములకు, మనస్సునకు, ఊహలకు, వానితో బాటు జీవకణములకు, అణువులకు తుదకు ప్రపంచమునకు సంబంధించిన విషయములు. ఇవి అన్నియును కరగిపోవును కాని పరమాత్మ కరుగడు. ఎందుకనగా ఇవి పరమాత్మయందు కరుగును. మంచుగడ్డ కరుగును, గాని నీరు కరుగదు. అట్లు ఎవనియందు ఇవి అన్నియూ కరగుచున్నవో అతడు అక్షరుడు .

3. శ్లో॥ యోగో యోగ విదాం నేతా ప్రధాన పురుషేశ్వరః
నారసింహవపుః శ్రీమాన్ కేశవః పురుషోత్తమః ॥

**ప్రతిపదార్థము :-** 1. యోగః=యోగము తానే అయినవాడు, 2. యోగవిదామ్ = యోగులలో, నేతా=నాయకుడు, 3. ప్రధానః = మూల ప్రకృతి (మాయ), 4. పురుషేశ్వరః = పురుషులకు అధిపతి అయినవాడు, 5. నారసింహవపుః = నరసింహరూపుడైనవాడు, 6. శ్రీమాన్ = లక్ష్మీదేవి భర్త, 7. కేశవః = కేశములు కలవాడు, 8. పురుషోత్తమః = ఉత్తమ పురుషుడైన వాడు.

**తాత్పర్యము :-** ఆయనే యోగము, యోగులకు నాయకుడైయున్నవాడు. మూల ప్రకృతి లేక మాయగా వచ్చినవాడు. పురుషులకు ఈశ్వరుడైన వాడు. నృసింహ రూపముతో వచ్చిన వాడు, లక్ష్మీదేవికి భర్త. లోకములే ఆయన కేశములు. ఉత్తమ పురుషుడను ప్రవృత్తిచే తెలియబడువాడు.

**వివరణము :-** 1. యోగమనగా అన్ని లోకములలోను ప్రజ్ఞ మేల్కొని యుండుట. అన్నమయము (భౌతికము). ప్రాణమయము, మనోమయము, విజ్ఞానమయము ఆనందమయమను కోశముల యందన్నిటియందు జీవులు సమానముగా మేల్కొనియుండు స్థితి. దీనిని సాధించుకొనుటకే యోగాభ్యాసము అవశ్యకము. అట్టి యోగాభ్యాసము ప్రారంభింపవలెనన్న కోరిక పరమాత్మనుండియే మనయందు పుట్టుచున్నది. కనుక పరమాత్మయే యోగమను పేర కూడ తెలియబడుచున్నాడు.

2. అందుచేత యోగసాధన చేయువారికి, ప్రారంభించువారికి నాయకుడు, లేక మార్గ దర్శకుడు నారాయణుడే అగుచున్నాడు. యోగాభ్యాసము మొదట ఒక సద్గురువునొద్ద ఉపదేశము పొందవలెను. అట్లు ఉపదేశించు గురువు ద్వారా యోగము నారాయణుడే ఉపదేశించుచున్నాడు. అనగా గురువు నుండి శిష్యులలోనికి నారాయణుడే ప్రవేశించుచున్నాడు. ఇదియే తైత్తిరియోపనిషత్తు నందు " అచార్యః పూర్వ రూపమ్, అంతేవాస్యుత్తర రూపమ్, విద్యాసన్ధిః" అని చెప్పబడినది. కనుక పరమాత్మయే యోగమునకు నాయకుడు అధికారి కూడ అగుచున్నాడు.

3. ప్రధానమనగా మూల ప్రకృతి. ఈ మూల ప్రకృతియే త్రిగుణములుగా వచ్చుచున్నవి. అవి సత్వము, రజస్సు, తమస్సు. ఈ మూడు గుణముల యొక్క సామ్యమువలన త్రికోణమేర్పడుచున్నది. దీనినే ఊర్ధ్వ త్రికోణమని కూడ

అందురు, ఈ త్రికోణమునందే సృష్టి నిలబడియున్నది. ఈ త్రికోణము చెదరినచో భౌతిక సృష్టి నశించి పరమాత్మయందు లయమగును. మొట్టమొదట మూల ప్రకృతి లేక మాయ పరమాత్మ నుండి వేరైనపుడు వారిద్దరు ఆది దంపతులనబడుదురు. దేవీ భాగవతమునందు వీరిరువురు శ్రీకృష్ణుడు, రాధగా వర్ణింపబడిరి. వేదములయందు కశ్యపుడు, అదితిగా వీరే చెప్పబడిరి. అట్లు పరమాత్మనుండి మూల ప్రకృతి వేరై వారిద్దరినుండి విశ్వములనేకములు దిగి వచ్చుచు, మరల వారియందే లయమగుచున్నవి.

4. స్వభావము జీవునికి ఆత్మగతమయినది. పరమాత్మ నుండి సంకల్పము బయలుదేరినపుడు అది సృష్టిసంకల్పము లేదా జగత్కర్మ యగును. అట్టి జగత్కర్మ ఒక వ్యక్తి ద్వారా పని చేయుచున్నపుడు, దానిని ఆ వ్యక్తి స్వభావము అందురు. సృష్టిలోనున్న సకల జీవులు క్షేమముగా ఆనందముగా ఉండవలెనను పరమాత్మ సంకల్పమే, జగత్కర్మయై గ్రహగోళాదులను పుట్టించుచు, వానికి గమనములను పరిధులను ఏర్పరుచుచున్నది. అదియే వ్యక్తిగతమయినపుడు, తాను, తన వారు సుఖముగా నుండవలెనని కోరును. ఇట్లు పురుషుని యందు స్వభావముగా ఏర్పడునది, వాని యందు గల జీవాత్మ మరియు తదంతర్లీనమయి యున్న పరమాత్మ అంశ అను రెండింటి సంయోగము చేత ఇది ఏర్పడుచున్నది. అచ్చట నుండి జగత్కర్మ జీవుని మనస్సుయందు ప్రతిబింబించి వాని స్వభావముగా వ్యక్తమగుచున్నది. కనుక అట్టి పురుషేశ్వరుని లేక పురుషుని యందలి ఈశ్వరుడై యున్న పరమాత్మను ధ్యానము చేయవలెను.

5. నరసింహునిగా పరమాత్మ దిగివచ్చెను. ఆయన హిరణ్యకశిపుని సంహరించి ప్రహ్లాదుని రక్షించెను. అనగా భగవంతుడు ఎప్పుడు ఏ రూపమున నైనను రావచ్చుననియు, మానవ దేహములవలెనే ప్రత్యేకముగా రానక్కరలేదనియు తెలియును. మానవుని వెన్నెముకయే స్తంభము. దానిని చీల్చుకుని పరమాత్మ వచ్చెననగా జీవుని వెన్నెముక యందలి ప్రజ్ఞా కేంద్రములు అన్నిటియందు తానను ఒకటే వెలుగు సమానముగా వెలిగినదని అర్థము. సింహము ధైర్యమునకు, శౌర్యమునకు, ఆశ్రిత రక్షణమునకు గుర్తు. అట్టి దీక్షయే శిరస్సుగా కలిగినది నరసింహావతారము. ఇట్టి లక్షణములను ధ్యానము చేసి అభ్యాసము చేయువానియందు నరసింహరూపుడై పరమాత్మ మేల్కొనును.

6. శ్రీ అన్న శబ్దము వైభవమునకు, సంపదకు చిహ్నము. ఇది సృష్టి యందలి పరమాత్మ విభూతియే. శ్రీదేవి అనగా పరమాత్మ యొక్క సగుణరూపమే. ప్రకృతి, అందలి సంపదలు, సూర్యకిరణముల యందలి బంగారు వర్ణముగా ఆమె శ్రీ సూక్తమున వర్ణింపబడినది. ''హిరణ్య వర్ణాం'' అను మంత్రముతో శ్రీ సూక్తము ప్రారంభమగును. అనగా సమస్త సృష్టి సంపదలో ప్రకృతి మున్నగు వానికి కారణములైన సూర్యకిరణములే ఈ లక్ష్మీదేవి యొక్క స్థానములు. ఈమె నివసించునది విష్ణుమూర్తి హృదయమందు. అనగా జీవుడు హృదయమున ఆర్ద్రత, ప్రేమ కలిగి యుండవలెనను భావము. అట్లు కలిగిన వానికి సమస్త సంపదలు వైభవములు కరతలామలకములగుచున్నవి. అందుకై నారాయణ ధ్యానము చేయవలెను. అనగా ప్రకృతిని తన హృదయస్థానమున ధరించిన పరమాత్మగా ధ్యానము చేయవలెను.

7. సమస్త సృష్టియంతయు అనేక పొరలుగా ఉన్నది. ఉల్లిపాయ యందలి పొరలవలె ఈ పొరలు విచ్చుకొనుచున్నవి. ఇవియే లోకములు. అట్టి లోకములే తన కేశములుగా కలిగినవాడు కేశవుడు అగుచున్నాడు.

8. మానవునిలో ప్రధానముగా లేక స్థూలముగా మూడు పొరలున్నవి. పరమాత్మ ఈ మూడు పొరల యందును - క్షర పురుషుడు, అక్షర పురుషుడు, పురుషోత్తముడుగ తెలియబడుచున్నాడు. అందు క్షరపురుషుడు సృష్టియందలి నశించు లేక మార్పులకు లోనగు స్వభావముగల ప్రకృతి; అనగా భౌతిక దేహము, భూమి, వృక్షములు మున్నగునవి. అక్షర పురుషుడనగా వీటియందు వెలుగుచున్న తాను అను ప్రజ్ఞ; అతడే జీవుడు. ఇవన్నియు ఎవనియందు జరుగుచున్నవో అతడే సృష్టికతీతమయిన పరమాత్మ. వానినే పురుషోత్తముడు అందురు.

4. శ్లో॥ సర్వ శ్శర్వ శ్శివ స్థాణు ర్భూతాదిర్నిధిరవ్యయః
సంభవో భావనోభర్తా ప్రభవః ప్రభురీశ్వరః ॥

**ప్రతిపదార్థము :-** 1. సర్వః = సమస్తము, 2. శర్వః = శివుడు, 3. శివ = శుభము కల్గించువాడు, 4. స్థాణుః = స్థిరమైన వాడు, 5. భూతాదిః= భూతములకు కారణమయినవాడు, 6. నిధిః = దాచబడిన సంపద

అయినవాడు లేక అందరిచే సమర్పణమయిన వాడు. 7. అవ్యయః = వ్యయమగుట లేని వాడు, లేక నశించుట లేనివాడు. 8. సంభవః = పుట్టుక లేక కలిగించుట అనుదానికి అధిపతి అయినవాడు. 9. భావనః = భావమును నడిపించువాడు లేక భావనకు గమ్యమైనవాడు, 10. భర్తా = పోషించువాడు, 11. ప్రభవః = మేల్కొల్పుటకు లేకవ్యక్త మగుటకు అధిపతి అయినవాడు, 12. ప్రభుః = సమర్థుడు లేక అధిపతి, 13.ఈశ్వరః = సృష్టి వైభవమునకు అధిపతి అయినవాడు.

**తాత్పర్యము :-** సమస్తము తాను అయినవాడు, హింసను నశింపచేయువాడు, శుభము కలిగించువాడు, భూతములకు స్థిరమైన కారణమైనవాడు, వ్యయము కాని నిధి అయినవాడు, భావమై పుట్టుకయైనవాడు, భరించువాడు, మేల్కొలుపుటకు సమర్థుడైనవాడు, అట్లు సృష్టివైభవమునకు కారణమైనవానికి నమస్కారము.

**వివరణము :-** 1. సమస్తమనగా సృష్టియందలి మరియు దానికి అతీతముగా ఉన్న మొత్తము పరమాత్మ యొక్క ప్రజ్ఞయే.

2. శర్వః అనగా హింసించు వాడు లేక నశింపజేయువాడు. ఈ సృష్టినంతటిని నశింపచేయుట అనగా సమస్తము దేని నుండి పుట్టినదో దాని యందు లయమగుట. భౌతిక ద్రవ్యములు అణువులనుండి వచ్చును. అట్టి అణువులు (Forces) శక్తులయొక్క సమాహారముచే (Equillibrium) ఏర్పడుచున్నవి. ఆ శక్తులు చోటులో పుట్టుచున్నవి. కనుక భౌతిక ద్రవ్యము నశించుట అనగా ద్రవ్యము శక్తుల యందును, శక్తి ప్రజ్ఞయందును లీనమగుట. సృష్టియందలి ఇట్టి నశింపజేయు ధర్మమును శర్వుడు అందురు.

3. శివుడనగా శుభము లేక మంగళము కలిగించువాడు; జీవులకు తాత్కాలిక శుభములను సుఖములను కల్గించుటతో ప్రారంభించి శాశ్వత సుఖమును, ఆనందమును కల్గించువాడు. అందుచేతనే నాస్తికుడు అయినవాడు మొట్టమొదటగా భగవంతునికి తన కష్టములు తొలగింపుమని మ్రొక్కినచో వెంటనే జరుగును. వానికి ఆ కష్టము తొలగిపోయి సుఖము కలుగును. అదే ఒక యోగి అయినవాడు తనకు ఐశ్వరము కల్గింపుమని, సంపదలు కల్గింపుమని

కోరినచో కలుగక పోవచ్చును. అంతేకాక అతడు దానికై చేయు ప్రయత్నములన్నియు వ్యర్థములై చివరకు కొంత ధనము కోల్పోవలసి వచ్చును. అట్లు తాత్కాలిక సుఖమును కోరు మనస్సును క్రమేణ శాశ్వత సుఖములకై భగవంతుడు మళ్ళించును.

4. స్థాణుః :- రాయివలె స్థిరమయినవాడు. అనగా భౌతిక సంపదయందు, రాళ్ళు, కొండలు, పర్వతములు ఎట్లు మిగిలిన వానికన్నా స్థిరమయియుండునో, అట్లే పరమాత్మ సృష్టికి వెలుపల, లోపల కూడా తానే స్థిరమయియుండును. ఆయన యందు విశ్వము గ్రుడ్డువలె తేలుచున్నది. మరల ఆయన యందే కరగిపోవుచున్నది. కనుక ఆయన స్థిరమయినవాడు. సృష్టి అస్థిరమయినది. స్థాణుః అను శబ్దమునకు అణువైయున్నవాడు అని కూడ అర్థము. పరమాత్మ అణువుయందలి శక్తిగా, ఆశక్తియందు ప్రజ్ఞగా తనే ఉన్నాడని అర్థము.

5. భూతాదిః :- భూతములకు కారణమైనవాడుగ తానై ఉన్నాడు అనగా అన్ని భూతములకు, ప్రాణులకు, జీవులకు తాను పుట్టుక అయి వున్నాడు. జీవునిలో నేను అను ప్రజ్ఞ మేల్కొని పని చేయుచున్నది. ఆ ప్రజ్ఞ జంతువులయందు, వృక్షములయందు, ఖనిజములయందు కూడా ఉన్నది, కాని మేల్కొని యుండదు. ఇట్లు అన్ని జీవులలోగల ''తాను'' అను ప్రజ్ఞగా కూడా తానే అయి ఉన్నాడు.

6,7. తరుగని సంపద అనగా, ఈ ప్రకృతి యందలి సంపదలు ఎచ్చటినండి దిగివచ్చుచున్నవో అదియే, అనగా సృష్టి సంకల్పము. అది పరమాత్మ నుండి వచ్చినది కనుక, అతడు తరుగని సంపదలు కల్గినవాడు. ఆయన నుండి దేవతలు సృష్టియజ్ఞమునకై సమస్తమును తీసుకొనుచున్నారు. ''తేన దేవాఅయుజంత'' అని పురుష సూక్తము చెప్పుచున్నది. ఈ సంపదలన్నియు ఆయనలో నుండి వచ్చుచు, మరల ఆయనయందే సమర్పింపబడుచున్నది. ఎన్ని సంపదలు దేవతలు ఆయన నుండి పరిగ్రహించిననూ ఆయన తరగకున్నాడు కదా!

8. సంభవ: :- పరిస్థితులను, సంఘటనలను కలిగించువాడు విష్ణువే. తానను ప్రజ్ఞగా ఆనందమయ స్వరూపుడిగా ఆయన యందు సృష్టి సంకల్పమనునది ప్రారంభమగుటయే ఒక సంఘటన. అట్లు సంభవమయిన సృష్టి యందు వివిధ లోకములు ఒకదాని తర్వాత ఒకటి సంభవమగుచున్నవి, లేక పుట్టుచున్నవి. భగవంతుని యందు జీవుని పుట్టుక గూడా ఒక సంఘటనయే.

9. భావన: :- మనయందు భావములు ఎచట పుట్టుచున్నవి? అట్లే వానికి గమ్యమేమి? అనగా ఎవరిని గురించి భావించినను లేక దేని గురించి భావించినను వాటియందు పరమాత్మ యున్నాడు. ఆ పరమాత్మనే వస్తువులుగా, జీవులుగా భ్రాంతి చెందిన మనస్సు అనేకముగా భావన చేయుచున్నది. అట్లే మానవుని భావన యంతయు తాను లేక తనవారి సుఖమును గూర్చియే.

10. భర్త :- ప్రతి వానికిని ఆహారము ఇచ్చి పోషించువాడు ఇంకొకడుండును. సాధారణముగా తల్లిదండ్రులు, బంధువులు, స్నేహితులు, యజమానులు, మున్నగు వారందరు పోషించు వారగుచున్నారు. కాని వీరందరును ఈ ప్రపంచమను నాటకరంగమున వర్తించు పాత్రలనునది ఎక్కువ సత్యము. అట్టి నాటకమునకు సూత్రధారి, నిర్దేశకుడు, పరమాత్మయగుచున్నాడు. కనుక పరమాత్మయను తెరపై వర్తించు బొమ్మలే వీరందరు అనునది సత్యము. కావున జీవులందరిని పోషించువాడు పరమాత్మయే యగుచున్నాడు.

11. అట్లు ప్రతి జీవియు నిద్రించి లేచుసరికి పై నాటకమున పాత్రలుగా తమను తాము గుర్తించుకొనుచున్నారు. పరమాత్మయను అంతర్యామిత్వమునుండి తాము ఫలానా పేరు గల వ్యక్తులమని గుర్తించుకొనుటతో వేరుగా పుట్టుట, మేల్కొనుట జరుగుచున్నది. అనగా పరమాత్మ తనయందు తాను నిద్రించి, సృష్టిగా మేల్కొనుచున్నాడు.

12. అట్లు మేల్కొన్న జీవులను పరమాత్మ శాసించుచునే యున్నాడు. అట్లు శాసించుట బాహ్యముగాకాక అంతర్లీనమైయున్నది. ఈయన ప్రభుత్వము అంతరంగికమయినది కనుక శాశ్వతము.

13. విభూతులనగా ప్రకృతి యందలి సాధ్యములుగానున్న శక్తులను భౌతికముగా వ్యక్తీకరింపజేయునది. ఈ శక్తులనే దేవతలు అందురు. అణిమ,

గరిమమున్నగు సిద్ధులన్నియు ఇట్టివే. అణువునకు సూక్ష్మముగా నుండు శక్తి కలదు. దానిని ఉపాసించిన వానికి సూక్ష్మత్వము, చిన్న వస్తువుగా మారుట మున్నగు శక్తులు కల్గును. అట్లే భూమికి పెద్దదిగా, బరువుగా నుండు శక్తి కలదు. వాయువునకు ప్రయాణము చేయుశక్తి కలదు. ఈ శక్తులను ఉపాసించినవానికి ఆ శక్తులు అట్టి వానియందు మేల్కొనును. అట్లే శరీరమునందు ధాతు నిర్మాణముచేయు శక్తులు, పంచేంద్రియముల శక్తులును పని చేయుచున్నవి, ఇదియే సూటిగా ప్రకృతియందు ఉపాసించి లేక ధ్యానము చేసినచో దివ్య శ్రవణము, దివ్యదృష్టి, కావలసినపుడు శరీరము సృష్టించుకొనుట, అక్కరలేనపుడు శరీరము పంచభూతములలోనికి మాయమగుట, సాధ్యమగును. ఇట్టి విభూతులన్నియు పరమాత్మ యొక్క వైభవములే.

5. శ్లో|| స్వయంభూః శంభురాదిత్యః పుష్కరాక్షో మహాస్వనః
అనాది నిధనో ధాతా విధాతా ధాతురుత్తమః ||

**ప్రతిపదార్థము :-** 1. స్వయంభూః = స్వయముగా అవతరించువాడు, 2. శంభుః=శాంతి స్వరూపుడు, 3. ఆదిత్యః = అదితికి కుమారుడు, 4. పుష్కరాక్షః = కల్వ పువ్వు వంటి కన్నులు కలవాడు, 5. మహాస్వనః = గొప్ప ధ్వని గలవాడు, 6. అనాది నిధనః = మొదలు చివరలు లేనివాడు, 7. ధాతా=సృష్టికర్త, 8. విధాతా=కల్పించువాడు, 9. ధాతుః ఉత్తమః = బ్రహ్మకన్న ఉత్తముడైనవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మ తనంతట తానే పుట్టుచున్నాడు. శాంతియే తానై వ్యక్తమగుచున్నాడు. అదితి కుమారుడు, కలువ పువ్వుల వంటి కన్నులు కలవాడు. శబ్ద స్వరూపమైనవాడు, మొదలు, తుది లేనివాడు. సృష్టి క్రమమును ఏర్పరచువాడు లేక కల్పించువాడు. తానే సృష్టి కర్తయు, అట్టి సృష్టి కర్తకు పాలకుడు, అయి ఉన్నాడు.

**వివరణ :-** 1. సత్యమునుండి ద్రవ్యము, శక్తి, మనస్సు అనునవి పుట్టి సత్యముచే నావరింపబడియున్నవి. ఈ సత్యము "తాను" అను వెలుగునుండి మొట్ట మొదటి చైతన్యము, లేక స్పందనముగా మేల్కొనుచున్నది. ఈ స్పందనము లేక చైతన్యము వలననే అన్ని లోకములు, ప్రజ్ఞలు మేల్కొని వర్తించుచున్నవి. కాని ఈ చైతన్యము తనంతటతానే పుట్టుచున్నది. సముద్రము నుండి కెరటాలుపైకి

లేచునట్లు ఈ చైతన్యము అంతర్యామియందు పుట్టుచున్నది. కనుక అట్టి చైతన్యముద్వారా అంతర్యామియే వ్యక్తమగుచున్నాడు. గనుక ఆయన ''స్వయంభూః'' మరియు మన దేహకోశములందు కూడ ''నేను'' అను జీవ సంకల్పముచుట్టు మనస్సు, ప్రాణము, భౌతిక దేహము మున్నగునవి అల్లుకొనుచున్నవి.

2. 'శం' అనగా శాంతియని అర్థము. దీనినే సామ్యస్థితి యందురు. 'శం' అను శబ్దమును ఉచ్చరించుచు ధ్యానము చేసినచో మనస్సు అప్రయత్నముగా ధ్యానమగ్నమగును. అనగా ప్రశాంతమగును. ఎందుకనగా ఆ ప్రయత్నమునందే ప్రశాంతత పుట్టుచున్నది. ఈ ప్రశాంతత యొక్క అనుభవమే సుఖము, ఆనందము; కనుక ఇట్టి ప్రశాంత స్థితియే తన రూపముగా కలిగిన పరమాత్మను ''శంభుడు'' అందురు.

3. ఆయన అదితియొక్క కుమారుడు. అదితి సకల దేవతలకు, సాక్షాత్తు విష్ణువునకును తల్లి, కాని పరమాత్మకు తల్లిదండ్రులు లేరు. ఆయనయే సకల జగత్తునకు తల్లి, తండ్రి, ఆయనలో నున్న ఒక కళయే తల్లిగా మొట్టమొదట వ్యక్తమైనది. ఈమెనే పరాప్రకృతి యనియు, పరదేవత యనియు అందురు. పామరులచే ఈమెయే ''మాయ'' అనియు పిలవబడుచున్నది. ఈమె గర్భమున మరల పరమాత్మ పుట్టెను. ఆయనను విరాట్ పురుషుడనియు, హిరణ్య గర్భుడనియు అందురు. ''తస్మాద్విరాడజాయత'' అని పురుష సూక్తము చెప్పుచున్నది. ఈ పరాప్రకృతియే సర్వ లోకములలోనికి తల్లిగా దిగివచ్చినది. భూలోకము నందు కూడ సంతానము కలిగిన స్త్రీయందు తల్లిగా ఈమెయే పని చేయుచున్నది. ఈమె అన్ని లోకములలోను తాను తల్లిగా నుండి పరమాత్మను తన బిడ్డగా పొందుచున్నది కనుక ఆమె అదితి. అట్లు తల్లికి బిడ్డ యగుచున్నాడు కనుక ఆయన ఆదిత్యుడు.

4. పుష్కర మనగా పద్మమనియు, కలువ పువ్వనియు రెండర్థములున్నవి. సూర్యుని కిరణమునకు పద్మము వికసించును. అట్టి పద్మమువంటి కన్నులు కలవాడు. అనగా పరమాత్మయొక్క ప్రభావముచే లోకములు విచ్చుకొని వ్యక్తమగుచున్నవి. అట్లు విచ్చుకొను లోకములే తన కన్నులుగా కల వాడని అర్థము.

పుష్కరాక్షుడనగా కలువ పువ్వులవంటి కన్నులు కలవాడని కూడా అర్థము. కలువలు రాత్రి విచ్చుకొనును. చీకటి యందు అవి విచ్చుకొనుచున్నవి కనుక అవ్యక్తమునందు లేక ప్రళయ స్థితియందు కూడ మేల్కొనియుండువాడు అని అర్థము. అనగా సృష్టియందును, సృష్టికతీతముగను, ప్రళయ స్థితియందును రెప్ప పాటు లేక చూచువాడు లేక రక్షించువాడు అని అర్థము. ఆయన కన్నులు భౌతికములు కావు. అవి దివ్యములు కనుక వానికి రెప్పపాటు లేదని చెప్పబడినది. (జగన్మాతయొక్క యిట్టి ఈ లక్షణమే మీనాక్షి యని ప్రస్తుతింపబడినది. మీనమనగా చేప, చేపకు రెప్పపాటు ఉండదు కనుక రెప్పపాటు లేక జీవులను నిరంతరము రక్షించుచుండునదని దీనికి అర్థము.) పుష్కర శబ్దమునకు పుష్టిని కలిగించుట అని అర్థము ఉన్నది అనగా తన చూపులతోనే విశ్వమునకు పుష్టిని కలిగించి ఆహారము, ప్రాణము, మనస్సు అను వానిచే సత్త్వవంతములను చేయుచున్నాడు, కనుక ఆయన పుష్కరాక్షుడు.

5. మహాస్వనము అనగా గొప్ప శబ్దములేక నాదము. సమస్త సృష్టి యంతయు బ్రహ్మాచే వాక్కుగా ఉచ్చరింపబడినది. అదియే మహానాదము. ఈ మహానాదమే విష్ణువు యొక్క శంఖారావము. ఆయన నుండి పూరింపబడిన ఈ నాదమే ''ఓం'' కార మనబడుచున్నది. ఈ ఓంకారమే ఒక్కొక్క లోకములో లేక స్థితిలో ఒక్కొక్క చైతన్యముగా తెలియబడుచున్నది. ఈ చైతన్యము యొక్క తరంగములే మనస్సు, ఇంద్రియములు, పంచభూతములు, ధాతువులు మున్నగునవిగా ఏర్పడుచున్నవి. వీటి వెనుకగల మహాచైతన్యమే '' ఓం'' కారము. ఈ ''ఓం'' కారమే జీవుల హృదయములలో పరమాత్మచే నాదముగా పూరింపబడుచున్నది, ఇట్లు జీవుల హృదయములలో వినిపించు నాదమునే ''పాంచ జన్యము' అందురు. అనగా పంచేంద్రియములనుండి పుట్టునది అని అర్థము. శ్రీకృష్ణుని శంఖము పేరు పాంచ జన్యము. ఈ '' ఓం'' కారము శ్వాసను నడుపుచున్నది కనుక తమ హృదయ స్థానముల యందు శ్వాసయొక్క చైతన్య తరంగములు పుట్టుచోటును ధ్యానము చేయుటవలన వాని మనస్సు శ్వాసయందు లయమగుచున్నది. అనగా '' ఓం'' కారము నందుండు ఇట్టి శబ్దముయొక్క మహా చైతన్య స్వరూపము తానే అయినవాడు మహాస్వనుడు.

6. ఈ సృష్టికి మొదలు, చివర కలవు. అనగా పుట్టుట, నశించుట కలవు. కాని పరమాత్మకు అవి లేవు. కుండకు మొదలు చివర కలవు. అనగా కుండను తయారు చేయుట, పగిలి ముక్కలై మట్టిలో కలసిపోవుట కలవు. కాని కుండ యందలి మట్టికి అవి లేవు కదా! సృష్టి కుండ అయినచో కుండ యందలి మట్టియే పరమాత్మ. పరమాత్మ సృష్టిగా వచ్చినను, సృష్టికి మొదలు చివర ఉన్నవికాని, అందలి పరమాత్మకు లేవు.

7. బ్రహ్మ సృష్టికర్త. ఆయన చతుర్ముఖుడు. వాక్కు యందలి నాలుగు స్థితులే ఆయన నాలుగు ముఖములు. అవి 1. పరావాక్కు, 2. పశ్యంతీ వాక్కు, 3. మధ్యమా వాక్కు, 4. వైఖరీ వాక్కు. ఆయన తన నాలుగు ముఖములనుండి సృష్టిని నాలుగు స్థితులలో ఉచ్చరించుచున్నాడు. ఈ చతుర్ముఖుడుగా వచ్చిన బ్రహ్మనే ''హిరణ్యగర్భుడు'' అందురు. పరమాత్మయే హిరణ్యగర్భుడైన బ్రహ్మగా వచ్చెను గనుక ఆయన సృష్టి కర్తయైన బ్రహ్మగా కీర్తింపబడినాడు.

8. సృష్టి యందు కాలము, చోటు అనునవి మొట్టమొదట పుట్టినవి. శబ్ద చైతన్యము యొక్క తరంగములే కాలము, దేశము అను రెండుగా వ్యక్తమగుచున్నవి. అవి తరవాత ప్రజ్ఞలుగా, శక్తులుగా, ద్రవ్యముగా మారి, ఈ మూడింటితో నేర్పడిన వివిధ లోకములను పొరలుగా ఏర్పడినవి. ఇవి అన్నియు విశ్వమునందు వ్యక్తమగుటకు ముందు, అవి గుణములుగా పరమాత్మ యందున్నవి. పంచదార నీటి యందు కరగియున్నట్లు. పరమాత్మయందు కరగియున్నవి. పువ్వు పుట్టుటకు ముందు పసరు మొగ్గయందు ఆ పువ్వు యొక్క రేకలు, రంగు, పరిమళము అదృశ్యముగానున్నట్లు ఉన్నవి. పువ్వుగా విచ్చుకొనునప్పుడు, అనగా మొగ్గ పువ్వుగా మారినప్పుడు ఇవి యన్నియు వ్యక్తమగుచున్నవి కదా! ఇట్టి క్రమ బద్ధమైన కల్పనము చేయువానిని ''విధాత'' అందురు. ఆయననే సంసార జీవులు తప్పించుకొనుటకు వీలులేనట్టి ''విధి'' అని పిలిచెదరు.

9. సృష్టికర్తయైన బ్రహ్మ ఒకవేళ ధ్యానము చేయవలెనన్నచో ఆయనకు, మనకు వలె దేవుని విగ్రహము, ఫొటో, పూజా మందిరము మొదలగునవి

యేమియు లేవు. ఎందుకనగా అవి యన్నియు బ్రహ్మలోని భాగములే. చివరకు ప్రాణాయామము, శ్వాస కూడ తానే కనుక ఆయన ధ్యానము చేయవలెనన్నచో తనను తానే ధ్యానము చేయవలయును. అనగా తానెవ్వరో? తనయందున్న ''నేను'' అను ప్రజ్ఞ ఎచ్చట నుండి పుట్టుచున్నదో, దానిని ధ్యానముచేయవలయును. సృష్టించుటకు పూర్వము సృష్టి కర్తయైన బ్రహ్మ ఇట్లు ధ్యానము చేసెనని భాగవతము ద్వితీయ స్కంధమునందు చెప్పబడినది. అట్లు భగవత్ ధ్యానముచేయగా ఆయన యందున్న ''తాను'' అను వెలుగే ఆయనకు ప్రత్యక్షమయ్యెను. ఆ వెలుగే నారాయణుడు. ఇచ్చట బ్రహ్మకు నారాయణుడు ప్రత్యక్షమగుట యనగా బ్రహ్మ తానను వెలుగునందు లీనమయ్యెనని అర్థము. అట్టి బ్రహ్మకన్న పరమాత్మ లేక నారాయణుడు, పై వాడు లేక ఉత్తముడు.

6. శ్లో॥ అప్రమేయో హృషీకేశః పద్మనాభో౽మర ప్రభుః
విశ్వకర్మా మనుస్త్వష్టా స్థవిష్ఠః స్థవిరో ధ్రువః ॥

**ప్రతిపదార్థము :-** 1. అప్రమేయః = కొలతల కందని వాడు, 2. హృషీకేశః = హృదయమున కధిపతియైనాడు, 3. పద్మనాభః = నాభియందు పద్మము కలిగినవాడు, 4. అమర ప్రభుః = దేవతలకు ప్రభువైనవాడు, 5. విశ్వకర్మా = విశ్వమును నిర్మాణము చేయువాడు, 6. మనుః = మానవ జాతికి అధిపతియైన మనువు, 7. త్వష్టా = రూపములను చెక్కువాడు, 8.స్థవిష్ఠః= స్థిరమైన వానిలో మిక్కిలి స్థిరమైనవాడు, 9. స్థవిరః = వృద్ధుడు, 10. ధ్రువః = ధ్రువము లేక ఇరుసు వంటివాడు.

**తాత్పర్యము :-** భగవంతుడు కొలతల కతీతమైన హృదయమున కధిపతిగా పద్మమే తన నాభిగా తెలియబడువాడు. ఆయన దేవతలకు ప్రభువు. విశ్వమును నిర్మాణము చేసినవాడు, మానవ జాతికి అధిపతియైనవాడు, సకల రూపములను చెక్కువాడు. అందరికన్నా ఎక్కువ వయస్సు కలవాడు. తానే ధ్రువమై స్థిరముగానున్నవాడు.

**వివరణ :-** 1. కొలతలన్నియు మనస్సుననుసరించి పుట్టినవి మాత్రమే. మనస్సు వలననే కాలము, చోటు మున్నగునవి పుట్టినవి. మనస్సులేనిచో అవి లేవు. లేవనగా వ్యక్తముగా లేవని అర్థము. నేనింతసేపు మాటలాడితిని, పని

చేసితిని అని చెప్పినప్పుడు, అవి మనస్సునందలి ఊహలు తప్ప అచటనున్న భౌతిక ద్రవ్యములకుగాని, వస్తువులకుగాని అవి లేవు. ''నిన్న ఈ పుస్తకము చదివితిని'' అన్నప్పుడు పుస్తకమునకు నిన్నలేదు. చెప్పువానికి మాత్రమే అది ఉన్నది. పుస్తకమునకు ఇప్పుడుండుటయే సత్యముగానీ నిన్న, రేపు అనునవి దానికి సంబంధించినవి కాదు. కనుక ఈ కాలమనునది మనస్సులో పుట్టి మనస్సునందే పని చేయుచున్నది. ఈ మనస్సు పరమాత్మనుండి పుట్టుచున్నది కనుక, ఆయనపై ఇవి పని చేయవు.

2. హృదయము అనగా భౌతిమగు గుండెకాయ కాదు. అది శక్తి కేంద్రము. ఈ హృదయ కేంద్రము చుట్టునూ, భౌతికమగు గుండె అను అవయవము తల్లి కడుపులో నున్నపుడు ఏర్పడును. ఎచ్చటనైననూ మొట్ట మొదట శక్తికేంద్రముండి, దాని చుట్టునూ భౌతిక ద్రవ్యము కట్టుకొనును. భూమి సూర్యుడు, మున్నగు గ్రహములు, తారలు అట్లే ఏర్పడినవి. మానవునకు కూడ శరీరమట్లే ఏర్పడినది. పరమాణువునందు (Atom) కూడా అణుకేంద్రము ఏర్పడి, తరువాత అణువు ఏర్పడుచున్నది. అట్లు మొట్ట మొదటి కేంద్రమే పరమాత్మగనుక ఆయన హృదయమునకు అధిపతి. అనగా ప్రేమయే కేంద్రముగా గలవాడు.

3. నాభి హృదయము వలెనే, మరొయొక శక్తి కేంద్రము. విశ్వమందు హృదయ కేంద్రముతోబాటు, ఈ నాభికేంద్రము కూడా కలదు. రెండు కేంద్రములు రెండు ధృవములవలె పని చేసి మొత్తము విశ్వమును త్రిప్పుచున్నవి. ఈ రెండు కేంద్రములు కలిసి, చోటునకు అయస్కాంతమగుచున్నది. మొట్ట మొదట ఈ అయస్కాంత మేర్పడిన తరువాతనే, దాని అయస్కాంత క్షేత్రమందలి, రేఖల (Lines of Magnetic Field) వెంబడి సౌర మండలములు, నక్షత్రములు, గుంపులు గుంపులుగా సమీకరణము చెందుచున్నవి. తల్లి గర్భమునందు జీవునికి వెన్నెముక ఏర్పడునపుడు కూడా ఇట్లే జరుగును. హృదయము ప్రేమకు, అనుభూతికి, కేంద్రముగా పని చేయును. నాభి ఆవేశములకు, ఉద్రేకములకు, స్థానముగా పని చేయును.

4. పిండాండము, బ్రహ్మాండములందు పనిచేయు దేవతలు, కొన్ని ధర్మములకు కట్టుబడి పని చేయుచున్నారు. సూర్యునకు వెలుగులు ధర్మము.

వాయువునకు వీచుట ధర్మము. గ్రహగోళములకు తమ చుట్టు తాము తిరుగుట, సూర్యుని చుట్టూ తిరుగుట ధర్మములు. భూమికి, విత్తనములను నాటినచో మొలకెత్తించి వాని ద్వారా పంటల నిచ్చుట, ధర్మము. దీనినే కృష్ణుడు భగవద్గీతలో ''రసో హమప్సుకౌంతేయ'' అని చెప్పెను. నీటిలో గల ప్రవహించు ధర్మము ''నేనే'' అయి ఉన్నాను, అట్లే సూర్య చంద్రాదులయందు గల ప్రకాశము (ప్రభాస్మి శశి సూర్యయోః) నేనే అని చెప్పెను. ప్రకాశించుట, ప్రవహించుట వయిన్నగు ధర్మములు, పరమాత్మ నుండి జీవులకు సంక్రమించుచున్నవి గనుక, అధర్మములకు అయనయే అధిపతి. ఈ ధర్మములనే మనము దేవతలని పిలుచుచున్నాము. కనుక ఆయన దేవతల కధిపతియై ఉన్నాడు. కనుకనే ఆయనను ఇంద్రుడని కూడా యందురు.

5. చోటులోనున్న రూపములకు, విశ్వమునకు రూపము నిర్మాణము చేయువాడు విశ్వకర్మ. ఈయన విశ్వమునందు ప్రజ్ఞగా ఇమిడియుండి గోళమునకు, గ్రహములకు, మానవులకు, సకల జీవులకు రూపురేఖాదులను నిర్ణయించును. (Shape Consciousness in space)

6. బ్రహ్మకు పదునాలుగు మంది మనువులు మనస్సు నుండి పుట్టిరి. ఒక్కొక్క మనువు కొంత కాలము మానవజాతికి అధిపతిగా నుండెను. యుగములు నాలుగు. అవి 1. కృతయుగము, 2. త్రేతాయుగము, 3. ద్వాపర యుగము, 4. కలియుగము. ఈ నాలుగు యుగములును కలసి ఒక మహా యుగమనబడును. అట్టి మహా యుగములు డెబ్బై రెండు కలసి ఒక మన్వంతరమగును. అటువంటి మన్వంతరములు పదునాలుగు కలసినచో అది బ్రహ్మకొక పగలు, అంతే కాలము బ్రహ్మకొక రాత్రి. కనుక ఒక మన్వంతరకాలమునకు అధిపతియైనవాడు మనువు. ఆయన యుగములను వెంబడి మానవ పరిణామమును, పరిపూర్ణతలను గమనించుచూ నడుపుచున్నాడు. ఈ విశ్వమునందు తారలు, గ్రహములన్నియూ కాలమువలన స్పందించుచున్నవి. వాటి స్పందనమునకు ప్రతిస్పందనమే జీవుల యందలి శ్వాస. ఈ స్పందనములు, ప్రతి స్పందనములు మనువు పరిపాలనకు చెందినవి. ఆయన కాలమునకు, దాని వలన జీవులలో సామూహికముగా జరుగు మార్పులకు అధిపతి. అంతేగాక, మానవ జాతి యందలి ఏడు ప్రధాన జాతులు (Root-races), ఉప జాతులు

(Sub-races), వాటి కలయికలు మున్నగు వన్నియూ ఈయన పరిపాలనకు చెందినవే.

7. త్వష్ట అనగా శిల్పి లేక వడ్రంగి. ఈయన జీవులయొక్క రూపములను వాటి వివరములతో చెక్కువాడు. తల్లి కడుపులో బిడ్డ శరీరమేర్పడుటకు ముందు నాడీ కేంద్రములను, రేఖలను నిర్మాణము చేసి వాటి వెంబడి నరములను, రక్తనాళములను నిర్మించువాడు. (Mason, who constructs physical tissus and organs according to shape of the vital body.)

8. ద్రవ్యము, శక్తి, మనస్సు అనునవి అశాశ్వతములు. అనగా మార్పు చెందునవి. బుద్ధి, సంకల్పము, విచక్షణ మరియు ప్రేమ అనునవి శాశ్వతములు. కనుక దేవతల లోకమునకు చెందినవి. ఇవి మార్పు లేనివి. ఇవి పరమాత్మయందు భాగములు కనుక పరమాత్మ మార్పు చెందని వానిలో మార్పు చెందనివాడై యున్నాడు.

9. సృష్టి పరమాత్మనుండి ప్రారంభమై మరల ఆయన లోనికే లీనమగుచున్నది. కనుక ఈయన అందరికన్నా పెద్దవాడు. అనగా వృద్ధులలోకెల్ల వృద్ధుడైనవాడు.

10. ధృవమనగా నొక కేంద్రము లేక ఇరుసు. అనగా దేనిచుట్టు కార్యక్రమము జరుగునో దానిని కేంద్రమందురు. మన శరీరములో శిరస్సునందు గల ''సహస్రారము'' అను కేంద్రము భూమి యందలి ఉత్తర ధృవమునకు ప్రతీక. అట్లే విశ్వమునందు సౌరమండలమును తనచుట్టూ తాను త్రిప్పుకొను ధృవ నక్షత్రము అనునది విశ్వమునకు కేంద్రము. కనుక ఈ ధృవము, సౌరమండలము అనునవి చోటులో నుండి పుట్టి, మరల చోటునందు అంతర్ధానమగుటయే మానవుని శరీరమందలి కేంద్రముల నిర్మాణముగా ధ్యానము చేయవలయును.

7. శ్లో॥ అగ్రాహ్యః శాశ్వతః కృష్ణో లోహితాక్షః ప్రతర్దనః
ప్రభూత స్త్రి కకుబ్ధామ పవిత్రం మంగళమ్ పరమ్ ॥

**ప్రతిపదార్థము** :- 1. అగ్రాహ్యః = తెలుసుకొనవీలు లేనివాడు, 2. శాశ్వతః = శాశ్వత మైనవాడు, 3. కృష్ణః = చీకటియే తన రూపమైనవాడు, 4. లోహితాక్షః = ఎఱ్ఱని కన్నులు కలవాడు, 5. ప్రతర్దనః = మార్పులేక నిలుచువాడు, 6. ప్రభూతః = చక్కని రూపముగా ఏర్పడినవాడు, 7. త్రికకుప్ = మూడు పేర్లతో తెలియబడువాడు, 8. ధామ= వెలుగు మార్గముగా గలవాడు, 9. పవిత్రం = నిర్మలమైనవాడు, 10. మంగళం = శుభమైనవాడు, 11. పరమ్ = పరమమైనవాడు, అత్యుత్తమ మైనవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను మన గ్రహణమున కతీతమైన వానిగా, చీకటికవ్వల నున్నవానిగా ధ్యానము చేయవలయును. ఆయన ఎఱ్ఱని కన్నులు కలిగి, మార్పుల కతీతముగా నుండువాడు. ఆయన చక్కని రూపముగా ఏర్పడినవాడు. మూడు నామములు కలిగినవాడు. వెలుగే తన మార్గమైనవాడు మరియు నిర్మలమైనవాడు. అత్యుత్తమ మంగళ రూపము కలవాడు.

**వివరణ** :- 1. గ్రహించుట లేక తెలిసికొనుట మనస్సు, ఇంద్రియములు మున్నగు వానికి సంబంధించిన విషయములు. పరమాత్మ పరిపూర్ణుడు. ఆయన నుండి ఈ లోకములన్నియూ పొరలుగా దిగివచ్చినవి. ఈ పొరలలో నొక పొర మనస్సు, మరియొక పొర ఇంద్రియములు, కనుక పరమాత్మలో నొక భాగమైన ఈ మనస్సు, పరమాత్మను గూర్చి తెలిసికొన జాలదు. కన్నులు అవతలి వానిని చూచును గాని తమను తాము చూచుకొనలేవు కదా! ఈ మొత్తము సృష్టిలో ఒక అణువు మాత్రమే అయిన మనస్సు పరమాత్మను తెలిసికొనజాలదు. అనగా వానియందు కలసిపోవుటయేగాని తెలియుట ఉండదు. గ్లాసు లోని నీటికి సముద్రములోని నీటికి పోలిక కలదు. గ్లాసులోని నీరు సముద్రపు నీటిలో భాగము. అనగా గ్లాసునందలి నీరు సముద్రమునందు కలియుటయే గాని పోల్చుకొని పరిధులు నిర్ణయించుట సాధ్యము కాదు. కనుక మనస్సు పరమాత్మయందు లయమై ఆయనగా నుండుటయే గాని, ఊహించుట తెలిసికొనుట సాధ్యముకాదు.

2. మార్పుచెందువానిలో మార్పు లేనట్టివాడు నారాయణుడు. మంచు గడ్డ కరిగి నీరైననూ, నీరు ఆవిరియైననూ అందున్న నీటి అణువులు మాత్రము

మార్పు చెందవు. అట్లే పరమాత్మ, మార్పు చెందు ద్రవ్యము, మనస్సు, ఇంద్రియములు మున్నగు వానియందు అవి మార్పు చెందుచున్నను, తాను అందలి ప్రజ్ఞగా శాశ్వతుడై యున్నాడు.

3. మనము చీకటి యని పిలిచినది, మన ఇంద్రియములు తెలుసుకొన లేని విషయములను మాత్రమే. ఈ గది చీకటిగా నున్నదనగా గదియందు ఏమియూలేదని అర్థము కాదు. గదిలో నున్నవానిని మన కన్ను చూడలేకున్నదని అర్థము. అగ్గిపుల్ల గీచి వెలిగించుచున్నప్పుడు, ఆ వెలుగు ఎచ్చట నుండి పుట్టుచున్నది? అగ్గిపుల్ల యందున్న మందులో అంతకు ముందు నిప్పులేదు. కాని ఈ రెండింటి రాపిడివలన, నిప్పు చోటులో పుట్టు చున్నది. అనగా నిప్పు లేక అగ్ని చోటులో అంతర్యామిగా నుండి, లేక అవ్యక్తముగా నుండి, అగ్గిపుల్ల, అగ్గిపెట్టెల రాపిడికి అగ్నిగా పుట్టుచున్నది. కనుక అట్లు అవ్యక్తగా చోటులోనున్న వెలుగునే మనము చీకటియను పేరుతో పిలుచుచున్నాము. అచ్చటనుండియే సూర్యగోళము మిగిలిన గ్రహములన్నియు పుట్టుచున్నవి. అనగా పుట్టిన తరువాత పుట్టినవని తెలియుటయే గానీ, పుట్టకముందు అవి ఉన్న స్థితిని గురించి ఎవరికిని తెలియదు. అనగా మనస్సునకు తెలియదు. ఎందుకనగా మనస్సు కూడా అచ్చట నుండియే పుట్టుచున్నది. ''నా'' నుండి పుట్టుచున్నది కనుకనే ''నేను'' అన్నిటికిని మూల కారణము. తనలోగల ఈ ''నేను'' మొత్తము చోటునందు కల ''నేను'' యే. అనగా దాని ప్రతిబింబమే. ఈ చోటు ఆకాశమనియు, దానికి నీలము రంగనియు మనస్సు భ్రమ పడుచున్నది. ఈ ''నేను'' అను వెలుగు శ్రీకృష్ణుడనియు, అయన ఆకాశమే తన దేహముగా గలవాడనియు వాని శరీరము నీలవర్ణముగా నుండు ననియు చెప్పబడినది.

4. సూర్యోదయము, సూర్యాస్తమయము అనునవి రెండునూ మానవ ప్రజ్ఞ పుట్టుటకును, లయమగుటకును ప్రతీకలు. వెలుగు, దాని విశ్లేషణముచే ఏర్పడు రంగులు, మానవుని కన్ను యొక్క పరిమితత్వమును తెలియజేయును. ఎందుచేతననగా ఈ వెలుగు మరియు వివిధ వర్ణములు చీకటి నుండియే పుట్టుచున్నవి. కనుక చీకటినే అసలు వెలుగుగా పిలిచెదరు. ఇదియే వేదము నందు '' ఆదిత్య వర్ణః తమసః పరస్తాత్'' అని చెప్పబడినది. చీకటి నుండి

సూర్యుడు పుట్టి మరల చీకటి లోనికి లయ మగుటయే సూర్యోదయ సూర్యాస్తమయములుగా రుద్రసూక్తమునందు ''నమస్తామ్రాయచ అరుణాయచ'' అని గానము చేయబడినది. అనగా రుద్రాత్మకుడైన సూర్యుడు, సూర్యాస్తమయమందు తామ్రవర్ణము అనగా రాగి రంగుతోనూ, అట్లే సూర్యోదయమందు అరుణ వర్ణముతోనూ వెలుగు చున్నాడని కీర్తింపబడినది. ఈ రెండును పరమాత్మకు కన్నులు కనుక ఆయన ఎఱ్ఱని కన్నులు కలవాడుగా చెప్పబడినది.

5. భగవంతుడు సమస్తము నందును అంతర్లీనముగా నుండి మార్పు లేకయున్నవాడు. సృష్టి ప్రారంభము నందును, లయమైనప్పుడును కూడా తాను మార్పు చెందడు. ఆకాశమునందు గ్రహగోళాదులు పుట్టుచున్నవి. మరల దానియందే లీనమగుచున్నవి. ఎన్ని జరుగుచున్ననూ ఆకాశము మార్పులేక అట్లేయున్నది. అట్లు అన్నింటి యందును మార్పు చెందక యుండు వానిని ప్రతర్దనుడందురు.

6. ప్రభూతః అనగా చక్కని రూపముగా సృష్టింపబడినవాడు. అణువు మొదలు బ్రహ్మాండము వరకు ఈ సృష్టి యందలి రూపములు, జీవులు మున్నగునవి చక్కగా, సున్నితముగా నున్న అనేక రూపములుగ సృష్టింపబడుచున్నవి. మానవులందరు ఒకే ఆకారము కల్గిన వారైనను ఎవరి రూపు రేఖలు వారివి. ఇట్లు సకల జీవులకును వారివారి రూపురేఖలు వేరువేరుగా పరమాత్మ తీర్చిదిద్దిచున్నాడు. ఇంతేకాక మనస్సు, తెలివి తేటలు, బుద్ధి జీవులందరికి సమానమే అయిననూ వేరువేరుగా పని చేయుచున్నవి కదా! ఇట్లు సృష్టి యందలి ప్రతి వస్తువు నందును, పరమాత్మ యొక్క నిర్మాణ కౌశలము, వాని అంతర్యామిత్వము రుజువగుచున్నది.

7. పరమాత్మకు మూడు నామములు కలవు. ద్రవ్యాత్మకము, శక్త్యాత్మకము, ప్రజ్ఞాత్మకము అను మూడు లోకములే వాని మూడు నామములు.

8. ఆకాశము నుండి సమస్తము పుట్టుచున్నది గనుక మొట్టమొదటి భౌతిక రూపము ఆకాశమని చెప్పవచ్చును. పరమాత్మ జీవులుగా దిగివచ్చుటకు ఆకాశమే మార్గమగుచున్నది. అట్లే జీవులు పరమాత్మయందు లీనమగుటకు

మరల ఆకాశమే మార్గమగుచున్నది. ఈ ఆకాశము సర్వాంతర్యామి యొక్క రూపమే గనుక అతడు అన్నిటికి ధామముగా లేక స్థానముగా నున్నాడు.

9. పవిత్రత అనునది తాత్కాలిక సత్యమేగాని పరిపూర్ణ సత్యము కాదు. అనగా ఒకటి యింకొక దానికన్నా ఎక్కువ పవిత్రమని, నిర్మల మని చెప్పగలము. బురద నీటికన్నా తేటనీరు ఎక్కువ పవిత్రము, నిర్మలము. అట్లే దానికన్నా వడగట్టబడిన నీరు యింకనూ ఎక్కువ నిర్మలము. దాని కన్నా నీటి యావిరిని చల్లబరచిన నీరు ఎక్కువ నిర్మలమని అనుకొనవచ్చును. అట్లే భౌతిక ద్రవ్యముకన్నా శక్తి ఎక్కువ పవిత్రము. శక్తి కన్నా ప్రజ్ఞ ఎక్కువ పవిత్రము, నిర్మలము. ఇట్లు చూచుకొనుచు పోవుచున్న కొలది, భౌతికమైన బాహ్యమైన పొరలకన్నా లోపలి పొరలు ఎక్కువ పవిత్రములు. ఇవి ఉల్లిపాయ పొరలవంటివి. అనగా పొరలన్నియు తీసుకొనుచు పోయినచో చివరకేమియు నుండదు. అనగా ఉల్లిపాయ అనునది వేరుగా నుండక అందలి పొరలుగానే యుండును. ఈ పొరలన్నింటితోనూ ఏర్పడిన రూపమునే ఉల్లిపాయ అందుము. అట్లే ఈ ఆవరణలన్నియూ ఒక్కొక్కటీ ఒకదానికన్నా మరియొకటి ఎక్కువ పవిత్రములే యైననూ, పైదానికన్నా క్రిందిది అపవిత్రమే యగుచున్నది. ఇంద్రియ భాగములకన్నా మనస్సు ఎక్కువ పవిత్రమే యైననూ బుద్ధితో పోల్చినచో అపవిత్రమే కదా! కనుక ఈ అపవిత్రముల యందున్న పవిత్రతయే పరమాత్మ. అనగా మనము పవిత్రత అని ఉచ్చరించి నప్పుడు దేనినుద్దేశించుచున్నామో అదియే పరమాత్మ. కనుకనే.

"అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా
యస్మరేత్ పుండరీకాక్షం స బాహ్యా ऽభ్యంతర శ్శుచిః

అని చెప్పిరి. అనగా పరమాత్మను స్మరించుటవలన అపవిత్రత నశించి పవిత్రత సిద్ధించునని భావము.

10. మంగళమనగా శుభము లేక సంతోషము కలిగించునది. ఈ సంతోషము కలుగుట, ఏ కారణము చేతనైననూ కావచ్చును. ఒకనికి ధనము సంపాదించుట వలన, మరి యొకనికి సంతానము వలన, ఇంకొకనికి పదవి వలన, కలుగవచ్చును. దేని వలన కలిగిననూ అది తాత్కాలికమే కాని శాశ్వతము

కాదు. అనగా తనలోనున్న సంతోషముగా నుండుట అను గుణమునకు భౌతికముగా కారణము కల్పించుకొనుచున్నాడు. ఒకనికి పదివేల రూపాలయలు లభించినచో సంతోషపడును. మరియొకడు ఇరవైవేలు రావలెనని ఆశించినప్పుడు పదివేల రూపాయలే లభించినచో దానికే దుఃఖపడుచున్నాడు కదా! కనుక ఈ సంతోషమనునది భౌతికము కాక జీవుని మనస్సుకు సంబంధించినది. ఈ సంతోషము లేక సుఖమనునది, భౌతిక వస్తువుల ప్రేరణ వలన తనలో నుండి వ్యక్తమగుచున్నది కనుక అదియే తన సహజ స్థితియని తెలియవలెను. అనగా జీవితము నిరంతరము శుభము, మంగళ ప్రదముగనే యుండుననియు వాటిని మానవుడు ప్రయత్నించి అమంగళము, అశుభముగా చేసుకొనుచున్నాడనియూ తెలియును. అట్లు కాక భగవంతుడిచ్చిన సహజమైన, ప్రశాంతమైన జీవితమును అట్లే ఉంచుకొన్నవానికి యెప్పుడునూ శుభముగనే యుండును. కనుక ఈ శుభమగు స్థితియే పరమాత్మ.

11. ఇట్టి శుభము భౌతికముకాక అవ్యక్తమని తెలియుచున్నది. కనుక అది పరము. అనగా మంగళ మనునది పరమే కాని భౌతికముకాదు. అవ్యక్తమైన ఈ పరము జీవుని సకల శుభములకు మూలమై యున్నది కనుక ఈ పరమే పరమాత్మయగుచున్నది.

8. శ్లో॥ ఈ శానః ప్రాణదః ప్రాణో జ్యేష్ఠః శ్రేష్ఠః ప్రజాపతిః
హిరణ్య గర్భో భూగర్భో మాధవో మధుసూదనః ॥

**ప్రతిపదార్థము :-** 1. ఈశానః = అందరికన్నా గొప్పవాడైన పరమాత్మ, 2. ప్రాణదః = ప్రాణములు ఇచ్చువాడు, 3. ప్రాణః = ప్రాణము, 4. జ్యేష్ఠః = అందరికన్నా పెద్దవాడు, 5. శ్రేష్ఠః = అత్యుత్తమమైనవాడు, 6. ప్రజాపతిః = పుట్టుకకు కారణమైనవాడు, 7. హిరణ్య గర్భః = బంగారపు గ్రుడ్డు, 8. భూగర్భః = భూమియొక్క కేంద్రము, 9. మాధవః = లక్ష్మీదేవి భర్త, 10. మధుసూదనః = మధువు అను రాక్షసుని చంపినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను, మిక్కిలి గొప్పవానిగను, ప్రాణము నిచ్చువానిగను, మరియు ప్రాణముగను, అందరికన్నా పెద్దవానిగను, ఉత్తమమైన వానిగను, పుట్టుకకు కారణమైన వాడుగను, బంగారపు గుడ్డుగను, భూమికి కేంద్రము

మరియు గర్భము అయిన వానిగను, లక్ష్మీదేవికి భర్తగను, మధువు అను రాక్షసుని సంహరించిన వానిగను, ధ్యానము చేయవలయును.

**వివరణ :-** 1. పరమాత్మను మిక్కిలి గొప్పవానిగను, అతీతునిగను ధ్యానము చేయవలయును. అనగా సృష్టియందలి ప్రతి భాగమునందును, మరియు అణువులన్నింటియందును అధిష్ఠించియుండును కనుక అన్నింటికన్నా అతీతుడని చెప్పబడినది.

2. పరమాత్మను ప్రాణము నిచ్చువానిగా ధ్యానము చేయవలయును. చోటులో నున్న ప్రాణశక్తి జీవులయందు, వృక్షములయందు, జంతువుల యందు మరియు గ్రహగోళాదులయందు, ఇంకను తారలయందును, ప్రాణశక్తిగా పనిచేయుచున్నది. ఈ ప్రాణశక్తి సూర్యునికి చోటు నుండి లభించుచున్నది. అదే ప్రాణశక్తి సూర్యకిరణముల ద్వారా వృక్షములకు లభించు చున్నది. అంతేకాక భూమిచే గ్రహింపబడి మరల జీవులకు భూమినుండి జీవశక్తిగా లభించుచున్నది. ఇట్లు సృష్టికంతటికి ఆధారమైన ప్రాణశక్తి, చోటులో నున్న తానను పరమాత్మనుండి లభించుచున్నది. కనుక భగవంతుడు ప్రాణ శక్తినిచ్చు వాడగుచున్నడు.

3. ఆయనయే ప్రాణము కూడా అగుచున్నాడు. ప్రాణము ఆయన నుండియే పుట్టి జీవులలో పని చేయుచున్నది. మనయందున్న ప్రజ్ఞా కేంద్రములును. అట్లే అణుకేంద్రము (Nucleus) మొదలైనవన్నియు ప్రాణ శక్తియే కనుక ఇట్లు పనిచేయుచున్న ప్రాణశక్తి ఆయనే.

4. సృష్టిలోనున్న ప్రతి వస్తువు ఆయన నుండి పుట్టినదే. సృష్టి కూడా ఆయన నుండియే పుట్టినది. కనుక అన్నింటికన్నా పెద్దవాడాయనే.

5. ప్రతి వస్తువునందు, విషయములందు పరమాత్మయే అంతర్లీనముగానున్నాడు. కనుక జీవులు కోరు వస్తువులయందును. విషయములందును గల కోరిక, ఆయనకు సంబంధించినదే. అనగా ఆ వస్తువు, లేక విషయము, లేక సంఘటన వలన కలుగు సుఖము, సంతోషము గూర్చి ప్రతివాడు ప్రయత్నించుచున్నాడు. మరియు ప్రాకులాడుచున్నాడు. అట్టి ఆనందము, సుఖము తానే కనుక ప్రతివాడును తెలిసినను తెలియకున్నను

ఆయననే కోరుచున్నాడు. కనుక ఆయనయే అందరికన్నా అన్నిటికన్నా శ్రేష్ఠుడు.

6. జీవుల పుట్టుకకు కూడా ఈయనయే కారణమగుచున్నాడు. ఎందుకనగా జీవులు పుట్టుటకు వాని సంకల్పమే కారణమగుచున్నది. ప్రతివానికిని తాను చేయదలచిన, చేయవలసిన పనుల వలన, సంస్కారములు ఏర్పడును. అనగా పనులను గూర్చిన సంకల్పమేర్పడును. అట్టి సంకల్పము వల్లనే జీవులకు శరీరము పుట్టుచున్నది. బ్రహ్మకు కూడా ఇట్టి సంకల్పము వల్లనే సమస్త సృష్టియు తనయొక్క శరీరముగా ఏర్పడినది. ఈయన శరీరమునే బ్రహ్మాండమందురు. ఈ బ్రహ్మయొక్క సంకల్పమే సృష్టియందలి పుట్టుకకు కారణమై ధాన్యాదులయందు అంకురముగ పని చేయుచున్నది. జీవుల యందు కామము కల్గించి శుక్ర ధాతువు నందలి జీవకణముగా, జీవశక్తిగా నిదియే పని చేయుచున్నది కనుక, అతడు ప్రజాపతి.

7. హిరణ్యగర్భుడుగా చెప్పబడిన బ్రహ్మ అంతకు ముందున్న 'తాన'ను వెలుగు నుండియే మేల్కొనుచున్నాడు. ఈ బ్రహ్మ, బంగారపు రంగు కలవాడుగా చెప్పబడినాడు. అనగా ఈ బంగారు వెలుగు, చీకటి నండియే పుట్టుచున్నది. చీకటి యనగా మన కన్నుల కందనిదియని యర్థము. అట్టి స్థితి మన మనస్సుకు కూడా అందదు కనుక, అది నిద్రగను, మృత్యువుగను జీవునిచే నర్థము చేసుకొనబడుచున్నది. నిజమునకు అసలైన వెలుగు లేక ప్రజ్ఞ అదియే. దాని నుండియే ప్రజ్ఞ తాను వేరుగా మేల్కొనుచున్నది. అట్లు మొట్ట మొదట మేల్కొనిన వెలుగే బ్రహ్మ లేక హిరణ్యగర్భుడు. కనుక ఆయన కూడా పరమాత్మ యొక్క రూపమగుచున్నాడు.

8. భూమియొక్క గర్భము లేక కేంద్రము, సూర్యుని చుట్టు తిరుగుట వలన, సూర్యుని వైపునకు ఆకర్షింపబడి, నశింపకుండా భూమి నిలచియుండుటకు ఉపయోగ పడుచున్నది. అనగా భూమియొక్క వేగమువలననే భూమి తన కక్ష్యలో నిలిచియుండుట సాధ్యమగుచున్నది. ఆ భూమి కేంద్రమే పరమాత్మ. అంతేకాక ఈ భూకేంద్రము వల్లనే భూగోళము ఏర్పడుచున్నది.

9. లక్ష్మీదేవి సంపదకు, వైభవమునకు చిహ్నము. సృష్టి యందు వీటిని కలిగించినది ఈమెయే. అట్టి ఈమె సృష్టి యున్నప్పుడు ఆయన హృదయ మందున్నది. సృష్టి లేనప్పుడు అనగా నశించి నప్పుడు ఆయనలో కరిగి ఆయనగనే లేక పరమాత్మగనే యున్నది. ఇది ఎట్లనగా నొక వ్యక్తికి తన కుమార్తె వివాహము నిర్ణయమైనంతనే హృదయము సంతోషముతో నిండియుండును. ఆయన నిద్రించినప్పుడు ఈ ఊహలన్నియు ఆయన లోనే కరిగిపోవుచున్నవి. మరియు మెలకువ వచ్చినంతనె యివన్నియూ అ క్షణముననే గుర్తుకువచ్చుచున్నవి. ఇట్లే లక్ష్మి కూడ భగవంతుని యందు ఉన్నది.

10. మొట్ట మొదట సృష్టి గోళము ఏర్పడి నప్పుడు పరమాత్మ యోగ నిద్రలో నుండగా అది రెండు భాగములైనది. అనగా రెండు పరస్పర విరుద్ధములైన శక్తులు పుట్టినవి. అవి ఒకటి నేను, రెండు ఇతరము. ఇట్లు తననుండి యితర మనునది యున్నంత కాలము సంఘర్షణ తప్పదు. అట్టి రెండు శక్తులుగా పుట్టినవారే మధుకైటభులను రాక్షసులు. పరమాత్మ వారిని జయించి సంహరించెను. అనగా వాటియందలి పరస్పర విరుద్ధమగు గుణములను ఒకే గోళము నందలి రెండు ధృవములుగా నేర్పరచెను. చోటునందేర్పడిన ఈ రెండు ధృవములే మనయందు కూడా ధృవములుగనే పని చేయుచున్నవి. మనయందు, మన భూమియందు కూడ రెండు ధృవములు కలవు. కనుక భగవంతుడు మధువు అను రాక్షసుని సంహరించిన వాడగుచున్నాడు.

9. శ్లో॥ ఈశ్వరో విక్రమీధన్వీ మేధావీ విక్రమః క్రమః
అనుత్తమో దురాధర్షః కృతజ్ఞః కృతి రాత్మవాన్ ॥

**ప్రతిపదార్థము :-** 1. ఈశ్వరః = జీవునియందున్న పరమాత్మ, 2. విక్రమ = విక్రమము కలవాడు, 3. ధన్వీ = ధనుస్సు కలవాడు, 4. మేధావీ = మేధస్సుకు అధారభూతుడు, 5. విక్రమః = విశేషమైన క్రమము కలిగినవాడు, 6. క్రమః = తరింపజేయువాడు లేక దాటించువాడు, 7. అనుత్తమః = అత్యుత్తముడు, 8. దురాధర్షః = భయపెట్టుటకు వీలుకానివాడు. 9. కృతజ్ఞః = విశ్వాసము గలవాడు, 10. కృతిః = చేయబడినది లేక నెరవేర్పబడినది. 11. అత్మవాన్ = అత్మవంతుడు.

**తాత్పర్యము :-** పరమాత్మను జీవునియందు గల పరమాత్మగను, పరాక్రమము కల వానిగను, ధనుస్సు ధరించిన వానిగను, ప్రజ్ఞావంతునిగను, విశేషమైన క్రమము కల్గినవానిగను, విషయముల కతీతమైన వాడుగను, భయపెట్టుటకు వీలుకాని వాడుగను, విశ్వాసముగల వానిగను, పనులు నెరవేర్చువానిగను, ఆత్మవంతునిగను ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ఈశ్వరుడనగా పరిపాలకుడు లేక నియామకుడు. ఇతడే అణువునందును, వ్యక్తియందును, విశ్వమునందును అధిపతిగా నుండి పని చేయును. వేదములయందు, ఈశ్వరుడు ప్రపంచము నందు లీనమై పాలించువానిగా, కీర్తింపబడినది. భగవద్గీతలో '' ఈశ్వరః, సర్వభూతానాం హృద్దేశో ర్జున తిష్ఠతి'' అని చెప్పబడినది. సకల జీవులయందును వారి హృదయములందు గల సంకల్పములుగా ఈశ్వరుడు పని చేయుచున్నాడు. అట్టి సంకల్పముల వలన జీవులకు పనులు ఏర్పడుచున్నవి. ఆ పనులే ప్రణాళికలుగా నేర్పడి జీవులను బంధించుచున్నవి. ఎవరేపని చేసినను వారి యందు గల సంకల్పము వల్లనే చేయుచున్నారు. అనగా ఎవరి సంకల్పము చుట్టును, వారు తిరుగుతున్నారు. ఆ సంకల్పము వారియందు గల ఈశ్వరుని వలన నేర్పడుచున్నది కనుక ఆయన చుట్టును జీవులు తిరుగుచున్నారు. పతంజలి యీ యోగమార్గమునకు అధిపతియై ఈశ్వరుడు జీవునియందు వెలుగుచున్నాడని చెప్పెను, అటువంటి ఈశ్వరుని ధ్యానము చేసినచో యోగము పరిపూర్ణమగును.

2. విక్రమః అనగా తన పరాక్రమము చేత జయించు వాడని అర్థము క్రింది లోకములలో పోటీ మనస్తత్వముగా నీయన తెలియబడుచున్నాడు. మధ్యమలోకములలో జయించుటకు అసాధ్యమైన జీవుని యందు గల వెలుగుగా తెలియబడుచున్నడు. అనగా జీవుడు తనయందు గల విక్రమత్వము అను వెలుగుచే తనలోపములను నశింపజేసుకొను చున్నాడు.

3. ఆయన ధనుస్సు కలిగియుండును. ధనుస్సు, రక్షణ మరియు పోరాటమను వానిని సూచించును. ఆయన అన్యాయమునకు గురి చేయబడిన వారిని ధనుస్సుతో కాపాడును. అధోలోకములలో అనగా సామాన్య సాంసారిక

జగత్తునందు ఆయుధములనుపయోగించు శక్తిగా ధారణ చేయబడుచున్నాడు. తనవారిని లేక ఆపదలోనున్నవారిని రక్షించుటకై ప్రాణములకు తెగించి పోరాడు వానిలో యుద్ధకౌశలముగా ఈయనయే పని చేయుచున్నాడు. ఊర్ధ్వ లోకములలో కనుబొమ్మల నడుమ గల ''చిత్'' అను బిందువుగా తెయబడుచున్నాడు. కను బొమ్మలు ధనుస్సు ఆకారమునుపోలి యుండును కదా! కనుక మనస్సునకు ఆధారమైన ప్రజ్ఞ ఇచ్చట నుండి పని చేయును. శబ్దమును ఉపాసించిన వానికి శబ్దములన్నియు '' ఓం'' కారమునుండి పుట్టినవని తెలియును. అట్లే '' ఓం'' కారము అవ్యక్తముగా ఉచ్చరింపబడుచున్నప్పుడు దానికి భౌతికమైన కదలికయే శ్వాస. ఈ శ్వాసయందలి '' ఓం'' కారమును ధ్యానము చేయువాని మనస్సు, అప్రయత్నముగా ఈ ''చిత్'' అనుబిందువు నందు నిలుచుచున్నది. ఈ ''ఓం'' కారమే ధనుస్సుగా ధరించిన జీవుడు, పంచేంద్రియములను ఐదు బాణములచే తనయందు గల అహంకారమునకు గురిపెట్టి, బాణప్రయోగము చేయుచున్నాడు. అట్లు కొట్టబడిన అహంకారము, పరమాత్మయందు కరిగి లయమగుచున్నది.

4. సృష్టిలో పరమాత్మయొక్క అంతర్యామిత్వము సమస్తమునకు ఆధారమైయున్నది. మనమేదైనా సంకల్పించినచో ఆ సంకల్పము వాని నుండి పుట్టి మనస్సు ద్వారా వ్యక్తమగుచున్నది. మన ఊహలకు, తెలివితేటలకు, సంకల్పములకు, అతడు మూలమై యున్నాడు. పరిస్థితులను బట్టి యిది యిట్లు చేయవలెనను సంకల్పముగా మనయందు పని చేయుచున్నాడు. అనగా మన తెలివితేటలకు తానే మూలమైయున్నాడు.

5. జీవితములో జరుగు సంఘటనలు అవసవ్యముగను, అస్తవ్యస్తముగను, అర్థరహితముగను కనుపించుటయేగాక సుఖదుఃఖములుగా పొరబడుట జరుగుచున్నది. యోగియైన వానికి నివియే యోగసాధనకు మెట్లుగా నేర్పడుచున్నవి. అనగా ఈ సంఘటనల నుపయోగించుకొని, మెట్లుగా నేర్పరుచుకొని జీవుడు తరింపగలుగుచున్నాడు. ఇట్లు నిత్య జీవితమునందలి సంఘటనలను యోగసాధనయందలి మెట్లుగా మార్చుకొనుటకు బుద్ధి కౌశలము కావలెను. ఒకడెన్ని ప్రయత్నములు చేసిననూ, ఎంత సాధన సంపత్తి యున్ననూ ఇల్లు కట్టుకొనుట సాధ్యము కాకపోవచ్చును. తెలివి తక్కువ వాడైనచో నట్లే

ప్రయత్నించి సగము కట్టి చివరకు అప్పులపాలై ఇల్లు పూర్తిచేయలేక, కొంత కాలమునకు అమ్మివేయవలసిన పరిస్థితి యేర్పడవచ్చును. అప్పులు వడ్డీలతో మూడింతలై, ఇల్లు అమ్మినను కొన్ని బాకీలు మిగిలిపోవును. మరి యొకడు అట్లే ఇల్లు కట్టుటకు ప్రయత్నించి ఆటంకము ఎదురైనప్పుడు, భగవంతుని పరీక్షగా తెలుసుకొని తన ప్రయత్నమును వాయిదా వేయును. కొంత కాలము తరువాత అప్రయత్నముగా తోటివారి సహాయ సంపత్తులు ఏర్పడి ధన సహాయము లభించును. మిక్కిలి సులభముగా గృహ నిర్మాణము పూర్తి చేయగలుగును. పరిస్థితులు ఎదురై పనులకు ఆటంకములు కల్గినచో, ఆ పని నప్పుడు చేయరాదనియే భగవంతుని ఆదేశము. ఇట్లు పరిస్థితులను బట్టి తన కార్యక్రమమును సర్దుబాటు చేసుకొనగల మనస్తత్వమే విక్రమము, లేక విశేషమైన క్రమము కలది. ఇట్టి ఈ లక్షణముగా భగవంతుడే మనయందు పని చేయుచున్నాడు.

6. జీవితమునందు అవాంతరములు ఏర్పడినప్పుడు వాటిని ధైర్యముతో నెదుర్కొని దాటగలుగుట, పరమాత్మ యొక్క యనుగ్రహము వలన సాధ్యమగుచున్నది. పరమాత్మయే మనయందుగల సృజనాత్మక శక్తి.

7. మనయందుగల అనేక స్థితులు లేక పొరలు ఒకదానికన్నా ఉత్తమముగా మరియొకటి పని చేయుచుండును. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మున్నగునవి ఒకదానికన్నా ఇంకొకటి సూక్ష్మమైనవి మరియు ఉత్తమమైనవి. క్రింది పొరలలోనున్న జీవుని మనస్సు పై పొరలలోనికి తీసుకొని పోబడుచున్నది. అనగా తనకన్నా పై స్తితులలో జీవించు వానిని జూచి వాని వలె ఆచరించుట, జీవించుట చేయువాడు, మంచి పరిస్థితులలోనికి పెరుగుచున్నాడు. ఇట్లు పెరుగుచు అన్నిటికన్నా ఉత్తమమైనవాడు పరమాత్మ గనుక చివరకు పరమాత్మయందు ఐక్యమగును. కనుక అన్నిటికన్నా ఉత్తముడైనవాడు పరమాత్మ.

8. భయమనునది, తనకు తెలియని దానిని గూర్చి ఊహించుకొనుట వలన నేర్పడుచున్నది. అసత్యమును సత్యముగా పొరబడుటవలన నిట్లు జరుగును. నిజమునకు భయమనునది తన యూహయేగాని సత్యముకాదు. పరమాత్మ తన వ్యాపనత్వము చేత మనయందు తనసాన్నిధ్యమును

కల్పించుటద్వారా భయమును పోగొట్టును. ఈయన సాన్నిధ్యము, ధైర్యముగా మనయందు వ్యక్తమగుచున్నది. అంతేగాక భయము కలిగించు పరిస్థితులలో పరమాత్మను ధ్యానము చేసినచో భయము నశించుచున్నది. అర్ధరాత్రి సమయమున చీకటిలో పోవుచున్నవానికి తన కేమగునోయను భయము కలుగును. కానీ బాట ప్రక్కనున్న చెట్లు చేమలకు భయముండదు. నశించుట మానవునికి చెట్లకు సమానమేయైననూ మానవుడు మాత్రమే భయపడుచున్నాడు. కనుక ఈ భయపడుట యనునది మనస్సులోనే ఉన్నది. కానీ, పరిస్థితులయందు లేదని తెలియుచున్నది. దీనిని తెలుసుకొని, తన మనస్సు పరమాత్మ నుండియే పుట్టునని తెలియువానికి భయముండదు. అందుచేత భయపెట్టుటకు వీలులేని వాడు భగవంతుడు.

9. చేసిన మేలు మరువని వానికి, వాని యూహలో తాను పొందిన ఉపకారము నిలిచియుండును. అందువలన తిరిగి అటువంటి ఉపకారము ఇంకొకనికి చేయగల మనస్తత్వము వానికి క్రమేణ కలుగుచున్నది. కనుక జీవుల యందు ఒకరికొకరు ఉపకారము చేసుకొనుట, పొందిన యుపకారమునకు కృతజ్ఞత కలిగియుండుట వలన, అది తిరిగి ఉపకారముచేయ ప్రయత్నించుటకు కారణమగుచున్నది. కనుక మనయందు కృతజ్ఞుడుగా పరమాత్మ పని చేయుచున్నాడు.

10. పై విధముగా ధ్యానము చేసినవానికి తాను చేయవలసిన పనులు, చేయుచున్నవి అన్నియు భగవంతునిగనే దర్శనమగును. అనగా చేయువాడు, చేయించుట అనునది అతడే అని తెలియును.

11. పరమాత్మ జీవునిలోనున్న ఆత్మయే. తనలోనున్న ఈ పరమాత్మ అంశయే తనను తాను పరమాత్మయందు ఐక్యము చేసుకొనుటకు కారణమగుచున్నది. అనగా ఒక పెద్ద గడివామియందు నిప్పురవ్వ పడినచో కొంతసేపటికి గడ్డియంతయూ తగలబడి అగ్నిలోనికి చేరుచున్నది. అట్లే తన యందు గల పరమాత్మ యొక్క అంశ ఇంద్రియములు, మనస్సు, బుద్ధి మున్నగు వానినన్నిటిని ఒకటిగా నాక్రమించి, అన్నియూ తానే యగుచున్నది.

10. శ్లో॥ సురేశః శరణం శర్మ విశ్వరేతాః ప్రజాభవః
అహః సంవత్సరో వ్యాళః ప్రత్యయః సర్వదర్శనః ॥

**ప్రతిపదార్థము :-** 1. సురేశః = దేవతలకు అధిపతి యైనవాడు, 2. శరణమ్ = శరణమైనవాడు, 3. శర్మ=సహనము, 4. విశ్వరేతాః = విశ్వమునకు శుక్రబీజమైనవాడు, 6. అహః = పగలు, 7. సంవత్సరః = సంవత్సరము, 8. వ్యాళః = సర్పము, 9. ప్రత్యయః = విశ్వాసము, 10. సర్వదర్శనః = సమస్తమును చూచువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మ దేవతలకు అధిపతిగను, శరణ్యముగను, సహనముగను, అయియున్నాడు. విశ్వమునకు బీజమువంటివాడు. జీవుల పుట్టుకకు కారణమైనవాడు. అట్లే దినము, సంవత్సరము మరియు సర్పమువంటి కాలము తానైయున్నాడు. విశ్వాసమునకు మూలము మరియు సమస్తమును దర్శింపచేయువాడు.

**వివరణ :-** 1. సురులు అనగా దేవతలు. వీరు మన శరీరమందలి ప్రజ్ఞామయ కేంద్రములందు, అట్లే చోటులో తారలుగను, ప్రకృతిశక్తులుగను పని చేయుచుందురు. వీరందరు దేవలోకమునను చెందినవారు. వీరి ద్వారా పని చేయునది కూడ నారాయణుడే. దీనిని గూర్చియే శ్రీకృష్ణుడు భగవద్గీతలో "పుణ్యోగంధః పృధివ్యాంచ తేజశ్చాస్మి విభావసౌః" అని చెప్పెను. నీటిలో నున్న ప్రవహించుశక్తియు, సూర్య చంద్రాదులవలన కలుగు కాంతియు, తానే ఐ యున్నాడు. ప్రకాశించు వానిలోగల కాంతిగా తానే ఉన్నాడు.

2. శరణ్యము అనునది మనలో భయమును పోగొట్టుటకు కావలెను. ఒక బలవంతుడైన అధికారి రక్షింతునని వాగ్దానము చేసినచో సామాన్యుడు నిర్భయముగా సంచరించగల్గును. అధికారిలోనున్న రక్షణశక్తి తాత్కాలికముగా ఆవేశించినను అది పరమాత్మ నుండి నిరంతరము లభించుచున్నది. అనగా రక్షణశక్తి పరమాత్మనుండి తాత్కాలికముగా అధికారిని ఆవేశించుచున్నది. కనుక శరణు ఎవరిని పొందిననూ అది వారిలోనున్న పరమాత్మనే కనుక అందరిలో శరణు పొందదగినవాడైన పరమాత్మను ధ్యానము చేయవలయును.

3. సుఖ దుఃఖములనునవి తాత్కాలికము. ఎందుకనగా అవి మనస్సుచే

కల్పింపబడినవి కాని, సత్యములు కావు. ఇది తెలిసినవాడు ఎదుటి వాని యందు తప్పులు పట్టుటకాని, కష్టములకు కృంగిపోవుట గాని చేయడు. అవి తనను చక్కదిద్దుటకే యేర్పడినవని తెలియును. జరిగినదానికి ఎదుటి వానిని, విధిని నిందించుట, తెలిసినవాడు చేయడు.

4. సృష్టియందలి సమస్తమునుండి అంకురశక్తిగా మరియు ఫలించు శక్తిగా పరమాత్మయే పని చేయుచున్నాడు. సూర్యకిరణములనుండి శక్తి మొక్కలకు లభించి పుష్టివంత మొనర్చుచున్నది. ఈ సూర్య కిరణములే భూమి యందలి ఖనిజములను పుట్టించుచున్నవి. మరల ఈ సూర్య కిరణములనుండియే జీవ ప్రజ్ఞలు భూమిపై పుట్టుచున్నవి. కనుక సమస్తమునకును బీజమువంటి పరమాత్మ ఈ సృష్టికి శుక్రబీజముగా నున్నాడు.

5. పై శుక్రధాతువు వలన జీవులు తల్లిగర్భము నుండి పుట్టుచున్నారు. అనగా ఊర్ధ్వ లోకములనుండి అధోలోకములు పుట్టును. పరమాత్మ నుండి ''నేను'' అను అహంకారము, బుద్ధి పుట్టుచున్నవి. బుద్ధి నుండి మనస్సు పుట్టుచున్నది. మనస్సునుండి ఇంద్రియములు పుట్టుచున్నవి. వీటి నుండి భౌతిక శరీరము పుట్టుచున్నది. అట్లే చోటునుండి వాయువు పుట్టును. అనగా చోటుయందు కదలిక పుట్టినచో అదియేవాయువు. శుక్రము వలన వీర్యధాతువు పుట్టుచున్నది. మరల దానియందే శుక్రబీజముండును. ఇచ్చట చోటులో నున్న శుక్రతేజస్సే మొట్ట మొదటి శుక్రము. ఈ శుక్ర తేజస్సు శుక్రగ్రహమువలన చోటులో పని చేయుచున్నది. ఈ శుక్ర తేజస్సునందు పరమాత్మ బీజమై యున్నాడు.

6. అహస్సు అనగా సూర్యోదయము నుండి సూర్యాస్తమయము వరకుగల సమయము. ఇది మనిషిని బట్టి, జీవిని బట్టి మారుచుండును. మానవులకు సుమారు పన్నెండు గంటల కాలము పగలైనచో దేవతలకు ఆరు నెలలు పగలు, ఆరునెలలు రాత్రి. బ్రహ్మకు ఒక కల్పము పగలు, ఒక కల్పము రాత్రి యగుచున్నది. కల్పమనగా పదునాలుగు మన్వంతరములు. ఒక మన్వంతరమనగా డెబ్బది రెండు మహాయుగములు. ఒక మహాయుగమనగా నాలుగు యుగములు కనుక ఈ పగలు, రాత్రి అనునవి ఎవరి కొలతనుబట్టి వారికి ఏర్పడునని తెలియుచున్నది.

7. సంవత్సరమనగా ఒక జీవి జీవించు కాలము అని అర్థమున్నది. సంవత్సరమునందు తొమ్మిది నెలలు తల్లి కడుపులోనున్న జీవికి మిగిలిన మూడు నెలలు పుట్టిన తరువాత (ఒకరోజు ఒక సంవత్సరము చొప్పున) తొంబది మానవ సంవత్సరములగును. ఇట్లు సంవత్సర మనునది కాలమునందలి ఒక కొలత. సంవత్సరము నందు గల ఋతువులవలన వర్షములేర్పడి ప్రజలకు ఆహారము లభ్యమగుచున్నది. భూమి సూర్యునిచుట్టు తిరుగు ఒక పరిభ్రమణకాలము సంవత్సరము. ఆ పరిభ్రమణమునందే ఋతువులిమిడి యున్నవి. జీవులు జీవించుట కావలసిన ఏర్పాట్లు ఈ పరిభ్రమణమునందే గలవు. కనుక నారాయణుడు సంవత్సర రూపుడు.

8. కాలమును సర్పముగా ధ్యానింప వలెను. చుట్టలు చుట్టుకొనుట, జారిపోవుట, ప్రాకిపోవుట, మొదలగునవన్నియూ పాము యొక్క లక్షణములు. అట్లే కుబుసము విడుచుట, ఆకులు రాలుట కాలమునకు లక్షణము. వేయి శిరస్సులు గల యనంతుని పడగపై భూమి నిలబడియున్నట్లు వర్ణింపబడినది. వేయి శిరస్సులనగా దినములు, గంటలు మున్నగునవి. ఇవి యన్నియూ ఒకే కాలమునందలి భాగములు. దీని ఆధారముగా భౌతిక సృష్టి నిలచియున్నది. కనుక కాలము అవ్యక్తమై పరమాత్మచే నడుపబడుచున్నది.

9. ప్రత్యయు మనగా విశ్వాసము. దీనివలననే మనమున్నాము. మనమున్నామన్న విశ్వాసము మనయందు పని చేయనిచో శరీరముండదు. నేను న్నా నన్న ఈ విశ్వాసమే మనస్సునందు, ధాతువులందు, కరణముల యందు పని చేయుచుండుట వలన శరీరము పని చేయుచున్నది.

10. దర్శనమనగా మనకు తెలిసిన విషయము లన్నింటియందు అంతర్యామిగానున్న పరిపూర్ణత్వము. జ్ఞానము వలన దర్శనమునకు అడ్డుగా నున్న చీకటియను తెరయందు రంధ్రములగుచుండును. ఒక్కొక్క రంధ్ర మనగా నొక సన్నివేశమువలన, ఒక గ్రంథపఠనము వలన, మనకు గలుగు ఆత్మ దర్శనము. మొదట ఇది తాత్కాలికముగా నుండి క్రమేణ మరుగుపడుచుండును. అట్లు అనేక పర్యాయములు జరుగుట వలన మనయందు గల చీకటియను తెర పూర్తిగా చిల్లులుపడి జారిపోవును. అప్పుడు నిరంతరము

సర్వాంతర్యామిని దర్శింపగలుగుట సాధ్యమగును. మన యందిట్టి పరిపూర్ణతను కలిగించు సామర్థ్యమునే బుద్ధియందురు. ఈ బుద్ధి వలననే పరిస్థితులు సరియైన పద్ధతిలో అవగాహన మగుచున్నవి. ఇట్టి అవగాహనములు ఒక పేర్పుగా నేర్పడుట వలన పరిపూర్ణ దర్శనము కలుగుచున్నది. ఇట్టి దర్శనమే నారాయణుడు.

11. శ్లో॥ అజః సర్వేశ్వరః సిద్ధః సిద్ధిః సర్వాదిరచ్యుతః
వృషా కపి రమే యాత్మా సర్వయోగ వినిస్సృతః ॥

**ప్రతిపదార్థము :-** 1. అజః = పుట్టనివాడు, 2. సర్వేశ్వరః = అన్నిటికి అధిపతియైనవాడు, 3. సిద్ధః=నెరవేర్చువాడు, 4. సిద్ధిః = నెరవేర్పబడినది, 5. సర్వాదిః = అన్నిటికిని మొదలుయైనవాడు, 6. అచ్యుతః = జారనివాడు, 7. వృషా కపిః = వర్షించి మరల గ్రహించువాడు, 8. అమేయాత్మా=కొలతల కందని ఆత్మ తత్వము కలవాడు, 9. సర్వయోగ వినిస్సృతః= అన్నిలోకముల యందలి పరిణామము వలన సృష్టిని పుట్టించువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను పుట్టనివానిగనూ, అన్నిటికినీ అధిపతిగనూ, సాధింపబడిన మరియూ సాధించుటయను రెండునూ తానే యైనవాడుగ, అన్నిటికన్నా మొదటగా నున్నవాడుగ, జారిపోవుట లేనివానిగా, వర్షములు కలిగించి మరల నీటిని స్వీకరించువానిగ, కొలత కందని ఆత్మ తత్త్వము కలవానిగ, అన్ని లోకముల యందలి సామ్యముగా, సృష్టిని పుట్టించువానిగా, ధ్యానము చేయవలయును.

**వివరణ :-** 1. పుట్టుట, మరణించుట అనునవి సృష్టియందలి జీవులకు సంబంధించినవిగాని, వాటి కతీతమైన పరమాత్మకు సంబంధించినవి కావు. అందుచేత పరమాత్మను పుట్టుకలేని వానిగా ధ్యానము చేయవలయును.

2. నారాయణుడు సృష్టికిని, సృష్టికర్తకును అధిపతి. ఆయన ద్రవ్యము, శక్తి, మనస్సు మరియు ఆత్మ అను నాలుగింటికిని అధిపతియైన వాడు. అంతేగాక, నామము, రూపము, స్వభావము మున్నగునవి తానే యైనవాడు. దేవతలయందు కూడా తానే యున్నాడు కనుక ఆయన అన్నింటికి అధిపతి.

3. యోగసాధన, యోగసిద్ధి మున్నగునవి సంకల్పించునది మనలో నెవరు? మనలో అట్టి సాధనకు పురికొల్పు కేంద్రమొకటి కలదు. ఆ కేంద్రమే నారాయణుడు. కనుకనే యోగసిద్ధి పొందినవాడు నారాయణుడే యగుచున్నాడు.

4. అట్టి యోగసాధన నారాయణుని గూర్చియూ, వానియందు లీనమగుటను గూర్చియు, ఆచరింపబడుచున్నదికనుక అట్టి సిద్ధి కూడ నారాయణుడే.

5. సృష్టి ప్రారంభమునకు పూర్వము నారాయణుడే యున్నాడు. ఆయన నుండియే సృష్టి ప్రారంభింపబడినది. కనుక నారాయణుడే అన్నింటికిని ప్రారంభమైయున్నాడు.

6. జారిపడుట, మనస్సుకు భౌతిక శరీరమునకు సంబంధించినది. జారిపడుట, పొరబడుట యనునది అంతర్యామి యందులేవు. ఎవరి యందెట్లు ప్రవర్తించుచున్నను. వారి యందంతర్యామియే ఉన్నాడు. ఎవరైనను మనలను పొరబడి నిందించినచో వారియందు గల నారాయణుడే మన మనస్సునకు గల రాగద్వేషములను నశింపజేయుటకై ఇట్లు చేయుచున్నాడని అర్థము. కనుక మనమనుకొనుచున్న "పొరబడుట" యనునది ఇచ్చట లేదు. అట్లు జరుగవలసియే జరిగెనని తెలిసికొని అందలి పరమార్థము గుర్తించవలయును.

7. వర్షాకాలమునందు, సూర్య కిరణములు మేఘములను వర్షింపజేయును. ఎండాకాలములో భూమి నుండి జలములు సూర్యకిరణముల వలన ఆవిరియై మరల మేఘలగుచున్నవి. అట్లే దాంపత్య సమయమందు మనస్సు వలన శుక్రము కలుగుచున్నది. మృత్యు సమయమందు భూమి యందలి ప్రాణశక్తి అన్నమయ, మనోమయ శరీరములను మరల తనలో కలుపుకొనుచున్నది. అట్లే సంకల్పమునుండి వాక్కు పుట్టుచున్నది. కాని మనము నిద్రించినప్పుడు, ధ్యానము చేయునప్పుడు, భావములు, చైతన్యము సంకల్పమునందు లీనమగుచున్నవి. మనము శ్వాసించునపుడు జరుగునది ఇదియే. నారాయణుడు ఈ సృష్టియందలి స్పందనాత్మకమైన శక్తికి అధిపతియై యున్నాడు. కనుక ఆయనను ధ్యానము చేయుము.

8. జీవుడు పుట్టినప్పుడు జీవాత్మచుట్టు అనేక కోశములేర్పడుచున్నవి.

ఇవియన్నియూ జీవునిచుట్టునున్న పొరలేకాని జీవుడు కాదు. అవి మరల తిరిగి జీవునియందే ప్రవేశించును. ఈ కోశములు ఏర్పడుట, మరల జీవునియందే కలసిపోవుట, యనునది జీవునియొక్క ప్రవృత్తి మార్గము. జీవితము, అందలి సంఘటనలు, జీవియొక్క ప్రవృత్తికి సంబంధించినవి. ఈ సంఘటనలు, కోశములు ఒకదానికొకటి కారణములుగా, ఫలితములుగా, నేర్పడుచున్నవి. ఆత్మ ఈ ఫలితములకు సంబంధించినది కాదు. సంఘటనలు ఆత్మ యొక్క ప్రవృత్తి యగు జీవితమునందే కలుగుచున్ననూ ఆత్మనంటవు. ఆత్మను కొలవలేవు.

9. పరమాత్మ, సృష్టియందలి లోకములన్నిటియందును, వ్యాపించి యున్నాడు. ఆయన తానే లోకములుగా దిగివచ్చుచున్నాడు. కానీ యేలోకమున కాలోకమువేరు, లక్షణము వేరు. లోకములు, ధర్మములు వేరువేరుగా నున్ననూ వాటన్నింటికిని ఒక సామ్యమున్నది. ఈ సామ్యమే యోగము. లోకము లెన్నియున్ననూ యోగమొక్కటే. అట్టి యోగమే పరమాత్మ.

12. శ్లో॥ వసుర్వసుమనాః సత్యః సమాత్మా సమ్మితః సమః
అమోఘః పుండరీకాక్షో వృష కర్మా వృషా కృతిః ॥

**ప్రతిపదార్థము :-** 1. వసుః = సృష్టియందలి సంపద, 2. వసుమనాః = సంపదలను కోరు మనస్తత్వము, 3. సత్యః = సత్యము లేక ధర్మము, 4. సమాత్మా= సామ్యమగు పరమాత్మ, 5. సమ్మితః = చక్కగా కొలువబడువాడు, 6. సమః = సమత్వము కలిగి నటువంటివాడు, 7. అమోఘః= వ్యర్థముకాని వాడు, 8. పుండరీకాక్షః=పద్మమువంటి కన్నులుకలవాడు, 9. వృషకర్మా = వర్షముకలిగించువాడు, 10. వృషాకృతిః= వర్షమే తానైనవాడు.

**తాత్పర్యము :-** సృష్టియందలి సంపదగానూ, ఆ సంపదను గోరు మనస్సుగనూ, సత్యముగనం, ధర్మముగానూ, సామ్యము గలవానిగనం, చక్కగా కొలువబడువానిగనూ, సముడుగనూ, వ్యర్థముకాని వానిగను, పద్మము వంటి కన్నులు కలవానిగనూ, వర్షము కలిగించువానిగనూ, వర్షమే తానైనవానిగనూ ధ్యానము చేయవలయును.

**వివరణ :-** 1. ఈ సృష్టి సంపదలో భౌతికమైన వస్తుసంపద అష్ట వసువులు అను ఎనిమిది మంది దేవతలచే నిర్వహింపబడుచున్నది. కనుక ఈ వసువులు

నారాయణుని అవతారములుగనే కొలువబడుచున్నారు.

2. మనస్సు భౌతిక సంపదలవెంట పరుగెత్తుచుండును. భౌతిక వస్తువులను గురించి తాపత్రయపడుట, ఆలోచించుట మనస్సు లక్షణము. కనుకనే యోగికాని వానికి అనగా మనస్సు, హృదయమునందు లీనము కాని, వానికి, తాపత్రయ పడుట జరుగును.

3. సత్యమనగా తానున్నాని తెలియుట. మనమున్నామని మనకు తెలియును గనుక మనము సత్యము నందున్నాము. తాను ఫలానా పేరుగల వ్యక్తిననియు, ఫలానా వారికి కుమారుడననియూ తెలియుట సత్యము. పేరులు శరీరములకు సంబంధించినవే కానీ జీవికి సంబంధించినవి కావని తెలియుట దానికన్నా పైసత్యము. తనయందున్న జీవ ప్రజ్ఞయగు ''నేను'', అన్ని జీవరాసులయందునూ సమముగా నున్నదని తెలియుట అంతకన్నా ఎక్కువ సత్యము. ఇట్లు నారాయణుడే సకల జీవుల యందలి ''నేన''ను శబ్దముచే తెలియబడుచున్నాడనుట అన్నిటికన్నా పరమ సత్యము.

4. దేహము, మనస్సు, ఇంద్రియములు, బుద్ధి వేరు వేరు స్థితులలో నుండును. వానికి ఒకదానితో నొకటి పొందికలేదు. అనగా సామ్యము లేదు. అవి వేరు వేరుగా నున్నపుడు సామ్యముండదు. అవి యన్నియూ ఒకదానితో నొకటి సమమైన స్థితిలోనున్నచో సామ్యముండును. అనగా అవి ఆత్మనుండి పుట్టుచున్నవని తెలుసుకొని, ఆత్మగా ధారణ చేయువానికి, ఇవి యన్నియూ సామ్యములో నిలుచును.

5. ప్రతివాడునూ ఇతరుల గుణగణములను లెక్కించునప్పుడు, తన మనస్సునుండి బుద్ధి నుండి ఆలోచించును. అనగా తానే స్థితిలో నున్నాడో, వాళ్ళను కూడా అచ్చటినుండియే లెక్కించును. అతడే ఆత్మ విద్య తెలిసిన వాడైనచో, వారిని ఆత్మగా చూచును. కనుక అతడు ఆత్మచే ఆత్మను కొలచుచున్నాడు.

6. పరమాత్మ సర్వాంతర్యామి గనుక ఆయన అన్ని లోకముల యందునూ, జీవరాసులయందునూ సమముగా ప్రకాశించుచున్నాడు.

7. ఇట్లు అన్నిటి యందునూ వ్యాప్తిచెందిన పరమాత్మ, ఒకదాని యందు ఎక్కువగా నుండుట గానీ, మరియొక దాని యందు తక్కువగా నుండుట గాని లేదు. వస్తువులలో వాటి ధర్మముగనూ, ఉపయోగముగనూ పరమాత్మయేయున్నాడు. కనుక అనవసరమైనదీ వ్యర్థమైనదీ లేదు.

8. మానవుల కన్నులు సూర్యకిరణములతో సంబంధము కలిగియుండును. కనుక అవి పద్మములతో పోల్చబడినవి. మనయందు గల చూపు అనుక్షణము సూర్యుని కేంద్రమునుండి మనలో పని చేయుచున్నది. కనుక పరమాత్మ పద్మములవంటి కన్నులు కలవాడని చెప్పబడినది.

9. వర్షము బీజములు మొలకెత్తుటకు, జీవుల పుట్టుకకూ కారణమగుచున్నది. పుట్టి, పెరిగి, ఫలించుట వృక్షములకు జీవులకు సమానము. వారి యందున్న జీవ లక్షణము వికసించుటకు, వర్షించుట కావలెను.

10. వర్షమునందు ప్రాణశక్తియున్నది. ఆ ప్రాణశక్తివలన జీవులు పుట్టుచున్నారు. చోటునందలి ప్రాణశక్తి (Space Electricity) ఉరుములు, మెరుపువలన మేఘములయందు నిక్షిప్తమగుచున్నది. అట్లు నిక్షిప్తమైన మేఘములు వర్షించుటవలన నీటియందలి ప్రాణశక్తి భూమిని, వృక్షములనూ, మానవులనూ చేరుచున్నది. కనుక వర్షము పరమాత్మయై యున్నాడు.

13. శ్లో॥ రుద్రో బహుశిరా బభ్రుర్విశ్వయోనిః శుచిశ్రవాః
అమృతః శాశ్వతస్థాణుర్వరారోహో మహాతపాః ॥

**ప్రతిపదార్థము :-** 1. రుద్రః = రుద్రుడను దేవత, ఛందస్సుకు అధిదేవత, 2. బహుశిరాః = అనేక శిరములు కలవాడు, 3. బభ్రుః = అనేకముగా విస్తరించిన రూపములే తనరూపమైనవాడు, 4. విశ్వయోనిః = విశ్వమే తనకుపుట్టుక స్థానమైనవాడు, 5. శుచిశ్రవాః = వినుటయందు నిర్మలత కలిగినవాడు, 6. అమృతః = మృతి లేనివాడు, 7. శాశ్వతః = శాశ్వతమైనవాడు, 8. స్థాణుః =కదలికలేనివాడు, 9. వరారోహః = ఉత్తమమైన జన్మకలవాడు, 10. మహా తపాః = గొప్పతపస్సు కలిగినవాడు లేక తపస్సే తానైనవాడు.

**తాత్పర్యము :** పరమాత్మను ఛందస్సుల కధిదేవతగా, అనేక శిరములు కలిగిన వానిగా, సృష్టియందలి వర్ణములన్నియు తన రూపమైనవానిగా,

విశ్వమునకు పుట్టుకయైనవానిగ, మరియు విశ్వమునందు పుట్టుచున్నవానిగ, మృత్యువు లేనివానిగ, శాశ్వతునిగ, చైతన్యము లేనివానిగ ఉత్తమమైన పుట్టుక కలవానిగ, గొప్ప తపస్సు చేయు వానిగ మరియు తపస్సే తానైన వానిగ, ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ఈ సృష్టియందు పని చేయుచున్న సకల దేవతలు మూడు గణములుగా నేర్పడియున్నారు. 1. ఆదిత్యులు, 2. రుద్రులు, 3. వసువులు. వీరిలో ఆదిత్యులు ప్రజ్ఞామయ లోకములయందు పని చేయుచున్నారు. రుద్రులు ఛందస్సులుగను, శక్తులుగను పని చేయుచున్నారు. మరియు వసువులు భౌతిక రూపములు కట్టుకొనుటకు అధి దేవతలుగ పని చేయుచున్నారు. వీరిలోకములే వరుసగా ప్రజ్ఞామయ లోకము (The Plane of consciousness), శక్తిమయ లోకము (The plane of energies and forces) ద్రవ్యమయలోకము (The plane of matter) అను పేర్లతో పిలువబడుచున్నవి. వీనియందు శక్తిమయలోకముల యందు పని చేయుచున్న దేవతలే రుద్రులని పిలువబడుచున్నారు. వీరు రోదసి అను పేరుతో పిలువబడు చైతన్యాత్మకమైన లోకములయందు పని చేయుటచే రుద్రులు అని పిలువబడుచున్నారు. ఈ చైతన్య లోకములకు సంబంధించినవే మనకు తెలిసిన రంగులు, శబ్దములు మున్నగునవి. ఇవి తానను (I AM) సూర్యుని నుండి బయలుదేరి శక్తిమయలోకముల లోనికి వచ్చు సరికి ఏడు రంగులుగా విశ్లేషణము చెంది సప్తవర్ణములుగా వచ్చుచున్నవి. ఇవియే సంగీతమునందు ఏడు స్వరములుగ వచ్చుచున్నవి. వీనికి సంబంధించిన ప్రజ్ఞలే ఏడు గ్రహములుగ కట్టుకొని సూర్యుని చుట్టూ పరిభ్రమించుచున్నవి. ఈ ఏడును 'తాన'ను సూర్యుని నుండి దిగివచ్చినవి. ఈ రుద్రులు పదకొండుమంది. వారే మన శరీరముందు ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు మరియు ఒక మనస్సు. అనగా ఆయా ఇంద్రియములు నడుపు ప్రజ్ఞలుగా (Intelligencies) మనయందు పని చేయుచున్నారు. కంటిలో చూచు శక్తిగా, చెవి యందు వినిపించుటయను శక్తిగా, మున్నగు వివిధ శక్తులుగ ఏర్పడి శరీరమునందు పని చేయుచున్నారు. భౌతిక అవయవములు ఈ శక్తులు పని చేయుటకు వాహికలవంటివి. ఇట్లు మనయందు పని చేయుచున్న రుద్రులు పదకొండుమంది. వారిలో

ప్రధానమైనవాడు శంకరుడు. కనుకనే భగవద్గీతలో శ్రీకృష్ణుడు ''రుద్రాణాం శంకర శ్చాస్మి'' అని చెప్పెను. ''శం'' అను శబ్దమునకు శాంతి అనియు, ఆనందమనియు అర్ధము. అట్టి ఆనందము నిచ్చు వాడు గనుక శంకరుడు రుద్రులలో ప్రధానదేవత.

2. పరమాత్మయొక్క శిరస్సులనగా, సృష్టియందలి సకల జీవుల శిరములే. అనగా కేవలము మానవుల శిరములే కాక జంతువుల, క్రిమి కీటకాదులు, మున్నగువాని శిరములన్నియు నారాయణుని శిరములుగ ధ్యానింపవలయును. ''సహస్ర శీర్షాపురుషః సహస్రాక్ష సహస్రపాత్'' అని పురుష సూక్తమున గానము చేయబడినది. శిరస్సు అనగా సుడి అని కూడ అర్ధమున్నది. గ్రహములు, తారలు మొదలగునవి యన్నియు చోటులో సుడులుగ నేర్పడినవే. ఆ సుడియందు పని చేయుచున్న శక్తుల సామ్యము (Equilibrium) వలన గోళములు నిలబడియున్నవి. ఇది ఎట్లనగా బొంగరమునకు త్రాడుకట్టి విసిరినప్పుడు బొంగరము వేగమువలన ముల్లుపై నిలబడి యుండుట వంటిది. బొంగరము యొక్క ఈ ముల్లే బొంగరమునకు ఆధారము. అట్లే గ్రహములయందు ఉత్తరధృవము నుండి దక్షిణ ధృవము వరకు మేరు దండము ఏర్పడియున్నది. ఈ మేరు దండమే గ్రహమునకు ఆధారము. మానవుని శరీరమందు వెన్నెముక ఈ దండము. ఈ వెన్నెముకయందు పని చేయుచున్న శక్తులే శరీరము నిలబడి యుండుటకు ఆధారములగుచున్నవి. మనము నిలబడియుండుటకు మన పాదము లాధారముకాదు. ఎందుచేతననగా వెన్ను యందలి నాడులకు పక్షవాతము కలిగినచో కాళ్ళు పని చేయవు. ఈ వెన్నెముక యందలి శక్తినే బ్రహ్మదండము అని కూడ అందురు. ఇట్లు భౌతికమైన అస్తిత్వమునకు ఆధారములుగ పని చేయుచున్న ఈ సుడులన్నియు పరమాత్మ యొక్క శిరములుగ మరియు అవయవములుగ చెప్పబడినవి.

3. విశ్వమునందు విచిత్రమైన సమ్మేళనమున్నది. అందు రంగులు, శబ్దములు మున్నగునవి సమ్మేళనము చెందుట చేతనే గ్రహములు. జీవులు వారి భౌతిక శరీరములు మొదలగునవి ఏర్పడుచున్నవి. ఇవి యన్నియు పంచభూతములతో కట్టుకొనుచున్నవి. ఒక్కటిగానున్న పరమాత్మనే అనేకముగ విశ్లేషణము చెందించి, రూపములుగా తీర్చి దిద్దు శక్తి యొకటి పని

చేయుచున్నది. ఆయననే విశ్వకర్మయందురు. ఆయన ప్రభావము వలననే రూపములు, రంగులు మొదలగునవి ఏర్పడుచున్నవి. అట్లే మన శరీరములందు కూడ వివిధ అవయవములు, హృదయము, శ్వాస, వాక్కు, ఉచ్చారణ, శబ్దము మరియు అర్థము మున్నగునవన్నియు నేర్పడుచున్నవి. ఇవన్నియూ అనేకములుగా యున్ననూ, ఒక్కటిగనే పని చేయుచుండును. శరీరములందు అనేక అవయవములలో వివిధ ప్రవృత్తులు ఉన్నను, అవి అన్నియు కలసి, పురుషుడను ఒకే సమాహారశక్తిగా నేర్పడుచున్నవి. అనగా వాటి వేరు వేరు అస్తిత్వములు నశించి ఒక్కటిగ నేర్పడుచున్నవి. ఇట్టి ఈ ప్రజ్ఞనే బభ్రుడు అనెదరు.

4. ఈ భౌతిక ప్రపంచమంతయు చోటునుండి పుట్టుచున్నది. ఈ చోటు కాలము నుండి పుట్టుచున్నది. కాలము మూల ప్రకృతి అను స్థితినుండి పుట్టుచున్నది. ఈ మూల ప్రకృతినే యోగమాయ అని కూడ చెప్పిరి. ఇదియే యోగనిద్ర అనగా జీవులందరు నిద్రయని దేనిని పిలుచుచున్నారో అట్టి స్థితి. ఈ మూల ప్రకృతి పరమాత్మ యొక్క సంకల్పముగా అనగా శ్వాసగా ఆయన నుండి వ్యక్తమగుచున్నది. అట్లే ఆయనయందు లయమగుచున్నది. ఇట్లు పరమాత్మ నుండి ప్రపంచమంతయు వ్యక్తమై మరల ఆయునయందే లయమగుచున్నది. కనుక పరమాత్మ ప్రపంచమునకు పుట్టుక స్థానమగుచున్నాడు. ఆ జీవుని నుండి సంకల్పము బయలుదేరి అదియే భావముగా, భావమునుండి అక్షరములుగా, అక్షరములు శబ్దములుగ వెలువడుచున్నది. ఇట్టి వాక్కుకు పుట్టుక స్థానముగ పరమాత్మయే యున్నాడు.

5. మనయందు వినుట యనునది పంచతన్మాత్రలలో నొకటి. అది శబ్దమను ప్రజ్ఞకు వాహికగా పనిచేయుచున్నది. అనగా చోటులో నున్న శబ్ద బ్రహ్మమును తనలోనికి గ్రహించుచున్నది. చెవులు శబ్దములను వినుచున్నప్పుడు అవి శబ్దములను స్వీకరించుచున్నవిగాని వాని అర్థములను కాదు. అర్థములు మానవునిచే సంకేతములుగ ఏర్పరచుకొనబడినవి. కనుక శబ్దములను వినుచున్నప్పుడు శబ్దములు అట్లే గ్రహింపబడుచున్నవిగాని వానియందలి అర్థములు కాదు. అనగా అర్థమును బట్టి గ్రహించుట, గ్రహింపకపోవుట లేదు. శబ్దములకు అర్థములను కల్పించి, నచ్చుట, నచ్చకపోవుట అనునవి

మనస్సు ఏర్పరచుకొన్న పొరలు. ఈ పొరలు వినుటకు సంబంధించినవి కాక మనస్సుకు సంబంధించినవి మాత్రమే. కనుక శబ్దములు జీవునిలోనికి స్వచ్ఛముగ అనగా నిర్మలముగనే స్వీకరింపబడుచున్నవి. మరియు నిర్మలమైన వానిని వినుటకు ఆధారమైనవాడు పరమాత్మయే. ఆయన సద్గ్రంథ పఠనమునకు, శ్రవణమునకు, జీవునకు ఉత్సుకత కల్పించి, అవి వినుట వలన బంధములు తొలగింపబడు స్థితికి తీసుకొనిపోవుచున్నాడు. అట్లు శ్రవణము అను శక్తిగ పని చేయుచున్న పరమాత్మ యొక్క కృపచేతనే, మనకు మంచి విషయములను వినుటకును, వినుట వలన ఆచరించుటకును సాధ్యమగుచున్నది.

6. పరమాత్మ అమృతుడు అనగా మృతిలేనివాడు. మృతియను నది సృష్టియందలి జీవులకు, గోళములకు సంబంధించినది. ఈ సృష్టియే కాలము అను చైతన్యముగ పరమాత్మ నండి దిగివచ్చినది. ఈ కాలము పరమాత్మ నుండి పుట్టినది కనుక ఆయన కాలమునకతీతుడు. అందుచేత పరమాత్మకు పుట్టుక, చనిపోవుట అనునవి లేవు.

7. సృష్టియందలి సకల జీవులును వారి దేహములను అశాశ్వతములు. అనగా నశించునవి. అట్లే గ్రహములు, సూర్య చంద్రాదులు మున్నగునవి. కాని వాటియందు ప్రజ్ఞలన్నియును పరమాత్మయను పెద్ద వెలుగునుండి వచ్చిన రవ్వలు. ఈ రవ్వలన్నియు మరల ''నేనే''ను పరమాత్మ యందు కలిసి వాని వెలుగులో నేర్పడుచున్నవి. కనుక నశించుచున్నట్లు కన్పించుచున్న రూపములయందలి నారాయణుడను వెలుగు శాశ్వతము.

8. పర్వతములు, రాళ్ళు, గుట్టలు అట్లే వృక్షములు మన దృష్టిలో కదలికలేనివి. అట్లే ఈ భూమి కూడ కదలిక లేనిదే. ఇట్లు వస్తువులను కదలిక లేనివిగ మనస్సు భ్రమ పడుచున్నది. ఈ భ్రమ, జీవుడు తనకు తాను ఏర్పరుచుకొన్న నామరూపాదులకు సంబంధించినది. ఇట్టి ఈ భ్రమ వలన జీవునికి తన అస్తిత్వమును గూర్చి భయము తొలగుచున్నది. ఇట్లు జీవులలో నిశ్చలత లేక కదలిక లేకుండుటయను భ్రమ కల్పించుట వలన, పరమాత్మ మనస్సునకు తన అస్తిత్వమును గూర్చిన భయమును పోగొట్టుచున్నాడు. కనుక ఇట్టి నిశ్చలతయను భ్రమగా పరమాత్మయే పని చేయుచున్నాడు.

9. సృష్టియందలి సకల భూతముల, జీవుల పుట్టుక పరమాత్మను దర్శనము చేయుటకే. జీవరాశుల సకల జన్మలన్నియు మనస్సునకు పరిపూర్ణత కల్గించి పరమాత్మ యొక్క అస్తిత్వమును స్థాపన చేయుటకే. అందు చేతనే జీవునికి ఎల్లప్పుడును ఒక జన్మకన్న దాని తర్వాత జన్మ ఉత్తమముగానుండుట. కోడి గ్రుడ్డునందలి కోడి పిల్ల పై గుల్లను పగులగొట్టుకొని పిల్లగా ఈవలకు వచ్చినట్లుగా జీవుడు ఒక జన్మయందలి నీచ సంస్కారములను క్షాళనము చేసుకొని దాని తరువాత జన్మను ఉత్తమమైనదిగా పొందుచున్నాడు. ఇట్లు జీవులకు ఉత్తమ జన్మలు కల్పించుచున్నవాడు నారాయణుడే.

10. మహానుభావులైన మహర్షులు. భక్తులు అనేక సాధనలు చేసి, తపస్సు చేసి పరమాత్మ యొక్క సాన్నిధ్యమును పొందుచున్నారు. ప్రహ్లాదుడు. ధృవుడు మున్నగు బాలురు సైతము ఇట్లు మహా తపస్సు చేసిన వారలే. వారి తపస్సుయందలి నిర్మలత్వము వలన వారు పరమాత్మను దర్శించి, వాని సాన్నిధ్యమును తమ ప్రజ్ఞలుగా ధరించి, శాశ్వతమైన వెలుగులుగా ఆకాశమున నిలచియున్నారు. జీవులకు తపస్సు చేయవలెనను సంకల్పము వచ్చినదనగా అది పరమాత్మనుండి వచ్చినదే. అదియే జీవులను రక్షించుటకొరకు, వారియందు తపస్సు అను సంకల్పములుగా పని చేయుచున్నది. అంతేగాక తపస్సు చేయుచున్న వారి యందు కూడ తానే యున్నాడు. వారి సంకల్పములకు మోక్షమను స్థితి కూడ తానే.

14. శ్లో॥ సర్వగస్సర్వ విద్భాను. ర్విష్వక్సేనో జనార్దనః
వేదో వేదవిదవ్యంగో వేదాంగో వేద విత్కవిః ॥

**ప్రతిపదార్థము :-** 1. సర్వగః = అంతటనూ వ్యాపించి యున్నవాడు, 2. సర్వవిత్ = సమస్తమూ తెలిసినవాడు, 3. భానుః = సూర్యునివలె ప్రకాశించువాడు, 5. జనార్దనః = జనులను కాలముగ భక్షించువాడు, 6. వేదః = వేదము, 7. వేదవిత్ = వేదము తెలిసినవాడు, 8. అవ్యంగః = అవయవలోపము లేనివాడు, 9. వేదాంగః = వేదాంగములకధిపతి, 10. వేదవిత్ = వేదములను తెలిసినవాడు, 11. కవిః = కవి.

**తాత్పర్యము :-** పరమాత్మను అంతట వ్యాపించియుండు వానిగా, సమస్తమును

తెలిసిన వానిగా, కిరణములను వెలుగు తానేయైన వానిగా, విశ్వమందలి సేనలకు నాయకునిగా, జీవులను కాలముగ తనలోనికి స్వీకరించువానిగా, జ్ఞానము తెలియు వాడుగను, వేదాంగములు తానే యగుటచే అంగలోపము లేనివానిగ పురాణములను కల్పించు కవిగ, మరియు అందలి పరమార్థము తెలియబడువానిగను ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. పరమాత్మ చోటునందును, కాలమునందును వ్యాపించియున్నాడు. అణువులందును, పరమాణువులందును తానే యున్నాడు. అనగా తానే శక్తిగా వాటియందు పని చేయుచున్నాడు. అంతేకాక అన్ని లోకముల యందును ద్రవ్యముగను, శక్తులుగను, జీవముగను, ప్రజ్ఞలుగను తానేయున్నాడు. అజ్ఞానముచే మానవుడు వీనినన్నిటిని ఒకదాని కొకటి సంబంధములేని వేరువేరు విషయములుగా పొరబడుచున్నాడు. ఇది నీరు, మంచుగడ్డ, నీటి యావిరి, నీటి అణువులు ఒకదానికొకటి సంబంధములేనివని భ్రమ పడుట వంటిది. అట్లే కదలునవి (జంగమములు) కదలనివి (స్థావరములు) అను రెండింటియందు కూడా తానే యున్నాడు. కనుక అతడు సర్వగః పిలువబడుచున్నాడు.

2. పరమాత్మ సామాన్య సాధకునియందు వాని మనస్సుగా యున్నాడు గనుక సృష్టియందలి రహస్యములను తెలుసుకొనుటకు ప్రయత్నించుచు అజ్ఞానివలె ప్రవర్తించుచున్నాడు. అట్లు ప్రారంభమైన వాని అన్వేషణ, పరనిర్వాణము, మహాపరనిర్వాణము వరకును సాగుచునే యుండును. కనుక పరమాత్మ సామాన్య సాధకునియందలి సమస్తము తెలియవలెనను అభిలాషగను, పరిపూర్ణ జ్ఞానియందలి జ్ఞానముగను తానేయున్నాడు.

3. సూర్యగోళమునందలి మహాతేజస్సు వాని కిరణములవలననే యేర్పడుచున్నది. అనగా సూర్యుడు తానే కిరణములరూపమున వెలుగుచున్నాడు. అట్లే జీవులయందలి ప్రజ్ఞ కూడా మహా తేజస్సు కలిగియున్నది. కాని ఆ తేజస్సు మన మనస్సను చట్రము ద్వారా గ్రహింపబడుచుండుటచే పరిమిత మగుచున్నది. అనగా జీవులలోనున్న వెలుగును ప్రేమగా దర్శించుట; కాని సాంసారిక జీవులలో ఈ ప్రేమ తనవారికి మాత్రమే పరిమితమగుటవలన, కొందరియందు మాత్రమే ఈ తేజస్సు నిర్మల ప్రేమగానను భవింపబడుచున్నది.

క్రమేణ మనస్సు విశాలమగుచున్న కొలది తన బంధువులయందును, పరిచయస్థుల యందును ఈ వెలుగు దర్శింపబడి అనుభవము అగుచున్నది. చివరకు సమస్తమునందును ఈ వెలుగు దర్శింపబడి అనుభవము శాశ్వత మగుచున్నది. చివర అనగా అంతము. వేదము అనగా తెలుసుకొనబడునది లేక సత్యము అని అర్థము. తెలుసుకొనుటయందలి పరిపూర్ణత లేక చిట్టచివరి స్థితి కనుక ఇది వేదాంతము అను స్థితి.

4. విశ్వమునందలి దేవతలు ఒక బృందముగా నేర్పడి పని చేయుచున్నారు. ఆ బృందము యొక్క యేర్పాటు వారి విధులనుబట్టి, స్థితిని బట్టి నియమింపబడును. వారియందు పని చేయుచున్న వారి శక్తులు, ప్రజ్ఞా కేంద్రములు ఇట్టి క్రమశిక్షణననుసరించి ఏర్పడి యున్నవి. ఈ యేర్పాటు అణువుల యందును, మానవ దేహకోశములయందును, సౌరమండలము నందును, ఒకే విధముగానున్నది. ఈ ఏర్పాటు ఇన్నిటియందును ఒకే క్రమశిక్షణ ననుసరించి యున్నది గనుక, పరమాత్మ వీటికి నేత లేక నడుపువాడు అగుచున్నాడు. వైష్ణవ సంప్రదాయమునందు ఈయనను ''విష్వక్సేనుడు'' అని పిలుతురు. చేతిలో నొక దండమును ధరించి సైన్యములను గణములుగా విభజించి భగవంతుని త్రైలోక్య రాజ్యాధిపత్యమును సుస్థిరముగా మార్చుచున్నాడు. ఇట్లు దేవగణములకు అధిపతి యగుట వలన ఈయన గణపతికూడా నగుచున్నాడు. గణపతి యనగా వినాయకుడేనని పొరపడరాదు. కనుకనే వైష్ణవ సాంప్రదాయమునందు గణపతి పూజ చేయవలసిన చోట్ల వినాయకుని బదులు విష్వక్సేనుని పూజింతురు. గణపతి అనగా శబ్దములను, ఛందస్సులను గణములుగా విభజించి పాలించువాడు. కనుక వినాయకుడు కూడా గణపతియై పూజింపబడుచున్నాడు. ఈ విష్వక్సేనునే శైవ సంప్రదాయమునందు దేవ గణములకు అధిపతియగు సుబ్రహ్మణ్యేశ్వరునిగా పిలుతురు. ఈయన చేతిలో శూలము ధరించి శక్తియే తన అయుధముగా దేవసైన్యమును పాలించును. ఈయనను కుమారస్వామి (మొట్టమొదటి కుమారుని)గా పూజించెదరు.

5. కాలము రూపములను, సంఘటనలను తనయందు లీనము చేసికొనును. ప్రతి వస్తువునకును లేక రూపమునకును ఒక ప్రయోజనము లేక పరమార్థము ఉన్నది. ఆ ప్రయోజనము తీరిన వెనుక దాని అస్తిత్వముత

అవసరము ప్రపంచమునకు తీరిపోవును. వంట పూర్తియైన వెనుక వంటపాత్రలయొక్క ప్రయోజనము తీరిపోవును గదా! కనుక పాత్ర లచ్చటి నుండి తొలగింపబడును. అట్లే ఒక ప్రాజెక్టును కట్టుటకు ఇంజనీరింగు శాఖవారి ఆఫీసు ఏర్పాటు చేయబడును. ప్రాజెక్టు పూర్తియయిన వెనుక ఆ ఆఫీసుతో ప్రయోజనము తీరిపోవునుకనుక అది తొలగింపబడును. అట్లే భౌతిక ప్రపంచమున జీవులు, వస్తువులు గ్రహగోళములు, తారలు, సౌరమండలములు, వాని ప్రయోజనము తీరిపోయిన వెనుక తొలగింప బడుచున్నవి. అట్లు తొలగించువాడు గనుక పరమాత్మ జనార్ధనుడని పిలువబడుచున్నాడు.

6. భగవంతుని శ్వాసగా ఈ లోకములన్నియు వ్యక్తమగుచున్నవి. మరల అవియన్నియు ఆయనయందే ప్రవేశించుచున్నవి. ఇట్లు ఒక పూర్తి శ్వాసయందు సృష్టియందలి సమస్తమును సత్యముగా నిలిచియున్నది. అట్టి ఈ సత్యమునే వేదము అని యందురు. ఈ సృష్టియందలి సత్యము జీవుని శ్వాసయందు రహస్యముగా తెలియబడుచున్నది. ఈ రహస్యమును తెలిసినవాడు సత్యమును తెలిసినవాడగుచున్నాడు. వానినే సత్యదర్శనుడందురు. అట్టివానికి సమస్త వేదము దర్శనమగుచున్నది.

7. అట్లు వేదమును శ్వాసయందు దర్శనము చేయువాడు ఎద విదుడని తెలియబడుచున్నాడు. ఇట్టి వేదమును దర్శించుటకు శ్వాసయందలి ఉచ్ఛ్వాస నిశ్వాసములు ధ్యానము చేయువలయును. అనగా శ్వాసను లోపలకు తీసుకొనునప్పుడు ఆ ప్రక్రియను మనస్సుతో గమనించుచూ గాలి లోపలికి పీల్చుకొనవలెను. అట్లే బయటకు వదలునప్పుడు కూడా శ్వాసప్రక్రియను గమనించవలెను. ఇది మిక్కిలి ప్రశాంతముగ నెమ్మదిగా చేయవలెను. శ్వాస లోపలి పీల్చునపుడు ''సో'' అని, మనస్సులో ఉచ్చరించుచు, బయటికి వదలునపుడు ''హం'' అని పైకి ఉచ్చరించవలెను. ఇట్లు ధారణ చేయువాడు ధ్యానము, సమాధియను స్థితులు పొందుచున్నాడు. అనగా ధ్యానము లేక వేదమే తానగుచున్నాడు. ఇట్టి స్థితి పొందినవాడు మాత్రమే బ్రాహ్మణుడని పిలువబడుచున్నాడు. కనుక నిజమైన బ్రాహ్మణునకు భగవంతునికి భేదములేదు. అందుచేతనే బ్రాహ్మణుడు భూసురుడని పిలువబడుచున్నాడు.

8. జీవులకు అవయవములన్నియూ సూక్ష్మ శరీరము ననుసరించి యేర్పడుచున్నవి. ఈ సూక్ష్మ శరీరము జీవాత్మ వలన కలుగును. జీవుడు, ''నేన''ను పరమాత్మచుట్టు, అహంకారమనబడు పొర యేర్పడుటవలన కలుగుచున్నాడు. పరమాత్మ జీవులకు అవయువములను సహజముగను సమానముగను సంకల్పించుచున్నాడు. ఏ జీవికిని అవయవలోపము కలుగునట్లు సంకల్పించడు. ఒక్కొక్కసారి మనస్సను పొరయందు, ఈ ఇంద్రియముల ముద్ర పరిపూర్ణముగా స్వీకరింపబడక పోవచ్చును. అట్లు స్వీకరింపబడకపోవుట మనస్సునందలి కొన్ని దుష్ట సంస్కారములు కారణము కావచ్చును. అట్లు మనస్సు మీది ముద్ర సక్రమముగా ప్రతిఫలింపక పోయినచో, భౌతికముగా అవయువ లోపము ఏర్పడవచ్చును. అట్టి అవయువ లోపము మొదట పరమాత్మయందు లేదు. యోగాభ్యాసము, సత్ప్రవర్తన కలిగియున్న సజ్జనులగు వారియందు ఈ అవయవముల ముద్ర మనస్సుపై సక్రమముగా స్వీకరింపబడి భౌతిక శరీరముగా ముద్రితమగుచున్నది. అట్టివారికి ఏ అవయవ లోపముండదు. కనుక పరమాత్మ అవ్యంగుడు లేక అవయువ లోపము లేనివాడుగ కీర్తింపబడుచున్నాడు.

9. వేదమునకు ఆరు అంగములు కలవు అవి 1. ఛందస్సు, అనగా చైతన్యాత్మకమైన తరంగము. ఇదియే కాలము, దేశము అనువానిగా తెలియబడుచున్నది. 2. కల్పము అనగా సృష్టి ప్రారంభమునుండి అంతమువరకు గల మొత్తము. ఇది బ్రహ్మకొక్క పగలు. మరలనంతే కాలము బ్రహ్మకు రాత్రి. ఇట్లు ఒక పగలు ఒక రాత్రి కలిపినచో బ్రహ్మకొక్క దినము. ఈ కల్పము వేయి దివ్య సంవత్సరములుగా విభజింపబడినది. అదియే పదునాలుగు మన్వంతరముల కాలము. ఒక్కొక్క మన్వంతరమునందు డెబ్బై యొక్క మహాయుగములు కలవు. ఒక మహా యుగము నాలుగు యుగములు. అవి 1. కృతయుగము, 2. త్రేతాయుగము, 3. ద్వాపరయుగము, 4. కలియుగము. ఇట్లు బ్రహ్మచే మహాయజ్ఞముగా కల్పింపబడిన సృష్టిక్రమమును కల్పమందురు. ఈ కల్పము, ఛందస్సు అను రెండింటిని ధ్యానము చేయువారికి, సృష్టియందలి కాలము మరియు యజ్ఞము అనువాని స్వరూపము బోధపడును. 3. వ్యాకరణము అనగా అనేకమగుట లేక విస్తృతమగుట యని అర్థము. అనగా

నొక్కటిగానున్న పరమాత్మనుండి అనేకములుగా సృష్టి యుచ్చరింపబడుట. ఇది మూడు గుణములుగా వ్యక్తమగుచుండును. అవి కర్త లేక చేయువాడు, క్రియ లేక చేయబడు పని, కర్మ లేక చేయబడు విషయము, ఇట్లు ఒక్కటిగానున్న వాక్కు కర్త, క్రియ, కర్మ యను మూడు భాగములుగా విభజింపబడి అర్థము చేసుకొనబడుచున్నది. 4. శిక్ష అనగా శిక్షణము లేక విధానము. '' ఓం'' కారము లేక ప్రణవము సృష్టిగా ఉచ్చరింపబడు యజ్ఞక్రమము. 5. జ్యోతిషము అనగా వెలుగును వాని వైభవములు. ప్రజ్ఞ లేక జ్యోతి, భౌతిక లోకములోనికి వెలుగుగా వచ్చు క్రమము, జ్యోతిశ్శాస్త్రము. సృష్టియందు అనేక జ్యోతులుగా ప్రకాశించుచున్న ఈ గోళములే వివిధ దశలలోనున్న దేవతలు లేక ప్రజ్ఞలు. వారినిగూర్చి వారి విభూతుల గురించి తెలియజేయు శాస్త్రమే, జ్యోతిశ్శాస్త్రము. ఈ జ్యోతిశ్శాస్త్రము, ఆధునిక ఖగోళశాస్త్రము (Astronomy) కన్న మిక్కిలి యున్నతము. ఈ ఆధునిక ఖగోళ, జ్యోతిశ్శాస్త్రములు వేదప్రతిపాదికమైన జ్యోతిర్వేదము (Spiritrial Astrology) నకు శవములవంటివి. 6. నిరుక్తము అనగా శబ్దముల పుట్టుక, మరియు పదముల అంతరార్థము. ఈ ఆరు అంగములు వేదమను అఖండ విజ్ఞానమునకు అవయవముల వంటివి. అనేక భాషలలో ఈ పేర్లతో గల గ్రంథములు అనేకములు గలవు. అవి అన్నియు ఆ గ్రంథకర్తల అల్పబుద్ధికి, ఈ విశ్వమను మహా విజ్ఞానమును గూర్చి, తోచిన మరియు అందిన పేజీలు మాత్రమే.

10. ఈ ప్రపంచమునందు అన్ని సంప్రదాయముల యందును పవిత్రమైన గ్రంథములున్నవి. అవి మానవునికి మార్గమును మరియు గమ్యమును నిర్దేశించుచుండును. అవి విశ్వమునందలి వేదమను మహా తేజస్సునకు వివరణ గ్రంథములు. అవి యన్నియు ఒక్కటియగు పరమాత్మను గూర్చి తెలుపుచుండుటచే పరమాత్మ వేదవిదుడు.

11. సంస్కృతమున కవియనగా కవిత్వమును వ్రాయువాడని యర్థము. కానీ వేదములందు ఈ పదము ఉపయోగింపబడిన అర్థము వేరు. సంస్కృత (కావ్య) వాఙ్మయముకన్న వేదవాఙ్మయము మిక్కిలి ప్రాచీనము కనుక ఈ వేదార్థమే సరియైనది, కవియనగా కల్పనము లేక అల్లిక చేయువాడు. అతడే సూర్యభగవానుడు. అయన తనకిరణములతో సౌరమండలమునంతయు

చూచుచున్నాడు. మరియు కవివలె భావములను ఊహాలు సృష్టిగా కల్పించుచు, లోకములను కావ్యరచనము చేయుచున్నాడు. ఆయన భవిష్యత్తున జరుగబోవునవి తెలియజేయుగల జ్ఞాని యగుచున్నాడు. అట్లు సూర్యుని యందలి కల్పనము జేయు శక్తి పరమాత్మవలన కలుగుచున్నది కనుక అతడే కవి.

15. శ్లో॥ లోకాధ్యక్షః సురాధ్యక్షో ధర్మాధ్యక్షః కృతాకృతః
చతురాత్మా చతుర్వ్యూహశ్చతుర్దంష్ట్రః చతుర్భుజః ॥

**ప్రతిపదార్థము :-** 1. లోకాధ్యక్షః = లోకములను అధిష్టించి యున్నవాడు, 2. సురాధ్యక్షః = దేవతలకు అధ్యక్షుడైనవాడు, 3. ధర్మాధ్యక్షః = ధర్మమునకు పాలకుడైనవాడు, 4. కృతాకృతః = సాధింపబడినది మరియు సాధింపబడనిది, 5. చతురాత్మా = నాలుగు విధములుగా వ్యక్తమగువాడు, 6. చతుర్వ్యూహః = నాలుగు వ్యూహములు గలవాడు, 7. చతుర్దంష్ట్రః = నాలుగు కోరలు గలవాడు. 8. చతుర్భుజః = నాలుగు భుజములు గలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను లోకములకు అధ్యక్షునిగను, దేవతలకు అధిపతిగను, ధర్మమునకు నిర్వాహకునిగను, సాధింపబడినది మరియు సాధింపబడ వలసినదిగాను, నాలుగు స్థితులుగా వ్యక్తమగువానిగను, నాలుగు వ్యూహములుగా తెలియబడు వానిగను, నాలుగు కోరలు గలవానిగను, నాలుగు భుజములు గలవానిగను ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ఈ సృష్టియంతయు అనేక లోకములుగా లేక పొరలుగా వ్యక్తమగుచున్నది. అది ఒక్కొక్క స్థితియందు ఒక్కొక్క పద్ధతిలో విభజన కల్గియున్నది. మూడుగను, నాలుగుగను, ఏడుగను, పదునాలుగుగను ఈ లోకములున్నవి. ఇవి ఒక్కొక్క కోణమునందు ఒక్కొక్క పద్ధతిలో గ్రహింపబడుచున్నవి. ఇవి ఎట్లు విభజింపబడినను అవి పరమాత్మ యందలి అంతర్భాగములే కానీ వేరు కాదు.

2. ప్రతి లోకమునందును (పరమాణువునందు సైతము) దేవతలు పని చేయుచున్నారు. ఇట్లు ఈ దేవతలు పని చేయుచుండుట ఒక నిర్ణీత పథకము ననుసరించి ఆ పథకమే జగత్కర్మ లేక సృష్టికర్మ. ఈ సృష్టి కర్మ పరమాత్మ యందలి భాగమే గనుక భగవంతుడే దేవతలకధ్యక్షుడై నడుపుచున్నాడు.

అనగా వారియందలి ''నేన''ను ప్రజ్ఞగా తానే యున్నాడని భావము.

3. అట్టి జగత్కర్మ ననుసరించియే లోకములు, దేవతలు సృష్టింపబడుచున్నారు. పదార్థముల ధర్మములు, జీవుల స్వభావములు, గుణములు మున్నగునవన్నియు ఈ జగత్కర్మ వలననే కలుగుచున్నవి. ఇట్లు అన్నిటియందును గల ధర్మములకు తానే మూలమై యున్నాడు గనుక పరమాత్మ ధర్మమునకు కూడ అధ్యక్షుడై నడుపుచున్నాడు.

4. ఈ సృష్టియంతయు పరిపూర్ణము మరియు సత్యమై యున్నది. ఎందుచేతననగా అందలి అంతర్యామి పరిపూర్ణుడు కనుక. కాని సృష్టి యందలి ఏ ఒక్కభాగము లేక లోకము వేరుగా పరిపూర్ణము కాదు. ఎందుకనగా ఇది మొత్తములో కొంతమాత్రమే గనుక. ఇదియే పురుష సూక్తమున ''పాదో స్య విశ్వాభూతాని, త్రిపాదస్యా మృతం దివి'' అని చెప్పడినది. ఈ కనిపించు భౌతిక ప్రపంచమంతయు ఒక పాదమే యనియు మిగిలిన మూడు పాదములను అంతర్లోకములుగాగలవనియు అర్థము. ఇందు ఏ యొక్క పాదమయినను అసంపూర్ణమే గనుక భగవానుడు ఆ పాదమునందు అసంపూర్ణముగా నున్నాడు.

5. ఆత్మ, జీవియందు నాలుగు పొరలలో తెలియబడుచున్నది. అవి 1) జీవాత్మ, 2) మనస్సు, 3) ప్రాణము, 4) భౌతిక శరీరము ఈ నాలుగును ఆత్మయందుగల నాలుగు పొరలు. ఈ నాలుగు పొరలును ఆత్మయొక్క రూపాంతరములే.

6. భగవంతుడు నాలుగు వ్యూహములుగ వ్యక్తమగుచున్నాడు. అవి 1) వాసుదేవుడు, 2) సంకర్షణుడు, 3) ప్రద్యుమ్నుడు, 4) అనిరుద్ధుడు. అందు వాసుదేవుడనగా లోకములన్నిటి యందును, సకల జీవులయందును, తానను ప్రజ్ఞగా నున్నవాడు. సంకర్షణుడనగా మనస్సులను కర్షణము చేయువాడు అనగా మథనము చేయువాడు. ప్రద్యుమ్నుడనగా తన కాంతిచే ప్రపంచమును వెలిగించువాడు. అనిరుద్ధుడనగా నిరోధించుటకు శక్యముకాని ప్రజ్ఞగలవాడు గనుక భగవానుడు ఈ నాలుగు వ్యూహములుగా సృష్టియందు వ్యాపించియున్నాడు.

7. జీవునికి మృత్యువు ఆసన్నమగుచున్న కొలది, భగవంతుడు నాలుగు కోరలతో ఈ జీవుని చీల్చి భౌతిక ప్రపంచమునుండి సూక్ష్మ లోకములలోనికి పంపును. ఈ నాలుగు కోరలే ముసలితనము, వ్యాధి, దుఃఖము మరియు మృత్యువు.

8. ఈ సృష్టి పరమాత్మ నుండి బ్రహ్మద్వారా ఉచ్చరింపబడినది. బ్రహ్మ దీనిని నాలుగు స్థితులుగా నుచ్చరించెను. అవి వరుసగా పరావాక్కు, పశ్యంతీవాక్కు, మధ్యమావాక్కు, వైఖరీవాక్కు, అందు పరావాక్కు సృష్టి ప్రారంభమునకు ముందు పరమాత్మ నుండి బయలుదేరిన సృష్టి సంకల్పమును తెలియజేయుచున్నది. ఇది పరమాత్మ నుండి మొట్టమొదటగా ప్రజ్ఞ వేరగుట. అనగా ఆనందమునందు లీనమైయున్న ప్రజ్ఞ తాను ఆనందించుచున్నానను స్థితిలోనికి మేలుకొనుట. ఈ మొట్టమొదటి మెలుకువనే చైతన్యమనియు, శక్తియనియు, మూల ప్రకృతి యనియు పిలిచెదరు. ఇదియే పరావాక్కు యని కూడా పిలువబడుచున్నది. దీని తరువాత సృష్టి, భావములుగా ఒక పథకముగా వ్యక్తమగును. ఇదియే పశ్యంతీ వాక్కు అని చెప్పబడినది. ఇది ఒక కవి నాటక రచనకై కథను స్థూల నిర్ణయము చేసుకొనుట వంటిది. దీని తరువాత మూడవ స్థితి యందు వివిధ లోకములన్నియు ఏర్పడి సూక్ష్మలోకములలో వాని నిర్మాణము, అందలి జీవుల నిర్మాణము పూర్తియగును. ఇది మూడవ స్థితి. దీనిని మధ్యమావాక్కు అందురు. నాలుగవ స్థితి యందు భౌతిక ప్రపంచము గ్రహగోళములు సమస్త జీవుల దేహములతో సహా వ్యక్తమగును. ఇది నాలుగవస్థితి. దీనినే వైఖరీవాక్కు అందురు. ఇట్లు తాను నాలుగు విధములుగా వ్యక్తమగుచున్నాడు. ఇవియే ప్రజ్ఞయందలి నాలుగు స్థితులుగా చెప్పబడినవి. అవి 1) జాగ్రదవస్థ, 2) స్వప్నము లేక కలలతో కూడి నిద్ర, 3) సుషుప్తి లేక గాఢనిద్ర, 4) తురీయావస్థ లేక ఆనందము. అట్లే భూమిచుట్టి సూర్యుని గమనము ఒక వృత్తముగా ఊహించుకొన్నచో ఆ వృత్తమునందు సూర్యోదయము, మిట్టమధ్యాహ్నము, సాయంత్రము, అర్ధరాత్రి యను నాలుగు సమయములును, కేంద్రమునుండి పరిధికి నాలుగు భుజములగుచున్నవి. ఇట్లు విశ్వము నందు చతుర్భుజుడుగా భగవంతుడే యున్నాడు.

16. శ్లో॥ భ్రాజిష్ణు ర్భోజనం భోక్తా సహిష్ణు ర్జగదాదిజః
అనఘో విజయోజేతా విశ్వయోనిః పునర్వసుః ॥

**ప్రతిపదార్ధము** :- 1. భ్రాజిష్ణుః= దీప్తిమంతుడు, 2. భోజనం = భోజనము, (ఆహారము) 3. భోక్తా = భుజించువాడు, 4. సహిష్ణుః = సహనము కలవాడు, 5. జగదాదిజః = సృష్టి మొట్టమొదట పుట్టినవాడు, 6. అనఘః = పాపము లేనివాడు, 7. విజయః = విజయము, 8. జేతా = జయించినవాడు, 9. విశ్వయోనిః = విశ్వమే పుట్టుక స్థానము కలవాడు, 10. పునర్వసుః = కోరినపుడు సంపదలు కలిగించువాడు.

**తాత్పర్యము** :- భగవంతుని దీప్తివంతునిగను, జీవుల ఆహారము తానేయైన వానిగను, జీవుల ద్వారా ఆహారము స్వీకరించువానిగను, సహనమే తన రూపమైన వానిగను, ప్రపంచమునకు మొట్టమొదట పుట్టినవానిగను, జయించిన వానిగను, విశ్వమునకు పుట్టుక తానేయైన వానిగను, ధ్యానము చేయుము.

**వివరణ** :- ప్రకృతి పరమాత్మయొక్క వెలుగు. ఆయన వెలుగుగా ప్రపంచమునందు వ్యక్తమగుచున్నాడు. ఇట్లు వెలుగుట లేక ప్రకాశించుట వలననే ఆయన జీవులుగా, లోకములుగా తెలియబడుచున్నాడు. వెలుగున్నచో నీడ యుండునుకదా! కనుక తాను, యితరులు అను రెండు స్థితులు తనంతట తానే సృష్టించు కొనుచున్నాడు. ఇదియే మాయ. దీని వలననే లోకములు, జీవులు, గ్రహములు, మరియు భౌతిక ప్రపంచము ఏర్పడుచున్నవి. కనుక పరమాత్మయే ఇట్టి ఆవరణలన్నిటికి కారణమై యున్నాడు. ఇవియన్నియు తన వెలుగు చేతనే యేర్పడుచున్నవి. కనుక పరమాత్మయే భ్రాజిష్ణుడు.

2. పంచభూతములు జీవుల శరీర నిర్మాణమునకు ఆవశ్యకములు. ఇవి వృక్షములయందును జంతువులయందును కణములుగా నేర్పడి యున్నవి. వృక్షములను ఆహారముగా స్వీకరించుట చేత అవి జంతువుల శరీరములందు ప్రవేశించి, వాని శరీర భాగములగుచున్నవి. ఈ జంతువులను, వృక్షములను, ఆహారములుగా స్వీకరించుట చేత, మానవునియందు మరల ఇవియే శరీర భాగములగుచున్నవి. ఇట్లు పరమాత్మ కోట్లాది జీవులకు, ప్రాణులకు ఆహారము కల్గించుచున్నాడు. మరియు పంచభూతముల ద్వారా తానే ఆహారముగ నేర్పడుచున్నాడు. కనుక పరమాత్మయే మనకు భోజనము.

3. అట్లు ఆహారమును సకలజీవుల ద్వారా తానే తినుచున్నాడు కదా.

ఈ తినుటయను ప్రవృత్తి జీవులయందు భగవంతుడు కల్పించుచున్నాడు. కనుక ఆయనయే భుజించువాడు లేక భోక్తయగుచున్నాడు. దీనిని గూర్చియే భగవద్గీతలో శ్రీకృష్ణుడు ''అహం వైశ్వానరో భోక్త్వా ప్రాణినాం దేహమాశ్రితః'' అని చెప్పెను. శరీరమునందలి వైశ్వానరాగ్నియను పేరుతో జీవులకాకలి పుట్టించి, ఆహారము స్వీకరించి, దాని వలన జీవులకు శక్తి కలిగించుచున్నాడు.

4. భూమి జీవులను సహించుచున్నది. ఈ సహనమే భూకేంద్రముగా పని చేయుచున్నది. అట్లే గ్రహములన్నింటిని సూర్యుడు సహించుచున్నాడు. ఆ సహనమే సూర్యుని యందు కేంద్రముగా పని చేయుచున్నది. అట్లే ఈ సృష్టి యంతటికిని కేంద్రముగా సోముడను దేవత పని చేయుచున్నాడు. ఆయనయే జీవుల హృదయములయందు శ్వాసకు కేంద్రముగా కూడ పని చేయుచున్నాడు. ఈ శ్వాస కేంద్రమే జీవులకు ఆధారమగుచున్నది. దీనిని 'హంస' అందురు. జీవులు శ్వాస లోపలికి తీసుకొనునపుడు ''సో'' అను శబ్దము మంత్రముగా పని చేయుచున్నది. అట్లే బయటకు వదులునపుడు ''హం'' అను శబ్దము మంత్రముగా పని చేయుచున్నది. ఈ రెండు మంత్రములను కలుపగా ''సోహం'' అగును. కాని పరమాత్మ సృష్టిని శ్వాసగా బయటకు వదిలి మరల శ్వాసగా తనలోనికి లయము చేసుకొనుచున్నాడు. కనుక భగవంతునినుండి ఇది మొదట ''హంసః'' అను మంత్రముగా దిగి వచ్చినది. జీవులు దానినే ''సోహం'' అను మంత్రముగా తమ శ్వాసయందు నిరంతరము తమకు తెలియకుండగనే ఉపాసన చేయుచున్నారు. ఈ ''సోహం'' శబ్దము నందలి 'స' కార 'హ' కారములనుండి సహ అను శబ్దము వచ్చును. కనుక జీవులను, సమస్త లోకములను శ్వాసగా సహించుచున్నవాడు గనుక పరమాత్మ సహిష్ణువగుచున్నాడు.

5. సృష్టి ప్రారంభమునకు ముందు పరమాత్మ యొక్కడే యుండెను. తరువాత వరుసగా మూడు, నాలుగు, ఏడు, పన్నెండు అను సంఖ్యలు వెలుగులుగా పుట్టెను. అందు మొదటి మూడు వెలుగులే బ్రహ్మ, విష్ణువు, శివుడు. అట్లే మరల అవియే నాలుగు వెలుగులయ్యెను. వారే కుమార సర్గము. ఈ నలుగురు బ్రహ్మకి మానస పుత్రులు వీరే సనకుడు, సనందనుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడను వారు. వీరు మానస పుత్రులు గనుక

శరీరములుండవు. జీవులలో దయ, ప్రేమ మున్నగు సద్గుణముల రూపమును మనస్సులందు వ్యాపించియుందురు. అట్లే మొదటి మూడును, ఈ నాలుగును కలిసి ఏడు వెలుగులైనవి. ఈ ఏడుగురు సప్తఋషులు. వీరు సప్త ఋషి మండలముగానే గాక, ఏడు గ్రహములుగా, ఏడు కిరణములుగా కూడ, దిగి వచ్చెదరు. అట్లే యీ నాలుగు వెలుగులు, ఒక్కొక్కటి మూడు చొప్పున, పన్నెండు వెలుగులయ్యెను. వారే ద్వాదశాదిత్యులు. అనగా పన్నెండు మంది సూర్యులు. యీ పన్నెండు మంది, సంవత్సర చక్రమునందలి పన్నెండు నెలలకు అధిపతులగుచున్నారు. అనగా సూర్యుడు ఒక్కొక్క రాశిలో నున్నపుడు జీవులలో కొన్ని కొన్ని స్వభావములను కల్గించును. అట్లు పన్నెండు రాశులలో ఒకే సూర్యుడు పన్నెండు విధములుగా ప్రవర్తించుచున్నాడు. ఇట్టి సూర్యుని ఒక్కొక్క ప్రవృత్తి ఒక్కొక్క పేరుతో పిలువబడుచున్నది. మరల ఈ సూర్యుడే సౌర మండలమునకు మొదటి వాడగుచున్నాడు.

6. పరమాత్మ పరిశుద్ధమయిన ఆత్మతత్వము కలవాడు. ఆయన నిర్మలుడు. ఆయన నుండి సకల సృష్టి దిగివచ్చినను, ఆయన నిర్మలుడే. ఏ వస్తువైనను ఆయనను చేరిన వెంటనే, ఆయనలో భాగమై పోవును గాని ఆయనను మలిన పరచలేదు. ఆయన యొక్క భౌతిక రూపమే అగ్ని. అగ్నిలో ఏ వస్తువు వేసినను అది అగ్నియందే లయమయి పోవును గాని మలిన పరచలేదు. కనుకనే జీవులు భగవంతుని తమ హృదములందు స్మరించుట ద్వారా, తమ పాప బుద్ధులను దగ్ధము చేసుకొనుచున్నారు. కనుక భగవంతుడు అనఘుడు లేక పాపము లేనివాడు.

7. భగవంతుడే విజయుడు. ఎందుచేతననగా ఆయనను ధ్యానము చేయువానికి, సృష్టి ప్రణాళిక, అందలి రహస్యములు బోధపడును. అట్టివానికి అపజయమనునది లేదు. వానికి జీవితమంతయు విజయమే. నిజమునకు పరమాత్మ సాన్నిధ్యమే విజయము.

8. జయించుట అనునది రజో గుణమునకు సంబంధించినది. అది సృష్టియందు ప్రభుత్వము, నిర్వహణ మరియు నాయకత్వము అను లక్షణములుగా వ్యక్తమగును. కనుకనే ఈ లక్షణములు కలవానిని రాజులనిరి.

ఈ రాజసిక లక్షణము ప్రజలలో, ధర్మమును స్థాపించి రక్షించుటకై పుట్టినది. కనుకనే పరమాత్మ శ్రీరాముడిగానవతరించినపుడు. నిజమైన రాజధర్మమును చూపించెను. దుష్టులను జయించి నియమించుట గూడ భగవంతుని లక్షణమే యగుచున్నది.

9. ఈ విశ్వమునందు తారలు, గ్రహములు, అందు జీవులు మొదలగునవనేకములు పుట్టుచూ విశ్వములోనికి లయమగుచున్నవి. కాని ఈ విశ్వము నేనుగానున్న పరమాత్మ నుండి పుట్టుచున్నది. కాని పరమాత్మ పుట్టుక లేనివాడు. ఆయననుండి సకల ప్రపంచము, లోకములు మున్నగునవనేకములు ఒక దానినుండి మరియొకటి పుట్టుచున్నవి. మొట్టమొదట నారాయణుని నుండి, బ్రహ్మ సృష్టికర్తగా పుట్టెను. ఆయన నుండి లోకములన్నియు ఒకదాని తరువాతనొకటి పుట్టినవి. అవియే వరుసగా బ్రహ్మ పుట్టిన సత్యలోకము. దాని నండి తపోలోకము, దాని నుండి జనలోకము. తరువాత మహర్లోకము, సువర్లోకము, భువర్లోకము చిట్టచివర భూలోకము పుట్టును. మరల యివన్నియు అదే వరుసలో క్రిందనుండి పైలోకముల లోనికి వరుసగా లీనమై చిట్టచివరకు నారాయణుని యందు లీనమగును. ఇట్లు సకలలోకముల పుట్టుకకు కారణమైన వాడు గనుక విశ్వయోనిగా పిలువబడుచున్నాడు.

10. వసువనగా సంపద. పునర్వసువనగా అనుక్షణము సంపదలను కల్గించుచుండువాడు. భగవంతుని కరుణ వలన సంపదలు కలుగును. దీనిని నమ్మినవారికి దారిద్ర్యమనునది లేదు. అట్లు కాక కేవలము ధనమును, భౌతిక వస్తువులను సంపదలుగా నమ్మినవారికి నిరంతరము దరిద్రము వెన్నాడుచుండును. తనకున్న ఆస్తిపాస్తుల గురించి ధనమును గురించి లావాదేవీలను గురించి బెంగ, భీతి, నిరంతరము మనస్సును కలతబెట్టుచుండును. అనగా నిజమైన సంపదయగు సంతోషము, నిర్భీతి వానికి లభింపవు. మనస్సును, లౌకికమగు తెలివితేటలను, నమ్ముకున్న వానికి ఆందోళన, ఆవేదన, దుఃఖము మిగులును. ఈ రహస్యము తెలిసినవాడు, తన విశ్వాసమును భగవంతుని యందుంచి, భౌతిక సంపదలకు వాటి ప్రయోజనము ననుసరించి మాత్రమే విలువనిచ్చుచున్నాడు. కనుక లేనిదాని గురించి దుఃఖపడుట గాని, ఉన్న దానిని సద్వినియోగము చేయక దాచియుంచుట కాని చేయడు. అట్టి వారికి

ఆతని సత్కర్మల ననుసరించి భగవంతుడే ధనము మున్నగు సాధన సంపత్తులు సమకూర్చి పెట్టును.

17. శ్లో॥ ఉపేంద్రో వామనః ప్రాంశు రమోఘశ్శుచి రూర్జితః
అతీంద్ర స్సంగ్రహస్సర్గో ధృతాత్మా నియమో యమః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఉపేంద్రః = ఇంద్రునికి తమ్ముడైనవాడు, 2. వామనః = పొట్టివాడు, 3. ప్రాంశుః = పొడవైనవాడు, 4. అమోఘః= వ్యర్థము కాని వాడు, 5. శుచిః = నిర్మలమైనవాడు, 6. ఊర్జితః = బలవంతుడైనవాడు, 7. అతీంద్రః = ఇంద్రుని మించినవాడు, 8. సంగ్రహః=గ్రహించుటయందు చక్కని సామర్థ్యము కలవాడు, 9. సర్గః = సృష్టి చేయువాడు, 10. ధృతాత్మా = ఆత్మను ధరించినవాడు, 11. నియమః = నియమింపబడినవాడు, 12. యమః = క్రమశిక్షణ గలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను ఇంద్రుని సోదరునిగను, పొట్టి వానిగను, ఉన్నతునిగను, ఇంద్రుని అతిక్రమించినవానిగను, చక్కని గ్రహణము గలవానిగను, సృష్టియందలి జీవుని ధరించినవానిగను, నియమము మరియు యమము అనునవి తానేయైన వానిగను, ధ్యానము చేయవలయును.

**వివరణ** :- 1,2,3. భగవంతుడు అదితికి కుమారుడై పుట్టెను. అదితి పెద్దకుమారుడు ఇంద్రుడు. రెండవ కుమారుడు వామనుడు. బలి చక్రవర్తి విశ్వజిద్యాగ మొనర్చి ముల్లోకములు జయించి, ఇంద్రుని ఓడించెను. అప్పుడు ఇంద్రుని తల్లియగు అదితి, విష్ణువును గూర్చి తపస్సు చేసి, ఆయనను తన కుమారునిగా పొందెను. వామనుడు పుట్టిన తరవాత బ్రహ్మచారియై బలిని మూడడుగుల నేల దానముగా యాచించెను. బలి అంగీకరించగా, వామనుడు త్రివిక్రముడై, ఒక పాదముతో భూమిని మరియొక పాదముతో ఆకాశమును ఆక్రమించెను. మూడవ పాదము నెచ్చట నుంచవలెనని బలిని యడుగగా, అతడు తన శిరస్సుపై నుంచమని చెప్పెను. అప్పుడు వామనుడు తన మూడవ పాదమును, బలి శిరస్సుపై నుంచి, అతనిని పాతాళమునకు త్రొక్కివైచెను. తరువాత, ఇంద్రునికి అతని సింహాసనము తిరిగి యిచ్చెను. బలి చక్రవర్తి చేసినది విశ్వజిద్యాగము - అనగా సమస్తమును దానము చేయుటవలన,

వాటియందు తనకు గల కోరికను జయించుట. విష్ణువు అక్రమించినది భౌతికలోకము, ఆకాశము లేక శక్తిమయ లోకము, మూడవది జీవప్రజ్ఞ. అనగా ఈ మూడిటియందును విష్ణువే వ్యాపించెను. బలిచక్రవర్తి తాను చేసిన సర్వసమర్పణమను యజ్ఞమునకు సమస్తమును విష్ణువుగా దర్శించు ఫలితము లభించినది. ఇంద్రుని సింహాసనమును తిరిగి యిచ్చి వేసెననగా, భౌతిక సంపదలపై ఆసక్తి నశించెనని యర్థము. పాతాళమునకు అణగద్రొక్కబడుట యనగా, అణువులయందున్న అంతర్యామి ప్రజ్ఞ యందు తాను లీనమగుట. అనగా ప్రతి అణువునందును విష్ణువును దర్శించుట. మన శరీరమునందు వెన్నెముక చివరగల మూలాధారమను ప్రజ్ఞయే బలిచక్రవర్తి యుండుచోటు. ఇదియే పాతాళము అని చెప్పుదురు. మానవ దేహమందలి అణువులు, కణములు కట్టుకొనుటకు ఈ మూలాధారమునందలి ప్రజ్ఞయే పని చేయును. వామనుడనగా పొట్టి వాడని అర్థము. అనగా అణువులందు, కణములయందు ఇమిడియున్న అంతర్యామి ప్రజ్ఞ. ఈ అణువులను, కణములను తన దేహముగా పొరపడుచున్న జీవ ప్రజ్ఞయే బలిచక్రవర్తి. అతడు వామనుని (పొట్టివానిని) చూచెననగా అణువు లందున్న అంతర్యామిని చూచుట. కనుక భగవంతుడే ఉన్నతుడు.

4. ఈ ప్రపంచమునందలి సకలకర్మలకును పరమార్థము మోక్షమే. అట్టి మోక్షము నుద్దేశించియే జీవితమునందలి సంఘటనలు ఏర్పడుచుండును, ఇందు ఏ ఒక్కటియు అనావశ్యకము గాని వ్యర్థముగాని కాదు. అవి యన్నియు జీవుని మోక్షస్థితికి కొనిపోవుట కుద్దేశింపబడినవే.

5. శుభ్రత, అపరిశుభ్రత అను రెండును భగవంతుని నుండి దిగి వచ్చిన రెండు స్థితులు. అపరిశుభ్రత యనునది మనస్సు, ఇంద్రియములు మరియు భౌతిక లోకములకు సంబంధించినది. నారాయణుడు వీటికి అతీతుడు, మరియు అవియన్నియు తానేయైనవాడు. కనుక అతడు పవిత్రుడు.

6. జీవులందరి యందును మనస్సుకు బలమిచ్చునది ఆశ. అట్లే ప్రాణశక్తికి బలమిచ్చునది స్వస్థత. శరీరమునకు బలము, ఆహారము కణములయందు దహనము చెందుట ద్వారా లభించును. ఇట్లు అన్నిటి యందును, శక్తిని పొంది వృద్ధి చెందుచున్నవాడు పరమాత్మయే.

7. ఇంద్రుడు దేవతలకును దేవలోకమునకును అధిపతి. ఇవి యన్నియు సృష్టిలోని భాగములే. పరమాత్మ అంతర్యామి గనుక ఈ లోకము లన్నిటియందును తానేయుండి వాటికతీతముగా గూడ తానేయున్నాడు. కనుక పరమాత్మ ఇంద్రునికన్నా అతీతముగా నున్నాడు.

8. చక్కగా గ్రహించుటయను సంస్కారము ప్రతి జీవియందును గలదు. మంచి విషయములను గ్రహించుట, అనవసర విషయములను వదిలివేయుట అనునవి జన్మలు గడుచుచున్నకొలది జీవియందు ప్రస్ఫుటమగును. ఇట్టి ఈ సంస్కారము జీవుని క్రమేణా మోక్షమునకు నడిపించును. ఇట్టి ఈ సంస్కారము జీవియందు పరమాత్మ అనుగ్రహముచే నేర్పడుచున్నది. కనుక పరమాత్మయే అట్టి గ్రహించు శక్తిగా, జీవుల మనస్సుల యందు పనిచేయుచున్నాడు.

9. ఈ సృష్టి యజ్ఞస్వరూపము. భగవంతుని నుండి యజ్ఞముగా దిగివచ్చిన ఈ సృష్టి, మరల పరమాత్మయందు లీనమగుచున్నది. ఈ యజ్ఞము నిర్వర్తించుచున్న సృష్టికర్తయగు బ్రహ్మగా, నారాయణుడే సృష్టి చేయుచున్నాడు. ఈ మొత్తము సృష్టియజ్ఞము తానేయైనవాడు, భగవంతుడు లేక నారాయణుడు.

10. శరీరము, ప్రాణము, ఇంద్రియములు, మనస్సు మున్నగునవన్నియు జీవుని తమయందు ధరించుచున్నవి. ఇట్టి ధారణము వాటి యందున్న భగవంతుని వలన కలుగుచున్నది. కనుక పరమాత్మయే ఆత్మను ధరించుచున్నాడు.

11. మానవుడు ప్రాథమిక దశలో నియమము, క్రమశిక్షణ లేనివాడు. అతడు తరువాత జన్మలు గడచుకొలది, క్రమశిక్షణ పొందుటకు ప్రయత్నించును. క్రమేణా కొన్ని జన్మల తరువాత, పూర్తిగా క్రమశిక్షణను పొందగలుగును. అట్లు క్రమశిక్షణ పొందగలుగుట, భగవంతుని కరుణవలననే సాధ్యమగును. కనుక నారాయణుడే నియమమును జీవులకు కల్పించుచున్నాడు.

12. మానవులయందు ఇంద్రియ ప్రజ్ఞలు, అనేకములుగా పని చేయును. అవి వానికి లోబడియుండక, తమ చిత్తము వచ్చినట్లు జీవుని నడిపించును. కొంత కాలమగుసరికి, మానవుడు ఇంద్రియములను మచ్చిక చేసుకుని, వానియందు స్వామిత్వము సాధించును. ఇది యెట్లు సాధ్యమగుననగా ఇంద్రియములను సామాన్య విషయములనుండి మరియొక మంచి విషయము

పైకి మరల్చవలెను. ఒకచోట బీదలకు అన్నదానము జరుగుచున్నచో, నచ్చట పని చేయువారు చాలాసేపు వారికి భోజనము వడ్డించుటయందు నిమగ్నులై యుండుటవలన, తమ ఆకలిని మరిచిపోవుదురు. అంతే కాని, ఇంద్రియములను బలవంతముగా నిగ్రహించుట సాధ్యము కాదు. మంచిపని యందు లగ్నము చేసినచో ఇంద్రియములు జీవునికి మచ్చికయ్యై, క్రమేణా వానిపై స్వామిత్వము కలుగును. కనుక, ఇట్లు జీవులయందు ఇంద్రియములను నియమించువాడుగా పరమాత్మయే యున్నాడు.

18. శ్లో॥ వేద్యో వైద్య స్సదాయోగీ వీరహా మాధవో మధుః
అతీంద్రియో మహామాయో మహోత్సాహో మహాబలః ॥

**ప్రతిపదార్థము** :- 1. వేద్యః = తెలియబడవలసినవాడు, 2. వైద్యః = వైద్యుడు, 3. సదాయోగీ = నిరంతరము యోగిగానుండువాడు, 4. వీరహా = వీరులను సంహరించువాడు (యుద్ధమందు), 5. మాధవః = లక్ష్మికి పతియైనవాడు, 6. మధుః=తేనెవంటివాడు, 7. అతీంద్రియః= ఇంద్రియములకు గోచరము కానివాడు, మరియు ఇంద్రియములను దాటినవాడు, 8. మహామాయః = అన్నిమాయలకు అతీతమయిన మాయకలవాడు, లేక మాయలన్నిటికి కారణమైనవాడు, 9. మహోత్సాహః = గొప్ప ఉత్సాహము గలవాడు, 10. మహాబలః = గొప్ప బలముగలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను తెలియబడువానిగా, వైద్యునిగా, యోగిగా, వీరునిగా, మరియు వీరులను జయించువానిగా, లక్ష్మీదేవి భర్తగా, మధురమైన వానిగా, ఇంద్రియముల కతీతమైన వానిగా, మాయల కతీతమైన వానిగా, గొప్ప ఉత్సాహవంతునిగా, గొప్ప బలసంపన్నునిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. జీవునియందు తెలిసికొనుట అను ఒక చిత్రమయిన ప్రజ్ఞ పని చేయుచున్నది. సృష్టిలోనికి వ్యాపించుటయే దీని పరమార్థము. ఒక విషయము తెలుసుకొనినపుడు మనస్సు అప్రయత్నముగా అందుండును. అనగా ఆ తెలుసుకొనిన విషయమే తానుగా నుండును. ఇట్లు సృష్టియందలి ఒక్కొక్క విషయమును తెలుసుకొనుచున్న కొలది, వాటియందు మనస్సు వ్యాప్తి

చెందుచుండును. ఇట్లు క్రమేణా విస్తరించి, పరమాత్మలో ఐక్యమగును. కనుక జీవులయందు తెలుసుకొనుట అను ప్రజ్ఞను కల్పించి, పరమాత్మయే పని చేయుచున్నాడు.

2. పరమాత్మ, ప్రకృతియందలి వస్తువులన్నింటికి ఔషధగుణములను కల్పించుట ద్వారా, జీవులకు రోగనివారణను కల్పించుచున్నాడు. అంతేకాక ఈ ఔషధ లక్షణములను కనిపెట్టు తెలివి, మానవుని యందు పని చేయుచున్నది. అది నారాయణుడే. అంతేకాక మానవునికి కర్మ సంస్కారములు ఏర్పడుచున్నవి. ఇవి పనులు చేయుటవలన, మనస్సునందు కల్గుచున్నవి. అటువంటి మానవుని యందు ఇట్టి సంస్కారములను తొలగించుకొనుటకు యోగ సాధన కావలెను. అట్టి యోగసాధన కల్పించి, దాని వలన సంస్కారములు ఒక్కొక్కటి తొలగింపబడుచున్నవి. ఈ సంస్కారములు, మనస్సునందు జీవికి సుఖదుఃఖములకు కారణమగుచున్నవి. కర్మను మానరాదు. కాని దానియందు ఆసక్తి యుండరాదు. పనులయందు ఆసక్తియే సంస్కారములు లేక వాసనలు. ఈ సంస్కారములు పోవుటకు జీవికి సత్కర్మాచరణమే మార్గమగుచున్నది. అట్టి సత్కర్మను భగవదర్పితముగా చేయుటయే యోగసాధన. దానియందు ఆసక్తి కల్పించుటవలన జీవులకు కర్మ సంస్కారములు క్రమేణా నశించును. అట్లు కర్మసంస్కారములు నశించిన వారికి వ్యాధులు రావు. ప్రాచీనవైద్య శాస్త్రమయిన ఆయుర్వేదమునందును, నవీన వైద్యశాస్త్రమయిన హోమియోపతియందును, ఈ సిద్ధాంతమే ప్రతిపాదింపబడినది. కనుక జీవులకు అట్టి యోగవిద్యను ఇచ్చిన నారాయణుడు వైద్యుడగుచున్నాడు.

3. ఇట్లు యోగమార్గము పరమాత్మచే జీవులకు ప్రసాదింపబడినది. యోగమనగా కలియుట అని అర్థము. సమస్త సృష్టియందలి పరమాత్మతో ఏకముగా అంతర్యామిత్వము చెందుట యోగము. అనగా ప్రతి అణువు నందును తానే ఉన్నానని తెలియుట ! ఇట్లు యోగస్థితి పొందుటకు జీవునికి తన దేహకోశములన్నియు ఒకే సామ్యమునందు నిల్చుట కావలెను. దేహకోశములన్నియు సామ్యముచెంది, యోగి అయినవానికి తాను సాధించిన మార్గమును తోటివానికి ఉపదేశింపవలసిన బాధ్యత ఏర్పడుచున్నది. ఇట్లు

ప్రతి యోగికిని మరియొకడు శిష్యుడుగా ఏర్పడుటవలన, యోగము ఉపదేశింపబడుచున్నది. ఇట్లు యోగము గురువునుండి శిష్యునికి మరల వాని నుండి వాని శిష్యునికి, ప్రవహించుచునే యుండును. అట్టి యోగము పరమాత్మయే కనుక అతడు సదా యోగి.

4. వీరులయందు యుద్ధము చేయవలెనన్న కోరిక యుండును. రాజులకది సహజము. ఒకవేళ వీరిలో మంచివారికి అట్టి కోరిక లేకున్నను, దుష్టులకు ఉండును. దుష్టులైన రాజులు, మంచి వారిపై దండెత్తి యుద్ధము చేయుదురు. అట్టి దుష్టులను, మంచి వారిలోనున్న వీరత్వమే దమించి, నిగ్రహించుచున్నది. కనుక వీరత్వము భగవంతుని రూపములో నొకటి. అందుచేత, దుష్టులైన వీరులను జయించి నశింపచేయు లక్షణము నారాయణుడే.

5. లక్ష్మీదేవి శుభమునకు, వైభవమునకు చిహ్నము. సృష్టియందలి సకల జీవులకును, వస్తువులకును ఈమెయే వైభవము కల్గించుచున్నది. అట్టి వైభవము వాటి రూపములవలన కలుగుచున్నది. ఈ వస్తువులు, జీవులు, అంతర్యామి అయిన భగవంతునినుండి రూపములుగా వ్యక్తమయినవి కనుక ఈ రూపములకు పరమాత్మయే ఆధారము. అందుచేత నారాయణుడే, వస్తువులకు వాటి వైభవములకు కూడ ఆధారమగుచున్నాడు. కనుక ఆయన లక్ష్మీదేవికి భర్త లేక అధిపతి.

6. ప్రతివానికిని, జీవితమునందు సంతోషము కల్గించునది, మధురమైనది అగు అనుభవ విశేషముండును. ఇది ఒక్కొక్కరికి ఒక్కొక్క స్థితిలో నుండును. ఒకనికి ఆహారాదులయందు ఇది కలుగవచ్చును. మరియొకనికి భార్యాపిల్లలయందు ఈ మాధుర్యముండవచ్చును. వేరొకరికి గానము చేయుటయందు ఉండవచ్చును. యోగి అయినవానికి, ఇతరులకు ప్రేమతో సేవచేయుటయందు, ఈ మాధుర్యము లభ్యము కావచ్చును. ఇట్లు జీవుడు ఒక్కొక్క స్థితినిదాటి, చివరకు జీవులయందున్న అంతర్యామినే, ఈ అనుభూతిగా పొందుదురు. కనుక నారాయణుడే జీవులయందున్న మాధుర్యము.

7. ఇంద్రియములు, జీవితమునందలి అనుభూతిని మానవునికి కల్గించుటకై పుట్టినవి. అవి ప్రకృతి వలననే మానవునికి కల్గుచున్నవి. ప్రకృతి భగవంతుని వలన కల్గుచున్నది. అందుచేత ఇంద్రియములు భగవంతునికి లోబడి పని చేయును. ఈ ఇంద్రియములు జీవునికి సృష్టియందు సాధనములుగా పని చేయును. ఇది జీవికి భౌతిక జీవితమునందు అనుభవము సమకూర్చి పెట్టుచున్నవి. ఈ అనుభవముల పరమార్థము భగవంతుని ప్రతిఫలముగా పొందుటయే.

8. ప్రత్తి నుండి వస్త్రము నేయబడుచున్నది. కాని వస్త్రము నుపయోగించువానికి అందలి జిలుగులు, రంగులు కన్పించును కాని, దారము ప్రత్తి, విస్మరింపబడుచున్నవి. అనగా తెలిసినను, తాత్కాలికముగా వాటి యందలి ఆకర్షణ మనస్సును భ్రమపెట్టును. అట్లే జీవుల శరీరములు కూడా ఒకరికొకరికి భ్రాంతికి కారణములగుచున్నవి. ఇట్లు జీవులను భ్రమ గొలుపుట ద్వారా ప్రకృతి తన కర్తవ్యము నిర్వహించుచున్నది. ఈ భ్రమనే మహామాయ అందురు. సృష్టి తనలోని భాగమే అని తెలియుటకు బదులు, తాను సృష్టిలోని ఒక భాగముగా భ్రమపడుటవలన, జీవుడు తనకు కర్తవ్యములను కల్పించుకొని పని చేయుచున్నాడు. ఇట్టి మహామాయ పరమాత్మనుండియే కలుగుచున్నది.

9. ఉత్సాహము జీవులను పనులకు పురికొల్పును. ఈ ఉత్సాహము ఒక్కొక్కరికి ఒక్కొక్క పని యందు కల్గును. తనకేపనియందు ఉత్సాహముండునో దానియందు తన శక్తిని, సామర్థ్యమును ప్రవేశపెట్టి ఇతరులకు ఉపయోగించు విధానమున దానిని నిర్వహించినచో అదియే జీవునకు మోక్షకారణమగుచున్నది. ఇతరులను పనులలో నియోగించినపుడు కూడా వారి ఉత్సాహమును గమనించి, దానినిబట్టి పనులలో నియోగించవలెను కాని, ఆసక్తిలేని దానియందు నియోగించరాదు. దీనినే శ్రీకృష్ణుడు భగవద్గీతలో స్వధర్మానుష్ఠానమని చెప్పెను. ఇట్లు పరమాత్మ జీవులను వారి వారి కర్తవ్యములయందు పురికొల్పి ఉత్సాహముగా నుంచుచున్నాడు.

10. అట్లే జీవులకు పనులయందు సామర్థ్యము కల్గును. సాధారణముగా తనకున్న సామర్థ్యము, బలమునుబట్టి పనులయందు ఉత్సాహము కల్గును. కొంతమందికి భౌతికముగను, మరికొందరికి మనస్సునందును. ఇంకొందరికి బుద్ధియందును ఈ బలము పని చేయును. వారికున్న ఈ బలమే, వారి సామర్థ్యమును వారి ధర్మముగా నిర్ణయించును. సాధారణముగా జీవులకు పనులయందు ఉత్సాహము, తమకున్న బలముననుసరించియే కల్గును. అట్లుకాక ఉత్సాహము తనకు సామర్థ్యము లేని వానియందు కల్గినచో, అది తన మనస్సునకు గల భ్రాంతివలన కలుగుచున్నదనియు, అది తన ధర్మము కాదనియు తెలిసికొని, మనస్సు తాను చేయగలిగిన వానియందు మాత్రమే వినియోగించిన వానికి, పనులు చేయుట సులభమగును. ఇట్టి సామర్థ్యమే బలమని చెప్పబడినది. జీవులయందు గల ఈ మహాబలమే భగవంతుడు.

19. శ్లో॥ మహా బుద్ధిర్మహా వీర్యో మహాశక్తిర్మహాద్యుతిః
అనిర్దేశ్య వపుశ్శ్రీమానమేయాత్మా మహాద్రిధృత్ ॥

**ప్రతిపదార్థము** : 1. మహాబుద్ధిః = గొప్పబుద్ధి కలవాడు, 2. మహా వీర్యః = గొప్ప పరాక్రమము కలవాడు, 3. మహాశక్తిః = గొప్ప సామర్థ్యము కలవాడు, 4. మహాద్యుతిః = గొప్ప ప్రకాశము కలవాడు, 5. అనిర్దేశ్యవపుః = పరిమాణమున కతీతమైనవాడు, 6. శ్రీమాన్ = లక్ష్మీ దేవితో కూడిన వాడు, 7. అమేయాత్మా = కొలతలకు మించిన వాడు, 8. మహాద్రిధృత్ = గొప్ప పర్వతమును పైకెత్తినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, బుద్ధికి ఆధారమైన వానిగా, వీర్యవంతునిగా, శక్తిమంతునిగా, మహాప్రకాశముగా, ఊహకందని పరిమాణముగలవానిగా లేక పరిమాణము లేనివానిగా, లక్ష్మీదేవికి భర్తగా, కొలతలకు లేక మానముల కందనివానిగా, మహాపర్వతమును పైకెత్తినవానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. జీవులయందలి మనస్సు, ఇంద్రియములు, ప్రాణశక్తి, శరీరము మున్నగువానికన్నింటికి, బుద్ధి ఆధిపత్యము వహించును. అట్లే ఈ సృష్టి అంతయు, మహా సంకల్పము లేక మహా బుద్ధిపై ఆధారపడి పనిచేయుచున్నది. దానినే మహా చైతన్యమని అందురు. ఈ మహాబుద్ధినుండియే

జీవుల వ్యక్తి గత బుద్ధి ఆధారపడి పనిచేయుచున్నది. ఇదే మొత్తము చోటునందు గల, దేవతల ప్రజ్ఞగ పనిచేయుచున్నది. ఇట్లు పనిచేయుచున్న మహా చైతన్యము లేక మహాబుద్ధి నారాయణుని వలననే కలుగుచున్నది.

2. మానవుని యందలి శౌర్యము, పరాక్రమము, ధర్మ సంస్థాపనకు, ధర్మరక్షణకు ఉపయోగపడును. సమాజమునందు ధర్మము ప్రజాసంక్షేమము కలిగించును. ఈ ధర్మమువలననే రాజులు లేక ధీరులు, పౌరుషము కలిగి, తమపై ఆధారపడివారిని తను పరాక్రమముచే రక్షించుచున్నారు. కనుక జీవులయందలి ఈ పరాక్రమమే పరమాత్మ.

3. ఈ విశ్వమంతయు ఒక మహాశక్తిపై ఆధారపడి పని చేయుచున్నది. చోటునందలి ఈ మహాశక్తియే జీవులయందు వారి వారి శక్తులుగా పని చేయుచున్నది. దీనినే ప్రకృతి యందురు. ఈ ప్రకృతి ద్రవ్యము, శక్తి, ప్రజ్ఞ అను మూడుగా పని చేయుచున్నది. ఈ మూడింటితో నేర్పడు త్రికోణము జీవునియందు పరమాత్మ అను వెలుగుపై ఆధారపడి పనిచేయుచున్నది. ప్రకృతి యందలి ఈ శక్తినే మహాశక్తి అందురు. ఈ మహాశక్తి పరమాత్మ యను వెలుగు వలన కలుగుచున్నది. కనుక అతడే మహాశక్తి అని పిలువబడుచున్నాడు.

4. జీవులయందు ప్రకాశించుచున్న ''నేనను'' వెలుగే పరమాత్మ. ఈ వెలుగే మనస్సుగా, ఇంద్రియములుగా, దేహ ధర్మములుగా పని చేయుచున్నది. మరియు ఈ వెలుగే మూడు లోకములయందు ద్రవ్యమయము, శక్తిమయము, ప్రజ్ఞామయము అను మూడు శక్తులుగా పనిచేయుచున్నది. మూడు శక్తులుగా నేర్పడిన త్రికోణము జీవునియందు నేనను అంతర్యామి యొక్క మహాతేజస్సు వలన పని చేయుచున్నది. కనుక పరమాత్మయే అట్టి మహాతేజస్సు.

5. పరమాత్మ యొక్క తేజస్సు వలననే మూడు లోకములు వెలుగు చున్నవి. అందలి జీవుల వేరు వేరు రూపములన్నియు పరమాత్మ యొక్క శరీరము నందలి భాగములే. ఆయన తేజస్సే తన శరీరముగా గలవాడు. తేజస్సునకు పరిమాణము ఎట్లుండును? సృష్టియందున్న సకల జీవులును, గ్రహ గోళాదులును ఆయనయందు భాగములుగా ఇమిడి పోవుచున్నారు. కనుక ఆయన పరిమాణము ఊహలకందనిది.

6. శ్రీయనగా లక్ష్మి. సృష్టియందలి సంపదలన్నియు ఆమె వలననే కలుగుచున్నవి. రూపము, సౌందర్యము, నామము మొదలైన వన్నియు ఈమె వలన కల్గినవే. ఈమె సర్వాంతర్యామి అయిన పరమాత్మ వలన పుట్టుచున్నది. కనుక ఈ సంపదలన్నింటికి నిజమైన అధిపతి నారాయణుడు. ఆయన సమస్త సృష్టికిని సాక్షిగా నుండగా, ఆమె జీవులకు రూపములతో పాటు సంపదలను కల్గించుచున్నది.

7. జీవాత్మ, పరమాత్మ అను అగ్ని నుండి పుట్టిన నిప్పురవ్వ. జీవులందరును ఈ మహాగ్ని నుండి పుట్టుచున్న రవ్వలే. ఈ అగ్నియే పరమాత్మ లేక మహాత్మ. అట్టి మహాత్మ కొలతలకు అందనిది. జీవాత్మకు నేను, నావారు అను పరిధి యుండును. ఈ పరిధులన్నియు, పరమాత్మ యను వెలుగు నందు, ఎవరికి వారుగా గీచుకున్న ఆవరణలే. ఇవి యన్నియు పరమాత్మ యందు కలిసిపోగా, ఆ ఆవరణలు కూడా ఆ మహావెలుగునందు కలిసిపోయి, వాటి ప్రత్యేకతను కోల్పోవుచున్నవి. రాత్రిపూట ఎవరి దీపములు వారు వెలిగించుకున్నను, సూర్యోదయము వెనుక ఈ దీపముల వెలుగులన్నియు సూర్యుని మహా తేజస్సునందు వాటి వాటి వెలుగులను కోల్పోవుచున్నవి కదా!

8. సృష్టి ప్రారంభమునందు పరమాత్మ అను మహా వెలుగునుండి సత్యము, అసత్యము అను రెండు శక్తులు పుట్టినవి. అందొకటి వెలుగుగా రెండవది చీకటిగా విడిపోయినవి. అట్టి రెండుగా విడిపోయిన వెలుగునుండి, జీవులకు మేలు కలిగించునట్టి, సృష్టిని పెంపొందించునట్టి, అనేక శక్తులు పుట్టినవి. ఆ శక్తులే సురలు లేక దేవతలు. అట్లే సృష్టిని నశింపజేయునట్టి లేక జీవులకు హాని కల్గించునట్టి శక్తులు చీకటి నుండి పుట్టినవి. ఆ శక్తులే అసురులు లేక రాక్షసులు. సృష్టి ప్రారంభమున ఈ సుర, అసుర శక్తులు చోటును మథనము చేయగా, దాని వలన చోటులో ఒక పెద్దసుడి ఏర్పడినది. ఆ సుడియందు గోళములు కట్టుకున్నవి. కట్టుకుని భౌతికముగా వ్యక్తమయినవి. అనగా ఆ మొదటి సుడి వలన చోటులో అనేక చిన్న చిన్న సుడులుగా ఏర్పడి, ఈ భౌతిక రూపములు కట్టుకున్నవి. అట్లు భౌతిక రూపములు కట్టుకొన్నను, అవి ఆ సుడివలననే నిలిచియున్నవి. ఇట్లు మహా సుడి చోటులో ఏర్పడినపుడు, పరమాత్మ దానిని తన వీపుపై ధరించి, ఆ సుడి చెదరిపోకుండా

కాపాడెను. భగవంతుడు తాబేలు రూపమున ఇట్లు చేసెను. తాబేలు వీపు అర్ధ చంద్రాకారముగా గట్టిగా ఉండును. అనగా అట్లేర్పడిన సుడియందు భౌతిక రూపముగా అణువులు ఏర్పడి, గోళాకారముగా వాటిని గట్టిపరచెనని భావము. అట్లే శ్రీ కృష్ణావతారమున శ్రీకృష్ణుడు గోవర్థన పర్వతమును తన చిటికెన వ్రేలుపై పైకెత్తి నిలబెట్టెను. ఇంద్రునికి గోపాలురపై కోపము వచ్చుటచే వారము దినములు సూర్యుని కనిపించనీయక, ఎడతెగని వర్షము కురిపించెను. శ్రీకృష్ణుడు వారిని రక్షించుటకు గోవర్ధన పర్వతము పైకెత్తి దాని క్రింద గోపాలురను, పశుపక్ష్యాదులను ఇంద్రుని బారి నుండి రక్షించెను. కనుక పరమాత్మ గొప్ప పర్వతమును ధరించిన వాడగుచున్నాడు.

20. శ్లో॥ మహేష్వాసో మహీభర్తా శ్రీనివాసస్సతాం గతిః
అనిరుద్ధ స్సురానందో గోవిందో గోవిదాం పతిః ॥

**ప్రతిపదార్థము** :- 1. మహేష్వాసో = గొప్పది అయిన ధనుస్సు ధరించినవాడు, 2. మహీభర్తా = భూమికి భర్త లేక ఆధారము, 3. శ్రీనివాసః = లక్ష్మీదేవికి నివాసమయినవాడు, 4. సతాంగతిః = సత్పురుషులకు మార్గము, లక్ష్యము అయినవాడు, 5. అనిరుద్ధః = అడ్డగింప శక్యము కానివాడు, 6. సురానందః = దేవతల ఆనందమునకు కారకుడు, 7. గోవిందః = గోవులకు యజమాని అయినవాడు, 8. గోవిదాంపతిః = తేజస్సును లేక జ్ఞానము తెలిసినవారిని రక్షించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, శార్ఞమను విల్లును ధరించినవానిగా, భూమిని ధరించువానిగా, సృష్టివైభవమే తన నివాసముగా గలవానిగా, సత్పురుషుల మార్గము, గమ్యము తానే అయినవానిగా, అడ్డగింప వీలులేనివానిగా, దేవతలకు ఆనందము కల్గించువానిగా, గోవులకు యజమానిగా, జ్ఞానులకు రక్షకునిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. విష్ణువు యొక్క ఆయుధములలో ఒకటి శార్ఞ్గమను ధనుస్సు. అనగా చక్కని వంపులు తిరిగిన ధనుస్సు అని అర్థము. విష్ణువు దీనిని ధరించి సృష్టియందు చీకటిని కలిగించు అసురులను సంహరించి దేవతలను, ఋషులను, రక్షించెను. అనగా సూర్యాత్మకము, చంద్రాత్మకము అను రెండు వెలుగు

కిరణములు ఈ ధనుస్సు యొక్క రెండు వంపులుగా నేర్పడి దాని యందు ఎక్కుపెట్టబడి విడిచిన బాణముగా, సృష్టి వ్యక్తమయ్యెనని భావము. అంతేకాక ఈ శార్ఙమను ధనుస్సే మానవుని కనుబొమ్మల నడుమ '' ఓం'' కారముగా ధ్యానము చేయబడినది. రెండు కనుబొమ్మలు, రెండు వంపులుకాగా వాటిమధ్య వెలుగుచున్న జ్ఞానమను వెలుగే బాణముగా ఏర్పడుచున్నది. సంస్కృతమున '' ఓం'' అను అక్షరము, బాణము ఎక్కుపెట్టబడిన వింటిని పోలియుండును. ఇందు శ్వాస లోనికి తీసుకొనుటయే వింతినారిని సూచించును. విడువబడిన బాణమే వ్యక్తమయిన సృష్టి. శ్వాసయందున్న ఓంకారమును ధ్యానము చేయువానికి భౌతిక సృష్టి పరమాత్మగా దర్శనమిచ్చును. అంతేకాక కుడి కనుబొమ్మ యందున్న సూర్యాత్మకమయిన వెలుగు ఒక వంపుగను, ఎడమ కనుబొమ్మ యందున్న చంద్రాత్మకమయిన వెలుగు మరియొక వంపుగను ఈ విల్లు ఏర్పడుచున్నది. జీవుని యందు గల జీవప్రజ్ఞ సూర్యునినుండి దిగివచ్చినది. దాని చుట్టును భౌతిక శరీరము, మనస్సు, ఇంద్రియములు మున్నగునవి చంద్రకిరణముల వలన ఏర్పడుచున్నవి. ఈ రెండింటి యందు గల అంతర్యామిని దర్శించిన వానికి, వాటి ప్రత్యేకతలు నశించి పరమాత్మయందు నిలుచునట్టి స్థితి లభించును. జీవియందు కలుగునట్టి ఇట్టి జ్ఞానమునే సుషుమ్న అందురు. ఈ సుషుమ్న కనుబొమ్మల నడుమ పుట్టుచున్నది. అనగా వింటియందు సంధింపబడిన బాణమే ఈ సుషుమ్ననాడి. ఇట్టి విల్లును జీవియందు ధరించినవాడు పరమాత్మ కనుక, అతను శార్ఙ ధనువు అని కీర్తింపబడినాడు.

2. భూమి అసంఖ్యాకమైన అణువుల సముదాయము, కాని అందలి చిత్రమేమనగా, ఈ అణువులన్నియు విడిపోకుండా ఒక్కటిగా పట్టియుంచు మహాశక్తి ఒకటి చోటులో పని చేయుచున్నది. అది మన భూమియందు అయస్కాంత క్షేత్రముగా ఏర్పడుచున్నది. భూమియందు ఏర్పడిన ఈ అయస్కాంత క్షేత్రము వలననే, అణువులు పట్టి యుంచబడుచున్నవి. ఈ అణువులే కొంతకాలము తర్వాత జీవకణములుగా ఏర్పడి, వానినుండి క్రమేణా వృక్షజాతులు, పశుజాతులు, మానవులుగా వచ్చుచున్నవి. అణువునందలి ప్రజ్ఞ మానవునిగా వచ్చుసరికి వ్యక్తిగత ప్రజ్ఞ ఏర్పడి, వేర్వేరు స్వభావములు ఏర్పడుచున్నవి. అవియే పరిపూర్ణ మానవుని యందలి పరమాత్మగా రూపాంతరము

చెందుచున్నవి. ఇట్టి అణువులన్నిటిని భూమి యందలి మహాశక్తిగా పరమాత్మయే భరించుచున్నాడు.

3. సృష్టియందలి సమస్తమును పరమాత్మనుండియే పుట్టుచున్నది. ఆయనవలననే సృష్టి రక్షింపబడుచున్నది. ఆయన, సృష్టిలోపల, వెలుపల కూడ నుండువాడు. ఈ సృష్టి, పరమాత్మ సంకల్పముగా బయలుదేరి వచ్చినది. కనుక సృష్టి లేక ప్రకృతికి, పరమాత్మ హృదయమే పుట్టుక స్థానము. హృదయము ప్రేమకు సంకేతము. కనుక పరమాత్మ యొక్క ప్రేమయే ప్రకృతిగా పుట్టుచున్నది. దీనిచేతనే విష్ణువు యొక్క హృదయము లక్ష్మికి నివాసస్థానముగా చెప్పబడినది. అట్టి లక్ష్మిని తన హృదయమందు ధరించుచున్నవాడు కనుక ఆయన శ్రీనివాసుడు.

4. సత్పురుషుల యందున్న సద్గుణ సంపత్తియే వారిని ముందుకు నడుపుచుండును. అనుగ్రహింపబడిన శిష్యులయందును, దీక్షగలవారి యందును, సత్కర్మయందలి అభిలాషగా, ఇదియే పని చేయుచున్నది. ఈ అభిలాషయే జీవుని క్రమేణా ముక్త స్థితికి కొనిపోవుచున్నది. ఇట్టి సత్కర్మయందలి కోరికవల్లనే, జీవులు తమయందు గల కామము, క్రోధము, మున్నగు వానితోకూడిన నీచ ప్రవృత్తిని జయించి, సర్వాంతర్యామి యందు ఐక్యమగుచున్నారు. అనగా వారియందలి జీవాత్మ అను వెలుగు, పరమాత్మ అను మహాతేజస్సుగా మారిపోవుచున్నదని అర్థము. ఇట్లు జీవులకు బాగుపడవలెనను సంకల్పము కల్గించి, తనయందు ఐక్యము చేసుకొనుచున్నాడు కనుక, పరమాత్మయే సత్పురుషుల మార్గముగా ఏర్పడుచున్నాడు.

5. ఈ లోకములన్నియు స్థూలముగా ఏడు పొరలుగా ఉండును. ఈ పొరలన్నియు ఒకదాని పైన మరియొకటి కాదు. ఒక దానియందు ఇంకొకటిగా యున్నది. ఆత్మ, బుద్ధి, మనస్సు, ఇంద్రియములు, ప్రాణము, భౌతిక శరీరము, అనునవి ఒకదానియందు ఇంకొకటి ఉన్నవి. మనస్సు ఉండుట, ఇంద్రియములకుగాని, భౌతిక దేహమునకుగాని లేక ఆత్మకుగాని, ఆటంకము కాదు. ఇట అన్నియు ఒకదానియందు ఒకటి ఇమిడి, చిట్టచివరకు పరమాత్మయందు ఇమిడి పోవుచున్నవి. కనుక పరమాత్మ నిరోధింపబడని వాడుగా నున్నాడు. అంతేగాక యిది భగవంతుని సృష్టి వ్యూహములలో నొకటి.

6. ఈ సృష్టి నిర్మాణమునకు, నిర్వహణకు దేవతలు పనిచేయుచున్నారు. వారు గ్రహగోళములు ఏర్పడుటకు, శరీరములు ఏర్పడుటకు, మొక్కలు మొలుచుటకు, వర్షమునకు, సూర్యరశ్మికి అధిపతులై సృష్టిని నిర్వహించుచున్నారు. వారు నిరంతరము ఇట్టి కార్యక్రమమున నిమగ్నులై యున్నను, తమ తమ కర్తవ్యముల యందలి సామ్యత అంతర్యామి వలననే కలుగుచున్నదనియు, తమయందలి పనులను దీక్షగా అంతర్యామియే చేయుచున్నాడనియు ఎరిగి, ఆయనయందు సమర్పణ బుద్ధికలిగి, ఆయన యందే మేల్కొని యున్నారు. వారికి నిరంతరము ఆనందమే. తమ యందు గల ఈ ఆనందమే పరమాత్మ యొక్క నిజస్థితి అని ఎరిగినవారై నారాయణుని ఆనందమయ స్థితియందు నిలిచి యున్నారు.

7. శ్రీకృష్ణుడు బృందావనము నందలి గోవులన్నింటికిని యజమానియై యున్నాడు. కనుక అతడు గోవిందుడు. గోవు అనగా కిరణములని కూడా అర్థమున్నది. సూర్యకిరణములనుండి దిగివచ్చిన ఏడు వర్ణములే ఏడు గ్రహములుగా కట్టుకొనుచున్నవి. కనుక సూర్యుని యందున్న పరమాత్మయే గోవిందుడు. అంతేకాక జీవునియందు నేను అను ప్రజ్ఞవలన మనస్సు, ఇంద్రియములు ఏర్పడుచున్నవి. ఇవి గోవులు. అట్లే శరీరమునందున్న వివిధ కేంద్రముల యందు గల గ్రంథులు, గోవులని వైద్య శాస్త్రమున చెప్పబడినది. అవి వాటి రసమను పాలను శరీరమునందు వర్షింప చేయుటచే, వివిధ అవయవములు పోషింపబడుచున్నవి. ఈ గోవులన్నియును జీవునియందున్న ''నేనను'' పరమాత్మ నుండి కలుగుచున్నవి కనుక అతడు గోవిందుడు.

8. గోవులను సేవించి, పోషించువారిని భగవంతుడు రక్షించును. గోవు పశు జాతులన్నింటిలోను ఉత్తమమైనది, మరియు పూజనీయమయినది. ఎందుచేతననగా తల్లిపాలు బిడ్డలకు మాత్రమే నిర్ణయింపబడుచున్నవి. గోవు అట్లుకాక తన పాలను తన బిడ్డలతోపాటు మానవులకు కూడా వినియోగించుకొననిచ్చుచున్నది. ఈ యొక్క లక్షణము చేతనే గోవు సమస్త మానవజాతికి మాతృస్థానమున నిలిచినది. అట్టి గోవును పూజించువాడు నారాయణుని అనుగ్రహమునకు పాత్రుడగుచున్నాడు. శ్రీకృష్ణుడు గోరక్షణము, వ్యవసాయము, యజ్ఞార్థ కర్మలుగా నిర్ణయించెను. ఆవులను పెంచి, పోషించి,

వాని పాలను సమాజమునందలి తోటివారి అవసరమునకై వినియోగించుట, అట్లే భూమిని దున్ని, పండించి, ఆ పంటను సమాజమునకు సమర్పించుటవలన, మానవుడు యజ్ఞము చేసిన వాడగుచున్నాడు. అనగా యజమాని అగుచున్నాడు. ఇట్లు ఈ కృషి, గోరక్షాదులను నిస్వార్థ బుద్ధితో గోవుల యందును, తోటి మానవులయందును నారాయణుని చూసి వాని సేవగా, నిర్వహించువానికి హృదయమునందు శ్రీకృష్ణుని సాన్నిధ్యము కల్గును. తన శ్వాసయందున్న ఓంకారమే వేణుగానమగును. దీనినే సామగానమందురు. అట్టి గానమునందు నిరంతరము మేల్కొనిన వాడు, సోమపానము చేయుచున్నాడని వర్ణింపబడినది. ఇట్టి యజ్ఞము చేసిన వాడు సోమయాజి అగుచున్నాడు. ఇట్టి యజ్ఞము తనయందు జరుగవలెనన్నచో ప్రతివాడును విధిగా ఆవును సేవించి తీరవలెను. అట్లు సేవించుటవలన వానియందు పశువులుగా చెప్పబడిన ఇంద్రియములు, మనస్సు మున్నగునవి అంతర్ముఖములై, తనయందున్న పరమాత్మను దర్శించును. అతడే తన గానమువలన, ఇంద్రియములను తన వైపునకు ఆకర్షించును. ఇట్లు గోవులను రక్షించి, పోషించువారికి పరమాత్మ అధిపతి యగుచున్నాడు.

21. శ్లో॥ మరీచిర్దమనో హంసస్సుపర్ణో భుజగోత్తమః
హిరణ్య నాభస్సుతపాః పద్మనాభః ప్రజాపతిః ॥

**ప్రతిపదార్థము** :- 1. మరీచిః = చీకటిని నశింప చేయు వెలుగు, 2. దమనః = దమించువాడు, 3. హంసః = హంసరూపుడు, 4. సుపర్ణః = గొప్పరెక్కలుగల పక్షి, గరుత్మంతుడు, 5. భుజగోత్తమః = సర్పము లందు శ్రేష్టుడు లేక అనంతుడు, 6. హిరణ్యనాభః = బంగారపు బొడ్డు గలవాడు, 7. సుతపాః = చక్కగా తపస్సు చేయువాడు లేక అట్టి తపస్సే తానైన వాడు, 8. పద్మనాభః = పద్మము నాభి యందుగలవాడు, 9. ప్రజాపతిః = జీవుల పుట్టుకకు కారణమైనవాడు.

**తాత్పర్యము** :- భగవంతుని, చీకటి నశింపచేయు వెల్గుగా, లేక మనస్సును చీకటికి వెలుగైన వానిగా, హంసగా లేక జీవుని శ్వాసయే తానైనవానిగా, సుపర్ణుడను గరుత్మంతునిగా, సకలలోకములను మోయుచున్న అనంతుడను మహా సర్పముగా, బంగారపు బొడ్డు గలవానిగా, సత్పురుషుల తపస్సు తన

రూపమైన వానిగా, బొడ్డు యందు పద్మముగల వానిగా, జీవుల పుట్టుకకు, రక్షణకు కారకుడైన వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. మరీచి యనగా చీకటిని చీల్చునది లేక వెలుగు అని అర్థము. సప్తమరుత్తులే ఏడుగురు ఋషులుగా వచ్చిరి. మరల అవియే సూర్యుని కిరణములేడుగా వచ్చినవి. సూర్యకిరణములయందలి ఏడు వర్ణములే ఏడు మరీచికలు. రంగులు, వర్ణ విశ్లేషణము అనువానికి, వీరు ఏడుగురు అధిదేవతలు.

2. ఇంద్రియములు, మనస్సు, ''నేను'' అను సూర్యుని నుండి భౌతికముగా వ్యక్తమగు ఏడు వర్ణముల వంటివి. ఇవియే పంచేంద్రియములు, మనస్సు, బుద్ధి. ఇవి తమ వివిధములగు ప్రవృత్తులనుండి పరమాత్మచే దమింపబడుచున్నవి. ఇట్లు దమించుట లేక నిగ్రహించుట అనునది, బలవంతముగా కాక, ఇంద్రియములను పరమాత్మ యందు, వాని లీలల యందును మరల్చవలెను. కేవలము పరమాత్మ యొక్క రూపమునందే కాక, జీవులుగను, వస్తువులుగా కూడా ఆయన వ్యక్తమగుచున్నాడని తెలిసి, వాటి నామ రూపాదులుగానే ధ్యానము చేయవలెను. కేవలము ధ్యానించుటయే కాక, భౌతికముగా అట్టి భావనలోనే జీవులను సేవించి తీరవలెను. అట్లు చేసినవానికి మాత్రమే అప్రయత్నముగా ఇంద్రియములు దమింపబడి, పరమాత్మయందు లగ్నమగును. ఇట్టి విధానమున జీవులను దమించుచున్నాడు. కనుక పరమాత్మ దమనుడుగా చెప్పబడియున్నాడు.

3. నారాయణుడు హంసుడని చెప్పబడినాడు. హంస నీటిని పాలను వేరు చేసి పాలను మాత్రమే గ్రహించును. అట్లే జీవుల యందుగల పరమాత్మయైన హంస, ప్రపంచమునందలి సత్కర్మలను, దుష్కర్మలను, వేరు చేసి, సత్కర్మలయందు మాత్రమే మనస్సు లగ్నమగునట్లు చేయును. ఈ హంస శ్వాస యందు పని చేయుచున్నది. శ్వాస యందు గల ''సోహం'' అను మంత్రమే ఈ హంస. ఇది ప్రాణాయామము, ప్రత్యాహారము, ధారణ మున్నగు వానివలన, జీవియందు మేల్కొనును. ఇట్లు ప్రాణాయామముద్వారా దీనిని ఉపాసింప దలచినవారు ప్రశాంతముగా కూర్చుండి మొదట శరీరమందలి

అవయవములన్నింటిని బిగువు లేకుండునట్లు ఆపాదమస్తకము సర్దుబాటు చేసుకొనవలెను. కనులు మూసుకుని శిరస్సు నుండి పాదముల వరకు ఒక్కొక్క అవయవమును మనస్సుతో వరుసగా స్పృశించుచు, వాటి యందు బిగువులు లేనట్లు సర్దుకొనవలెను. పిదప ఉచ్ఛ్వాస, నిశ్వాసలను, క్రమము చేసుకొనవలెను. అనగా శ్వాస లోనికి తీసుకొనుట, బయటకు వదలుట, ప్రశాంతముగా, అతి నెమ్మదిగా చేయవలెను. ఇట్లు మూడు నాలుగుసార్లు చేసిన తర్వాత మనస్సుతో శ్వాస ప్రక్రియను గమనించవలెను. ఛాతి, అందలి ఊపిరితిత్తులు సంకోచించుట, వ్యాకోచించుట, ప్రశాంతముగా గమనించుచుండ వలెను. అట్లు మూడు నాలుగు శ్వాసలు గమనించిన తర్వాత, శ్వాస లోనికి తీసుకొనునప్పుడు ప్రశాంతముగా మనస్సుతో ''సో'' అను అక్షరము సుదీర్ఘముగా, శ్వాస లోనికి తీసుకొనుచున్నంత సేపు ఉచ్చరించవలెను. అట్లే శ్వాస బయటకు వదలునప్పుడు ''హం'' అను అక్షరము పైకి వినిపించునట్లు ప్రశాంతముగా సుదీర్ఘముగా ఉచ్చరించవలెను. ఇట్లు కనీసము మూడు నాలుగు సార్లు చేయవలెను. ఇట్లు చేయునపుడు అతిగా చేయుటగాని, ఎక్కువసేపు శ్వాసను తీయుటగాని ఎక్కువసార్లు చేయుటగాని చేయరాదు. ఇట్లు చేయువారు తప్పనిసరిగా ప్రతిదినము భగవద్గీత లేక భాగవతము వంటి సద్గ్రంథములు చదివి, వివరణ చేసుకొనవలసి యుండును. అట్టి వారికి మాత్రమే ఈ మంత్రము శ్వాసయందు మేల్కొని అందలి హంసగా భగవంతుడు వ్యక్తమగుచున్నాడు. ప్రాణాయామము చేయవలసిన సరియైన పద్ధతి ఇదియే. పెద్దలు, మహర్షులు అంగీకరించిన విధానము ఇది మాత్రమే. శ్రీకృష్ణుడు భగవద్గీతయందు ''ప్రాణాపానౌ సమౌకృత్వా'' అని ప్రాణాయామమును ప్రతిపాదన చేసెను. ప్రాణమనగా ఉచ్ఛ్వాసము, అపానము అనగా నిశ్వాసము వీనిని ప్రశాంతముగా తీసికొని వదలుటనే శ్రీకృష్ణుడు సమమునందు కాక సామ్య స్థితియందు ఉంచుటగా చెప్పెను. అట్లే ఇంకొకచోట ''మనోహృది నిరుధ్యచ'' అని కూడ చెప్పెను. మనస్సు హృదయమునందు నిమగ్నము చేయవలెను. అట్లే నిమగ్నము చేయుట, పై ప్రక్రియవలననే సాధ్యపడును.

4. సుపర్ణుడు నారాయణుని తన వీపుపై మోయుచున్న పక్షిదేవత. సుపర్ణుని వీపుపైనున్న నారాయణుడు గోళాకారములోనుండి, అమృతత్వము

అనబడు స్థితిలో తెలియబడుచున్నాడు. ఊపిరితిత్తులు రెండును ఈ సుపర్ణునికి రెండు రెక్కలు. శ్వాసయందు ధ్యానము చేయబడువాడే నారాయణుడు. ఈ నారాయణుడు ''ఓం'' కారముగా జీవులయందు ఉన్నాడు సోహం మంత్రమునందు సో అను అక్షరమునందలి ''స'' కారము, మరియు ''హం'' అను అక్షరమునందలి ''హ''కారము తొలగించినచో, ఓమ్ అనగా '' ఓం'' వచ్చును. ఈ ఓంకారమే మనయందు శ్వాసను నడుపుచున్నది. ఓజస్సు అను పేరుగల అమృతము, జీవి శ్వాసను, శరీర భాగములను నడుపుచున్నది. మన శరీరమునందు, ముక్కు కొననుండి హృదయము వరకుగల నాడీ మండలముయొక్క స్పందనమునకు అధి దేవతయే, ఈ సుపర్ణుడు. ఆయన వలననే, దేహమునందలి శ్వాసప్రక్రియ చక్కగా నడుచుచున్నది. ఈ సుపర్ణుడే గరుత్మంతుడని కూడా పిలువడినాడు. ఆ గరుత్మంతునికి పొడవైన ముక్కున్నట్లుగా చెప్పబడినది.

5. ఆదిశేషువు లేక అనంతుడు చుట్టలు చుట్టుకొని యుండగా, ఆ చుట్టలమధ్య మహా విష్ణువు శయనించియుండును. అంతేగాక ఆదిశేషువు యొక్క వేయి తలల పడగపై భూమి నిలబడియున్నది. ఇందు ఆదిశేషువు అనగా చుట్టలుగానుండి విచ్చుకొనుచున్న కాలము. ఆ చుట్టల మధ్య విష్ణువుండును. అనగా విష్ణువునుండియే కాలము పుట్టుచున్నదని, ఆకాలమునందు అంతర్లీనముగా విష్ణువే ఉన్నాడని అర్థము. అట్లు విచ్చుకొనుచున్న కాలము నుండియే సృష్టి వ్యక్తమగుచున్నది. కనుకనే భూమి, ఆయన పడగపై ఉన్నట్లుగా చెప్పబడినది. ఆది శేషువు యొక్క వేలాది తలలే అసంఖ్యాకములైన జీవరాశులు. వీరందరు కాలము వలననే సృష్టిలో పుట్టుచున్నారు. కనుక అవ్యక్తస్థితిలో నున్న పరమాత్మ నుండి, భౌతిక ప్రపంచమువరకు వ్యాపించియున్న కాలమను మహాసర్పమే అనంతుడు. ఇందు అనంతుడు పరమాత్మ నుండి సృష్టి దిగివచ్చుటకు సంకేతము. గరుత్మంతుడు జీవుడు తన భౌతికస్థితి నుండి అమృతత్వమునకై సాధనము చేసి ఐక్యము పొందుటకు సంకేతము.

6. హిరణ్యనాభుడు అనగా సృష్టి మొట్టమొదట పరమాత్మ నుండి దిగివచ్చిన హిరణ్యగర్భాండము. ఇదియే మొట్టమొదటి రజస్సు. ఆ రజస్సు

లేక ధూళినుండియే తారలు రూపుకట్టుకొన్నవి. ఈ రజస్సు అవ్యక్తముగానున్న పరమాత్మ నుండి పుట్టుచున్నది.

7. మహాతపస్సు లేక తీవ్రనిష్ఠ, మొట్టమొదట సూర్యుడి పుట్టుకకు కారణమయ్యెను. తప అను శబ్దమునకు వేడి అని కూడా అర్థమున్నది. సూర్యుడు తపస్సుచేయగా వాని శరీరముగా అగ్ని గోళము ఏర్పడినది. ఈ తపస్సు జీవులలో మోక్షమునందలి కోరికగా వ్యక్తమగుచున్నది. ఇట్లు సూర్యుని మొదలు జీవునివరకు ఈ తపస్సు పని చేసి, వారిని నారాయణునియందు ఐక్యమొనర్చుచున్నది. కనుక అటువంటి మహాతపస్సే నారాయణుడు.

8. పద్మము వికసించుట లేక విచ్చుకొనుట అనుదానికి గుర్తు. లోకములన్నియు ఒక్కొక్కటిగా వ్యక్తమగును. అట్లు వ్యక్తమగుటనే ఈ పద్మము తెలియజేయును. ''సుడి''కి తర్వాత స్థితి పద్మము. చోటులో సుడిగా ప్రజ్ఞ ఏర్పడి, తర్వాత క్రమేణా అందు ఒక్కొక్కటిగా దానియందలి భాగములు ఏర్పడును. ఇట్లు పువ్వుగా విచ్చుకొనుస్థితి, బ్రహ్మవలన కలుగుచున్నది. బ్రహ్మ తన నాలుగు ముఖములతో సృష్టిని ఉచ్చరించును. అవియే సృష్టియందలి నాలుగు స్థితులుగా చెప్పబడినవి. నారాయణుడు సర్పమునందు శయనించియుండగా ఆయన నాభినుండి సృష్టి పద్మముగా విచ్చుకొనును.

9. బ్రహ్మయొక్క సంతానమే ప్రజాపతులు. బ్రహ్మకు మొట్టమొదటి సంతానముగా నలుగురు కుమారులు పుట్టిరి. వారే సనక సనందనాదులు. వారు బ్రహ్మయొక్క మనసునుండి పుట్టిరి. సృష్టిచేయుమని బ్రహ్మ కోరగా వారంగీకరింపలేదు. అప్పుడు బ్రహ్మ ప్రజాపతులను సృష్టించెను. వారు శక్తులుగా, రూపములుగా, భౌతిక సృష్టిని పుట్టించిరి. జీవుల పుట్టుకయేకాక గ్రహగోళాదుల పుట్టుకకు, మండలాత్మకమైన సంవత్సరమునకు వీరు అధిపతులు. కనుక వారును భగవంతుని రూపములే.

22. శ్లో॥ అమృత్యు స్సర్వదృక్సింహస్సన్ధాతా సన్ధిమాన్ స్థిరః
అజోదుర్మర్షణశ్శాస్తా విశ్రుతాత్మా సురారిహా ॥

**ప్రతిపదార్థము :-** 1. అమృత్యుః = మృత్యువులేనివాడు, 2. సర్వదృక్ = అందరినీ చూచువాడు మరియు అందరికన్నులు తానే అయినవాడు, 3.

సింహం = సింహము, 4. సంధాతా = సంధానపరచువాడు, 5. సంధిమాన్ = సంధిచేయువాడు లేక సమన్వయము చేయువాడు, 6. స్థిరః = స్థిరమైనవాడు, 7. అజః = పుట్టుకలేనివాడు, 8. దుర్మర్షణః = నాశములేనివాడు, 9. శాస్తా = శాసనము చేయువాడు, 10. విశ్రుతాత్మః = వినునట్టి జనులయొక్క ఆత్మ అయినవాడు, 11. సురారిహా = దేవతల శత్రువులను సంహరించువాడు.

**తాత్పర్యము:-** పరమాత్మను, మృత్యువులేనివానిగా, సమస్తమును చూచువానిగా, మరియు అందరిచూపే తన చూపైనవానిగా, సింహమువంటి పరాక్రమము కలవానిగ , అన్ని విషయములను సంధానపరిచి సమన్వయము చేయువానిగా, స్థిరమైనవానిగా, పుట్టుక లేకపోవుటచే జయించుటకు సాధ్యము కానివానిగా, జగత్తును శాసించు వానిగా, జ్ఞానుల ఆత్మ తానే అయినవానిగా, మరియు దేవతల శత్రువులను సంహరించు వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :-** మృత్యువు శరీరమునకు, ఇంద్రియములకు, వానివంటి యున్న మనస్సునకేగాని ఆత్మకు గాదు. జీవుడు వస్త్రములను విడిచినట్లు శరీరములను విడుచును. ఇది తెలిసినవానికి మృత్యువు లేదు. పరమాత్మ జీవునియందున్నవాడు. కనుక మృత్యువు లేనివాడు. శరీరము, అందు పని చేయుచున్న శక్తులు, చోటునండి వచ్చినవే. అవి మరల చోటును చేరుచున్నవి. కనుక అందలి పరమాత్మ కూడా మృత్యువు లేనివాడు అగుచున్నాడు.

2. చోటులో మొట్టమొదట వెలుగు పుట్టినప్పుడు, వెలుగు చీకటి అను రెండు ఏర్పడినవి. అట్లే చూచువాడు, చూడబడు విషయము అని రెండు వచ్చినవి. ఇవి పరమాత్మ నుండి పుట్టినవి. కనుక అతడే చూచువాడు, చూడబడు విషయము కూడా.

3. సింహము పరాక్రమమునకు గుర్తు. రాశి చక్రమునందు ఐదవ రాశికి సింహము సంకేతము. ఈ రాశి ఉత్తమ గుణములను, ప్రేమను, మరియు రక్షించుట, పరిపాలించుట అను రాజధర్మనమునకు గుర్తు. అంతే గాక, పరమాత్మ జీవుల హృదయములందుండి వారిని రక్షించుచున్నాడు. కనుక సింహమని చెప్పబడినాడు.

4. సృష్టి యందున్న అనేకములగు జీవులును వస్తువులును పరమాత్మ

వలననే నిలబడియున్నవి. నాటకమునకు దర్శకుడు లేక సూత్రధారివలె, పరమాత్మ లోకములలో జీవులకు, సంఘటనలను, పరిస్థితులను అనుసంధానముచేసి, రసమయతను కల్పించుచున్నాడు. ఇట్టి రసమే జీవిత సారాంశము. అట్టి రసము నిరంతరమైనచో, జీవిని ముక్త స్థితిలో నుంచును. ఇట్లు జీవితమునందు రసపోషణముకై పరమాత్మచే సమస్తమును సంఘటితము చేయబడుచున్నది లేక కూర్చబడుచున్నది.

5. అణువులు, పరమాణువులు మున్నగునవన్నియు ఒక దానితో నొకటి సంధింపబడినవి. అట్లే జీవుని శరీరము, భూమి, మిగిలిన లోకములు కూడా సంధింపబడినవి. ఇట్లు ఒకదానితో నొకటి అనుసంధానము చేసి సామ్యతను కూర్చుట భగవంతుని లీల.

6. సృష్టియందలి ప్రతి అణువును ఒక కేంద్రమే. ఈ కేంద్రము చుట్టును విశ్వమంతయు పరిభ్రమించుచు కేంద్రమును సామ్యస్థితిలో నుంచుచున్నది. బొంగరము గిర గిర తిరుగుచున్నపుడు దాని ముల్లుపై బొంగరమంతయు నిలబడి యున్నది కదా! అట్లే ప్రతి అణువునందునుగల ఈ కేంద్రము విశ్వమంతటను ఉన్నను దానికి పరిధిమాత్రము లేదు. ఇదియే అనేమిచక్రము లేక పరిధిలేని చక్రముగా సుపర్ణ సూక్తమున చెప్పబడినది. ఈ కేంద్రము లేక బిందువుగా, పరమాత్మ సృష్టికి స్థిరత కల్పించుచున్నాడు.

7. ఈ సృష్టియంతయు భగవంతునినుండి పుట్టి మరల భగవంతుని యందే లీనమగుచున్నది. భగవంతుడు మాత్రము సృష్టికి అతీతుడు కనుక ఆయనకు పుట్టుకలేదు. ఎందుచేతననగా పుట్టుటయనగా జీవితమునకు ప్రారంభము. చనిపోవుట యనగా జీవితము పూర్తియగుట. ఇట్లు మొదలు, చివర అను లక్షణములు కలవాడు జీవుడు. మొదలు పెట్టుట, పూర్తియగుట అనునవి మనస్సుయొక్క లక్షణములు. కాని ఆత్మకు ఈ లక్షణము లేదు. నదికి ఒకచోటినుండి మరియొక చోటికి ప్రవహించుట చివరకు సముద్రమునందు లీనమగుటయున్నది కాని నీటికి ఇట్లు ఒకచోట ప్రారంభమై అంతమగుట అను లక్షణము లేదు. అనగా నది సముద్రమునందు కలిసిపోవుచున్నది గాని, నీరుమాత్రము నది, సముద్రము రెండింటియందును నీరుగనే యున్నది.

కనుక పరమాత్మ నీటివంటి వాడైనచో జీవుడు నదివంటివాడు. కావున జీవుడు మరణించుచున్నను అందలి పరమాత్మకు మరణము లేదు.

8. నశింపచేయుట, లేకుండాపోవుట అనునవి, భౌతిక లోకమునకు సంబంధించినవి. నిజమునకు నశించుట సాధ్యము కాదు. వస్తువులు స్థితిమార్పు చెందును కాని నశింపవు. నీటిని మరగబెట్టినచో నీరు ఆవిరి రూపములోనికి మారును. కాని నశింపదు. ఇట్లు అన్నింటియందునుగల ఈ నశింపని గుణము పరమాత్మయే. కనుక అతడు నాశనము లేనివాడు.

9. భగవంతుడు శాసించువాడు. పదార్థములను వాటి ధర్మముల ద్వారా శాసించుచున్నాడు. అట్లే జీవులను వారి స్వభావముల ద్వారా శాసించుచున్నాడు. నీటికి ప్రవహించుట ధర్మము. ప్రపంచమునందు ఎచ్చటనైనను ఈ ధర్మము నీటియందు పని చేయుచుండును. తుదకు ప్రయోగశాలలో రసాయనిక చర్య మూలంగా తయారైన నీటికి సైతము ఈ ధర్మము తప్పదు. నీరు ప్రవహించునేగాని పొరపాటునైనను నిప్పువలె కాలదు కదా! అట్లే జీవులయందు సైతము ఈ ప్రభావము వారి స్వభావములననుసరించి పని చేయుచున్నది. కోపముగా నున్నవారికి శాంతముగా నుండుట వాని తరము కాదు. ముందుగా కోపము తెచ్చుకొన గూడదని నిర్ణయించుకున్నను, పరిస్థితుల యందు అసౌకర్యము, కష్టము అనిపించినచో వానికి తెలియకుండగనే కోపము వచ్చును. ఇట్లే సమస్త జీవులను వారి వారి స్వభావముల ద్వారా భగవంతుడు శాసించుచున్నాడు. ఒకవేళ జీవులలో ఆత్మ వికాసము కలిగి శాంతము, సహనము వంటి సద్గుణములు కలిగినను, అట్టి ఆత్మ వికాసమునకు కావలసిన సంకల్పము లేక బాగుపడవలెనను కోరిక, తన యందున్నప్రేరేపణ వలన కలుగుచున్నది కదా! అందుచేత భగవంతుడు అన్నింటిని, అందరిని శాసించుచున్నాడు.

10. పురాణములను, సద్గ్రంథములను శ్రద్ధతో చదివి ఆచరించువారు, వాటి ద్వారా భగవంతుని సాన్నిధ్యము పొందుచున్నారు. అనగా వానియందే జీవించుచున్నారు. కనుక భగవంతుడు కూడా అట్టి వారియందుండును.

11. దేవతలు సృష్టియందలి జీవుల పరిపూర్ణతకు పని చేయువారు.

కనుక వారి పని సృష్టి నిర్వహణకు, అభివృద్ధికి సంబంధించి యుండును. ఎవరైనను దీనిని వ్యతిరేకించినచో వారు దేవతలకు శత్రువులగుచున్నారు. కనుక దేవతల సహజగుణములయిన శాంతము, దయ, ప్రేమ మున్నగు సద్గుణములకు బదులు వాని స్థానముననే కోపము, ద్వేషము, పగ, మున్నగు గుణములు పుట్టును. అట్లు తనయందుఁగల ఈర్ష్య, ద్వేషము చేతనే వారు నశించుచున్నారు. కనుక వారియందలి దుర్గుణముల నుపయోగించి వారిని సంహరించుచున్నాడు.

23. శ్లో॥ గురుర్గురుతమో ధామ స్సత్యస్సత్యపరాక్రమః
నిమిషో౽ నిమిష స్స్రగ్వీ వాచస్పతిరుదారధీః ॥

**ప్రతిపదార్థము** :- 1. గురుః = ఉపదేశకుడు, 2. గురుతమః = గురువులకు ఉపదేశించువాడు, 3. ధామః = వెలుగు యొక్క మార్గము, 4. సత్యః = సత్యము, 5. సత్యపరాక్రమః = సత్యముగా లోకముల నాక్రమించువాడు, 6. నిమిషం = రెప్పపాటు, 7. అనిమిషః = రెప్పపాటు లేనివాడు, 8. స్రగ్వీ = మాలచే అలంకరింపబడినవాడు, 9. వాచస్పతిః = వాక్కునకు అధిపతి, 10. ఉదారధీః = తనంతట తాను వెలుగునట్టి బుద్ధిగా పని చేయువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మ ఉపదేశికునిగాను, మరియు ఉపదేశికులందరికి గురువుగను, వెలుగు తనమార్గమైన వానిగను, సత్యముగా వెలుగు వానిగను, అట్టి సత్యముగనే లోకములన్నియు ఆక్రమించువానిగను, రెప్పపాటుగా నున్న వానిగను, మరియు అట్టి రెప్పపాటు తానే అయిన వానిగను, మాలను ధరించిన వానిగను, వాక్కునకు అధిపతిగను, తనంత తాను వ్యక్తమగు బుద్ధిగా తెలియబడుచున్నాడు.

**వివరణ** :- 1. గురువనగా ఉపదేశకుడని సామాన్యార్థము. నిజమునకు గురువు భగవంతుని అంశ. భగవంతుడే జీవులకు ఆత్మసంస్కారము కలిగించుటకై గురువుగా వచ్చును. అనగా గురువు ఎట్టివాడైనను శిష్యునికి లభించునది పరమాత్మ సాన్నిధ్యమేగాని భౌతికమగు గురువు మనః ప్రవృత్తిగాదు. అతని ద్వారా శిష్యునికి భగవంతుడే స్వయముగా జ్ఞానము నిచ్చును. ఇచ్చుట శిష్యునికి పరీక్ష ఏమనగా గురువునందు కనిపించు లోపములు. అవి శిష్యుని సంస్కారమును బట్టి గురువునందు కనిపించును. అట్టి లోపములను విమర్శించి గురువును

నిందించుటవలన తమకు కలిగిన ఆత్మ సంస్కారమును, ముక్తి మార్గమును కోల్పోవుచున్నారు. ఇచ్చట లోపములున్నవా లేవా అనునది ప్రశ్న కాదు. శిష్యుడు దీనిని గమనించుచున్నాడు లేక పట్టించుకొనుచున్నాడనియే. ప్రశ్న. ఎంత ఎక్కువగా లోపములను గూర్చి పట్టించుకొనునో ముక్తి వచ్చుటకు అన్ని జన్మలు పట్టునని సమాధానము. నిజమైన ఆత్మ సంస్కారము కలిగిన వానికి భగవంతుడే తనను పరీక్షించుటకు యిట్లు ప్రవర్తించుచున్నాడని తెలిసి గురువు యొక్క గుణగణములతో సంబంధము లేక శరణాగతి పొందును.

2. ''గురుబ్రహ్మా గురుర్విష్ణు ర్గురుదేవో మహేశ్వరః
గురుస్సాక్షాత్పరం బ్రహ్మా తస్మైశ్రీ గురవేనమః

అని గురువునుద్దేశించి చేసిన ప్రార్థన పూర్తిగా అర్థవంతమే. కాని కేవలము గురువును గౌరవించుటకు చెప్పినది గాదు. ఇది శిష్యులు గురువును '' ఉపాసన'' చేయ వలసిన విధానము. సమస్త సృష్టిని పుట్టించువాడు, నడుపువాడు, మరల లయము చేయువాడు, గురువే. అట్టి గురువే అన్నిటికిని అతీతమయిన పరబ్రహ్మగా నున్నాడు. ఆయనను శరణు పొందుచున్నాను అని ధ్యానము చేయవలెను. ఇట్టి ధ్యానమును మనస్సులో నిరంతరము ధారణ చేయు మనిషి యిక చదువ వలసిన వేదాంత గ్రంథములుండవు. సకల పురాణ గ్రంథములు, వేదములు, ఉపనిషత్తులు, జీవుని ఇచ్చటకు తీసుకుని వచ్చి విడచును. అటుపైని శిష్యుని పురోగమనమును గురువు స్వయముగా నిర్ణయించును. అట్టి నిర్ణయము కూడా శిష్యునికి తెలియవలసిన అవసరము లేదు. ఆ తరువాత గురువు ఆజ్ఞపై ఏ గ్రంథము చదివిననూ శిష్యునికి అందలి విషయము చక్కగా బోధపడుచుండును. అతడు నిత్యజీవితమునందు అనుక్షణము గురువు యొక్క సాన్నిధ్యమును అనుభవించుచునే యుండును. సకల జీవుల రూపమున గురువే కనుపించును. దీనిని గూర్చి వివేకానందుడు ''నిజమయిన శిష్యుడు'' (The True Diciple) అను తన ఉపన్యాసమున వివరించెను. శిష్యునికి ఇట్టి ఆత్మ సంస్కారము కలిగి నిజమైన శరణాగతి పొందువరకు గురువు వేచియుండును. శిష్యుని హృదయము నందున్న పరమాత్మయే గురువుగా శిష్యుని వద్దకు వచ్చుచున్నాడు. గురువు యొక్క శరీరము వేరైనను పని చేయుచున్నది శిష్యునిలోనున్న గురువను పరమాత్మ

అంశయే. అతడు సకల జీవులను తన మాయ అను క్రీడ యందు వారి సంస్కారములను బట్టి నియమించుచు వారితో క్రీడ సల్పి రసానందము కలిగించును. అట్టి రసానందమే పరమాత్మ యని తెలిసిన వానికి అదియే బ్రహ్మానందమై తాదాత్మ్యము సిద్ధించును. ఆ రసానందమును గుర్తించి అనుభవింప లేనివానికి అది కోపతాపములుగా, దుఃఖముగా, బాధలు అనుభవమగుచున్నది. గుర్తించినవానికి నాటకమునందు వలె ఆనందము, తన్మయత్వము కలిగించుచున్నది.

3. మన దేహము, ప్రాణము, మనస్సు, ఇంద్రియములు మున్నగునవన్నియునూ, పరమాత్మ యను వెలుగు నుండి వచ్చినవే గనుక, తిరిగి భగవంతుని చేరుటకు ఇవియే మనకు సాధనములగును. అట్లు సాధన యను సంకల్పము గూడా, పరమాత్మ నుండి జీవులయందు ప్రసరించు కిరణము. కనుక పరమాత్మయే మరల జీవునికి మార్గమగుచున్నాడు.

4. సత్యమనగా మనకు తెలిసిన తాత్కాలిక సత్యమునుండి, ఈ సృష్టికి మూల కారణమైన పరమ ధర్మమువరకు, వివిధ స్థితులలో వేరు వేరుగా తెలియబడుచున్నది. నిజమునకు యివి అన్నియూ ఒక మహాసత్యములోని అంతర్భాగములే గాని వేరు వేరు కాదు. అనగా నా సోదరుడు, లేక నా కుమారుడు, అనునది సత్యమే. అతడు జీవుడనునది అంతకన్నా ఎక్కువ సత్యము. పరమాత్మ యొక్క అంశ అనునది మిక్కిలి సత్యము. అంతమాత్రముచే అతడు మానవుడు కాదనరాదు. మానవుడు, పరమాత్మ అను రెండు స్థితులునూ సత్యములే. కుమారుడుగా జీవునిగా వర్తించుచున్న పరమాత్మ అనునది, పరిపూర్ణమైన సత్యము. ఋగ్వేదము ''ఈ భూమి సూర్యుని వలన నిలబడియున్నది'', ఆకాశము సత్యమువలన నిలబడియున్నది, అని చెప్పుచున్నది. ఇచ్చట సత్యమనగా ఇది యిట్లుండవలెను అను పరమాత్మయొక్క సంకల్పము.

5. అట్టి సత్యమును దర్శించి తెలుసుకొనగోరువాడు, మొదట తనకు తెలిసిన విషయములనుండి తెలియని విషయములను అర్థము చేసుకొనుటకు ప్రయత్నించును. ఇట్లు క్రమేణా సృష్టియందలి సమస్త విషయములు తెలుసుకొనగలుగును. తుదకు ఈ జ్ఞానమంతయూ పరమాత్మను గూర్చియే

తెలుపుచున్నదన్న విషయము తెలియును. ఇట్లు సత్యమును దర్శనము చేయుచు, సృష్టియందలి సమస్తమునూ పరమాత్మయొక్క అస్తిత్వముగా గ్రహింపగలుగుట ''సత్య, పర, ఆక్రమణము''.

6. రెప్పపాటు అనగా మానవుని భౌతిక అస్తిత్వమునకు ఒక గుర్తు. అంతేకాక అన్నవవంతు కాలము గడచినదని అర్థము. ఇట్లు రెప్పపాటు లేక నిమిషము, గంట, దినము మున్నగునవి కాలమను అనంతమైన మహా ప్రవాహమునుండి మన శరీరమను పొలములోనికి తీసుకొనుచున్న పిల్లకాలువలు. ఈ కాలువలు మనము తీసుకొన్నవి గనుక పూడిపోవుట, మరల మనము సరిచేసుకొనుట, యుండును. అదియే మృత్యువు, మరల జన్మము. ఇవి మన కాలువకు సంబంధించినవిగాని అనంతమైన ప్రవాహమునకు సంబంధించినవి కావు. మనము నిమిషములను పేర్లతో అర్థము చేసుకొనునది కాలమను ''పరమాత్మ'' గూర్చియే.

7. అట్టి అనంతుడైన పరమాత్మ, జీవుడను శరీరమునందు ప్రవేశించుసరికి తనను తానే నియమించుకొనుచున్నాడు. కిటికిలోనుండి సూర్యరశ్మి ఇంటిలో పడువానికి, సూర్యుని దిశ మారుసరికి సూర్యరశ్మి పడకపోవుట యుండవచ్చును. అనగా సూర్యుడు ప్రకాశించుట లేదనిగాదు. భగవంతుని అస్తిత్వము జీవునియందు పరిమితమగుచుండును. అది జీవుని యందు నిద్రించుట, అజాగ్రత్త, మనస్సులయమగుట, మృత్యువు అను అనేక స్థితులుగా కల్పింపబడుచున్నవి. ఈ స్థితులన్నియు భగవంతునియందు వేరువేరుగా కల్పింపబడుచున్నవే గాని వానికి సంబంధించినవి కావు. పట్టపగలు ఇంటిలో నుండి, కిటికీలు, తలుపులు బిగించుకొన్నవానికి, చీకటి సృష్టించబడుచున్నదిగాని, సూర్యుడు వెలుగుట లేదని గాదు. కనుక భగవంతునికి రెప్పపాటు లేదు. అనగా అతను రెప్పపాటు కాలము కూడా ఉండకపోవుట అనునదిలేదు.

8. ప్రకృతి యందలి పుష్పములన్నియు తమ పరిమళములతో, రంగులతో ప్రకృతిని అలంకరించుచున్నవి. పరమాత్మయే ప్రకృతిగా వచ్చెను. కనుక ఆయనకు ఈ పూల గుత్తులన్నియూ మాలగా ఏర్పడుచున్నవి. ఈ పూల సువాసనకు తన్మయత్వము చెందు జీవులు, ప్రాణులు, భగవంతుని రూపములే గనుక వారి ద్వారా అతడే ఆనందించుచున్నాడు.

9. మన వాక్కుకు, ఉచ్చారణకు మూలము మనస్సు. అట్టి మనస్సునకు నేనను ప్రజ్ఞయే మూలము. జీవుని యందలి ఈ నేనను ప్రజ్ఞ భగవంతుని నుండి వచ్చినది. గనుక అతడే మన వాక్కునకధిపతి యగుచున్నాడు.

10. వాక్కునకు, మనస్సునకు, బుద్ధికి, పరమాత్మ అధిపతి. వాక్కు మనస్సునందు పుట్టుచున్నది. మనస్సు బుద్ధినుండి పుట్టుచున్నది. బుద్ధి తననుండి పుట్టుచున్నది. కనుక పరమాత్మ బుద్ధి అను వెలుగుగా కూడా తానే యున్నాడు.

24. శ్లో॥ అగ్రణీర్గ్రామణీ శ్రీమాన్న్యాయో నేతా సమీరణః
సహస్ర మూర్ధా విశ్వాత్మా సహస్రాక్షస్సహస్రపాత్ ॥

**ప్రతిపదార్థము** :- 1. అగ్రణీః = ముందుగానుండువాడు, 2. గ్రామణీః = జీవులను నడుపువాడు, 3. శ్రీమాన్ = సంపదల కధిపతి, 4. న్యాయః = ధర్మముయొక్క రూపమైనవాడు, 5. నేతా = నాయకులను నడుపువాడు, 6. సమీరణః = చల్లనిగాలి, 7. సహస్రమూర్ధా = వేయి శిరస్సులు గలవాడు, 8. విశ్వాత్మా = విశ్వమే తన ఆత్మగాకలవాడు (లేక) విశ్వమునకాత్మయైనవాడు, 9. సహస్రాక్షః = వేయికనులు కలవాడు, 10. సహస్రపాత్ = వేయి పాదములు కలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, మొదటగానుండు వానిగానూ, జీవులను నడుపువానిగానూ, సంపదల కధిపతిగానూ, న్యాయమే తన రూపమైనవానిగా, నాయకునిగా, ప్రశాంతముగా వీచువాయువుగా, వేయి శిరస్సులు గలవానిగా, వేయికన్నులు గలవానిగా, మరియూ వేయిపాదములుగలవానిగా, ఇంకనూ విశ్వమే తన ఆత్మయైనవానిగా, విశ్వమునకు ఆత్మయైన వానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. పరమాత్మ సృష్టియందలి ప్రాణులు, అణువులు మున్నగు అన్నిటియందునూ ఆత్మగా యున్నాడు. వానినన్నిటిని ఆయనయే. నడుపుచున్నాడు. అన్నింటిని అధిష్ఠించి మొదటగానున్నాడు గనుక ఆయన జీవులనేగాక, గోళములకు సమస్త ప్రపంచమునకు వాని పుట్టుకనుండి మృత్యువు వరకూ, తానే ప్రముఖపాత్ర వహించుచున్నాడు. జీవులు తాము మనస్సు,

బుద్ధి మరియు వానియందలి సంకల్పములు, ఊహలు, వ్యక్తిగతమైనవిగా పొరబడి స్వంతముగా ప్రయత్నములు చేసుకొనుచున్నారు. కాని వారి ఊహలు, సంకల్పములు, వారి వారి ఆత్మయందలి తానను ప్రజ్ఞలోనివి. ఈ తానను ప్రజ్ఞయే జీవులను నడుపుచున్నది.

2. ఇట్లు నడుపబడుట సామూహికమేగాని, వ్యక్తిగతము కాదు. సృష్టియందలి అణువుల మొదలు జీవులవరకు గుంపులు గుంపులుగా నున్నవి. ఇది గ్రహములందేగాక తారలయందు కూడా ఇట్లు గుంపులుగా నుండుట మనము గమనించుచున్నాము. అణువులు పరమాణువులు కూడా ఇట్లే గుంపులుగానున్నవి. ఇట్లు గుంపులుగా నేర్పడుటకు కారణము వాని యందలి పరస్పర ఆకర్షణ శక్తియే. జీవులయందు కూడా, ఇట్లే జరుగుచున్నది. రాజకీయముగా, సామాజికముగా, ఆధ్యాత్మికముగా, జీవులు గుంపులుగా నేర్పడుచున్నారు. ఇట్లు గుంపులుగా నేర్పడుట తాత్కాలిక ఉద్దేశ్యములతో నైననూ, నిజమునకు వారియందలి పరస్పర ఆకర్షణయే తాత్కాలిక ప్రయోజనముల రూపమున పని చేయుచున్నది. దీనిని నిర్వచించి నిర్దేశించినవాడు మనువు. అతడు ప్రకృతియందలి ఖనిజములయందు, వృక్షములయందు, జంతువులయందు, గ్రహతారకాదులయందు గుంపులు గుంపులుగా నేర్పడుట యందలి రహస్యమును గమనించి, దానినే జీవులకు కుటుంబము, సమాజము అనుపేర నిర్దేశించెను. కుటుంబముగా జీవించుట యందలి పరమార్థము తెలిసినవాడు, దానినే సమాజమునందు కూడా అభ్యాసము చేసుకొనుచున్నాడు. ఇట్లు మానవులకు తెలియకయే వారియందలి ఆకర్షణకు లేదా ప్రేమకు ప్రభావితులై బృందముగా నేర్పడుచున్నారు. ఈ ఆకర్షణ లేక ప్రేమయే పరమాత్మ. అతడు జీవులయందలి ఈ పరస్పర ఆకర్షణగా తానే యుండి, బృందములుగా నేర్పరచి నడుపుచున్నాడు.

3. ప్రకృతియే సృష్టియందలి సంపద. ఈ సంపదకు యజమాని భగవంతుడు. ఆయననుండి సృష్టి ప్రారంభమైనది గనుక ఆయనలో ఈ సృష్టి సమస్తము ఒక భాగము మాత్రమే. ఈ రహస్యము తెలిసినవాడు భగవంతుని సృష్టి సంపదకు మూలముగా ఆరాధించుచున్నాడు. భగవంతుని ఇట్లు ఆరాధించుట వలన, జీవుడు సంపదకు అతీతమగుచున్నాడు. అనగా అట్టివాడు

సంపదను గూర్చిగాక, భగవంతుని గూర్చి పని చేయును. తోటి వారి యందలి పరమాత్మకు సమర్పణముగా పని చేయుచున్నాడు గనుక, సంపద వానికప్రయత్నముగా సిద్ధించును. సంపదను గూర్చి, దాని వినియోగమును గూర్చి, ప్రాకులాడు వానికి భగవంతుడుండడు గనుక, సంపద యుండదు. కేవలము వ్యాపార దృష్టితో ధనార్జన చేయువానికి సయితము ఇట్లే జరుగును. ఖర్చు పెట్టుట, దుర్వ్యయము చేయుట వంటి బుద్ధియున్న వానికి, సంపదయుండదు. ఉన్ననూ తొలగిపోవుట చూచుచునే యున్నాము. అట్లు గాక కేవలము ధనార్జన చేయుచు సంపాదించిన ధనమును జాగ్రత్తగా ఖర్చు పెట్టువాడు, భగవంతుని ధనరూపమున పవిత్రముగా చూచుచున్నాడు. కనుక వానికి భగవంతుడు ధనరూపమున సిద్ధించును. పరమాత్మను శరణాగతి పొంది, జీవుల యందలి భగవంతుని సుఖపెట్టుటకై ధనార్జన చేయువానికి సహితము ధనము ఇట్లే సిద్ధించును. కాని ధనము సంపాదించుటలో పైవాని కున్న క్లేశము, శ్రమ వీరికుండవు. కనుక ఇతడు ధనము సంపాదించుచున్ననూ ధనమునకు సంబంధము లేక సుఖపడుచున్నాడు.

4. ప్రతి వారును, తాను రక్షింపబడవలెనని, తనకు ధర్మము ననుసరించి ప్రయోజనములు సమకూరవలెనని, కోరుకొనును. దీనినే న్యాయమందురు. ఇట్లు న్యాయమును కోరుట, జీవులందరి యందును సమానముగా పని చేయుచున్నది. దీని ననుసరించి న్యాయశాస్త్రము, నీతిశాస్త్రము, వాని ననుసరించి శాసనము, రాజ్యాంగము లేర్పరుపబడినవి. ఇవి జీవులందరిచేతనూ కోరబడుచున్నవి, కనుక వారియందలి పరమాత్మయే న్యాయముగా నేర్పడుచున్నాడు. జీవులకు న్యాయమును, ధర్మమును మనువు మున్నగు పెద్దలు నిర్వచించి యిచ్చిరి. అది వారి బోధల రూపముననూ, జీవితముల రూపముననూ, ప్రపంచమునకు నిర్వచింపబడినది. అందుచేత భగవంతుడే ఈ పెద్దల రూపమున, వారి జీవితముల రూపమున, న్యాయమిచ్చిన వాడగుచున్నాడు.

5. ఇట్లు న్యాయమును, ధర్మమును కోరువారు, అట్టి జీవనమునకు తమ జీవితములను, తెలియకయే సమర్పణము చేసికొనుచున్నారు. భగవంతుడు జీవులయందలి మనస్సుగా పని చేయుచున్నాడు కనుక ప్రతివారునూ తమకు తెలియకయే తమ మనస్సులచే ముందుకు నడుపబడుచున్నారు. ఈ మనస్సులు

భగవంతుని అధీనములో నున్నవి గనుక, జీవులను నడుపువాడు భగవంతుడే. ఎందుకనగా వారి మనస్సులు, మనస్సుల యందలి ఆదర్శములు కూడా, భగవంతుని రూపములే.

6. వాయువు వీచుట తనయందుగల వీచుట అను ధర్మము ననుసరించి జరుగుచున్నది. ఇది సృష్టియందలి స్పందనమను మూలధర్మముపై నాధారపడియున్నది. ఈ స్పందనము, భగవంతుని నుండి మొట్టమొదటగా పుట్టిన, మహా చైతన్యము వలన కలుగుచున్నది. ఈ మహా చైతన్యమే పరమాత్మ శ్వాస, కనుక వాయువు భగవంతుని రూపముగా, జీవులయందు శ్వాసగా పని చేయుచూ, ప్రాణమును, లేక జీవనమును, కలిగించుచున్నది. కనుక అది నారాయణుని రూపము.

7. భగవంతుడు వేయి శిరస్సులు గలవాడుగా వర్ణింపబడినాడు. నారాయణుడు సృష్టిగా దిగి వచ్చెను గనుక, ఈ సృష్టి యందలి జీవుల శిరస్సులే, నారాయణుని శిరస్సులుగా వర్ణింపబడినవి. సహస్ర శబ్దమునందలి ''స''కార, ''హ''కార, ''ర'' కారములు శ్వాసనుండి పుట్టుచున్నవి. ''సోహం'' మంత్రము నందలి ''స''కార, ''హ''కారములు కంఠమునందలి స్వరపేటిక యందు రేఫము లేక ''ర''కారముగా ఘర్షణ చెంది, ''శబ్దము'' పుట్టుకతో వాక్కుగా వ్యక్తమగుచున్నది. ఈ రేఫమే ''ఋషభము'' అని వేదమునందు చెప్పబడినది. ఇదియే ఎద్దు రంకె పెట్టుట అని చెప్పబడినది. ''త్రిధాబద్ధో వృషభోరోరవీతి'' - మూడు తాళ్ళతో కట్టబడిన వృషభము రంకె పెట్టుచున్నదనగా, ప్రజ్ఞామయము, శక్తిమయము, ద్రవ్యమయము అను మూడు లోకములుగా దిగివచ్చిన ఈ ప్రకృతి యందు, భగవంతుని నుండి వచ్చిన చైతన్యము ప్రవేశించుటచే ఘర్షణ పుట్టి, ఆ లోకములయందలి జీవులకు శరీరము లేర్పడును. ఇట్లు రోదనము చేయు వానినే రుద్రుడని యందురు. ఆ రుద్రునికే వృషభము వాహనమని చెప్పబడినది. చైతన్యము నుండి శబ్దము పుట్టుట, ఆ శబ్దము నుండి చోటు పుట్టుట, దీనికి సంకేతము. ఇట్లు భగవంతుని తేజస్సు లేక చైతన్యము, రజస్సుగా వచ్చుటయే ఈ రేఫము. ఈ మూడు అక్షరములలోనే పురుష సూక్తమందలి మొట్టమొదటి శ్లోకము

ప్రారంభమగు చున్నది - ''సహస్ర శీర్షా పురుషః''

8. అట్లు సృష్టిగా దిగివచ్చిన పరమాత్మ, సృష్టియందు మరల తానేయున్నాడు. ఇట్లుండుట జీవులలో శ్వాసవలన సాధ్యమగుచున్నది. జీవులలో నున్న పరమాత్మ అంశ వలననే శ్వాస కలుగుచున్నది. ఇట్లు అణువు మొదలు సూర్యగోళము వరకూ భగవంతుడు, తానను ప్రజ్ఞగా ఉండి, సృష్టి నడుపుచున్నాడు. ఈ తానను అనంతమైన ప్రజ్ఞకు ఎవరికివారు తమ శరీరములను పరిధులుగా నిర్ణయించుకొనుటచే పరిమితత్వములోనికి బంధించుకొనుచున్నారు. నిజమునకు భగవంతుడు విశ్వమునందు వ్యక్తముగా మరియు అవ్యక్తముగా ఉన్న సమస్త సృష్టి యందును వ్యాపించి యున్నాడు.

9. సహస్రాక్షుడనగా ఇంద్రుడు. అనగా వేయి కన్నులు కలవాడు. అక్షములనగా రేఖలు లేక కిరణములు. వేయి కిరణములు గలవాడు సూర్యుడు. ఆయన తన వేల కొలది కిరణములతో లేక రేఖలతో, తన శక్తిని సౌరమండలమంతయూ వెదజల్లుచున్నాడు. అయస్కాంత క్షేత్రమందలి రేఖలవలె ఈ రేఖలు పని చేయుచు, సౌరమండల మంతనూ ఒక్కటిగా పట్టి యుంచుచున్నవి. ఇందలి గ్రహములే కాక, అణువుల మొదలు మానవుల వరకూ సమస్తమునూ, ఈ రేఖల ననుసరించి పని చేయుచున్నవి. మరల అట్లు పని చేయుచున్న బిందువులన్నియూ వేరు వేరు కేంద్రములుగా నేర్పడి, తమ చుట్టును అటువంటి రేఖలనే ప్రసరింప చేయుచున్నవి. ఇన్నిటి యందునూ, కిరణముల ద్వారా తన ప్రభావమును చూపుచున్నవాడు అంతర్యామి యగు నారాయణుడే.

10. సహస్ర పాదములు కలిగిన అంతర్యామి, సృష్టిగా విస్తరించియున్నాడు. సృష్టియందలి సకల జీవుల పాదములు ఆయనవే. ఈ మొత్తము సృష్టి యంతయూ పరమాత్మయందు ఒక పాదము మాత్రమే. అట్టి పాదములు మరి మూడు అవ్యక్తముగా నున్నవని వేదము చెప్పుచున్నది. ఉదయము, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రి అను నాలుగు పాదములతో కూడిన దినము, భూమి చుట్టు సూర్యుడు పరిభ్రమించుచున్నట్లు కనిపించు వృత్తము వలన, నేర్పడుచున్నది. అట్టి వృత్తములనేకములు ఈ విశ్వాంతరాళము లందు కలవు. ఇట్టి వేలాది వేల పరిభ్రమణములన్నియూ సృష్టియందలి

పరమాత్మ యొక్క అస్తిత్వము వలననే కలుగుచున్నవి. కనుక, యివి యన్నియూ వాని పాదములే.

25. శ్లో॥ ఆవర్తనో నివృత్తాత్మా సంవృత స్సంప్రమర్దనః
అహస్సంవర్తకో వహ్నిరనిలో ధరణీ ధరః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఆవర్తనః = సమస్తమునూ త్రిప్పువాడు మరియు తిరుగువాడు, 2. నివృత్తాత్మా = అసక్తి లేనివాడు, 3. సంవృతః = సమస్తముచే చుట్టబడినవాడు, 4. సంప్రమర్దనః = రాక్షస శక్తులను దమించువాడు, 5. అహః = దినము, 6. సంవర్తకః = అగ్నియైదహించువాడు, 7. వహ్నిః = స్థితి మార్పు చెందించు అగ్ని, 8. అనిలః = వాయువు, 9. ధరణీధరః = భూగోళమును ధరించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, త్రిప్పుట మరియూ తిరుగుట అను రెండు శక్తులుగా పనిచేయువానిగా, లేక ప్రాణము, అపానము అను రెండు శక్తులుగా పని చేయువానిగా, అనాసక్తునిగా, సృష్టిగా చుట్టబడియున్నవానిగా, రాక్షసశక్తులను దమించువానిగా, దినాధిపతిగా, అన్నిటినీ తనలోనికి లీనము చేసుకొను లేక దహించు అగ్నిగా, వాయువుగా, భూగోళము చోటులో నిలబడియుండుటకు ఆధారమైన వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- ఈ సౌరమండల మంతయూ రెండు శక్తులపై ఆధారపడి నిలిచియున్నది. అవి ఒకటి - త్రిప్పుట, రెండు - తిరుగుట, అవియే కేంద్రమునకు ఆకర్షించు శక్తి (Centripetal Force) మరియూ కేంద్ర పరాఙ్ముఖ శక్తి (Centrifugal Force) అను రెండు శక్తులుగా కూడా చెప్పబడినవి. ఒక వస్తువు మరియొక వస్తువు చుట్టూ గుండ్రముగా తిరుగుచున్నచో దానిపై రెండు శక్తులు పని చేయును. ఒకటి తిరుగునట్టి వేగము, రెండు దానిని కేంద్రము వైపునకు ఆకర్షించు దాని కక్ష్యలో పెట్టి నడిపించు శక్తి. వీనిలో ఏ ఒక్కటి లేకున్ననూ వస్తువుండదు. అనగా నశించును. ఈ రెండు శక్తులనే ప్రాణము, అపానము అని కూడా అందురు. ఇట్లు గ్రహ గోళాదులు వాని వాని కక్ష్యలలో వర్తించుటకు కారణమైన శక్తులు పరమాత్మ నండి పుట్టుచున్నవి గనుక, నారాయణుడు ఆవర్తనుడని చెప్పబడుచున్నాడు.

2. సృష్టి యందలి సమస్తము, వైభవమునూ, సంపదనూ తెలియజేయును. కాని అందలి ప్రజ్ఞకు లేక జీవునికి ఇది అంటదు. అవి జీవుని మనస్సుపై పని చేయునేగాని, వాని ప్రజ్ఞనంటవు, ప్రజ్ఞ మాత్రమే భగవంతుని యందంటి యుండును.

3. భగవంతుని చుట్టు ఈ సృష్టి అల్లిక చేయబడి, వాని చుట్టు తిరుగుచున్నది. కనుక పరమాత్మ చుట్టబడి యున్నాడు.

4. రాక్షస శక్తులనగా తమకోసమే తాము జీవించునట్టి ప్రజ్ఞలు. ఇవి భగవంతునిపై ఆధారపడక, తమ అహంకారముపై మాత్రమే ఆధారపడి పని చేయును గనుక, రాక్షసములు. పోటీపడుట, యుద్ధముచేయుట మున్నగునవి అట్టి అహంకారమువలన పుట్టుచున్నవి. ఒకరితో నొకరు పోటీపడి స్పర్ధవహించుట ద్వారా భగవంతుడు వారిని నిగ్రహింపగలుగుచున్నాడు. అంతేగాక సమయము వచ్చినపుడు తనశక్తిచే వారిని సంహరించి తొలగించుచున్నాడు.

5. దినము సూర్యోదయముతో ప్రారంభమగుచున్నది. అనగా జీవుని నిద్రనుండి మేల్కొలుపుచున్నది. ఇట్లు నిద్రించు ప్రజ్ఞను మేల్కొలుపు శక్తియే సూర్యుడు. జీవులను మేల్కొలుపు ఈ శక్తియే, దేవతలను, సృష్టికర్తయైన బ్రహ్మను, ఆయా లోకములలో మేల్కొలుపుచున్నది. మొట్టమొదట సృష్టికర్తయైన బ్రహ్మకు ఇట్టి మెలుకువ వచ్చి చూడగా, లేక గమనించగా, తానున్నానని తెలిసెను. '' ఎట్లు వున్నాను?'' అని ప్రశ్నించుకొని, ఆ ప్రశ్న లేక ఊహ, తన యెందెచ్చట పుట్టుచున్నది, అని ధ్యానము చేసెను. అపుడు నారాయణుడు ప్రత్యక్షమయ్యెను. అనగా బ్రహ్మ తనయందుగల ఈ ఊహ తననుండే పుట్టుచున్నదని, తానను ప్రజ్ఞయే నారాయణుడని దర్శనము చేసెను. ఇట్టి మేలుకొలుపు ప్రతి జీవికిని సూర్యోదయమందు కలుగును.

6. సంవర్తకమనగా సమస్తమునూ తనలో లీనము చేసుకొను అగ్ని. ఈ అగ్నియే జీవులకు మృత్యుసమయము ఆసన్నమైనపుడు పనిచేయును. అట్లే గ్రహ గోళములను, తారలను, మరల చోటులోనికి లయము చేయుచున్నది. జీవునికి వాని అయుర్దాయము పూర్తియైన పిదప, ఈ సంవర్తకమను అగ్ని, మృత్యువు కలిగించి, శరీరమును పంచభూతములలో కలిపివేయును. మానవుని

ఆయుర్దాయము, సంవత్సరములు, రోజులు, మున్నగు లెక్కలపై కాక జీవిత పరమార్థముపై ఆధారపడి యుండును. అనగా జీవుడు ఆ జన్మలో తాను దేనిని సాధించుటకు పుట్టెనో అది నెరవేరుదాక శరీరముండును. అట్టి పరమార్థము నెరవేరిన మరుక్షణము దేహము వ్యాధిగ్రస్తమై మృత్యు లక్షణములు వచ్చును. అనగా జీవితపరమార్థము పూర్తియైనదని, జీవుని ప్రస్తుత శరీరముయొక్క అవసరము తీరిపోయినదనియూ అర్థము. అట్లే గ్రహములకునూ, తారలకునూ, ఇట్టి పరమార్థము కలదు. అట్లు పరమార్థము తీరిన వెంటనే, శరీరమును, గోళములను, అణువులుగా విభజించి, చోటులోనికి లీనము చేయు శక్తిని, సంవర్తక మందురు.

7. వహ్నియనగా వహించువాడని • అర్థము. అగ్ని, పదార్థములను జీవులను వేడిమివలన రూపాంతరము చెందించువాడు గనుక వహ్ని అని చెప్పబడినాడు. మంచుగడ్డ, నీరు, నీటి ఆవిరి అను మూడును, నీటి అణువుల యొక్క వివిధ స్థితులు. ఇట్లు ఒక స్థితినుండి మరియొక స్థితిలోనికి రూపాంతరము చెందించువాడు అగ్నియే. అతడే పంచభూతములను ఖనిజములుగా, ప్రాణులుగా, జీవులుగా రూపాంతరములు చెందించుచున్నాడు. అట్లు రూపాంతరము చెందుటకై వానియందలి ప్రజ్ఞలను దహించి పరిశుద్ధము చేసి, పై స్థితిలోనికి పంపుచున్నాడు. అట్లు పంపుటనే తపింప చేయుట అందురు. ఇదియే తపస్సు, ఇట్టి తపస్సుకు కారణమైనవాడు వహ్ని అను అగ్ని, నారాయణుని ఈ ప్రవృత్తియే ఆదిత్య హృదయమునందు ''తపనః'' తపింపజేయువాడు అని కీర్తింపబడినది. ఈయన మానవుల మనస్సును తపింపచేసి దేవతలుగా, మహర్షులుగా మార్చుచున్నాడు. ఇట్లు పనిచేయు వహ్ని నారాయణుని యొక్క రూపమే.

8. సృష్టి ప్రారంభమునందు, మహా చైతన్యము పరమాత్మ నుండి వ్యక్తమైనది. దాని నుండి మిగిలిన సృష్టి అంతయూ, దిగివచ్చినది. ఈ మహాచైతన్యమే మొట్టమొదటి కదలిక లేక వాయువు. అట్టి వాయువు తానే కనుక, నారాయణుడు అనిలుడు.

9. భూమి సూర్యుని చుట్టు తిరుగుచు, తన చుట్టూ తాను తిరుగుచున్నది. భూమియందు అనేక శక్తులట్లు పని చేయుచుండుటవలన భూమి

ఈ విశ్వమునందు తన మార్గములోనే నిలిచియుండ గలుగుచున్నది. అట్లు భూమిని నిలిపియుంచు శక్తుల సామ్యము భగవంతుని అనుగ్రహమే కనుక, నారాయణుడు ధరణీధరుడు లేక భూమిని ధరించుచున్నవాడు. అంతేకాక భూమి తనచుట్టు తాను తిరుగుచుండుటవలన, వస్తువులను తనవైపునకు ఆకర్షించు శక్తిని పుట్టించుకొనుచున్నది. అట్టి శక్తివలననే మానవులు, వస్తువులు, భూమిపై నిలిచి యుండగలుగుచున్నారు. అట్లు భూమి యందుండి ధరించుచున్నాడు గనుక నారాయణుడు ధరణీధరుడు.

26. శ్లో॥ సుప్రసాదః ప్రసన్నాత్మా విశ్వసృడ్విశ్వభుగ్విభుః
సత్కర్తాసత్కృత స్సాధుర్జహ్నుర్నారాయణోనరః ॥

**ప్రతిపదార్థము :-** 1. సుప్రసాదః = అనుగ్రహము గలవాడు, 2. ప్రసన్నాత్మా = వరములిచ్చువాడు, 3. విశ్వసృడ్ = విశ్వమును సృష్టించువాడు, 4. విశ్వభుక్ = ప్రపంచమును అనుభవించువాడు లేక భుజించువాడు, 5. విభుః = పరిపాలించువాడు, 6. సత్కర్తా = మంచినిచేయువాడు, 7. సత్కృతః = గౌరవింపబడినవాడు, 8. సాధుః = సౌజన్యము కలవాడు, 9. జహ్నుః = జహ్నువు అనుమహర్షి, 10. నారాయణః = జీవుల మార్గము లక్ష్యము అయినవాడు, 11. నరః = నరుడను మహర్షి.

**తాత్పర్యము :-** భగవంతుని అనుగ్రహించువానిగా, వరములు ఇచ్చువానిగా, సృష్టికర్తగా, సృష్టిని పాలించువానిగా, మరియు తనలోనికి స్వీకరించువానిగా, లేక లయము చేయువానిగా, మంచిని కలిగించుటద్వారా గౌరవింపబడువానిగా, జహ్నువు, నారాయణుడు, నరుడు మరియు ప్రశాంతులైన మహర్షులుగా; ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. భగవంతుడు కరుణ కలవాడు. ఆయన స్నేహము, బాంధవ్యము, సేవ అనువానికి ప్రతీక. అనగా ఆయనవలన స్నేహము, బంధుత్వము మున్నగునవి ఏర్పడినవి. జీవులకు ఒకరి యందొకరికి ప్రేమ, ఆప్యాయత, దయ మున్నగు భావముల మూలమున నేర్పడు సుముఖత లేక ఆకర్షణయే భగవంతుడు. అట్టి భావములను కలిగియున్నవారే సజ్జనులు. కనుకనే వారు భగవదనుగ్రహమునకు పాత్రులగుచున్నారు. అట్లు అనుగ్రహబుద్ధి కలిగియున్నవాడే సుప్రసాదుడైన భగవంతుడు.

2. సజ్జనులు భగవంతుని గూర్చి తపస్సు చేయుదురు. అట్లు తపస్సు చేయువారికి ఆయన వరములిచ్చును. కాని సజ్జనులు వరములకోసము తపస్సు చేయరు. వారు లోకశ్రేయస్సునకు, ప్రజల క్షేమమునకు నిరంతరము శ్రమచేయుచు, తపింతురు. ఆ తపనయే నిజమైన తపస్సు. ఇతరుల క్షేమమునకు తపించి, పరిశ్రమించి, తోటిమానవులను సుఖపెట్టుటకు మార్గములనన్వేషించు వారికి, భగవంతుడు ప్రసన్నుడైయుండును. అనగా వారికి వరములనిచ్చును. ఆయన ఇచ్చిన వరములే వారి శక్తులుగా పరిశోధనలకు ఫలితములుగా సిద్ధించును. వేదవ్యాసుడు, వశిష్టుడు, అగస్త్యుడు, మరువు, దేవాపి, మైత్రేయుడు మున్నగు మహర్షులతో బాటు నవీన శాస్త్రజ్ఞుల వరకూ ఇట్లు తపస్సు చేసిన వారే. వారికే గనుక స్వార్థబుద్ధి యున్నచో ప్రపంచమునకు చక్రవర్తులయ్యెడి వారు. వారు తమ పరిశోధనలను, తపస్సులను ప్రజలకే ధారపోసి పుణ్యజీవనులైరి. అట్టి వారియందు నారాయణుడు ప్రసన్నుడై యుండుటయే గాక, వారి ద్వారా ఇతరులయందు సయితము ప్రసన్నుడుగా నుండును.

3. సృష్టించుట, సృష్టికర్తయైన బ్రహ్మచేయును. అనగా ఆయన ఒక్కడే చేయవలెనను నియమము లేదు. కానీ సృష్టి చేయువారికి ఆయన తాను చేసి చూపుట ద్వారా మార్గదర్శకుడగుచున్నాడు. కుండలను తయారు చేయు కుమ్మరివాడు, యంత్రమును కనిపెట్టి నిర్మించు ఇంజనీరు, ఒక పెద్ద ఆనకట్టను లేక ప్రాజెక్టును పథకము వేసి నిర్మించువారును, సృష్టికర్తలే యగుచున్నారు. ఇట్లు బ్రహ్మమొదలు అణువులవరకు ప్రతి జీవియు, ప్రాణియు సృష్టికర్త యగుచున్నారు. ఇట్లు ఇందరిలోనూ సృష్టించు సంకల్పమే సృష్టికర్త లేక బ్రహ్మ. ఆయన నారాయణునినుండి వచ్చెను. గనుక విశ్వమునందలి సృష్టించు శక్తియే నారాయణుడు.

4. అట్లు ఒకప్రక్క సృష్టింపబడగా, మరియొక ప్రక్క సృష్టింపబడిన వాటిని వాటి ప్రయోజనము తీరినవెనుక మరల చోటునందు భగవంతుడు లయము చేయుచుండును. శిథిలమై నిరుపయోగములైన యంత్రములను కరిగించి మరల యంత్రములుగా పోతపోయుదురు. అట్లే ప్రయోజనము తీరిన వెనుక, జీవుల దేహములు అణువులుగా విడగొట్టబడి పంచభూతముల యందు చేర్చబడును. అట్లు చేర్చబడిన అణువులు, నూతన శరీరముల

నిర్మాణమునకు వినియోగపడును. ఇట్లు వస్తువులను, ప్రాణుల దేహములను విడగొట్టు శక్తియే విశ్వభుక్కు; అనగా విశ్వమును తినుచున్నాడని అర్థము. చెట్లు మానవులచే, జంతువులచే ఆహారముగా స్వీకరింపబడుచున్నవి. జంతువులు ఒకదాని నొకటి ఆహారముగా తినుచున్నవి. తమో ప్రవృత్తి గల మానవుడు జంతువులను గూడా ఆహారముగా స్వీకరించుచున్నాడు. ఇట్లు ఒకదానినొకటి ఆహారముగా స్వీకరించుటవలన సృష్టి వృద్ధి పొందుచున్నది. కాని ఇవి సవ్యము, అవసవ్యము అను రెండు మార్గములుగా నుండును. తాను ఆహారము స్వీకరించుచున్ననూ, ఇతర ప్రాణులను హింసింపనక్కరలేదు. చంపనక్కరలేదు. ఫలములను, గోక్షీరములను, ఆహారముగా తీసుకొనువారు అట్లు చేయుచున్నారు. మరియు ధాన్యజాతి మొక్కలు పంటకు వచ్చినతోడనే మొక్క చనిపోవును. అప్పుడు ఆ ధాన్యమును ఆహారముగా స్వీకరించు వారు కూడా అట్టివారే. మొక్కలు సూర్యరశ్మిని, భూమియందలి ఖనిజములను. నీటిని ఆహారముగా స్వీకరించుచు వృద్ధి పొందుచున్నవి. అట్లు ఆహారముగా తీసుకొనుటవలన సూర్యుడుగాని, భూమిగాని చనిపోవుట, నశించిపోవుట లేదు. కనుక అట్లు అహింసా బుద్ధితో ఆహారము స్వీకరించుటవలననే నిజమైన అభివృద్ధి కలుగును. మహర్షులు దీనిని ప్రకృతినుండి నేర్చుకొని జీవులకు బోధించిరి. గౌతమ బుద్ధుడుకూడా ఆ మార్గమునే అనుసరించెను గనుక ఆయన తథాగతుడైనాడు. గనుక ఇదియే సవ్యము. సహజమైన మార్గము. అట్లు గాక తోటి జీవిని చంపి ఆహారముగా స్వీకరించు మార్గము అపసవ్యమైనది. దీనినే అసుర లక్షణముగా శ్రీకృష్ణుడు భగవద్గీతలో నిర్ణయించెను. అసుర లక్షణములవలన జీవులు ప్రకృతియందు బంధింపబడుచున్నారు. అహింస, భూతదయ మున్నగు దైవలక్షణముల వలన మానవుడు బంధవిముక్తి పొందుచున్నాడు. ఇట్లు జీవులయందు తినుట అను లక్షణమును కల్పించి విశ్వమునందు పదార్థములు ఒకదాని నొకటి తినుచు తుదకు సమస్తమును తనయందు లయము చేయువాడు కనుక ఆయన విశ్వమునందు తినుచున్న వాడగుచున్నాడు.

5. ఈ సృష్టి యంతయు అందలి ధర్మముల ననుసరించి నిర్వహింపబడుచున్నది. ఈ ధర్మములు భగవంతుని నుండి పుట్టినవి. కనుక భగవంతుడే ఆ ధర్మముల రూపమున విశ్వము నంతనూ పరిపాలించుచున్నాడు.

కనుక భగవంతుడు విభుడు అని పిలువబడుచున్నాడు.

6. మంచి పనులనగా ఇతరులను సుఖపెట్టునవి. ఇతరులను కష్టపెట్టునవి లేక బాధించునవి చెడ్డపనులు. ప్రతి మానవునికి, తనకు లేక తన వారికి మంచి జరగవలెనను కోరిక యుండును. కాని ఇతరులకు కూడా మంచిని కోరునట్టి సద్బుద్ధి యుండదు. దీనినే మాయ అందురు. మంచిని కోరు బుద్ధి భగవంతుని రూపము గనుక తనకుగాని, యితరులకి గాని మంచిని కోరువానికి అప్రయత్నముగా నారాయణుని సాన్నిధ్యముండును.

7. ఆదరింపబడుట, సన్మానింపబడుట అనునవి జీవుల యందు సంభవించును. ఒకరినొకరు ఆదరించుచున్నారనగా, ఒకరియందొకరికి ప్రీతి కలుగుచున్నదని అర్థము. సామాన్యులు తమకుగల కోరికలద్వారా భగవంతుని ధ్యానము చేయుచున్నారు. అనగా వారివారి కోరికల రూపమున భగవంతునే చూచుచున్నారని యర్థము. అట్టివారి యాదర్శములుగా, గుణములుగా భగవంతుడే యున్నాడు. సత్పురుషులయందు మంచిపని చేయవలెనను కోరికగా భగవంతుడే యున్నాడు. దుష్టులు సైతము తమ కోరికల గురించి భగవంతుని, దుష్టము, హింసతోకూడిన ప్రవృత్తితో, ఆరాధించుచున్నారు. ఎట్లు చేసిననూ ఆరాధించుట మంచిపని గనుక అదియే వారిని పునీతులను చేయుచున్నది. అనగా తమతమ నీచ ప్రవృత్తులనుండి ఉత్తమ ప్రవృత్తిలోనికి క్రమేణా మారుచున్నారు. ఇట్లు మారగలుగుట, ఆరాధించుట వలననే సాధ్యపడుచున్నది కనుక భగవంతుడు, సృష్టిలోనున్న అన్ని జీవులచేత, వారికి తెలిసినను తెలియకున్ననూ, ఆరాధింపబడుచున్నాడు. అనగా ఆదరింపబడుచున్నాడు.

8. సౌజన్యము స్నేహితులయందు, బంధువులయందు, ప్రేమగల వారి యందు మాత్రమే గుర్తింపబడుచున్నది. జీవులు ఒకరి యందొకరు సుజనత్వమును అభ్యసించిన, వారు భగవంతుని యందుందురు. తోటి వారియందు చూపునట్టి సాధుత్వమే భగవంతుని లక్షణము. దీని వలన జీవులు తోటివారితో కలిసి ఒక బృందముగా నేర్పడగలుగుచున్నారు. ఇట్లు జీవులను బృందములుగా తీర్చిదిద్దు నారాయణుడే సాధుత్వమను పేర, జీవులచే ఉపాసింపబడుచున్నాడు.

9. పూర్వము భగీరథుడు, పాతాళలోకములో బూడిదరాశిగ నున్న తన తాతలను తరింపచేయుటకై గొప్ప తపస్సు చేసి గంగాదేవిని భూలోకమునకు తెచ్చెను. అట్లు ప్రవహించుచున్న గంగానది, జహ్నువు అను పేరుగల మహర్షి ఆశ్రమము మీదుగా ప్రవహించుచు, ఆయన ఆశ్రమమును తన కెరటములతో ధ్వంసము చేసెను. అప్పుడు జహ్నువు, గంగానదిని మొత్తము త్రాగెను. భగీరథుడు వేడుకొనగా, ఆయన తన కుండి చెవి నుండి గంగను వదిలెను. భగీరథుడు అనగా జీవి. అతడు చోటుయందున్న అంతర్యామి ప్రజ్ఞను ధ్యానము చేసినపుడు, అట్టి అంతర్యామిప్రజ్ఞ శిరస్సునందలి సహస్రారము అను ప్రజ్ఞామయ కేంద్రము ద్వారా, శరీరములోనికి ప్రవేశించును. తేజోమయమయిన ఈ ప్రవాహము, శరీరమునందు ప్రవేశించిన వెనుక, జీవియందు మూడు నాడులుగా ప్రవహించును. అవియే ఇడ, పింగళ, సుషుమ్న అనునవి. ఇవియే మరల గంగ, యమున, సరస్వతి, అను పేర జీవనదులుగా భూమిపై ప్రవహించును. శరీరములోనికి ప్రవేశించిన మహా తేజస్సు జీవ ప్రజ్ఞయందు, పింగళ అను నాడిగా పనిచేయును. అది సూర్యాత్మకమైన నాడి. అదియే గంగ. ఈ నాడి కుడివైపున ఉండును కనుక జహ్నువు కుడి చెవి నుండి వదలెనని చెప్పబడినది. భౌతికముగా చేయు యోగసాధన యందు, శరీరమునంలి కుడిభాగము ప్రాధాన్యత వహించును. అందు చేతనే గురువులు మంత్రోపదేశము చేయునప్పుడు, కుడి చెవియందు ఉపదేశింతురు. కాశీయందు మరణించినవారికి విశ్వేశ్వరుడే స్వయముగా కుడిచెవియందు పంచాక్షరి ఉపదేశించునని చెప్పబడినది. శరీరమునందలి జీవకణములు, ధాతువులు, భౌతిక జగత్తునందు అణిగియున్నవి. అవియే సగర పుత్రుల ప్రజ్ఞలు. పంచభూతములు, మానవ శరీరమునందలి కణములుగ, అణువులుగ, ఏర్పడుచున్నవి. కనుక పాతాళమునందుండెనని చెప్పిరి. ఆ సగర పుత్రులు శపింపబడి, తాత్కాలికముగా వారి దివ్యత్వమును వదలి, దేహమునందు ధాతువులుగా కణములుగా నిలిచిపోయెనని అర్థము. ధాతు కణములయందు ప్రాణవాయువు సంయోగము చెంది దహనము చెందుట వలన (Metabolism), ప్రాణశక్తి (energy) పుట్టు చున్నదని నవీన జీవశాస్త్రము (Biology) తెలుపుచున్నది. ఇదియే సగరపుత్రులు దహనమగుటగా చెప్పబడినది. భగీరథుడు గంగానదిని తెచ్చి సగరపుత్రుల బూడిద రాశులపై ప్రవహింపచేసి

వారికి మోక్షము కలిగించెను. అనగా జీవి యోగసాధన చేయుట వలన, వానియందలి కుండలినీశక్తి ఉద్బోధనము చెంది, శిరస్సునుండి మూలాధారము వరకు ప్రవహించి, దేహమునందు, అందలి ధాతువుల యందు బంధింపబడియున్న జీవప్రజ్ఞకు, దివ్యత్వము కలిగించెనని భావము.

10,11. నరుడు, నారాయణుడు అను వారిరువురు గొప్ప మహర్షులు. అనగా ప్రజ్ఞామయ మూర్తులు. వీరే పరమాత్మ మరియు జీవప్రజ్ఞ అను రెండు వెలుగులుగా దిగి వచ్చిరి. వారు బదరికాశ్రమమునందు గొప్ప తపస్సు చేసిరి. ఆ తపస్సు యొక్క ఫలితమువలన వారు నిర్మలులు, పవిత్రులైరి. వీరిరువురు ద్వాపరయుగమున శ్రీకృష్ణుడు, అర్జునుడుగా దిగి వచ్చిరి. ఈ నరనారాయణ ప్రజ్ఞలవలె జీవుల యందలి పరమాత్మ మరియు జీవాత్మలు కలవు. జీవాత్మ అనేక జన్మములెత్తి అనుభవములను పొందుటయే తపస్సు అందురు. ఒక్కొక్క జన్మయందలి అనుభవమే ఒక్కొక్కమెట్టు. ఇట్లు చేయుతప్పస్సు వలన జీవాత్మ నిర్మలమై పవిత్రమగును. జీవాత్మ తపస్సు చేయుచుండెననగా అందలి అంతర్యామియే చేయుచుండెనని అర్థము.

27. శ్లో॥ అసంఖ్యేయో౽ ప్రమేయాత్మా విశిష్టశ్శిష్టకృచ్ఛుచిః
సిద్ధార్థస్సిద్ధ సఙ్కల్పః సిద్ధిదః సిద్ధి సాధనః ॥

**ప్రతిపదార్థము :-** 1. అసంఖ్యేయః = లెక్కించుటకు సాధ్యము కానివాడు, 2. అప్రమేయాత్మా = కొలతకు అతీతమైన ఆత్మ గలవాడు, 3. విశిష్టః = ప్రత్యేకత గలవాడు, 4. శిష్టకృత్ = శిష్టులను కల్పించువాడు, 5. శుచిః = నిర్మల మయినవాడు, 6. సిద్ధార్థః = సిద్ధించిన ప్రయోజనము కలవాడు, 7. సిద్ధసంకల్పః = సంకల్పము నెరవేరినవాడు, 8. సిద్ధిదః = పరిపూర్ణత్వమిచ్చువాడు, 9. సిద్ధిసాధనః = పరిపూర్ణతను కలిగించు యోగ సాధన ఇచ్చినవాడు.

**తాత్పర్యము:-** భగవంతుని, సంఖ్యలకతీతునిగా, కొలతలకు అందని ఆత్మరూపునిగా, ప్రత్యేకత గలవానిగా, జీవులయందు ప్రత్యేకత కల్గించువానిగా, నిర్మలమయినవారిలో నిర్మలత్వముగా, ధ్యానము చేయుము. ప్రయోజనము సిద్ధించిన వాడగుటచే తన సంకల్పము సిద్ధింపబడెను. మరియు సిద్ధికి కారణమైన

వానిగా అట్లు సిద్ధించు మార్గము కూడా తానే అయిన వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. భగవంతుడు సంఖ్యల కతీతుడు, ఆయననుండి సంఖ్యలు పుట్టెను. మనస్సునుండి రూపములు అసంఖ్యాకములుగా పుట్టును. లెక్కించుచున్న కొలది, రూపములు వచ్చుచునే యుండును. కనుక మనస్సు సంఖ్యల కతీతము. అట్లే చోటునుండి, గ్రహములు, గోళములు, మానవులు, ప్రాణులు మున్నగునవి అసంఖ్యాకముగా పుట్టుచున్నవి. కొన్ని నశించుచుండగా మరల కొన్ని పుట్టుచున్నవి. ఈ చోటు లేక విశ్వము, భగవంతునినుండి పుట్టునది కనుక, అతడు సంఖ్యల కతీతుడు.

2. కొలత అనునది మనస్సునుండి పుట్టినది. మనస్సు దేనినైనను కొలత వలన గ్రహింపగల్గును. వాడు వీడికన్న మంచివాడనియు, ఇతడు మరియొకనికన్న చెడ్డవాడనియు, పొడుగనియు, పొట్టి అనియు మున్నగునవి, మనస్సు, పోలికవలన తెలిసికొనుచున్నది. ఇది తియ్యగానున్నదని చెప్పుటకు, పంచదారవలె నున్నదని చెప్పుదురు. ఇట్లు పోలికలు లేక స్వతంత్రముగా తెలియుట, మనస్సునకు సాధ్యముకాదు. భగవంతుడు ఈ మనస్సునకు అతీతుడు కనుక, ఆయనకు పోలిక లేక కొలతలేదు.

3. ప్రతివస్తువు మరియొక దానికన్న భిన్నముగా నుండును. ఒక దానికన్న మరియొకటి దానితరహా మరియు తీరుతెన్నులయందు వేరుగా నుండును. లోకమునందు మానవులెందరున్ననూ ఎవరితరహా వారిది. ఇట్లు జీవులలోని భిన్నత్వమునకు, ప్రత్యేకతకు కారణమైనవాడు, భగవంతుడు. కనుక ఆయన విశిష్టుడు.

4. జీవులను ప్రత్యేకమైనవానిగా భగవంతుడే కల్పించును. మానవుల యందు మంచివారు, తమతోటి వారికన్నా భిన్నముగానుందురు. ఇట్టి భిన్నత్వము, మొదట జీవులకు ఇంద్రియములయందు, కల్పింపబడును. దీనివలన ఒకరికి నచ్చినది వేరొకరికి నచ్చకుండుట యుండును. ఈ భిన్నత్వమే మనస్సునందు ఉద్దేశ్యములుగా, ఆశయములుగా, మరియు ఆదర్శములుగ నుండుటచే ఒకరికన్నా ఇంకొకరు భిన్నులు, శిష్టులు అగుచున్నారు. ఇట్టి ఆదర్శములను

జీవులయందు కల్పించి, వారిని యితరుల కన్నా శిష్టులుగా చేయుటవలన, నారాయణుడు ''శిష్టకృత్'' అని పిలువబడుచున్నాడు.

5. యోగసాధన వలన మనసునందలి స్వార్థము నశించును. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అను ఆరు విధములైన మలినములు తొలగింపబడుటచే మనస్సు, శరీరము నిర్మలములగును. ఇట్టి నిర్మలత్వము కలిగించుచున్నాడు కనుక నారాయణుడు శుచిః లేక నిర్మలుడు.

6. మానవుడు అనేక కోరికలచే జీవితమంతయు పెనుగులాడుచుండును. కాని వానియందుగల భగవంతుడు ప్రయోజనము సిద్ధించిన వాడే అగుచున్నాడు. వాని ప్రయోజనము జీవునియందు తానుండుటయే. అట్లు భగవంతుని తనయందు దర్శించిన మానవుడు కూడా, తన కోరికల పర్యవసానము, ప్రయోజనము గ్రహించి, పరమార్థము సిద్ధించిన వాడగుచున్నాడు.

7. జీవితమునందలి తాత్కాలిక ప్రయోజనములలో కొన్ని సిద్ధించును, కొన్ని సిద్ధింపవు. అనగా అవి నెరవేరుట, నెరవేరకపోవుట సృష్టి సంకల్పముననుసరించి యుండును. ఆ సృష్టి సంకల్పము జీవులయందు పనిచేయునప్పుడు జీవుల సంకల్పమగును. అట్లు జీవసంకల్పముగా మారినప్పుడు పనుల గురించి ప్రయత్నించుటను జీవులు సిద్ధించునట్లు పొరపడెదరు. అనగా పనులగురించి ప్రయత్నించుట అను సత్యము నశించి, జరిగి తీరవలెను అను అసత్యము మేఘమువలె క్రమ్ముకొనును. అట్లు క్రమ్ముకొనుటవలన, సూర్యరశ్మి అను భగవత్ సంకల్పము జీవునికి మాటుపడును. చీకటి, తుఫానువంటి కష్టములు, జీవితమునందు కలుగును. తన సంకల్పము భగవత్ సంకల్పముగా సిద్ధింప చేసుకొన్నవానికి, పనులగుట, కాకపోవుట ఉండదు. పనులకై యత్నించుట మాత్రమేయుండును. ఇది వర్షముకురియుట వంటిది. వర్షము కురియునపుడు మానవుడు ఆ నీటిని సద్వినియోగము చేసుకొనలేక పోవచ్చును. అంతమాత్రముచేత వర్షించుట మాననక్కరలేదు. వర్షించుట దైవసంకల్పము. వినియోగించుకొనుట, వినియోగించుకొనలేకపోవుట మానవుని సంకల్పము. అట్లే జీవులయందలి సిద్ధించుట, సిద్ధించకపోవుట అను అభిప్రాయములవెనుక, యత్నించుట అను తన సంకల్పమును భగవంతుడు నెరవేర్చుకొనుచునే యున్నాడు. కనుక ఆయన

సిద్ధ సంకల్పుడు.

8. ఇట్టి తన సంకల్పమును జీవులయందు మేల్కొలుపుటకు, భగవంతుడు వారిని అనుగ్రహించి యోగసాధనను ఇచ్చెను. మరికొంతమంది జీవులను, ఏ యోగ సాధన అక్కర లేకయే అనుగ్రహించుచున్నాడు. కొందరికి వారి బుద్ధియందు స్ఫురణగా తన మార్గమును ఇచ్చుచున్నాడు. కనుక భగవంతుడే జీవులకు సిద్ధిని కల్గించుచున్నాడు.

9. ఇట్లు సిద్ధించుటకు, భగవంతుడు అనేక సాధనములను కూడా కల్పించుచున్నాడు. సాధనమేది అయినను ముఖ్యమైన సాధనము శ్రద్ధ. ఇది జీవులకు వారి వారి కోరికలయందు పనిచేయుచు, క్రమేణా మంచి పనులయందు, మంచికోరికలయందు ఆసక్తి కలిగించును. దీనినే భక్తియందురు. తాను చేయు మంచిపనులు తోటి వారియందు ప్రేమతో చేసినచో, అదియే మోక్షము కలిగించును. కనుక, అట్టి మోక్షమును కలిగించు సాధనము ఇచ్చినవాడు కనుక, నారాయణుడు సిద్ధిసాధకుడు అని పిలువబడినాడు.

28. శ్లో॥ వృషాహీ వృషభో విష్ణుర్వృషపర్వో వృషోదరః
వర్ధనో వర్ధమానశ్చ వివిక్తశ్శ్రుతి సాగరః ॥

**ప్రతిపదార్థము** :- 1. వృషాహి = గొప్ప సర్పము, లేక వృషభమునకు, శత్రువు, 2. వృషభః = వీర్యవంతమైన ఎద్దు, 3. విష్ణుః = విష్ణువు, వ్యాపించువాడు, 4. వృషపర్వః = నైసర్గిక మార్పులే బీజములుగా గలవాడు, 5. వృషోదరః = ఎద్దువంటి ఉదరము కలవాడు, 6. వర్ధనః = అభివృద్ధి యైనవాడు, 7. వర్ధమానః = అభివృద్ధి పొందువాడు, 8. వివిక్తః = వేరుగానుండు వాడు, 9. శృతిసాగరః = వేదముల పరమార్థము తెలిసిన వాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, వృషభాసురుని సంహరించినవానిగా, గొప్ప వృషభముగా, అంతటనూ వ్యాపించువానిగా, భూమిని ఫలవంతము చేయు నైసర్గిక బీజములు గలవానిగా, వృషభము వంటి ఉదరము గలవానిగా, అభివృద్ధియైన వానిగా, మరియు జీవులలో అభివృద్ధి పొందువానిగా, సృష్టియందు ఉన్ననూ దానినంటక వేరుగా నున్నవానిగా, అంతటనూ

వ్యాపించియున్న వానిగా, వేదముల పారము తెలిసిన వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :-** ధేనుకాసురుడను రాక్షసుడు తనను చంపుటకు ఆవుల మందతో కలిసి రాగా, శ్రీకృష్ణుడు వానిని సంహరించెను. వేదములయందు దీని రహస్యము వర్ణింపబడినది. ఇది రాశిచక్రమునందలి విషయము. వృషభరాశినుండి వృశ్చికరాశి వరకు గల రహస్యము ఇందు చెప్పబడినది. వృషాహియనగా, సర్పముగా నున్న జీవి వృషభముగా పరిణామము చెందెనని భావము. వృషభరాశి వీర్యవంతమైన పురుషశక్తికి సంకేతము. వృశ్చికరాశి, స్త్రీ, పురుష భేదములకు, కామమునకు, సంకేతము. అనగా శక్తి లింగభేదము లోనికి రూపాంతరము చెందుటకు యిది గుర్తు. దీనికి సంబంధించిన మార్గమే వృషభరాశినుండి, మిథున కర్కాటకముల మీదుగా వృశ్చికరాశి వరకూ గల రాశిచక్ర గమనము. ఇదియే సాంసారిక మానవునికి జాతకచక్ర గమనము. ఇది రాశిచక్రమునందలి ఒక అర్ధ వృత్తము మాత్రమే. మరియొక అర్ధవృత్తము, వృషభ రాశినుండి మేషము మీనముల మీదుగా వృశ్చికమువరకూ గల అపసవ్య మార్గము. దీనినే అప్రదక్షిణ మార్గము అని అందురు. ఈ మార్గమున శక్తులు, భౌతిక నామరూపాదులు, బంధములు తొలగి, నిర్మలమైన ప్రజ్ఞగా మార్పు చెందును. అనగా కామములేని దివ్య సృష్టియందు ప్రజ్ఞ మేల్కొనును. ఈ మార్గమును పురుష శక్తి తేజోమయమైన సృష్టి చేయును. అట్టి స్థితినే ద్విజత్వము అందురు. ఈ రెండవ మార్గమును విషువద్గమనము అని కూడా అందురు. దీనినే జ్వాలాకూల్ మహర్షి చక్రమును వెనుకకు త్రిప్పుటగా తన Esoteric Astrology అను గ్రంథమున వివరించెను.

2. ఆకాశమునందు శబ్దమే బీజముగా నేర్పడి జీవమును పుట్టించును. అనగా ఆకాశము, అందలి గ్రహ గోళములు, శబ్దము వలన పుట్టుచున్నవి. దీనినే ఋషభము అందురు. సృష్టియందలి ఈ ఋషభము అను దేవతయే, మానవులయందు గర్భధారణను కలిగించు వీర్యమను ధాతువుగా, నేర్పడుచున్నది. ఇది మనస్సునందు ఆవేశముగా పని చేయును. ప్రాణమయలోకములయందు శబ్దముగా పనిచేయును. ఈ శబ్దమువలన ధ్వనికి, వాక్కునకు భేదము తెలియుచున్నది. సంకల్పము చేత ఉచ్చరింపబడు శబ్దమును, వాక్కందురు.

ఇదియే మంత్రమని కూడా చెప్పబడినది. స్వరపేటికయందు వాయువు యొక్క రాపిడివలన రేఫము పుట్టును. అదియే ఋషభము అని పిలువబడినది. ఈ రేఫము జీవుని సంకల్పముచే పుట్టుచున్నది. కనుక వాక్కు రూపముగా ప్రజ్ఞ వెలువడుచున్నదనియూ, జీవుడు తనని తానే వాక్కుగానుచ్చరించుచున్నాడనియూ చెప్పబడినది. ఇట్లు శబ్దమునుచ్చరించుటవలన, ఆ శబ్దతరంగములచే మనస్సు, పంచేంద్రియములు క్షాళనమగుటయే గాక, పరిసరములను కూడా నిర్మలము చేయును. అంతేగాక, శబ్దములనుచ్చరించుటవలన, తోటివారి మనస్సులుకూడా నిర్మలమగును. మనస్సు నిర్మలమైనవారికి వ్యాధి యుండదు. వ్యాధులు మనస్సునందు పుట్టి, శరీరముపై వ్యాపించును. కనుక మనస్సు నిర్మలమైనంతనే, శరీరముపైగల వ్యాధి లక్షణములు నిర్మూలనమగును. ఇట్లు శబ్దములను, మంత్రములుగా నుచ్చరించుటవలన, దేహకోశములన్నియూ పరిశుద్ధినొంది, మనసు స్వచ్ఛమై, అంతర్యామిని పూర్ణచంద్రుని వలె పూర్తిగా ప్రతిబింబించును. అట్లు మనస్సు పరిపూర్ణమగుటకే ద్విజత్వమనియు, రెండవ జన్మమనియు చెప్పుదురు. దీనినే కాళిదాస మహాకవి కుమారసంభవమనుపేర మహాకావ్యముగా రచించెను. ప్రకృతిని తల్లిగా, అందలి ప్రజ్ఞగానున్న అంతర్యామిని తండ్రిగా, ధ్యానము చేయుటవలన, జీవునియందలి మానవత్వము నశించి, పరమాత్మయే మరల కుమారుడుగా, జీవునియందు జన్మించుచున్నాడు. ''జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ''. ప్రకృతి పురుషులను తల్లిదండ్రులుగా కీర్తించుట వలన, జీవుడు కుమారుడగుచున్నాడు. ఇదియే పురాణములయందు వృషభమునెక్కి వచ్చుచున్న ఆది దంపతుల కథగా చెప్పబడినది. శివాలయములందు నంది, శివునికి అభిముఖముగా కూర్చుని యుండుట ఈ కథకు సంకేతము.



3. ఈ విశ్వమంతయూ వ్యాపించి యున్నవాడు, విష్ణువు. ఆయనయే చోటునందు, అగ్ని లేక ''నేను'' అను వెలుగు రవ్వగా మేల్కొనుచున్నాడు. ఈ అగ్ని, విష్ణువు అను ఇరువురునూ కలిసి, అశ్వనీదేవతలగుచున్నారు. ఈ నేను అను బిందువే, మొత్తము విశ్వమునకు కేంద్రమగుచున్నది. మొత్తము చోటునందు అంతర్యామిగా నున్నపుడు ఈ నేను, విష్ణువగును. చోటులో ఒక బింధువునందు మేల్కొనునపుడు ''అగ్ని''యగును. విష్ణువు ''1'' అను అంకెచే తెలియబడుచున్నాడు. అగ్ని ''0'' లేక పూర్ణము. ఈ సృష్టియంతయు

''9'' అను సంఖ్యచే తెలియబడుచున్నది. భూమి, నీరు, వాయువు, అగ్ని, చోటు, మనస్సు, బుద్ధి, అహంకారము, అందలి అంతర్యామి అను 9 విధములుగా ప్రకృతి ఏర్పడినది. ఇదియే శంబరాసురుడి కోట అని విష్ణు సూక్తములందు వర్ణింపబడినది. ఈ శంబరాసురుని, వాని కోటను విష్ణువు ముట్టడించి జయించెను. అనగా ఒకటి మరియూ 9 కలుపగా 10 అగుచున్నది. అనగా రాక్షసుడు నశించి, మరల అగ్ని విష్ణువులు మిగులుచున్నారు.

4. పర్వములనగా కణుపులు. సంవత్సరచక్రము ఇట్టి కణుపులనేకములు కలిగియున్నది. అవి విషువములు, రాశిచక్రము, భావబిందువులు, తిథులు మున్నగునవి. ఒక్కొక్క కణుపు ఒక్కొక్క విధమగు మార్పునకు కారణమై, నైసర్గిక భేదములను, వాతావరణమును పుట్టించి, భూమిని ప్రకృతి సౌందర్యముతో తీర్చిదిద్దును. ఈ ప్రకృతి వైభవమంతయు, భూమిచుట్టూ తిరుగుచున్నట్లు కనిపించుచున్న సూర్యునివలన, ఇతర గ్రహముల వలన, ఏర్పడుచున్నది. ఇట్లు భూమిం ‌ ‌ ‌ ‌ంలి వివిధ నైసర్గిక వాతావరణ భేదములకు కారణమగు పర్వములే తన బీజములుగా, వీర్యశక్తిగా పనిచేయు భగవంతుడు, వృషపర్వుడు అని కీర్తింపబడినాడు.

5. ఆకాశము భూమిపై బోర్లించిన మూకుడువలె నుండును. ఈ ఆకాశమునుండియే సమస్తము పుట్టుచున్నది. మరియూ ఈ ఆకాశమే సమస్తమును పుట్టించుచున్నది. ఇట్లు పుట్టించుశక్తిగల ఈ ఆకాశము, వృషభముయొక్క ఉదరముగా వర్ణింపబడినది. ఇదియే కొన్ని చోట్ల గోగర్భమని కూడా చెప్పబడినది.

6. సృష్టియందలి జీవులు వస్తువులు వృద్ధిపొందుటకు, పరమాత్మ సంకల్పమే కారణము. ఆయన సంకల్పమే, వృద్ధిచెందు శక్తిగా పనిచేయుచున్నది. కనుక భగవంతుడు వర్ధనుడు అగుచున్నాడు.

7. అట్లు వృద్ధి పొందుచున్న సృష్టియందలి జీవులు పదార్థములు కూడా పరమాత్మయే. ఆయనయే అణువులుగా దిగివచ్చి భూమియందు ఖనిజములుగా నేర్పడి, వాటినుండి మొక్కలు, మొక్కలనుండి జంతువులు, జలచరములు, భూచరములు, మానవులుగా పరిణామముచెంది

చివరికిదివ్యత్వము నందుచున్నాడు. ఇట్లు సృష్టియందు, పదార్థములుగా, జీవులుగా వృద్ధి పొందుచున్నాడు గనుక ఆయన వర్ధమానుడు.

8. ఈ విశ్వమునందు అంతటనూ పరమాత్మ వ్యాపించి యున్నాడు. ప్రతి దేశమునందునూ తానేయున్నాడు. అట్లుండుట యితరులకు సాధ్యముకాదు. అనగా ఉన్నచో భగవంతునివలె అన్నిటియందు ఉండుట సాధ్యముగాని, ఇతరముగా నుండుట సాధ్యముకాదు. అట్లు, ప్రత్యేకత కలిగియున్నాడు కనుక, భగవంతుడు, ''వివిక్తః'' అని పిలువబడినాడు.

9. శృతి అనగా శబ్దము. చోటునందు శబ్దము వ్యాపించి యున్నది. ఇది ఉచ్ఛరించువానిలో వాక్కుగా మేల్కొని వినువానియందు ప్రతిబింబించుచున్నది. దీనినే శృతివిద్య యందురు. ప్రజ్ఞ, ఉచ్ఛరించు వానినుండి వినువానిలోనికి ప్రవహించుటవలన, చోటునందు మేల్కొనుచున్నది. ఇట్లు మేల్కొను ప్రజ్ఞయే ''సరస్వతి'' అని పిలువబడినది. వాక్కు ద్వారా మేల్కొనుచున్నది గనుక ''వాణి'' అని పిలువడినది. ఇట్లు శబ్దము, ఉచ్చరించువాడు, వినువాడు, అను మూడు బిందువులతో నేర్పడు త్రికోణమే, మానవునికి త్రయీవిద్య యందలి మొదటి పాదము. ఉచ్ఛరించు వానియందు వాక్కుగా మేల్కొని వినువానియందు ప్రసరించుటవలన, విద్యుత్తు లేక మెరుపుతోకూడిన మార్గమేర్పడి, ధారణ చేయబడుటవలన మొత్తము విశ్వము ప్రకాశవంతమగుచున్నది. ఇట్లు దేని వలన విశ్వము వెలిగింపబడునో, దానినే వేదమందురు. భగవంతుడు ఇట్టి వేదము లేక శృతి అనుదానికి సాగరమైయున్నాడు.

29. శ్లో|| సుభుజో దుర్ధరోవాగ్మీ మహేంద్రో వసుదోవసుః
నైక రూపో బృహద్రూపః శిపివిష్టః ప్రకాశనః ||

**ప్రతిపదార్థము** :- 1. సుభుజో = మంచి భుజశక్తికలవాడు, 2. దుర్ధరః = జయించుటకు సాధ్యముకానివాడు, 3. వాగ్మీ = మంచి వాక్కు మరియు భాష కలవాడు, 4. మహేంద్రః = ఇంద్రులకు ఇంద్రుడు, 5. వసుధః = సంపద నిచ్చువాడు, 6. వసుః = సంపద, 7. నైకరూపః = ఒకే రూపమున గాక అనేకములుగా నుండువాడు, 8. బృహద్రూపః = అన్ని రూపములకన్నా గొప్పదైన రూపము కలవాడు, 9. శిపివిష్టః = కిరణములయందు లేక లోకములయందు ఉన్నవాడు, 10. ప్రకాశనః = ప్రకాశించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను అపారమైన భుజబలము గలవానిగా, జయించుటకు వీలుకాని వానిగా, గొప్ప వాక్‌శక్తి గల వానిగా, ఇంద్రులకు ఇంద్రునిగా, సంపదలిచ్చువానిగా, సంపదలన్నియూ తానేయైన వానిగా, అనేక రూపములు గలవానిగా, అన్నిటికన్నా గొప్పదైన రూపము గలవానిగా, అన్ని లోకములయందు లేక కిరణములయందు నుండువానిగా, సమస్తమునూ వెలిగించువానిగా, ధ్యానముచేయుము.

**వివరణ** :- 1.2. మానవజాతి ధర్మమార్గమును తప్పినపుడల్లా భగవంతుడు మానవులమధ్య యుద్ధములను కల్పించి శిక్షింపచేయును. ఇట్లు యుద్ధము వలన ఎవరు గెలిచి ఎవరు ఓడిననూ, భగవంతుని సంకల్పమే, భుజబలముగా ప్రదర్శితమగుచున్నది. ఒకవేళ మంచివాడు తాత్కాలికముగా ఓడిపోయిననూ, అతడు మరల భుజబలము సాధించి దుష్టులను నిగ్రహించుచున్నాడు. లేదా అట్టి శక్తిగల యితరుల నాశ్రయించి వానిద్వారా దుష్టుని జయించి మరల ధర్మమును స్థాపించుకొనుచున్నాడు. ఇట్లు యుద్ధములు చేసుకొనుటలో మానవుడు ఒకరినొకరు జయించుకొనుచున్నారు. కానీ తమయందుగల జయింపవలెను, పోరాడవలెను, అను కోర్కెను మాత్రము జయింపలేరు. కనుక భగవంతుడు అపారమైన భుజబలము కలవాడు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ''పరిత్రాణాయ సాధూనాం వినాశాయ చ దుష్కృతాం, ధర్మ సంస్థాపనార్థాయ, సంభవామి, యుగే యుగే'' అని చెప్పెను. సజ్జనులను రక్షించుట కొరకు, దుష్టులను శిక్షించుటకొరకు, ధర్మమును స్థాపించుటకొరకు, అన్ని యుగములయందు తానవతరించుచున్నానని చెప్పెను. అట్లు అవతరించుట వేరుగాకాక, ధర్మమునకై పోరాడువానిలోనే అవతరించి, వారికిని దుష్టులకునూ యుద్ధములు కల్పించి, దుష్టులను జయించుచున్నాడు. ఒకవేళ సజ్జనులు తమంతతాము యుద్ధము చేయకపోయిననూ, దుష్టులలోనున్న యుద్ధము చేయవలెనను కోరికగా తానే పనిచేసి, యుద్ధములను కల్పించుచున్నాడు. ఇట్లు ధర్మమునకై పోరాడు వీరులయందు గల భుజశక్తి తానే.

3. ఈ సృష్టి అంతయూ పరమాత్మయొక్క వాక్కు. ఆయన తనని తానే, ఓంకారముగానుచ్చరించుచున్నాడు. సముద్రమునుండి కెరటము పైకిలేచినట్లు, సూర్యునినుండి వెలుగు వచ్చినట్లు, పరమాత్మనుండి సృష్టి

దిగివచ్చినది. అట్లు దిగివచ్చుటకు ముందు ఈ సృష్టియంతయూ, ఓంకారమను నాదముయొక్క బిందువై, పరమాత్మ యందున్నది. దీనినే అక్షరమందురు. అనగా నాశము లేనిదని అర్థము. ఈ ఓం కారమే నాదముగానుచ్చరింపబడి సృష్టిగా వ్యక్తమయినది. ఆ నాదమునందలి లేక వాక్కునందలి శ్రుతి, తాళము, లయ, భావము, రాగము, భాష, పదములు మున్నగు వివరములే ఈ సృష్టి. అనగా నారాయణుడే, తన వాక్కు యొక్క రూపముగా, వ్యక్తమగుచున్నాడు. కనుక ఆయన ''వాగ్మి''.

4. ఇంద్రుడనగా దేవతలకు రాజు. ఆయన సృష్టియందలి పరిపాలనకు, రాజత్వమునకు అధిపతి. అట్టి ఇంద్రత్వము పరమాత్మ నుండి వచ్చినది. కనుక భగవంతుడు ఇంద్రులకు ఇంద్రుడు లేక రాజులకు రాజు.

5. ఆస్తిక్యత, భగవద్భక్తి కలిగిన మానవునికి, సృష్టియందలి వైభవములన్నియూ ''వసు'' వగును. సంపదలన్నియూ వాని సంకల్పము ననుసరించి సిద్ధించుచుండును. ఎందుచేతననగా అట్టి స్థితిలో నున్నవాడు యోగియై, లోకకళ్యాణమునకు పనిచేయును గనుక వాని అధీనమున అన్ని శక్తులు సంపదలు పనిచేయును. దయామయుడైన ఏసుక్రీస్తు ఒకనాడు తనను దర్శించుటకు ఒక గ్రుడ్డివాడు రాగా, అతనిని చూచిన ఆయన హృదయము కరుణతో ద్రవించి, అతనికి దృష్టిరావలెనని అనిపించెను. వెంటనే ఆ గ్రుడ్డివానికి చూపువచ్చెను. ఇట్లు భగవంతుని శక్తులు సంపదలు, సృష్టియందలి జీవులకు సంక్రమించుచుండును. అట్లు సంక్రమించుటకు కారణము భగవంతుడే గనుక, అతడు సంపదలిచ్చువాడు.

6. అట్లు లభించు సంపద లేక శక్తి భగవంతుడే. ఆయనయే సంపదయొక్క రూపమున జీవులకు సిద్ధించెను. దీనిని తెలసినవాడు, తనకు లభించిన సంపదను సద్వినియోగము చేయును. ఆహారాది ధాన్యముల మూలముననూ, క్షీరము మున్నగువాని రూపముననూ, సంపదలు వచ్చును. మానవుడు దీనిని తోటిజీవులతోకలిసి అనుభవించినచో, ఈ సంపద తరుగదు. ఇచ్చట తోటి జీవులనగా, మానవులేగాక పశుపక్ష్యాదులు కూడ. అట్లు తనకు లభించిన సంపదను దేవ ప్రసాదముగా చూడక స్వార్థబుద్ధితో దుర్వినియోగము

చేయుట, హెచ్చుధరల కమ్ముట, దాచి కుళ్ళబెట్టుట, మున్నగునవి చేయువానిని కరువు కాటకములు, వర్షము కురియకుండుట, వరదలు, వ్యాధులు, దొంగలు అనువాని రూపమున భగవంతుడు శిక్షించును. ప్రకృతియందలి ఈ వైపరీత్యములన్నియూ ఆ ప్రాంతమునందలి మానవజాతియొక్క మనస్సులపై నాధారపడి పనిచేయును. దీనిని తెలిసినవాడు, సామరస్యముతో ఇతరులకునూ తనకునూ కలిపి, సుఖమును సాధించుకొనుచున్నాడు. ఇది హెచ్చరించుటకే, లక్ష్మీదేవి చంచల అని వర్ణింపబడినది. అనగా ఒకచోట కూడబెట్టుటకు సాధ్యముకాదని భావము. ధాన్యాదులు క్రుళ్ళి, నశించును. ధనమైనచో దొంగలెత్తుకొని పోవుదురు. నల్ల ధనమైనచో అధికారులెత్తుకొని పోవుటయేగాక పై పెచ్చు శిక్షింతురు. ఈ సత్యము గ్రహించినవాడు నేర్పరియై, తన సంపదను ఇతరులకు కూడ పంచి సుఖమును పొందును. శ్రీసూక్త ఫలశ్రుతియందు దీనిని గూర్చియే ''ధనమగ్నిర్ధనం వాయుః ధనం సూర్యోధనం వసుః ధనమింద్రో బృహస్పతిః వరుణం ధనమశ్నుతే'' అని వర్ణింపబడినది.

7. ఈ సృష్టి సమస్తమూ, భగవంతునియొక్క ఒకేఒక రూపము. దీనినే అర్జునుడు గీతోపదేశ సమయమున దర్శించి, ''అనేక బాహూదర వక్త్రనేత్రం'' అని స్తోత్రము చేసెను. అట్లయిననూ, సృష్టయందు మరల వేరు వేరు రూపములలో తానే యున్నాడు. అంతేగాక అవతారములుగా దిగివచ్చినాడు. శ్రీరాముడు, పరశురాముడు ఇరువురునూ నారాయణుని అవతారములే అయిననూ, సృష్టియందు ఒకే సమయమున వేరు వేరు రూపములతో నిలిచి, సంభాషించి ప్రవర్తించిరి. శ్రీకృష్ణుడు ఇట్లే తన భార్యల గృహములయందు ఒకే సమయమున అన్నిరూపములతో నున్నట్లు నారదుడు దర్శించెను. ఇట్లు అనేక రూపములతో సంచరించువాడు నారాయణుడు.

8. ఎన్ని రూపములతో నున్ననూ ఈ రూపములన్నిటికన్నా పెద్దదియైనది విశ్వమను రూపము. మిగిలిన రూపములన్నియూ ఈ విశ్వమను రూపములో ఇమిడి పోవును. కనుక ఆయన రూపము అన్నిటికన్నా పెద్దది.

9. శిపి విష్టుడనగా అన్ని లోకములయందు తానేయున్నవాడు. ఈ సృష్టియందు లోకములన్నియయూ ఒకదానిలో నొకటి యిమిడియున్నవి. సూర్యకిరణమందలి ఏడు రంగులుగా ఈ లోకములున్నవి. సృష్టియందు పరిధి

లేని ఒకటి చక్రము గలదు. దానిని ''అనేమి చక్ర'' మందురు. ప్రతి అణువునూ ఒక కేంద్ర బిందువు. ఇట్లు అసంఖ్యాకములైన కేంద్ర బిందువులు కలిగిన ఈ సృష్టికి పరిధి లేదు. ఇట్లు ఈ కేంద్ర బిందువులన్నియూ తానేయైన వాడు భగవంతుడు. ఒక కేంద్రము చుట్టునూ అసంఖ్యాకములైన వృత్తములను ఊహించినచో ఈ వృత్తముల సంఖ్యకు అంతులేదు. అనగా వాని వ్యాసము అపరిమితము. ఇట్లు పరిమితమయిన సూక్ష్మజీవి (బాక్టీరియా) యొక్క లోకమునుండి విశ్వము వరకూ అనేక లోకములు ఒకే కేంద్రము చుట్టూ నేర్పడి యున్నవి గనుక, పరిధులు లేని ఈ మహా లోకమునకు భగవంతుడే కేంద్రమైయున్నాడు.

10. అగ్ని లేక వెలుగునకు ఒక ఉపాధికావలెను. మంటకు కట్టె ఆధారము. జీవునికి శరీరము, మనస్సు ఆధారము. సూర్యునకు చోటునందలి ప్రజ్ఞ ఆధారము. కనుక అన్ని ప్రజ్ఞలకు, వెలుగులకు ఆధారము కావలెను. ఈ ఆధారములన్నియూ అంతర్యామియైన పరమాత్మపై నాధారపడియున్నవి గనుక భగవంతుడే నిజమయిన ప్రకాశము. అనగా ఆయన వలననే మరియు ఆయన యందే వెలుగు పుట్టుచున్నది.

30. శ్లో॥ ఓజస్తేజో ద్యుతి ధరః ప్రకాశాత్మా ప్రతాపనః
బుద్ధ స్స్పష్టాక్షరో మంత్రశ్చంద్రాంశుర్భాస్కరద్యుతిః ॥

**ప్రతిపదార్థము :–** 1. ఓజః = ఓజస్సు, 2. తేజః = తేజస్సు, 3. ద్యుతిధరః = కాంతిని ధరించినవాడు, 4. ప్రకాశాత్మా = ఆత్మయను వెలుగును ధరించినవాడు లేక వెలుగుయొక్క ఆత్మ, 5. ప్రతాపనః = తపింపచేయువాడు, 6. బుద్ధః = వృద్ధి పొందువాడు, 7. స్పష్టాక్షరః = అక్షర రూపమైనవాడు లేక నశింపని వెలుగైనవాడు, 8. మంత్రః = శబ్దముల వలన వ్యక్తమగు వెలుగు, 9. చంద్రాంశుః = చంద్రుని కిరణము, 10. భాస్కర ద్యుతిః = సూర్యుని కిరణము.

**తాత్పర్యము :–** పరమాత్మను, ఓజస్సుగా, తేజస్సుగా, వెలుగును ధరించిన వానిగా, వెలుగుచున్న ఆత్మగా, వెలుగుయొక్క ఆత్మగా, తపింపచేయు వానిగా, అక్షరమయిన సృష్టి రూపముగా వృద్ధి పొందు వానిగా, మంత్రములన్నటికీ బీజమయిన '' ఓం'' కారముగా, చంద్రుని వెన్నెల సూర్యుని వెలుగు తానే

అయిన వానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :-** ఓజస్సు అనగా ఓంకారమును పుట్టించునది అని అర్థము. లేక ఓంకారము వలన పుట్టునది అని కూడా అర్థము. ఈ ఓంకారమే సృష్టినందలి మొట్టమొదటి వెలుగు. దాని నుండి సమస్తము దిగివచ్చినది. నేనను ప్రజ్ఞ యొక్క మొట్టమొదటి రూపము లేక నాదము ఓంకారము. మన శరీరమునందు హృదయగతమైన ప్రజ్ఞగా ఇదియే పని చేయును. గనుక దీని వలననే గుండె కొట్టుకొనుచున్నది. తల్లి గర్భము నందలి బిడ్డకు ఈ ఓంకారమే కేంద్రమై వేరుగా తనచుట్టూ శరీరనిర్మాణము చేసుకొనుచున్నది. అట్టి ఓంకారమునకు కారణమైనవాడు గనుక పరమాత్మయే ఓజస్సు.

2. అట్టి ఓంకారము జీవుల మనస్సు నందు, ఇంద్రియములందు ఆయా ప్రజ్ఞలుగా పని చేయుచు అనేక రూపములుగా సృష్టిని చూచుచున్నది. అట్టి వెలుగును కల్పించువాడు గనుక, భగవంతుడు తేజస్సు యొక్క రూపము. భగవద్గీతలో దీనినే ''తేజః తేజస్వినామహం'' అని చెప్పెను. మనస్సు, ఇంద్రియములు మున్నగునవాని యందు గల ప్రజ్ఞ తానేయని భావన.

3. ద్యుతి యనగా అగ్ని లేక వెలుగు. పరమాత్మ, సృష్టి మొదట కేంద్రముగా మేల్కొనినప్పుడు, ఆయన అగ్ని లేక వెలుగు అని పిలువబడుచున్నాడు. ఈ వెలుగే జీవునిగా మేల్కొనినప్పుడు వాని చుట్టూ అహంకార మను పొర ఏర్పడుచున్నది. అట్లు అహంకారముతోకూడిన పరమాత్మ అంశ, జీవాత్మ ఏర్పడినపుడు దానిచుట్టూ మనస్సు, యింద్రియములు అను అనేక పొరలేర్పడుచున్నవి. ఇట్టి పొరలతో కూడిన జీవుడు పరమాత్మ అను వెలుగును ధరించుచున్నాడు. అంతేకాక ఈ పంచేంద్రియముల వెలుగులు, జీవుడను వెలుగు, భగవంతునినుండి దిగి వచ్చినవి గనుక, భగవంతుడు జీవులను వెలుగులను ధరించిన వాడగును.

4. అట్టి పరమాత్మయను మహాతేజస్సు నుండి ప్రకృతి, జీవులు, పుట్టుచున్నారు. అంతర్యామియైన నారాయణుని నుండి ఈ వెలుగు వస్తువులుగా మనస్సుగా, ఆత్మగా దిగివచ్చును. అట్లు దిగివచ్చిన వెలుగే మరల జీవులలో నేనను ప్రజ్ఞగా ప్రకాశించుచున్నది. వృక్షములలోనూ ఖనిజములలోనూ

నిద్రించుచున్న ఈ ప్రజ్ఞ మానవునియందు మేల్కొను చున్నది.

5. ప్రాణశక్తి వలన శరీరమునందలి అన్ని భాగములు పని చేయుచున్నవి. శరీరమునందలి వివిధ శక్తి కేంద్రములద్వారా మనకు ప్రాణశక్తి లభించును. అందులో ప్రధానమయినది స్వాధిష్ఠానచక్రము. ఇది మన శరీరమునందు ప్లీహము (Splene) అను గ్రంథి యున్నచోటు. అనగా దానికెదురుగా వెన్నెముకయందలి చోటునందు ఈ ప్రజ్ఞా కేంద్రము పని చేయును. ఈ స్వాధిష్ఠాన చక్రముద్వారా శక్తి ప్రసరించి, ప్రాణశక్తిగా మారుచున్నది. అనగా ఈ కేంద్రము సూర్యకిరణముల యందలి జీవ శక్తిని ప్రాణశక్తిగా మార్చుచున్నది. ఇట్లు ప్రజ్ఞశక్తిగా మారుటకు వేడి కావలయును. ఈ వేడిమియే మనయందు ప్రాణశక్తిగా నున్నది. అట్టి ప్రాణశక్తి మనయందుండుట వలన మనము జీవించి యుండగలుగుచున్నాము.

6. జీవుల దాంపత్యమువలన సంతతిని అభివృద్ధి చేసుకొనుచుందురు. అట్లే ప్రాణులన్నియు అభివృద్ధి చెందుచున్నవి. విత్తనములు మొలకెత్తుట వలన వృక్షజాతి అభివృద్ధి చెందుచున్నది. ఇట్లు సృష్టియందు సమస్తము పరస్పరత్వమువలన అభివృద్ధి చెందుచున్నది. మరియు పంటలు పండించుట, పశువులను రక్షించి పోషించుట మున్నగు వాని వలన, మానవుడు మిగిలిన జాతుల అభివృద్ధికి సహకరించుచున్నాడు. ఇట్లు అభివృద్ధి చెందుటకు కారణము వాని యందు గల అభివృద్ధి చెందు గుణమే. ఆ గుణము నారాయణుని నుండి సృష్టిలోనికి దిగివచ్చినది గనుక, జీవుల అభివృద్ధికి నిజమైన కారకుడు భగవంతుడే.

7. అక్షరమనగా నశింపనిది. ఉచ్చరించువాడు, తనను తానే శబ్దముగా నుచ్చరించును. అనగా తానే భావమై, తానుచ్చరించు విషయముతో ప్రయాణముచేయును. అట్లే భగవంతుడు ఈ సృష్టి మొత్తమును ఉచ్చరించినవాడు గనుక, ఆయన తానే తన సృష్టియందలి సారాంశమగుచున్నాడు. అట్టి సారాంశమే ప్రణవము లేక ఓంకారమగుచున్నది. ఈ ఓంకారమే పరమాత్మ నుండి దిగి వచ్చిన మొట్టమొదటి శబ్దము లేక అక్షరము, కనుక నిర్మలము.

8. మంత్రః అనగా మననము చేయుటచే రక్షించువాడని అర్థము. అట్లు మననము చేయుటకు ఒక ఆలంబనము కావలయును. రూపము

మననము చేయునప్పుడు చెదిరిపోవునవకాశమున్నది. అక్షరములు శబ్దములైనచో మరికొంత ఎక్కువ సేపు నిలువబడును. మరియు శబ్దమునందలి అర్థము కూడా మనస్సు నాకర్షించును. మరియొక రహస్యమేమనగా, కొన్ని కొన్ని శబ్దములు శరీరమందలి ప్రజ్ఞా కేంద్రములను కదలించును, అనగా ప్రేరణ చేయును. కనుక అట్టి ప్రేరణ వలన మనస్సునందలి రాగ ద్వేషములు దమింపబడి, హృదయము స్వచ్ఛమై బుద్ధి ప్రకాశించును. దాని వలన అంతర్యామియందు భక్తి నిశ్చలమగును. అట్లు ధ్యానము చేయువారిని, మంత్రమను శబ్ద స్వరూపుడై, నారాయణుడే రక్షించుచున్నాడు.

9,10. చంద్ర కిరణములు, సూర్య కిరణములు అనునవి, రెండు స్థితులలో నున్న ప్రజ్ఞలు. సూర్యుడు చోటునందలి అంతర్యామి ప్రజ్ఞను తన కిరణములుగా వ్యక్తము చేయును. అట్టి సూర్య కిరణములను చంద్రుడు స్వీకరించి, భూమి యందలి జీవులకు ధాతు నిర్మాణమునకు వృక్షజాతులు పుష్పించి ఫలించుటకు కారణమగుచున్నాడు. ఇట్లు సూర్యచంద్రులు ఒకరు ఉత్తర ధ్రువము, మరియొకరు దక్షిణ ధ్రువముగా పనిచేయుచున్నారు. ఇట్లు పనిచేయుట భూమి పుట్టుటకు ముందునుండి మాత్రమే గాక, సూర్యచంద్రులు గ్రహములుగా దిగి వచ్చుటకు ముందునుండి చోటులో ధ్రువములుగా పని చేయుచున్నారు. వీరి ఈ ప్రజ్ఞలు అంతర్యామి నుండి దిగి వచ్చినవి గనుక నారాయణుడే సూర్య కిరణములుగా మరియూ చంద్ర కిరణములుగా పని చేయుచున్నాడు.

31. శ్లో॥ అమృతాం శూద్భవో భానుః శశిబిందుస్సురేశ్వరః
ఔషధం జగతస్సేతు స్సత్యధర్మ పరాక్రమః ॥

**ప్రతిపదార్థము** :- 1. అమృతాంశూద్భవః = చంద్ర కిరణములనుండి పుట్టినవాడు, 2. భానుః = ప్రకాశమయమైన కిరణములు కలవాడు, 3. శశిబిందుః = చంద్రుని యందు బిందువుగా నుండు వాడు. 4. సురేశ్వరః = దేవతలకధిపతి, 5. ఔషధమ్ = స్వస్థత కలిగించునది, 6. జగతస్సేతుః = లోకములకు తీరముయైనట్టిది, 7. సత్యధర్మ = సత్యము చేతను ధర్మము చేతనూ, 8. పరాక్రమః = జయించువాడు.

**తాత్పర్యము :-** భగవంతుని, చంద్రుని అమృత కిరణములనండి పుట్టిన వానిగా, సూర్యునివలె ప్రకాశించు కిరణములు కలవానిగా, చంద్రుడను బిందువుగా, దేవతలకధిపతిగా, స్వస్థత కూర్చువానిగా, అన్ని లోకములకు. తీరమైన వానిగా, సత్యము చేతనూ ధర్మము చేతనూ లోకములన్నియూ ఆక్రమించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. చంద్రకిరణములు అమృతమయమైనవి. వీనివలన ఖనిజములు వృక్షజాతులలోనికి, వృక్షములు జంతు దశలోనికి పరిణామము చెందును. ఈ మొత్తము పాశనములు, అనశనములు అని రెండుగానున్నవి. పాశనములనగా పంచభూతములను ఆహారముగా తీసుకుని వృద్ధి పొందునవి (Organic Substances) అనశనములనగా ఆహారమక్కర లేనివి (Inorganic Substances). మొదటివానికి మానవులు, జంతువులు వృక్షములు ఉదాహరణములు. రెండవదానికి ఖనిజములు, మట్టి ఉదాహరణములు. చంద్రకిరణములు అనశనములను, పాశనములుగా పరిణామము చెందించును. అనగా మృతత్వము లేక ప్రాణము లేని స్థితి నుండి, ప్రాణము లేక జీవముగల వృక్ష, జంతు, మానవజాతులలోనికి మేల్కొల్పును గనుక చంద్ర కిరణములు అమృతమయములు. అంతేగాక పంచభూతముల అణువులను, ప్రాణుల దేహధాతువుల యందు కణములుగా నిర్మాణము చేయుటవలన, అవి జీవవంతములగును. కనుక చంద్రకిరణములయందు అమృతమున్నది.

2. సూర్యుని వలన ప్రాణులకు జీవశక్తి కలుగుచున్నది. దానివలననే జీవ ప్రజ్ఞ వేరుగానేర్పడి, మేల్కొని పని చేయుచున్నది. ఆ జీవప్రజ్ఞయందలి అంతర్యామి సూర్యుని వలన కలుగుచున్నది. ''భ'' అనుశబ్దమునకు ప్రకాశించుట అని అర్థము. జీవునిలోని వెలుగే తానున్నానని తెలియు ప్రజ్ఞగా, పని చేయును. జీవులలో అట్టి వెలుగుకు కారణమైనవాడు గనుక నారాయణుడు భానుడని పిలువబడినాడు.

3. చంద్రకిరణములు మృతులైన జీవులకు మరల శరీరములను కల్పించుచున్నవి. కనుక అవి అమృతములని పిలువబడెను. చంద్రునియందు గల, ఇట్టి అమృతత్వము కలిగించు బిందువునే సోముడందురు. ఈ సోముడు,

విశ్వమునకు కేంద్రబిందువుగా పని చేయును. ఆయనపై విశ్వ మంతయూ ఆధారపడి జీవించియున్నది. ఆ సోముని కిరణములే, మన సౌరమండలమందలి చంద్రుని ద్వారా, భూమియందలి జీవులకు ప్రసరించును. ఆ సోముడను ప్రజ్ఞను లేక బిందువును, చంద్రుడు తన ద్వారా ప్రసరింపచేయుచున్నాడు. కనుక శశి బిందువు అని పిలువబడుచున్నాడు.

4. ఈ విశ్వమునందు దేవతలు, లేక సురలు అనేకమంది యున్నారు. వారు ప్రధానముగా మూడు లోకములయందు పని చేయుచున్నాడు. మొదటిది ప్రజ్ఞామయము. ఇందు పని చేయు దేవతలను ఆదిత్యులందురు. వారు 12 మంది అనగా 12 గుణములుగా పని చేయుదురనియర్థము. వీరు జీవులయందలి ప్రజ్ఞలకు మరియు వెలుగులకు అధిపతులు. జీవప్రజ్ఞ పుట్టుకకు వీరు కారకులు. అనగా ఒక సౌరమండలమందు జీవులను పుట్టించుట వీరి కార్యక్రమము. రెండవది శక్తి మయలోకము. ఇందు పనిచేయు దేవతలను రుద్రులందురు. వీరు శక్తికి, కిరణములకు అధిపతులు. మన యింద్రియములందలి చూచు శక్తి, విను శక్తి మున్నగునవి వీరివలననే కలుగుచున్నవి. అట్లే సూర్యకిరణములు, చంద్ర కిరణములు మున్నగునవన్నియు ఇట్టి దేవతల వలననే కలుగుచున్నవి. మూడవది ద్రవ్యమయము లేక వసులోకము. దీనికి అధిపతులు వసువులు. వీరు ఎనిమిది మంది. వీరివలన భౌతికమగు ద్రవ్యము, పదార్థము ఏర్పడుచున్నవి. అణువులు ఏర్పడుట. అవి వస్తువులుగా కట్టుకొనుట మున్నగునవి ఈ వసువులవలననే కలుగుచున్నవి. ఇది కాక యింకనూ పితృదేవతలు, గంధర్వులు అనువారలు కలరు. వీరిలో పితృదేవతలు దాంపత్యము, గర్భధారణము, చెట్లు పుష్పించుట మరియు ఫలించుట అనువాని కధిపతులు. గంధర్వులు సంగీతమునకధిపతులు. పరమాత్మనుండి మొట్టమొదటి నాదముపుట్టి అది 7 స్వరములై ఏడులోకములుగా దిగివచ్చినది. ఇట్టి దేవతలందరకూ అధిపతి నారాయణుడు.

5. మానవుని యందు వ్యాధి, మొట్టమొదట మనస్సునందు పుట్టి తరువాత శరీర భాగములకు వచ్చును. కనుక వ్యాధి నివారణ జరుగవలెనన్నచో అది మొట్టమొదట మనస్సునందు జరుగవలెను. మనస్సునందు ఈ వ్యాధి

లక్షణము, నేను, నాది అను భావములవలన, ప్రారంభమగుచున్నది. కనుక, నిజమైన వ్యాధి నివారణ జరుగవలెనన్నచో, మానవునియందు ఈ భావము నశింపవలెను. అట్టి భావము పోవలెనన్నచో మనస్సు భగద్భక్తిచే నిర్మలమై, తోటివారియందు పరమాత్మను చూచి ప్రేమతో సేవ చేయగలుగు స్థితిరావలెను. దీని వలననే సర్వవ్యాధులు నివారణ మగుచున్నవి. అట్టి భావము జీవులయందు కలిగించుటకు పరమాత్మ అనుగ్రహము కావలెను. కనుక నారాయణుడే జీవులకు నిజమైన ఔషధమగుచున్నాడు.

6. ఈ విశ్వమంతయూ జలములపై తేలుచున్నట్లు పురాణముల యందు వర్ణింపబడినది. ఆ జలములే మహా చైతన్యమనబడు తరంగములు. ఇట్టి తరంగములతో కూడిన సముద్రము నారాయణుడే కనుక, నారాయణుడే ఈ లోకములన్నిటికి చేరదగిన తీరమైయున్నాడు.

7,8. సత్యము శాశ్వతమైనది. సమస్తమూ దాని వలననే ఏర్పడును. సత్యమున కాధారము ''నే''నను ప్రజ్ఞ. ఇదియే మొట్టమొదటి సత్యముగా దిగి వచ్చుచున్నది. ఈ మొట్టమొదటి సత్యమునుండియే మిగిలిన సత్యములు లేక ధర్మములు, వేనికవి పుట్టుచున్నవి. ఇది తెలిసిన జ్ఞానులు, ధర్మాచరణము చేత సత్యమునుపాసించుచున్నారు. ఇట్టి ధర్మమునకు పరమావధి సృష్టి సంకల్పము. అనగా జీవుల సంక్షేమము. దీని నాశ్రయించుకొనియే జీవులకు ధర్మము లేర్పడుచున్నవి. ఈ ధర్మములు ఒక్కొక్క జీవికి ఒక్కొక్క వ్యక్తిగత ధర్మముగా నేర్పడును. ఒకనికి పొలము దున్నవలెనని. పంటలు పండించవలెనని కోరిక కలుగును. మరియొకరికి వైద్యము చేయవలెననియూ, వ్యాధి నివారణ చేయవలెననియూ కోరిక కలుగును. ఎవరికి వారు, వారి వ్యక్తిగత లక్షణమును బట్టి, ధర్మమును మలచుకొనుచున్నారు. జ్ఞానులు, తాము చేయు స్వధర్మమునే నిష్కామముగా భక్తితో ఆచరించుటవలన, సత్యమునుపాసించు వారగుచున్నారు. అట్టి తమ ఉపాసనచే వారు, తమ మనస్సు, బుద్ధి మున్నగు వానిని నిర్మలములు చేసుకొనుటవలన, అంతర్యామి యైన భగవంతునియందు లీనమగుచున్నారు లేక వ్యాప్తి చెందుచున్నారు.

32. శ్లో॥ భూత భవ్య భవన్నాథః పవనః పావనోఽనలః
కామహా కామకృత్కాన్తః కామః కామప్రదః ప్రభుః ॥

**ప్రతిపదార్థము :-** 1. భూత భవ్య భవత్ = జరిగిపోయినది, జరుగబోవునది, జరుగుచున్నది. 2. నాథః = అధిపతి, 3. పవనః = పరిశుభ్రము చేయువాయువు, 4. పావనః = పరిశుద్ధి చేయువాడు, 5. అనలః = అగ్ని, 6. కామహా = మన్మధుని నశింపజేయువాడు, 7. కామకృత్ = కోరికలను కలిగించువాడు, 8. కాంతః = మిక్కిలి ఇష్టమైన రూపము కలవాడు, 9. కామప్రదః = కోరికలు కల్గించువాడు, 10. కామః =మన్మధుడు, 11. ప్రభుః = పరిపాలకుడు.

**తాత్పర్యము :-** పరమాత్మను భూతము, భవిష్యత్తు, వర్తమానము అను మూడు కాలములకు అధిపతిగా, పరిశుద్ధి చేయు వాయువుగా, పరిశుద్ధి చేయువానిగా, అగ్నిగా, అన్నిటికన్నా మిక్కిలి నిర్మలమైన వానిగా, మన్మధుని సృష్టించిన వానిగా, మరియూ నశింపచేయువానిగా, అందరిచే కోరబడువానిగా, అన్ని కోరికల రూపము తానేయైన వానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. భూతము, భవిష్యత్తు, వర్తమానము అను మూడునూ ఒక అల్లికగానేర్పడి, మానవునికి అనుభవముగా (కాలముగా) తెలియుచున్నది. దీనినే జీవితమని కూడా అందురు. కాలమొక్కటే. జీవుడు తనని తాను ఈ అనంతమైన కాలములో ఒక బిందువుగా నూహించుకొనుట చేత, ముందు వెనుక లేర్పడుచున్నవి. అవియే మనకు నిన్న, రేపు. ఈ సత్యమును తెలిసికొనుటయేగాక అట్లు జీవించువానికి కాలము పని చేయదు. వానికి కాలము వర్తమానమగునుగాని భూతము, భవిష్యత్తు అనునవి యుండవు. అనగా తాను కూడా కాలమే యగును. దీనిని ఆచరణ పూర్వకముగా విశ్వసింపవలె నన్నచో, నిన్నటి దినమున తాను చేసిన వానిని గూర్చిగాని, రేపుతనకు జరుగవలసినవి, రావలసినవి మున్నగువానిని గూర్చి గాని, ఆలోచించుట చేయరాదు. ప్రతిక్షణమును భగవత్ స్వరూపముగా దర్శించి, ఆ క్షణమున తానెదుటివారిలోనున్న పరమాత్మకు సమర్పణపూర్వకముగా, తాను చేయవలసిన పనిని శ్రద్ధతో నిర్వర్తింపవలెను. తాను చేయవలసినదనగా ఎదుటివానికి అవశ్యకమైనది మాత్రమే. ఇట్లాచరించువానికి, భూతము, భవిష్యత్తు, వర్తమానము అన్నియూ కలిసి ఒక్కటేయైన కాలముగా, అనుభవమగు చున్నది. అట్టి అనుభవమే రసమనియు అది జీవునకు లభించుటయే రససిద్ధియనియు

అందురు.

2. ఇట్టి రససిద్ధి జీవులకు కలుగుటకు కారణముగా, కాలమున కధిపతియైన భగవంతుడే యున్నాడు గనుక, అతడే నాధుడగుచున్నాడు.

3. శ్వాసవలన ప్రాణవాయువు ఊపిరి తిత్తులలోనికి తీసుకొనబడి, మానవుని రక్తమును పరిశుద్ధి చేయుచున్నది. అంతేగాక శ్వాసను ధ్యానము చేయుటవలన మనసు నిర్మలమై, బుద్ధియందు లయమగుచున్నది. కనుక పరమాత్మ, శ్వాస వలన, ప్రాణవాయువు వలన, జీవులను పరిశుద్ధి చేయుచున్నాడు.

4. ప్రతి వస్తువు మరియొక దానితో పోల్చుటవలన మలినముగా నెంచబడుచున్నది. కనుక పరిశుభ్రత సాపేక్షికమేగాని పూర్తి సత్యము కాదు. అన్నిటికన్నా పైనున్నవాడు పరమాత్మయే గనుక, ఆయన పరిపూర్ణమైన నిర్మలత్వము గలవాడు. కనుక ఆయనయే అట్టి నిర్మలత్వము కలిగించువాడు కూడా అగుచున్నాడు. అనగా జీవుల మనస్సులను పరిశుభ్రపరచి, ఉత్తమ జన్మలలోనికి తీసుకొని పోయి, చివరకు వారికి తనయందు లీనమగు స్థితిని ప్రసాదించుచున్నాడు. కనుక భగవంతుడు అన్నిటిని పరిశుభ్రము చేయువాడగుచున్నాడు.

5. అగ్ని అనగా ప్రజ్ఞ, మరియు మొట్టమొదటి చైతన్యము. ఇట్టి అగ్నిగా నారాయణుడే సృష్టిలోనికి దిగివచ్చి, భౌతికమగు అగ్నిగా వ్యక్తమై, దహించుటవలన అన్నిటికి నిర్మలత్వము కలిగించుచున్నాడు. ఈయనయే మనస్సునందు రాగద్వేషాదులుగా పని చేసి మనస్సును దహించి, పరిశుభ్రము చేయుచున్నాడు. అట్లే ఆదర్శము లేక సత్కర్మలు చేయుట యందలి కోరికగా నేర్పడి, ఆ కోరికచేతనే బుద్ధిని కూడా తపింపచేసి నిర్మలము చేసి తనయందు లీనము చేసుకొనుచున్నాడు. అట్టి అగ్ని నారాయణుడే.

6. మానవునికి జీవితము ఒక మహానాటకమువంటిది. నాటకము నందు పాత్రలు నటించుచున్నట్లే, జీవుడు కూడా ప్రపంచమను రంగస్థలమున తన పాత్రను తనకు తెలియకయే అభినయించుచున్నాడు. అట్టి అభినయము సత్యముగా పొరబడుట వలననే, నాటకమునందలి సంఘటనలపై అభిలాష

పెంచుకొనుచున్నాడు. నిజమునకు ఇట్టి అభిలాష లేక కోరిక, భగవంతునిచే సంకల్పింపబడినదే. జీవులయందలి ఇట్టి అభిలాషను కలిగించు దేవతయే మన్మధుడు. మనకు యిష్టమయినవారియందు, సంఘటనలయందు, ఇట్టి అభిలాషనే కలిగించి, మన్మధుడు సృష్టిసంకల్పములు జీవులచే నిర్వర్తింపజేయుచున్నాడు. ఈ మన్మధుడు, పరమాత్మ సంకల్పమునుండి పుట్టెను గనుక, విష్ణువు కుమారుడని చెప్పబడినాడు. మరల ఈ సృష్టి సంకల్పము వలననే, జీవులకు యోగసాధన ప్రారంభమగును. అట్టి సాధనవలన జ్ఞానోదయమై, వివేకమను మూడవకన్ను జీవునకు తెరుచుకొనుచున్నది. అట్టి వివేకనేత్రమువలన, వ్యక్తులపై, పరిసరములపై తనకున్న వ్యామోహములను, భ్రమలను, మరియు ఆకర్షణలను దగ్ధము చేసికొని, వాటి సత్యత్వమును మాత్రమే దర్శించును. అనగా వానినుపయోగించి, ఇతరుల యెడల తన ధర్మమును నిర్వర్తించుటయే గాని పనులను గూర్చిగాని, ఫలితములను గూర్చిగాని వ్యామోహపడుట యుండదు. అట్టి మూడవ కన్ను తెరచుకొనువరకు, ప్రతివాడును తనకిష్టమైన వారిని గూర్చి, వస్తువులను గురించి ఆకర్షణకు లోనగును. అట్టి ఆకర్షణ కలిగించువాడు మన్మధుడు. ఈ మన్మధుడు చెఱకుగడను వింటిగా నేర్పరచుకొని అయిదు బాణములతో యుద్ధము చేయుననియూ, యుద్ధమున అతనిని జయించువాడు లేరనియు చెప్పబడినది. అయిదు బాణములనగా పంచేంద్రియములు, చెఱకుగడ యనగా జీవిత సంఘటనలయందలి తీపి లేక ఆకర్షణ.

7. ఈ సృష్టియందలి జీవులందరూ, భగవంతుని సంకల్పము ననుసరించి పని చేయుచున్నారు. కానీ ఎవరికివారు తమతమ సంకల్పముల ననుసరించియే వర్తించుచున్నారు. అనగా ఎవరి కోరిక వారిది. ఎవరి అభిలాష వారిది. ఈ కోరికలన్నియూ సృష్టిసంకల్పముననుసరించియే జీవులకేర్పడును. పిల్లలను పోషించి సంరక్షించవలెనను సంకల్పము తల్లితండ్రులయందు కలిగిననూ, అది భగవంతుని నుండి జీవులకు కలుగునదే. ఇట్టి కోరికలను, తన సంకల్పము ననుసరించి, జీవులకు పరమాత్మయే కలిగించును.

8. జీవులకు మొట్టమొదట కొన్ని వస్తువులయందు ఇష్టము. ప్రియము

భగవంతుడే కలిగించుచున్నాడు. తాను యిష్టపడిన వాటినిగూర్చి మానవుడు తీవ్రమగు కృషి చేసి, పొందుటకు యత్నించుచున్నాడు. అట్లే తనకిష్టమైన వారిని గూర్చి కూడా అట్లే చేయుచున్నాడు. ఇట్లు జీవులకు ఒకరి యందొకరికి ప్రియత్వము కలిగించి, ఒకరిగూర్చి మరియొకరు ప్రయత్నించుట, పని చేయుట మున్నగునవి కల్పించుచున్నాడు. ఇట్లు జీవులలో ఎవరికివారు భగవంతునే తమకిష్టమైన వారుగా పొరబడి పని చేయుచున్నారు. కనుక నారాయణుడే అందరికిని ప్రియమయినవాడు.

9. జీవులయందు కలుగు కోరికలన్నియూ వారి మనస్సులనుండి పుట్టుచున్నవి. ఈ మనస్సు 'నే'నను ప్రజ్ఞనుండి పుట్టుచున్నది. ఈ నేనను ప్రజ్ఞయే సృష్టియందంతటనూ వ్యాపించియున్న పరమాత్మగా పిలువబడుచున్నది. కనుక పరమాత్మయే జీవులయందలి కోరికలుగా వ్యక్తమగుచున్నాడు.

10. ఒకరి కోరికలనొకరు నెరవేర్చునప్పుడు అట్లు నెరవేర్చువాడు నారాయణుడే. చెట్లు మానవునకు రుచికరములైన ఫలములను, ధాన్యాదులను ఆహారముగా ఇచ్చుచున్నవి. సూర్యుడు కాంతిని యిచ్చుచున్నాడు. వాయువు శ్వాసను కలిగించి జీవించుటకు తోడ్పడుచున్నాడు. ఇట్లు మానవుని కోరికలు పంచభూతముల ద్వారా, తోటి జీవుల ద్వారా భగవంతుడే తీర్చుచున్నాడు.

11. ఇట్లు జీవుల కోరికలు తీర్చుచు, వారి మనస్సులకు, శరీరములకు, తానే అధిపతియై నడుపుచున్నాడు. కనుక ఆయనయే ప్రభువు.

33. శ్లో॥ యుగాది కృద్యుగావర్తో నైకమాయో మహాశనః ।
అదృశ్యోఽ వ్యక్తరూపశ్చ సహస్రజి దనంతజిత్ ॥

**ప్రతిపదార్థము** :- 1. యుగాదికృత్ = యుగముల ప్రారంభమును కల్పించువాడు, 2. యుగావర్తః = యుగధర్మములను కాలచక్రముగా నిర్మించినవాడు, 3. నైకమాయః = మాయలన్నిటికి అధ్యక్షుడైనవాడు 4. మహాశనః = సమస్తమును తినువాడు, 5. అదృశ్యః = పంచేంద్రియములకు కనిపించని రూపము కలవాడు, 6. అవ్యక్తరూపః = అవ్యక్తమైన రూపము కలవాడు, చ = మరియు, 7. సహస్రజిత్ = వేయి విధములుగా జయించువాడు, 8. అనంతజిత్ = అనేక విధములుగా జయించువాడు.

**తాత్పర్యము :-** 1. పరమాత్మను, యుగముల ప్రారంభకునిగా, ధర్మములతో కూడిన కాలచక్రమును నిర్వహించువానిగా, మాయయొక్క అనేక రూపములుగ మరియు ఆ మాయను అధిష్ఠించి యున్నవానిగా, సృష్టియందలి సమస్తము తినివేయువానిగా, వ్యక్తము మరియు అవ్యక్తముగానున్న అదృశ్య రూపునిగా, సృష్టియందలి సమస్తమును తన వేయి మార్గములలో అనేకమైన విధానములతో జయించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. సృష్టికి వ్యక్తము అగుట, మరల పరమాత్మలోనికి అంతర్ధానమగుట, అను రెండు స్థితులుండును. ఇవియే ''బ్రహ్మ''కు పగలు మరియు రాత్రిగా చెప్పిరి. దీనినే ఒక కల్పమందురు. ఇట్టి కల్పము 14 మన్వంతరములుగా, మహాయుగములుగా మరియు యుగములుగా విభజింపబడినది. ఈ యుగముల కాలము 4, 3, 2 అను సంఖ్యలతో పదులు, వందలు, వేల సంఖ్యలుగా గుణింపబడును. ఇట్లు అపరిమితమైన కాలము పరిమిత పరిమాణములలోనికి తీసుకురాబడినది. ఇట్టి కాలచక్రమును భగవంతుడు తానే అధిష్ఠించి వ్యక్తమగుచున్నాడు కనుక ఆయన యుగములను సృష్టించువాడు.

2. ఈ యుగములతో కూడిన కాలము మహా సుడిగుండము వంటిది. ఈ సుడిగుండము పరమాత్మయను శక్తిచే నడుపబడుచు. ఆయనయందే ప్రారంభము, విస్తారణ, మరియు అంతర్ధానము, కల్పించుకొనుచున్నది. ఇట్టి అవర్తన లేక చుట్టుకొను స్వభావము కలిగిన కాలము పరమాత్మయే. అట్లే సూర్యోదయముతో ప్రారంభమై, మధ్యాహ్నము, సాయంత్రము, రాత్రి మరల సూర్యోదయముతో, ఒక అవర్తనము లేక చుట్టు పూర్తి యగును. అట్లే శుక్ల పాడ్యమితో ప్రారంభమై, పౌర్ణమి. తర్వాత కృష్ణపాడ్యమి నుండి అమావాస్య వరకు మొత్తము 28 తిధులతో కూడిన ఒకమాసము అవర్తన కాలమగును. చైత్రమాసముతో ప్రారంభమై ఫాల్గుణమాసముతో అంతమగు సంవత్సర కాలముగా మరియొక అవర్తనము పూర్తియగుచున్నది. ఇట్లు అనేక అవర్తనములు ఒకదానిలో నొకటి, మరియు ఒకదానిపై ఇంకొకటి కలిగిన మహా అవర్తనమే కాలము. అట్టి కాలమును అవర్తనముగా కల్గిన వాడు భగవంతుడే.

3. ఈ యుగములు, ఆవర్తనములు, సృష్టిమున్నగున వన్నియు భగవంతునిచే క్రీడగా కల్పింపబడినవి. అది తెలిసినవారికి క్రీడ, తెలియని వారికి మాయ.

4. ఇట్లు కన్పించుచున్న సమస్త సృష్టి, జీవులు మరియు గ్రహగోళములు అన్నియు అదృశ్యమై, అవ్యక్తమై భగవంతునిలోనికి అంతర్ధానమగుచున్నవి. అట్లు సృష్టి అంతటిని కల్పించి, మరల తనలోనికి దీనినంతటిని గ్రహించుచున్నాడు కనుక, ఆయన ఈ మొత్తము సృష్టిని తినివేయుచున్నాడు.

5. జీవులు, సమస్త సృష్టిని తారలు, గోళములు మొదలు క్రిమి కీటకాదులవరకు ప్రతిదానిని చూడగలుగుచున్నారు. పరీక్షించుచున్నారు. మరియు గ్రహింపగలుగుచున్నారు. కాని పరమాత్మ వీటన్నిటియందు ఉన్నప్పటికిని ఆయన మాత్రము అదృశ్యునిగనే యున్నాడు.

6. ఇట్లు అదృశ్యుడుగా నున్న పరమాత్మను అణువు మొదలు బ్రహ్మాండమువరకు గల సమీకరణము లేక సామ్యమును తెలిసినవారు, అందలి సామ్యముగా గుర్తించుచున్నారు. అట్టి సామ్యమును గుర్తింపలేని వారికి, పరమాత్మ అవ్యక్తుడై యున్నాడు.

7. భగవంతుని మాయను దాటుటకు, పెద్దలచే ఉపదేశింపబడిన మహామంత్రము ''స–హ–స్ర'' అనుమంత్రము. దీనికి అర్థము వేలాది శిరస్సులు, పాదములు, కన్నులు కలవాడని అర్థము. అనగా సృష్టియందలి సమస్త జీవుల శిరస్సులుగా, కన్నులుగా, పాదములుగా, తానే ఉన్నాడని అర్థము. భగవంతుని అర్చించుట అనగా సకలజీవులను వాని స్వరూపముగా నర్చించుటయే. వారి సంతృప్తియే, పరమాత్మయొక్క సంతృప్తి. అంతేకాక సకార, హకారములు శ్వాసబీజములు, అనగా మానవునియందు ప్రాణశక్తి, శ్వాస స్పందించుటకును, అట్లే చోటునందలి ప్రాణశక్తి స్పందించుటకును గుర్తులు. స్ర అను బీజము రేఫముతో కూడిన సకారము. అనగా వాక్కు శ్వాసతో వ్యక్తమగుట. వాక్కు నుచ్చరించునపుడు వాయువు స్వర పేటికయందలి పొరలతో ఘర్షణ చెందుటవలన రకారము లేక రేఫము పుట్టును. దీనినే ''ఋక్కు'' అందురు. ఈ మొత్తము మంత్రము విశ్వము వాక్కుగా నుచ్చరింపబడుటను తెలియచేయును. ఇది

శ్వాసవలన జరుగుచున్నది. పరమాత్మయొక్క శ్వాసగా సృష్టి ఉచ్చరింపబడి, మరల ఆయనలోనికి లీనమగుచున్నది. అట్టి భగవంతుని శ్వాసయే కల్పములతో కూడిన కాలచక్రము యొక్క ఆవర్తనము. ఇది జీవునియందు గూడ, శ్వాసగా ఉచ్చరింపబడుచున్నది. భగవంతుడు శ్వాసవలన చేయు సృష్టియే, జీవుడు కూడా తన శ్వాస ననుసరించి చేయుచున్నాడు. శ్వాసను ధ్యానము చేయువాడు, శ్వాస నుండి మనస్సు ఈవలకు వచ్చినపుడు వానికి సృష్టియుండును. శ్వాసతో మరల లోనికి ప్రయాణము చేసినపుడు వానికి సృష్టియుండదు. ఆక్షణమున క్రమేణా వ్యక్తిగత ప్రజ్ఞననుసరించి అంతర్యామి ప్రజ్ఞ నిలుచును. ఈ మంత్రమును సుదర్శన మంత్రమందురు. అనగా చక్కని దర్శనమని అర్థము. ఇట్లు శ్వాసతో ప్రారంభమయిన కాలము, నిముషములుగా, గంటలుగా, దినములు మరియు సంవత్సరములుగా, యుగములుగా, కల్పములుగా ఆవర్తమగుచున్నది లేక తిరుగుచున్నది. ఇట్లు ఆవర్తనమై తిరిగి వచ్చుటనే కాలచక్రమందురు. కనుక ఆయన వ్రేలిచుట్టు, వ్రేలినాధారముగా గొని ఈ చక్రము తిరుగుచున్నది. దీనిని ధ్యానము చేసినవానికి అంతర్యామి యొక్క నిజస్థితి దర్శనమగును. అదియే పరిపూర్ణ స్థితి లేక సుదర్శనము. దీని వలన జీవికి మాయ తొలగిపోవును అనగా జీవుడు మాయను జయించును.

8. భగవంతుని పైవిధముగా ధ్యానము చేయుటకు ఒక్కొక్కడు ఒక్కొక్క మార్గ మెన్నుకొనును. ఒకడు సంకీర్తము చేయును. మరియొకడు శాస్త్ర గ్రంధములు చదువును. ఇంకొకడు సత్కర్మాచరణము చేయును. మరియొకడు ఏకాంత ప్రదేశములకు వెళ్ళి తపస్సు చేయును. ఎందరు జీవులు కలరో అన్ని మార్గములున్నవి. ఎవని మార్గము వానికి సత్యము. అది వానికే సత్యము అందరికి ఒకే మార్గము తప్పనిసరికాదు. దీనిని తెలిసినవాడు వేదవిదుడగుచున్నాడు. భగవంతుడు, ఇన్ని మార్గములలో ఏ మార్గమున జీవుడు ఆరాధించినను, వానిని అనుగ్రహించుచున్నాడు. అదియే వాని విజయము. వాని విజయమే వాని భక్తుల విజయము.

34. శ్లో॥ ఇష్టో విశిష్టశ్శిష్టేష్టః శిఖండీ నహుషో వృషః ।
క్రోధహా క్రోధ కృత్కర్తా విశ్వబాహుర్మహీధరః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఇష్టః = ఇష్టమైనవాడు, 2. అవిశిష్టః = ఇష్టము కానివాడు, 3. శిష్టేష్టః = శిష్టులైన వారికి మాత్రమే యిష్టమైనవాడు, 4. శిఖండీ = శిరోజములు ఖండింపబడినవాడు, 5. నహుషః = నహుషుడను రాజు, 6. వృషః = వృషభము, 7: క్రోధహా = క్రోధమును సంహరించినవాడు, 8. క్రోధకృత్ = క్రోధమును కల్పించువాడు, 9. కర్తా = నిర్వహించువాడు, 10. విశ్వబాహుః = అందరికి చేయి అయినవాడు, 11. మహీధరః = భూమినీ ధరించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను, నీ యొక్క ఇష్టా ఇష్టములుగా మరియు విశిష్టులకు ఇష్టమైన వానిగా, శిరోజములు లేక కిరణములు ఖండింపబడినవానిగా, మానవుని ఇంద్రునిగా మార్చగలిగిన నహుషునిగా, వృషభముగా, క్రోధమును సృష్టించి సంహరించువానిగా, అందరికి హస్తము వంటి వానిగా, మరియు భూమిని భరించువానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1,2. ఇష్టములు, అయిష్టములు అనునవి, మానవుని నీచలోకములకు సంబంధించినవి. లింగదేహమునందలి ఉద్రేకములచే ఇది ఏర్పడును. అనగా కామమయశరీరమునందు ఇవి ఏర్పడును. కోరికలు తీవ్రమయినప్పుడు ఉద్రేకములు ఏర్పడి వాని వలన రజస్సు, తమస్సుల మధ్య సామ్యము చెడును. దాని వలన సుఖదుఃఖములు అను అస్తవ్యస్తమయిన జీవితము జీవి సృష్టించుకొనును. కొంత కాలము సుఖము మరి కొంతకాలము దుఃఖముతో కూడిన జీవితము మానవుని బాధించును. ఇట్టి అస్తవ్యస్త స్థితి నుండి జీవి బయటపడుటకు ప్రయత్నించును. ఈ ప్రయత్నమే అతని ఊర్ధ్వగమనమునకు కారణమగును. అట్లు ఊర్ధ్వముఖమైన మనస్సు, క్రమేణా పరిశుద్ధమై అంతర్యామియందు లీనమగును. కనుక మానవునికి ఇట్టిస్థితి కలుగుటకు వానియందలి ఇచ్ఛాద్వేషములే కారణము. కనుక అవి రెండును పరమాత్మ రూపములే.

3. విశిష్టులైన వారు అనగా మన దృష్టిలో సద్గుణములు కలవారు, సత్కర్మము చేయువారు లేక ఒక గొప్ప స్థితిలో నున్నవారు. అట్టి వారి సాన్నిధ్యమున మనముండుటవలన మనయందు ఒక అలజడి బయలుదేరును. వారి యందలి సద్గుణములను గొప్పదనమును మన లక్షణములతో పోల్చుకుని

మన నీచస్థితికి బాధపడుదుము. అట్లు బాధపడుటవలన, మనస్సు అప్రయత్నముగా వారి మంచి లక్షణములు ఒక్కొక్కటి అనుకరించుటకు ప్రయత్నించును. దీనివలన మనయందు గూడుకట్టుకొనియున్న దుష్కర్మ రహితమగుట ప్రారంభమగును. చెడు అలవాట్లు, చెడ్డ లక్షణములు ఒక్కొక్కటి అప్రయత్నముగా నశించుట ప్రారంభమగును. ఎంతటి నీచస్థితిలోనున్న వాడు సైతము, ఇట్టి అనుకరణవలననే తన దుష్కర్మ నుండి బయట పడగలుగుచున్నాడు. అనాది కాలమునుండియు ఇట్టి విశిష్టులగు వారు మానవుల యందు పుట్టుచునే యున్నారు. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, కపిలుడు, జనకుడు మున్నగు వారందరు ఇట్టి విశిష్ట పురుషులే. నవీన కాలమున సైతము రామకృష్ణ పరమహంస, సాయిబాబా, రమణమహర్షి, అరవిందులు, మాస్టర్ సి.వి.వి. మున్నగు మహానుభావులుసైతము విశిష్టజనులే. కేవలము వీరి సాన్నిధ్యమే, వేలాది జనులను భూగోళమంతట ప్రభావితులను చేయుటయే గాక. సన్మార్గమునకు త్రిప్పి, పుణ్యజనులుగా మార్చెననుటలో సందేహము లేదు. దీనికంతటికిని కారణము, విశిష్టజనులయందు మనకు గల ఇష్టతవలననే. కనుక ఈ ఇష్టత, నారాయణునిచే కల్పించబడినది.

4. అగ్ని, సూర్యగోళమునందు నేనను ప్రజ్ఞగా వ్యక్తమై, తన చుట్టు తేజోమయముగా గోళమున నిర్మించుకొని లోకమునకు వెల్గు నిచ్చుచున్నాడు. విశ్వకర్మ తన అల్లుడైన సూర్యునికి శిరోముండనము చేసెనని, ఏడు వెంట్రుకలు మాత్రము కత్తిరించక వదలెనని ఇతిహాసము. అనగా అంతర్యామియైన అగ్ని యొక్క మహాతేజస్సును, భౌతికమగు తేజస్సుగా తీసుకొని వచ్చుటకు ప్రయత్నించినప్పుడు, విశ్వకర్మ వాని తేజస్సును పరిమితము చేసి ఏడు కిరణములుగా వదలెను. అనగా అపరిమితమై భరించుటకు వీలుకాని వాని తేజస్సును, మనము భరింపగల్గు ఏడురంగుల కిరణములుగా పరిమితము చేసెను. విశ్వకర్మ అట్లు పరిమితము చేయనిచో సూర్యునియందలి మహా తేజస్సు లేక అపరిమిత విద్యుత్తు అనబడు శక్తి, క్షణకాలములో సమస్త సౌరమండలమునంతను నశింపచేయును. విశ్వకర్మ యిట్లు చేయుటవలన సూర్యుని తేజస్సునకు తట్టుకొని సౌరమండలము నిల్చియున్నది. కనుక ఏడు కిరణములతో గూడిన సూర్యుని పరమాత్మగా ధ్యానము చేయుము.

5. నహుషుడను రాజు నూరు అశ్వమేధములు చేసి ఇంద్రపదవి పొందెను. అనగా దేవతల రాజయ్యెను. అతడు ఇంద్రుని భార్య శచీదేవిని తనకు భార్యగా కమ్మని కోరగా, దానికి ఫలితముగా అతడు మరల సర్పముగా భూలోకములో పడెను. ఇచ్చట నూరు అశ్వమేధములనగా నూరు సంవత్సరములని అర్థము. అశ్వమేధము అనగా జీవితము. అశ్వమనగా ప్రాణశక్తి అని వేదార్థము. ప్రాణశక్తితో నిర్వహించు యజ్ఞమనగా జీవితమని అర్థము. నూరు సంవత్సరములతో కూడిన జీవితము మానవునిచే యజ్ఞార్థముగా నిర్వహింపబడినపుడు, అతని జీవితము పరిపూర్ణమగును. యజ్ఞార్థమనగా ఫలాపేక్ష లేకుండా చేయుకర్తవ్యము. ఈ కర్తవ్యమే స్వధర్మానుష్ఠానమని శ్రీకృష్ణునిచే భగవద్గీతయందు నిరూపింపబడినది. అట్లు సమర్పణబుద్ధితో యజ్ఞార్థముగా జీవించువానికి అప్రయత్నముగా జీవితమునందు కొన్ని సిద్ధులు కలుగుటగాని, విశేషమయిన సంపదలు కలుగుటగాని, లేక అధికారము కలుగుటగాని సంభవించును. ఇవి ఆ జీవిచేయు సత్కర్మకు భగవంతుడు మెచ్చి యిచ్చువరములు. వాని నుపయోగించి అతడు తన సత్కర్మాచరణమును మరింత సమర్థవంతముగా నిర్వహించినచో పూర్తిగా బంధవిముక్తుడగును. కేవలము వాటిని అనుభవించుచున్నచో పురోగతి లేక నిల్చిపోవును. దుర్వినియోగము చేసినచో నహుషునివలె మరల నీచజన్మలలోకి వచ్చి పుట్టవలసి యుండును. అంతేకాక ఈ నహుషుడు ఇంద్ర పదవిని చేరుట, మరల భూలోకమునకు తిరిగి వచ్చుట, జీవి సాధనచేసి అంతర్యామియందు ఐక్యమగుట, మరల అంతర్యామి జీవులుగా దిగివచ్చుటగా తెలియవలెను.

6. వృషభరాశియందలి వృషభము, శబ్దముచే సృష్టిని జీవవంతము చేసి, సృష్టియందు జీవులు పుట్టుటకు కారణమగుచున్నది. మరియు ఓషధులు మున్నగు వానిని పుట్టించుటవలన పంటలు పండుట మున్నగునవి కలిగించును. అనగా జీవుల పుట్టుకకు, మానవ శరీరము పుట్టుకకు, ఓషధులు మున్నగు వృక్షజాతుల పుట్టుకకు, ఈ వృషభరాశియే కారణము. ఈ వృషభరాశియందలి వృషభము వలననే పురుషుల యందు సంతానము కలిగించు శక్తి, మరియు గింజలందు అంకురములుగా మొలకెత్తు శక్తి, కలుగుచున్నది. అంతేకాక ఏప్రియల్ 21 నుండి మే 20 వరకు వృషభరాశిలోని సూర్యుడు తన తీవ్ర

కిరణములచే భూమియందలి నీటి నంతటిని మేఘములుగా ఆకర్షించి మరల వర్షముగా కురిపించును. ఇట్టి ఈ సూర్యుని శక్తి కూడా వృషభమే.

7. కోపము, ఈర్ష్య అనునవి మానవుని యందలి నీచగుణములు. కాని వీటినే ఆయుధములుగా గొని, మానవులు ఒకరి నొకరు బాధించుకొనుచున్నారు. అనగా ఎవరి కోపము వారినే బాధించుచున్నది. కోపము వచ్చినచో చిరాకుపడుట, అశాంతి, నిద్రపట్టకుండుట, మున్నగునవి కలుగును. అనగా మానవుడు ఆ సమయమంతయు సుఖమును కోల్పోవుచున్నాడని అర్థము.

8. ఇట్లు కోపము కలుగుటవలన జీవులు యుద్ధములు కల్పించుకొని తమను తామే శిక్షించుకొనుచున్నారు. కొన్ని వేలమందిని ఒక్కసారిగా సంహరింపవలెనన్నచో భగవంతుడు క్రోధమూర్తిగా అవతరించును. దీనివలన, వారు దుష్కార్యములకు శిక్షింపబడుటయేగాక, ప్రాణమునకు తెగించి పోరాడుట మున్నగు మంచిగుణములు అప్రయత్నముగా అనేక మందికి సంక్రమించును. ఇట్లు ప్రపంచమునందలి మానవులను సంస్కరించుటకు, భగవంతుడే క్రోధమును కల్పించుట మరియు ఆ క్రోధమును ఉపసంహరించుకొనుట చేయుచున్నాడు.

9. జీవులు తాము చేయు పనులను తామే స్వతంత్రించి సంకల్పించి చేయుచున్నామనుకొందురు. కాని ఇది సత్యము కాదు. వారి యందలి కోరికలే వారిచేత ఈ పనులను చేయించును. సృష్టియందలి సకల జీవులు వారి వారి కోరికలకు మరియు స్వభావములకు బద్ధులై పని చేయుదురు. ఎట్టి వారికైనను, తుదకు దేవతలకైనను స్వతంత్రము లేదు. కాని జీవులు తప్పని సరి అయి చేయుదురు. లేదా తామే కర్తలమను భ్రాంతితో చేయుదురు. అనగా చాలామందికి తమకొక స్వభావము ఉన్నదనియే తెలియదు. మహర్షులు మరియు దేవతలు దీనిని తెలిసినవారు. అప్పుడు వారి వారి స్వభావమును వారు గుర్తించి దానిని భగవంతుని ఆజ్ఞగా తెలిసికొని దానియందు యజ్ఞార్థ బుద్ధితో పనిచేయుదురు. అప్పుడు వారి స్వభావము వారిని బంధించదు. దాని వలన వారు తమ స్వభావమునకు అతీతులగుదురు. కాని కర్తవ్యము మాత్రము ఆపరు. గాలికి వీచుట, నీటికి ప్రవహించుట, సూర్యునికి కాంతి నిచ్చుట స్వభావములు. ఆయా దేవతలు లేక ప్రజ్ఞలు ఇది తమకు తప్పనిసరిగా గాక, భగవంతుడు

తమనుఅనుగ్రహించుటకు అప్పచెప్పిన కర్తవ్యముగా తెలిసికొని సంతోషముతో సృష్టియందలి జీవులకు ప్రీతి కరముగా తమ ధర్మములను నిర్వహింతురు. కాని జీవులకిది తెలియదు. తెలిసినను, తెలియకున్నను, వారి స్వభావము వారిచే పని చేయించును. అట్లు పని చేయుటకు కారణము అగుచున్నాడు కనుక, భగవంతుడు కర్త.

10. పనులను చేయువాడు భగవంతుడే. జీవులు పనులు చేయుచుండగా ఆయన వారి చేతలద్వారా తన చేతులతో పని చేయును. రైతు విత్తులు జల్లి, మొక్కలు పెంచి, పంటలు పండించుచున్నప్పుడు తానే పండించుచున్నానని అనుకొనును. కాని చల్లబడిన విత్తులను మొలకెత్తు నట్లు చేసి, సరియైన సమయమునకు పంట వచ్చునట్లు చేసినది ప్రకృతి యందలి భగవంతుడే. అనగా ప్రకృతి యందలి భగవంతుని బాహువులే. రైతు పండించుచున్నాననుకొన్నను, పండించి రైతునకిచ్చునది భగవంతుడే. కనుక ఈ విశ్వమే ఆయన బాహువులు.

11. ఆహారపానీయములు, జీవితము, ఆదర్శములు, ఆశలు, లక్ష్యములు మున్నగునవన్నియు భగవంతుని నుండి బయలుదేరి, జీవునికి అనుభవములుగా సంక్రమించుచున్నవి. ఈ అనుభవములే మరల జీవుని భగవంతుని వద్దకు చేర్చుచున్నవి. పైన చెప్పబడిన అల్లికయే సృష్టి. ఈ సృష్టి యందలి సమస్త జీవుల యొక్క భారమును నిర్వహించువాడు భగవంతుడే. సముద్రము ఓడ యొక్క బరువును అందలి నావికులతో సహా మోయు చున్నట్లు, జీవులందరిని వారి జీవిత నిర్వహణముతో సహా భగవంతుడే మోయుచున్నాడు.

35. శ్లో॥ అచ్యుతః ప్రథితః ప్రాణః ప్రాణదోవాసవానుజః ।
అపాం నిధిరధిష్ఠాన మప్రమత్తః ప్రతిష్ఠితః ॥

**ప్రతిపదార్థము** :- 1. అచ్యుతః = జారిపడుట లేనివాడు, 2. ప్రథితః = పేరుపొందినవాడు, 3. ప్రాణః = ప్రాణశక్తి అయినవాడు, 4. ప్రాణదః = ప్రాణశక్తి ఇచ్చువాడు, 5. వాసవానుజః = ఇంద్రుని తమ్ముడు, 6. అపాంనిధిః = నీటికి నిధియైనవాడు, 7. అధిష్ఠానం = అధిష్ఠించుటకు ఆసనము, 8. అప్రమత్తః = అజాగ్రత్త లేనివాడు, 9. ప్రతిష్ఠితః =

నిశ్చలముగా నిలబెట్టినవాడు.

**తాత్పర్యము :–** భగవంతుని, జారిపడుటలేని వానిగా, పేరుపొందిన వానిగా, ప్రాణశక్తిగా, ప్రాణశక్తి ఇచ్చువానిగా, ఇంద్రుని సోదరునిగా, నీటికి నివాసమైనవానిగా, అధిష్ఠించియున్నవానిగా, అజాగ్రత్త లేనివానిగా, నిశ్చలముగా నిలిచియుండువానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :–** 1. జారిపడుట లేక పొరపడుట అనునవి మానవలక్షణములు. అవి దైవలక్షణములు కావు. జీవులలో అతడెల్లపుడు మేల్కొని యుండును. ఈ మేల్కొనియుండుటయే తనకు తాను తెలియుట. ఒక్కొక్కసారి జీవులు తమనుండి తాము జారిపోవచ్చును. తాము కల్పించుకొన్న పనులే తమ మనస్సులకు అడ్డుగా నిలబడి తామెవరో తమకు తెలియని స్థితిలో జీవింతురు. చాలా మందికి తామున్నామను స్పృహయే ఉండదు. కాని అతడు మాత్రము జీవులనుండి ఎన్నడు జారిపోడు. వారియందు ''తాను'' లేక ''నేను'' అను ప్రజ్ఞగా ఎల్లపుడు మేల్కొనియే యుండును.

2. ప్రతివానికిని తెలిసిన విషయములు అనేకములుండును, మరియు ఒక్కొక్కనికి ఒక్కొక్క విషయమునందు ప్రావీణ్యముండును. ఎవనికి ఏది తెలిసినను అది భగవంతుని గూర్చియే కనుక ప్రతివాడును, తమకు తెలియకయే, తమ తమ జ్ఞానములుగా భగవంతుని గూర్చియే తెలియుచున్నాడు. ఏ శాస్త్రమైనను, విజ్ఞానమైనను భగవంతుని, సృష్టిని గూర్చిన జ్ఞానమే. అనగా ప్రకృతియందలి అనేక విషయములలో ఒక్కొక్కటి ఒక్కొక్క శాస్త్రముగా, విషయముగా జీవులచే పరిశోధింపబడుచున్నది, తెలిసికొనబడుచున్నది. ఇట్లు ఎవరికి వారు భగవంతుని గూర్చియే తెలిసికొనుచున్నారు. కనుక అందరిచేత తెలియబడువాడు నారాయణుడే. వారి వారికి గల జ్ఞానములవలన క్రమేణా భగవంతుని గూర్చి తెలిసికొనుటకు మార్గములు ఏర్పడుచున్నవి. వారు అంతర్యామిత్వము లేక విశ్వవ్యాప్తి అనునది మొదట జ్ఞానముగా లేక శాస్త్ర విషయముగా తెలిసికొనుటగా ప్రారంభించి, దానిలోనికి ప్రవేశించుచున్నారు.

3. ప్రాణశక్తి అనగా జీవులకు శరీరములు కల్పించి ఇచ్చునది. వారి జీవిత ప్రయోజనము పూర్తి అయినతోడనే ప్రాణశక్తి వారి శరీరములను

విసర్జించును. అనగా ప్రాణశక్తి రూపమున భగవంతుడు జీవుల శరీరము ధరించి మరల విసర్జించుచున్నాడు. ఈ ప్రాణశక్తి లేనిచో జీవులకు శరీరములు లేవు. శరీరము ఏర్పడునది పంచభూతముల వలన. ఈ పంచభూతములు, జీవులు కూడినను ప్రాణశక్తి లేనిచో శరీరములుండవు. ఇటుకలు, ఇసుక, సిమెంటు తెప్పించుకొన్నను. యజమానికి ఇల్లు కట్టిపెట్టు తాపీ పనివాడు లేనిదే ఇల్లుండదు. ఆ ఇటుకలు, సిమెంటు మున్నగునవి యజమానికి నిష్ప్రయోజనము. అంతేకాక ఈ ప్రాణశక్తియే మొత్తము చోటునకు కూడా ఆధారమై యున్నది. చోటునందు పని చేయుచున్నపుడు దీనినే కుండలిని అందురు. దీని వలన గ్రహగోళములు వ్యక్తమగుట మరల అవ్యక్తము లోనికి పోవుట జరుగుచున్నది. చోటునందలి ఈ స్పందనమే జీవియందు ఉచ్ఛ్వాస, నిశ్వాసములుగా మరియు గుండె కొట్టుకొనుటగా ఏర్పడుచున్నవి. ఇవి అన్నియు ప్రాణశక్తి వల్లనే కల్గుచున్నవి కనుక భగవంతుడు ప్రాణశక్తి, అనగా భగవంతుడే జీవులకు ప్రాణమై యున్నాడు.

4. కనుక భగవంతుడు జీవుల శరీరమును తానే ప్రాణశక్తియై కల్పించి ఇచ్చుచున్నాడు. అందుచేత ఆయన ప్రాణమును ఇచ్చువాడగుచున్నాడు. అట్లు వచ్చు శరీరములు కూడా భగవంతునిచే కల్పింపబడినవే కాని జీవులచేత కాదు. అట్లు కల్పించుటకై ఆయన ఆయా శరీరముల యందు ప్రాణశక్తిగా మేల్కొని యున్నాడు. ఒక్కొక్కసారి ఆపత్సమయములందు కాని, కష్టసమయములందు కాని, కొందరు మనకు సహాయము చేసి ఆపదలను, కష్టములను తొలగించి ప్రాణమును నిలబెట్టుదురు. అతడు వైద్యుడు కావచ్చును. స్నేహితుడు కావచ్చును. లేక పరిచయములేని క్రొత్త వ్యక్తికావచ్చును. ఆపదలలో నున్నపుడు మనలను కాపాడుటవలన అతడు మనకు ప్రాణములను, శరీరములను, ఇచ్చువాడగుచున్నాడు. అనగా భగవంతుడే అగుచున్నాడు. కనుక అట్టి వారికి కృతజ్ఞత కలిగియుండి, వారి ఉపకారబుద్ధిని గౌరవించి పూజించుట ధర్మము. అట్లు చేయుటవలన అతని యందు ఉన్న భగవంతుని, నిన్ను రక్షించుచున్న వానిగా గుర్తించుచున్నావు. అతని యందున్న అంతర్యామి, నీ కృతజ్ఞతకు మెచ్చి నిన్ను సర్వదా అట్లే కాపాడుచుండును. మరియు ఇతరులయందలి ఈ గుణము తాను కూడా అవలంబించి తోటివారిని

రక్షించుటయందు తన సమయమును ధనమును ఖర్చు పెట్టినవానికి ఆపదలు కలుగవు. కనుక ఇట్లు జీవులలో గల రక్షించుబుద్ధిగా భగవంతుడే యుండి మనకు ప్రాణములను, జీవితమును ఇచ్చుచున్నాడు.

5. వామనావతారమున మహావిష్ణువు అదితి, కశ్యపులకు కుమారుడై పుట్టెను. కశ్యపుడనగా ఆకాశమువలె కనిపించు డిప్ప. అదితి అనగా మూల ప్రకృతి. వామనుడు దేవతల రాజ్యమును మరల స్థాపన చేసి దానిని దేవేంద్రునకు ఇచ్చెను. బలికి దానికి అతీతమైన తన సాన్నిధ్యమును, శాశ్వత స్థితిని ఇచ్చెను.

6. విద్యుత్తు చోటునందు నీటిని కల్పించుచున్నది. ఈ విద్యుత్తు వలననే మేఘములు వర్షములుగా కురియుచున్నవి. అనగా చోటుయందు నీటియొక్క పుట్టుకకు ఈ విద్యుత్తు కారణము. నీరు, మంచుగడ్డ, నీటి ఆవిరి మున్నగునవి విద్యుత్తువలననే కల్గుచున్నవి. ఈ విద్యుత్తువలననే నీరు సృష్టింపబడుటయు మరల నశించుటకు జరుగుచున్నది మరియు భగవంతుడు తానే నీటికి నిధియై యుండి సృష్టి నిర్మాణమునకు, ప్రళయములకు కారణమగుచున్నాడు. అనగా ఈ సృష్టియంతయు ఆయనయందు కరిగి పోవును. మరల ఆయనలో మంచుగడ్డ తేలినట్లు లేక ఒక పడవ తేలినట్లు ఈ సృష్టి తేలును. ఇట్టి నీటికి తానే ఆధారము కనుక ఆయన నారాయణుడు అగుచున్నాడు. ఈ నారాయణుడు అపాంనిధిః అని కీర్తింపబడుచున్నాడు.

7. ఈ విశ్వమే జీవులకు పీఠము లేక ఆసనము. ఈ విశ్వ రూపుడయిన భగవంతుడు జీవులకు, లోకములకు ఆధారమయి యున్నాడు. సృష్టి వివిధ స్థితులను, లోకములను జీవుడు పొందుటకు భగవంతుడే ఆసనముగా పనిచేయుచున్నాడు. సృష్టింపబడిన ప్రతి వస్తువు ఆయనయందే జీవించియున్నది. కనుక నారాయణుడు అందరిని తానేపొంది యున్నాడు. అంతేగాక జీవులు సంపాదించి పొందిన వస్తువులు సైతము భగవంతుని యందే యున్నవి. కనుక వీటిని నిజముగా పొందినది నారాయణుడే.

8. పొరపాటు అనునది సృష్టియందు గాని ప్రకృతి యందు గాని మనకెచ్చటను కనిపించదు. ఇది మానవుల మనస్సునందు మానవులచే

సృష్టింపబడినది. ప్రకృతి యందు సమస్తము ధర్మము ననుసరించి పని చేయును. పదార్థముల ధర్మములు, శక్తి, మనస్సు, చోటు మున్నగునవి ఈ ధర్మము నుండి పుట్టును. ఈ ధర్మమునకు ఆధారమైనవాడు భగవంతుడు. కనుక వీనిలో పొరపాటు లేనిచో భగవంతునియందు పొరపాటు లేదనియే అర్థము. మామిడిపండు తియ్యగానుండుట, కాకరకాయ చేదుగానుండుట వాని ధర్మములు. మామిడి పండు పొరపాటున చేదుగానుండుట గాని, కాకరకాయ పొరపాటున తియ్యగానుండుటగాని జరుగవు. కనుక ధర్మమునకు, ప్రకృతికి పొరపాట్లు లేవు. నిప్పులో చేయి పెట్టినచో పొరపాటున కాలకుండ నుండదు. కనుక భగవంతుడు పొరపడడు. అతనెప్పుడును అప్రమత్తుడై ఉండును. అనగా జాగరూకుడై యుండును. ఈ జాగరూకత జీవులలో ఎల్లప్పుడు వుండును. ఈ జాగరూకతనే గాయత్రిగా చెప్పుదురు. జీవుల శ్వాసయందుండి జీవులను మేల్కొలుపునది ఈ గాయత్రియే. ''ధీయోయోనః ప్రచోదయాత్'', అను మంత్రముద్వారా గాయత్రి ఉపాసింపబడుచున్నది.

9. ప్రతివాడు తన భావములను, ఆశయములను స్థాపించుటకు ప్రయత్నించును. ఇవి తన సిద్ధాంతములపై నాధారపడినవి. ఆ సిద్ధాంతములు తనకున్న జ్ఞానము ననుసరించి కలుగును. ఎవరికెంతవరకు జ్ఞానము కలుగవలెనన్నది అంతర్యామియైన పరమాత్మ యధీనము. అనగా ప్రతివాడు తనకు తెలియకుండగనే తనజ్ఞానమనుపేర నారాయణునే స్థాపించుచున్నాడు. కనుక ఎవరేది నిలబెట్టినను, స్థాపించినను అది నారాయణునే యగుచున్నది.

36. శ్లో|| స్కన్దః స్కన్దధరోఽధుర్యో వరదో వాయు వాహనః
వాసుదేవో బృహద్భానురాది దేవః పురన్దరః ||

**ప్రతిపదార్థము** :- 1. స్కన్దః = సుబ్రహ్మణ్యస్వామి స్వరూపము. చోటు నుండి తేజస్సును (నీటి) బిందువుగా వ్యక్తమగువాడు, 2. స్కన్దధరః = సుబ్రమణ్యేశ్వర స్వామిని ధరించిన తల్లి (అగ్ని, గంగ, కృత్తికలు సుబ్రమణ్యేశ్వరుని జన్మకు కారకులైనవారు), 3. ధుర్యః = నాయకుడు, 4. వరదః = వరములిచ్చువాడు, 5. వాయువాహనః = వాయువే తన వాహనమైనవాడు, 6. వాసుదేవః = వసుదేవుని కుమారుడు, జీవులచేష్టల రూపమున

వ్యక్తమగువాడు, 7. బృహద్భానుః = గొప్పవాడైన కుమారుడు లేక గొప్పకాంతిని ధరించినవాడు, 8. ఆదిదేవః = మొట్టమొదటికాంతిగా వ్యక్తమయినవాడు, 9. పురందరః = రాక్షసుల పురములను నశింపచేసినవాడు. (ఈయనే ఇంద్రా విష్ణువు. అనగా యింద్రుని రూపముగా నున్న విష్ణువు.)

**తాత్పర్యము :-** పరమాత్మను రాక్షస సంహారమునకై దేవతల సైన్యమును నడుపు సుబ్రహ్మణ్యేశ్వరునిగా, అగ్నిగా, గంగగా, కృత్తికలుగా, మరియూ వీరిని ఆయన జన్మకు కారకులైనవారిగా ధ్యానము చేయుము. మొట్టమొదటి కాంతిగా, వరములిచ్చువానిగా, వాయువే తన వాహనమైన వానిగా. అందరిలో వారి ప్రవర్తనగా వసించు దేవునిగా, మరియు గొప్ప ప్రకాశవంతునిగా, రాక్షసుల పురములను నశింప చేయువానిగా ధ్యానము చేయుము.

**వివరణము :-** 1. స్కన్దుడు శివుని కుమారుడైన సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆయన దేవతలను సేనగా సమీకరించి రాక్షసులను సంహరించెను. స్కన్దుడనగా బొట్లు, బొట్లుగా స్రవించువాడు అని అర్థము. చోటునందు అమృతత్వము అను తేజస్సు నిండి యున్నది. ధ్యానము చేయువారికి వారియందు ఈ అమృతత్వము బొట్టు బొట్లుగా స్రవించును. మానవుని శిరస్సునందు ఇంద్రగ్రంధి **(Penial Gland)** అను గ్రంధి ఒకటి మెదడు క్రింది భాగమున కలదు. మానవుని యందు అమృతత్వము జీవరసముగా మారి ఇంద్ర గ్రంధి ద్వారా స్రవించును. మనస్సును బుద్ధియందు లీనము చేసి బుద్ధిని అంతర్యామియందు సమర్పణ చేయువారికి ఇది సాధ్యము.

2. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి జన్మించినప్పుడు శివునినుండి మొట్టమొదటి కాంతిగా ఆయన వ్యక్తమయ్యెను. అగ్ని ఆయన కాంతిని స్వీకరించి తాను ధరింపలేక గంగ యందు వదలెను. గంగ యనగా మంచు నీరుగా మారు స్థితి. అప్పుడు ఆయన గంగ ఒడ్డున గల రెల్లు పూలపై ధరింపబడి, పిల్ల వానిగా పుట్టెను. ఆ పిల్ల వానిని కృత్తికలు పాలిచ్చి పెంచిరి. పరమాత్మనుండి సంకల్పము అను మహాచైతన్యము లేక తేజస్సు పుట్టినది. దానినే మొట్ట మొదటి వెలుగు లేక అగ్ని అని కూడా అందురు. అగ్ని నీరుగా మారినపుడు ఆ నీటియందు మరల ఈ చైతన్యమే జీవశక్తిగా ధరింపబడి మొక్కలు

పుట్టుకకు కారణమగుచున్నది. రెల్లుపూలు అనగా సూర్య కిరణములు అని సంకేతము. ఆ సూర్య కిరణమునందలి జీవశక్తి వలన జీవులు పుట్టుచున్నారు. ఈ జీవులకు శరీరములు కల్పించు ధాతువు దేహమునందు శుక్రమను ధాతువు. అది తెల్లగా నుండును కనుక రెల్లుపూలుగా చెప్పబడినది. జీవులయందలి జీవశక్తియే సుబ్రహ్మణ్యేశ్వరుడు. ఆయనకు ఆహారము కృత్తికా నక్షత్రముల నుండి వచ్చును. అనగా కృత్తికల కిరణములు జీవుని యందలి షట్చక్రములను ఉద్భోధనము చేసి, జీవునియందలి పరమాత్మను మేల్కొల్పి పరిపూర్ణత్వము కలిగించును. ఇట్లు పరమాత్మ జీవునియందు మేల్కొనుటకు కృత్తికా నక్షత్రములనుండి ప్రసరించు కిరణములు సహాయము చేయును. అట్లు పరమాత్మ జీవునియందు పుట్టుటయే సుబ్రహ్మణ్యేశ్వరుని జననముగా వర్ణింపబడినది. అట్లు అగ్ని, గంగ, కృత్తికలు సుబ్రహ్మణ్యేశ్వరుని ధరించుచున్నారు.

3. ధుర్యః అనగా రెండెద్దుల బండికి ముందు నడుచువాడు అని అర్థము. అనగా సుబ్రహ్మణ్యేశ్వరుడు దేవతల సైన్యమును నడుపువాడు గనుక ధుర్యః అని పిలువబడినాడు.

4. సుబ్రహ్మణ్యేశ్వరుడు వరములిచ్చువాడు. ముఖ్యముగా పిల్లలు లేని వారు ఈయనను కొలిచి సంతానమును పొందుచున్నారు. అట్లే తనను ధ్యానము చేయువారికి వ్యాధి నివారణ చేయును. ముఖ్యముగా గర్భాశయ వ్యాధులు, గర్భపాతములు, కంటి బాధలు, చెవులు, ముక్కు, గొంతులకు సంబంధించిన వ్యాధులు ఈయనను ధ్యానము చేసినచో శీఘ్రముగా నివారణ కాగలవు.

5. అగ్ని వాయువు వలన శీఘ్రముగా వ్యాపించును, మరియు మన శరీరము నందలి ప్రాణశక్తి శ్వాసవలన పుట్టుచున్నది. కనుక అగ్ని వాయువాహనుడు.

6. వాసుదేవుడనగా వసుదేవుని కుమారుడు మరియూ జీవులలో వారి ప్రవర్తన మూలమున తెలియబడువాడు. అనగా జీవుల యందలి ప్రవర్తనము వాసుదేవుని యొక్క ప్రవర్తనముగా ధ్యానము చేసి, వానిననుసరించి జీవించువానికి వాసుదేవుని సాన్నిధ్యము నిరంతరముండును.

7. సూర్యుడు మనకు కనిపించుచున్నట్లు ఒక గోళము కాదు. నిజమునకు అచట గోళమనునది లేదు. చోటులో ఒక చోట కేంద్రీకృతమై అనంతమైన శక్తి జ్వాలగా లేక ప్రకాశముగా వ్యక్తమగుచున్నది. చోటులో నున్న అగ్ని తనంతట తాను వ్యక్తమగుచున్నది. కనుక ఎట్టి ఇంధనము అక్కరలేదు. ఏ ఇంధనమువలన నైనను అగ్ని లేక నిప్పు పుట్టుటలేదు. కాని అగ్ని వ్యక్తమగుట కవి సహకరించుచున్నవి సూర్యుడు తారలు మున్నగునవన్నియూ ఇట్లు శక్తి కేంద్రములుగా లేక బిందువులుగా వ్యక్తమై జ్వాలామయమైన గోళములుగా కట్టుకొన్నవి. వాటి యందు ఇంధనము లేదు కనుక, ఇంధనమైపోవుట, జ్వాల ఆరిపోవుట అను ప్రసక్తి రాదు. చోటులో ఇట్లు కేంద్రములుగా లేక బిందువుగా ఆత్మయే వ్యక్తమగుచున్నది. ఈ ఆత్మయే నేనను ప్రజ్ఞ, విశ్వమునంతటనూ ఈ ప్రజ్ఞయే నిండి యుండును.

8. ఇట్లు చోటుయందు ఒక చోట బిందువుగా వ్యక్తమైన సూర్యుడను ప్రజ్ఞ మన సౌరమండలమునకు మొదటి వాడగుచున్నాడు. అట్లే ఈ విశ్వమునకు కూడా, అంతటను నిండియున్న పరమాత్మయే కారకుడగుచున్నాడు. కనుక ఆయన ఆదిదేవుడు. అనగా మొట్టమొదటి దేవుడు.

9. అంతర్యామి ఇంద్రుడుగా దిగివచ్చి రాక్షసులు కట్టిన పురములను నశింపచేయును. శంబరాసురుడను రాక్షసుడు పురమును నిర్మింపగా ఇంద్రా విష్ణువులు వాని పురమును నాశనము చేసిరని విష్ణు సూక్తములందు చెప్పబడినది. మనసు నందుగల కామము, క్రోధము, మదము, మాత్సర్యము మున్నగు దుష్ట భావములే ఈ రాక్షసులు, ఆ భావములవలన ఊహలు, చేయుపనులు మున్నగునవియే వారిపురములు. రాక్షసులను ఇంద్రా విష్ణువులు సంహరించిరి. ఇంద్రియముల కధిపతి యింద్రుడు. అతని యందు విష్ణువు ఆవేశించినపుడు రాక్షస సంహారము జరుగును. లేనిచో రాక్షసులే యింద్రుని జయింతురు. పంచేంద్రియముల ద్వారా చూచునది, వినునది మున్నగునవన్నియూ విష్ణువుయొక్క రూపములే అని తెలియుటయే ఇంద్రుని విష్ణువావేశించుట. దీనివలన మాత్రమే రాక్షస సంహారము జరుగును.

37. శ్లో॥ అశోకస్తారణస్తారః శూరశ్శౌరిర్జనేశ్వరః
అనుకూలశ్శతావర్తః పద్మీపద్మనిభేక్షణః ॥

**ప్రతిపదార్థము** :- 1. అశోకః = శోకము లేనివాడు, 2. తారణః = తరింపచేయువాడు లేక దాటించువాడు, 3. తారః = తరింపచేయుతార లేక సూర్యుడు, 4. శూరః = శూరుడు, 5. శౌరిః = సూర్యుని యందలి శూరత్వము, 6. జనేశ్వరః = జనులకు ఈశ్వరుడు లేక అధిపతి, 7. అనుకూలః = అనుకూలమైనవాడు, 8. శతావర్తః = వంద సుడులు కలవాడు, 9. పద్మీ = బొడ్డునందు పద్మము కలవాడు, 10. పద్మ నిభేక్షణః = పద్మమువంటి కన్నులు కలవాడు.

**తాత్పర్యము** :- భగవంతుని దుఃఖమునకతీతునిగా, మాయను తరింపచేయువానిగా, తారయై మార్గము నిర్దేశించువానిగా, సూర్యునిగా, వాని యందలి శౌర్యముగా, ఇతరులతో అనుకూలించువానిగా, మరియూ అందరిని తనచుట్టూ వంద సుడులై ఆకర్షించువానిగా, నాభియందు పద్మము గలవానిగా మరియూ పద్మదళములవంటి కన్నులు కలవానిగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. శోకమనునది మనస్సులో నొక పొర. తాను దుఃఖపడు సన్నివేశములే ఇతరులకు జరిగినపుడు అవి సహజములని మానవుడు తెలియుచున్నాడు. తనకు జరిగినప్పుడు కూడా ఈ భావనయే నిలిచినచో వానికి శోకము నశించును. అట్టి భావము నిలచుటకు మనస్సు, అందలి పొరలు బుద్ధియందు లీనము కావలెను. అట్లు లీనమగుటకు అంతర్యామి స్మరణయే ముఖ్యసాధనము. అనగా వాని స్మరణయందున్నపుడు మనస్సు, అందలి భావములు జీవినంటవు. కనుక అతడు అశోకుడని చెప్పబడినది.

2,3. భగవంతుడే జీవులకు ఆకాశమునందలి తారవలె మార్గమును చూపుచున్నాడు. పూర్వము నావికులు సముద్రప్రయాణము చేయునపుడు రాత్రులందు వారి ప్రయాణము ధ్రువ నక్షత్రము, సప్తఋషి మండలము మొదలగు వాని వలన నిర్ణయించుకొనువారు. అట్లే జీవుల వారి జీవితములందు కష్టములు చుట్టుముట్టి మనసును శూన్యము చేసినపుడు విష్ణువు వారికి ధ్రువతారవలె దారిచూపును. ఇట్లు ఈ దారి చూపుట జన్మల తరబడి జరిగి,

విష్ణువు క్రమేణా చీకటినుండి వెలుగులోనికి తీసుకొని పోవుచున్నాడు. అనగా అజ్ఞానమునుండి జ్ఞానమను వెలుగులోనికి తీసుకొని పోవును.

4,5. ప్రపంచమునందు మంచి వారిని కాపాడుటకు, ధర్మమును రక్షించుటకు శూరులు కావలెను. అట్టి శూరులు మరియు వారియందలి శూరత్వము విష్ణువునుండి దిగివచ్చినవే. దీనిని గూర్చియే భాగవతమునందు భగవంతుని ఆవేశావతారములు అసంఖ్యాకములని చెప్పబడినది. ఇదియే భగవద్గీతలో శ్రీకృష్ణునిచే ''బలం బలవతామశ్మి'' అని చెప్పబడినది. అనగా బలవంతులయందలి బలము భగవంతుని రూపమని భావము.

6. రాజు విష్ణువు యొక్క అంశతో కూడినవాడని శాస్త్రమునందు చెప్పబడినది. అనగా ధర్మము ననుసరించి ప్రజలను పరిపాలించుచు సుఖపెట్టుచున్నారనగా వారు నారాయణాంశ సంభూతులే. ఇది జరగవలెనన్నచో కేవలము రాజు ధర్మపరుడైనంత మాత్రమున సరిపోదు. ప్రజలలో అత్యధికులు ధర్మము ననుసరించి జీవించువారై మిగిలినవారిని నియమింపగలిగి యుండవలెను. అనగా వారు త్రికరణశుద్ధిగా ధర్మమును కోరి, నాచరింపవలెను. ధర్మము నాచరించుట యనగా కష్టపడి పని చేయుట, దేశసంపదను పెంచి మిగిలినవారిని సుఖపెట్టుట మున్నగునవి. అంతేకాని ధనార్జన, తన వ్యక్తిగత సౌఖ్యమే ప్రధానము కారాదు. అనగా పై మార్గముల యందు మాత్రమే ధనార్జన, సంపదను కోరుట చేయవచ్చును. అట్లు జీవించు ప్రజలకు ధర్మపరుడైన రాజు సహజముగా సంక్రమించును. అనగా విష్ణువే అట్లు నయమించును. ఈ రహస్యము తెలిసినవారు ప్రభుత్వమును, రాజ్యాంగమును విమర్శించుట మాని, తాము తమ ధర్మము సక్రమముగా నిర్వర్తించుటవలన జనులయందలి ఈశ్వరుని ఆరాధించు వారగుచున్నారు.

7. అనుకూలము అనునది భగవంతుడిచ్చువరము. అనగా ఒక పని చేయుటకు అనుకూల పరిస్థితులేర్పడినచో ఆ పని జరుగుట భగవంతునికంగీకారమని అర్థము. ఇది తెలిసినవారు పనులు అనుకూలించినప్పుడు సంతోషపడుట, ప్రతికూలించినపుడు దుఃఖపడుట చేయరు. అంతే గాక పనులు అనుకూలించుచున్నచో భగవంతుని అనుమతి యైనదని వారు గుర్తింతురు. అట్లు కానిచో ఆ పనులు చేయరు. మరియూ

పని చేయుట వలన కలుగు ఫలితములు భగవంతుని వరములుగా గుర్తించి, ఆనందింతురు. ఫలితమేదైననూ అది తమను అంతర్యామిలోనికే తీసుకొని పోవునని గుర్తింతురు.

8. పరమాత్మ తనచుట్టూ అనేక ఆవర్తనములుకాక సుడులను కలిగి యున్నాడు. సృష్టియందు ప్రతివారికిని తనచుట్టూ తాను గీచుకున్న గిరియున్నది. ఆ గిరియే తన మనస్సు, ఎవడు గీచుకున్న గిరినుండి వాడు ఈవలకు రాలేడు. ఇది ఒకరికి చిన్నది మరియొకరికి పెద్దది, ఇంకొకరికి ఈ విశ్వమంతది కావచ్చును. ఎవరి మనసునుబట్టి వారికి భౌతిక ప్రపంచముతో అవగాహన ఏర్పడును. సిద్ధపురుషులైనవారు తమ అవగాహన భగవంతునియందు మిళితము చేసుకొని వానినే సంఘటనలుగా, అనుభవములుగా అవగాహనము చేసుకొనుచున్నారు. ఇట్లెవరి చుట్టూ వారు గీచుకొన్నగిరి సృష్టి యందలి గ్రహములకు గోళములకు, కూడా కలదు. సూర్యుని చుట్టూ గ్రహములన్నియూ తమ తమ పరిధులలో తాము తిరుగుచున్నవి. కాని వీటన్నిటికి కేంద్రమొక్కటే. అదియే సూర్యుడు. అట్లే జీవులు ఎవరి పరిధియందు వారు తిరుగుచున్ననూ, వారందరికీ కేంద్రమొక్కటే. అదియే పరమాత్మ. పరమాత్మనే తమ లక్ష్యములుగా, ఆదర్శములుగా చిత్రించుకొని జీవులు వాని చుట్టు తిరుగుచున్నారు. ఎవరి పరిధిలోనున్ననూ వారి పరిధిని తన పరిధిగా మార్చగలవాడు భగవంతుడొక్కడే. కనుకనే ఆయన శతావర్తనుడని పిలువబడినాడు.

9. పరమాత్మయొక్క నాభినుండి పద్మము పుట్టెను. అదియే సృష్టి ప్రారంభము. ఈ పద్మము నుండియే బ్రహ్మ విష్ణువుకు మొదట కుమారునిగా పుట్టెను. ఆయన సృష్టికర్త.

10. పరమాత్మయొక్క కన్నులు పద్మములవంటివి. అందుచేతనే ఆయన పద్మదళాయతాక్షుడు అని కూడా పిలువబడెను. పరమాత్మయొక్క చూపులకు, బ్రహ్మసృష్టికి సంబంధమున్నది. పరమాత్మ చూచుట ప్రారంభించెననగా బ్రహ్మ, సకలదేవతలు, మహర్షులు, మానవులు, సకల జీవులు అందరూ చూచుచుండిరని అర్థము. పరమాత్మ యొక్క చూపులే వారి చూపులు. లేక వారి చూపులే భగవంతుని చూపులు. వారియందు గల చూచునట్టి శక్తి భగవంతునివలన నేర్పడుచున్నది. సూర్యుని కిరణములవలన పద్మదళములు వికసించినట్లు,

భగవంతుని అనుగ్రహమువలన జీవులు మేల్కొని కన్నులు విచ్చి చూచుట ప్రారంభించిరి. ఇట్లు అందరి చూపులు లేక కన్నులు తనవేయైనవాడు గనుక ఆయన పద్మములవంటి కన్నులు కలవాడు.

38. శ్లో॥ పద్మనాభో ऽరవిందాక్షః పద్మగర్భశ్శరీరభృత్ ।
మహర్ధిర్ఋద్ధో వృద్ధాత్మా మహాక్షో గరుడధ్వజః ॥

**ప్రతిపదార్ధము :-** 1. పద్మనాభః = బొడ్డుయందు పద్మముకలవాడు. 2. అరవిందాక్షః = పద్మదళములవంటి కన్నులు కలవాడు, 3. పద్మగర్భః = పద్మము తన పుట్టుక స్థానమైనవాడు, 4. శరీరభృత్ = శరీరమును నడుపువాడు, 5. మహర్థిః = గొప్ప వృద్ధి కలవాడు, 6. ఋద్ధః =వృద్ధిపొందినవాడు, 7. వృద్ధాత్మా=వృద్ధి చెందిన ఆత్మ కలవాడు, 8. మహాక్షః = గొప్ప కన్నులు కలవాడు, 9. గరుడధ్వజః = గరుడ పతాకము ధరించినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను బొడ్డునందు పద్మము గలవానిగా, పద్మముల వంటి కన్నులు గలవానిగా, మరియు పద్మమునందు పుట్టువానిగా, శరీరము నిర్వహించువానిగా, మరియూ శరీరము వృద్ధి పొందువానిగా, ఆత్మగా వృద్ధి పొందువానిగా మరియూ వృద్ధి పొందు రూపమే తానైనవానిగా, గొప్ప కన్ను లేక చూపు (సూర్యునిగా) గలవానిగా మరియూ గరుడ పతాకము గలవానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ఆయన నాభినుండి పద్మము పుట్టుట యనగా సృష్టి ప్రారంభమగుట. నాభి తల్లి బిడ్డలకు సంకేతము. ప్రకృతి తల్లిగా పరమాత్మ శిశువుగా నున్నపుడు తల్లికి బిడ్డకు నాభి ద్వారా సంబంధముండును. ఈ మొట్టమొదటి బిడ్డయే బ్రహ్మ. ఆయనకు పరమాత్మకు నాభియే సంబంధము. ఈ నాభి స్థానముననే మణిపూరక చక్రము పని చేయుచున్నది. ఇది మానవునియందు గల ఆవేశమునకు పుట్టుక స్థానము. తనయందలి ఆవేశములను భగవంతునియందలి భక్తిచే దమింపచేసుకొనువానికి పై లోకముల యందు ప్రవేశము కలుగును. భగవంతుని యందు కలుగు ప్రేమ లేక భక్తియే శక్తి యనియు, కుండలిని యనియు పిలిచెదు. ఆమెయే లలితా సహస్రనామ స్తోత్రములందు ''మణి పూరాంత రుదితా'' అని కీర్తింపబడినది.

అజ్ఞానములోనున్న జీవికి మొదట వాని బిడ్డలయందు ప్రేమ లేక వ్యామోహమే వానిచే వారికొరకు మంచి పనులను చేయించును. అట్లే ఆవేశాత్మకమగు ప్రేమ ద్వారా మానవుని మొట్టమొదటి సంస్కారము ప్రారంభమగుచున్నది. అట్లు ప్రారంభమైన సంస్కారము క్రమేణా మనస్సును, బుద్ధిని మేల్కొల్పి చివరకు ఆత్మయందు స్థిరత్వము చెందుచున్నది. అనగా జీవుడు తానే జీవులందరియందు వున్నానని గ్రహింపగలుగుచున్నాడు. ఇట్లు వికాసమునకు ప్రారంభము నాభి నుండియే కనుక భగవంతుడు పద్మనాభుడు. అంతేగాక మానవుని మేధస్సునందలి ఒక్కొక్క పొర తొలగిపోయినకొలది తనచుట్టూ ఉన్న విశ్వమును గూర్చి తన అభిప్రాయములను పొరలు గూడా క్రమేణా విచ్చుకొని, చివరకు భగవంతుని అంతర్యామిత్వమునందు జీవుని లయము చేయుచున్నది. ఇట్లు విచ్చుకొనుచున్న పొరలే పద్మమునందలి దళములు.

2. పరమాత్మ పద్మము వంటి కన్నులు కలవాడనగా సృష్టియందు మొక్కలు వృక్షజాతులు పుట్టి వికసించి, చిత్రవిచిత్రములైన వర్ణములతో సృష్టిని మనోహరముగా తీర్చిదిద్దుట తెలుపును. పూవు పుట్టి, అది కాయయై, పండై, మరల గింజలనిచ్చి, సృష్టిని కొనసాగించుటకు యిది సంకేతము.

3. చోటు, పద్మము నుండి పుట్టుచున్నది. అట్లే సృష్టికర్త బ్రహ్మ, నారాయణుని నుండి పుట్టుచున్నాడు. అనగా నారాయణుడే బ్రహ్మగా దిగి వచ్చెను. ఆ బ్రహ్మ పద్మమునుండి పుట్టెను. కనుక భగవంతుడే పద్మమునందు పుట్టెనని చెప్పబడినది. బ్రహ్మాండమంతయూ చోటుగా పుట్టుచున్నది. అట్లు చోటుగా పుట్టుటయే పద్మము పుట్టుట, వికసించుట. అట్లు వికసించిన చోటునందు పరమాత్మ తానే సకల జీవులుగా దిగి వచ్చుచున్నాడు కనుక అతను పద్మగర్భుడు.

4. శరీరము నిర్వహింపబడుటకు ప్రాణశక్తి కావలెను. జీవుడు శరీరమునందు మేల్కొనినవెంటనే ఈ ప్రాణశక్తి శరీరమునందు పని చేయనారంభించును. జీవుడు పుట్టుకముందు తల్లి కడుపులోనున్నపుడు తల్లి ప్రాణశక్తియే బిడ్డను రక్షించుచున్నది. జీవునియందు ఈ ప్రాణశక్తి పరమాత్మ సాన్నిధ్యము వలన లభించును. అది జీవునిలో తానను ప్రజ్ఞగా మేల్కొని యుండును. ఈ ప్రాణశక్తి వలననే శరీరము నిలబడి యున్నది. అనగా గుండె కొట్టుకొనుట,

శ్వాసతీయుట, మున్నగునవి ప్రాణశక్తి వలన మాత్రమే జరుగును. ఇట్లు జీవుని శరీరనిర్వహణమును ప్రాణశక్తి నిర్వహించు చున్నదనగా అది భగవంతుని సంకల్పమే అని అర్థము. జీవుని శరీరము నిర్వహించువాడు నారాయణుడే అగుచున్నాడు.

5. శరీరము, మనస్సు, బుద్ధి మున్నగునవి అభివృద్ధి చెందుచున్నవనగా విష్ణువు వ్యాపకత్వము జీవునియందు జరుగుచున్నదని అర్థము. భగవంతుని అంతర్యామిత్వమునుండి జీవుడుగా పుట్టెను వృద్ధి యనగా ఇంతకు ముందున్న స్థితినే మరల అనుభవము లోనికి తెచ్చుకొనుటయే.

6. అట్లు అభివృద్ధి చెందుట లేక వ్యాపకత్వము చెందుట అనగా పరమాత్మయొక్క అస్తిత్వమును అన్నిటియందునూ గుర్తించుట. అభివృద్ధి చెందుచున్నవాడు పరమాత్మ అంశయే. మరియూ అభివృద్ధి చెందుటకు ఆయనయే కారణము కూడా. ఈసమస్తము ఆయనలో ఒక భాగమే. తెలుసుకొనువాడు, తెలుసుకొనునది, తెలుసుకొనబడు విషయము మున్నగునవన్నియూ పరమాత్మ యొక్క భాగములే.

7. సౌరకుటుంబ మంతయూ ఒక మహా ప్రజ్ఞచే దర్శింపబడి నిర్వహింపబడుచున్నది. ఆ మహా ప్రజ్ఞయే సూర్యగోళమునందు పని చేయుచున్నది. ఈ ప్రజ్ఞ వలననే జీవులకు కన్ను లేర్పడి చూపు ప్రసాదింపబడుచున్నది. ఇందరి చూపునకు కారణమైనవాడు సూర్యాంతర్వర్తి యైన నారాయణుడు.

8,9. జీవప్రజ్ఞ సర్పము వంటిది. స్వార్థబుద్ధి కల మనస్సు దాచి యుంచుటయూ, రహస్యమునూ కోరును. మూలాధారమునందు గల జీవప్రజ్ఞ సర్పము వంటిది. అది పరమాత్మ అంతర్యామిత్వమును అణువుల రూపమున భౌతిక వస్తువుల రూపమున పుట్టలోవలె దాచును. మూలాధారమునందలి ప్రజ్ఞ ఊర్ధ్వముఖ మైనప్పుడు పక్షివలె యగును. జీవునికి స్వార్థబుద్ధి నశించి, తోటివారియందు ప్రేమ మేల్కొనినప్పుడు, మనస్సు ఊర్ధ్వముఖమగును. ఈ పక్షికి గల రెండు రెక్కలే, వూపిరి తిత్తులు, రెక్కలాడించుటయే శ్వాస. ఈ పక్షి వీపుపై పరమాత్మ కూర్చొని యుండును. అనగా ఆయన హృదయమునందు

ప్రేమగా అనుభవింపబడుచున్నాడని యర్థము. మానవుని ఘెన్నెముకయే పరమాత్మకు ధ్వజము. శ్వాస తీసుకొనుట ముక్కుతో జరుగును. కనుక దీనకి సంకేతముగా గరుత్మంతునికి పొడవైన ముక్కు ఉన్నట్లు చెప్పబడినది. శ్వాసయందు మనసు నిలిపిన వానికి నారాయణుని సాన్నిధ్యము కలుగును. శ్వాసయందు మనసు నిలుపుట యనగా హృదయమునందు మనస్సులయము చేయుట. అనగా పనులు చేయుటకు హృదయము కారణము కావలెను, గాని మనస్సు కారాదు. ఇది తెలుసుకొనుటయే గాక, ఆచరించువానికి మాత్రమే శ్వాసయందు మనస్సు లయమగుచున్నది. ఇట్లు శ్వాస యందు, మనస్సు లయమగుట యనగా మానవుడు బుద్ధి లోకములలోనికి ప్రవేశించుట. ఇదియే ఆజ్ఞాచక్రము మేల్కొనుటయని చెప్పబడినది. ఇట్లు మనస్సునందు పరమాత్మ ప్రజ్ఞను ధరించినవానిస్థితికి గరుత్మంతుడు సంకేతము. మనస్సునందు చంచలమగు మానవ లక్షణము పని చేయువారికి కోతి సంకేతము. మహాభారతమున నారాయణుని రథముపైగల ధ్వజమునందు గరుత్మంతుడుండును. నరుడగు అర్జునునకు రథ పతాకముపై కోతి యున్నది. కనుకనే వేంకటేశ్వర సుప్రభాతమునందు పరమాత్మ ''ఉత్తిష్ట గరుడధ్వజ'' అని కీర్తింపబడినాడు. అనగా గరుడధ్వజుడైన పరమాత్మ మనయందు మేల్కొనును గాక యని అర్థము. మానవ శరీరమే రథము. పరమాత్మ సృష్టియందు అణువుగా మేల్కొని, జీవునిగా పర్యవసానము చెంది తిరిగి తనయందు తాను లయమగుట ఇది సూచించును.

39. శ్లో|| అతులశ్శరభో భీమస్సమయజ్ఞో హవిర్హరిః :|
సర్వలక్షణ లక్షణ్యో లక్ష్మీవాన్ సమితింజయః ||

**ప్రతిపదార్థము** :- 1. అతులః = తనకు సమానము లేనివాడు, 2. శరభః = వీరభద్రుడు, 3. భీమః = భయము కలిగించువాడు, 4. సమయజ్ఞః = సంప్రదాయము తెలిసినవాడు, 5. హవిః = యజ్ఞమునందు వేయబడునవి. 6. హరిః = సృష్టిలోనికి దిగివచ్చు పరమాత్మ, 7. సర్వలక్షణ లక్షణ్యః = అన్ని మంచి లక్షణములతో కూడిన లక్షణము కలవాడు, 8. లక్ష్మీవాన్ = లక్ష్మీదేవి భర్త, 9. సమితింజయః = తోటివారిని తర్కములో మించువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను అసమానునిగా, వీరభద్రావతారముగా, శివునివలె భయకంపితుని చేయు వానిగా, సంప్రదాయము తెలిసిన వానిగా, యజ్ఞములో సమర్పింపబడు సమిధగా, ధర్మము నిలబెట్టుటకు దిగివచ్చువానిగా, సృష్టియందలి కళ్యాణగుణములన్నియూ కలిగి యున్నవానిగా, లక్ష్మీదేవి భర్తగా తోటివారిని మించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. భగవంతుడు సృష్టియందు, సృష్టికి పైన ఉన్నాడు, గనుక ఆయనకు సమానము లేదు. ఏదియైననూ ఆయనలోని భాగమేకాని సమానము కాదు.

2. వీరభద్రుడు శివుని కోపమువలన పుట్టినవాడు. అతడు దక్ష యజ్ఞమును నాశనము చేయుటకై పుట్టెను. అట్లు నాశనము చేసి చివరకు దక్షుని శిరస్సు ఖండించి యజ్ఞమును అసంపూర్తిగా వదలెను. దేవతలు గొఱ్ఱె తలదెచ్చి దక్షుని కతికించి యజ్ఞమును పూర్తిచేసిరి. దక్షుడు సంవత్సరమను యజ్ఞమునకధిపతి. సకల దేవతలు వివిధ శక్తులుగా ఈ సంవత్సర యజ్ఞమునందు పని చేసి ఋతువులను కలిగించి, వృక్షములను, జంతువులను, మానవులను పోషించి పెంచుదురు. ఈ దేవతల యజ్ఞమునకు దక్షుడాధిపత్యము వహించును. ఉత్తర విషువము అను దినమున సంవత్సరము ఖండింపబడును. అనగా సూర్యుడు ఆ దినమున మీనరాశి నుండి మేషరాశి లోనికి ప్రవేశించును. ఆ దినము ప్రతి సంవత్సరము మార్చి నెల సుమారు 22వ తేదీనగాని, కొంచెము ముందు వెనుకలుగా గానివచ్చును. మేషరాశికి గుర్తు గొఱ్ఱెతల. సూర్యుడు రుద్రునికి సంకేతము. కనుక సంవత్సరాధిపతియైన దక్షునికి గొఱ్ఱెతల అతికించెనని చెప్పబడినది.

3. శివుని ప్రళయరూపము భయంకరముగా నుండును. కనుక ఆయన భీముడనియూ, భీమేశ్వరుడనియూ స్తుతింపబడినాడు. త్రిమూర్తులు నారాయణుని అవతారములు కనుక నారాయణుడే భీముడని చెప్పబడెను.

4. సంప్రదాయము మానవునిచే నిర్ణీతమైనది. కాని వానియందు సత్సంప్రదాయము మాత్రము భగవంతుని చేరుటకై ఉద్దేశింపబడినది. ఉదయముననే లేచి దైవప్రార్థన చేయుట, పూజ చేయుట, ప్రతిదినము దేవాలయమునకు పోవుట, అతిథులను గౌరవించి ఆతిథ్యమిచ్చుట, సేవ చేయుట

మున్నగునవి మంచి సంప్రదాయములు. ఇవి పాటించిన వాడెవడైననూ, నిస్సందేహముగా మోక్షమును పొందును. ఇట్టి సంప్రదాయము భగవంతునివలననే మానవునియందు స్థాపింపబడుచున్నది. కనుక పరమాత్మ సమయజ్ఞః అని చెప్పబడినాడు.

5. బుద్ధి, ద్రవ్యమయము, శక్తిమయమైన ప్రజ్ఞలు మానవశరీరములుగా కట్టుకొనుచున్నవి. ఇవియే పరమత్మ నిర్వహించు యజ్ఞమునకు సమిధలు. వానిని ఈ యజ్ఞమునందు సమర్పణము చేయవలెను.

6. భగవంతుడు ధర్మ సంస్థాపనము చేయుటకు ఒక అవతారముగా దిగివచ్చును. అట్లు అవతారముగా దిగివచ్చుటనే హరి యందురు.

7. సృష్టియందలి సౌందర్యము, సంతోషము, శుభము, మొదలగునవన్నియూ భగవంతుని వరములే. భగవంతుని అనుగ్రహము చేతనే, పరిస్థితులవలన పైవి సమకూరును. కనుక వీటిరూపముగా భగవంతుడే ప్రకాశించుచున్నాడు.

8. వైభవము, సంపద అనునవి లక్ష్మీదేవికి చిహ్నములు, ఆమె నారాయణుని భార్య. అనగా జీవులయందు పరమాత్మను దర్శించు గుణమున్నవానికి లక్ష్మీదేవి అనుగ్రహముండును. ఇట్టి వైభవమునకు, సంపదకు కారణమైన వానిగా నారాయణుని ధ్యానము చేయవలెను. అంతేగాని లక్ష్మిని మాత్రమే ధ్యానము చేయరాదు. ఆమెను విడిగా పూజించినచో అచ్చట నారాయణునికి స్థానములేదు గనుక లక్ష్మి తొలగిపోవు ప్రమాదమున్నది. అనగా జీవులు ధన కారణముగా గాక నారాయణుని యందు భక్తి కారణముగా పరులకు పనులు చేయవలెను.

9. గోష్ఠులయందు, సమావేశములయందు తానితరులను మించుచున్నాడనగా దానినిబట్టియే యితరులు తనకు సమానము కాదని తెలియును. అట్లు ఇతరులను మించుశక్తి పరమాత్మవలన కలుగును. గనుక అతడు సమితింజయుడు. పరమాత్మయొక్క ఈ గుణమే జీవులలో పనిచేసి సభలయందు భగవంతుని అంతర్యామిత్వమును స్థాపించువారియందు పనిచేయుచున్నది.

40. శ్లో॥ విక్షరో రోహితో మార్గో హేతుర్దామోదరస్సహః ।
మహీధరో మహాభాగో వేగవానమితాశనః ॥

**ప్రతిపదార్థము** :- 1. విక్షరః = నాశనములేనివాడు, 2. రోహితః = ఎరుపు వర్ణము కలవాడు, 3. మార్గః = మార్గమైనవాడు, 4. హేతుః = కారణమైన వాడు, 5. దామోదరః = మాలచేత అలంకరింపబడిన ఉదరము కలవాడు, 6. సహః = సహనము, సామర్థ్యము తానేయైనవాడు, 7. మహీధరః = భూమిని ధరించువాడు, 8. మహాభాగః = గొప్పభాగ్యము కలవాడు, 9. వేగవాన్ = మిక్కిలి వేగవంతమైనవాడు, 10. అమితాశనః = వివపరీతముగా తినువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను నాశనము లేనివానిగా, ఎరుపు వర్ణము కలవానిగా, తర్కించుటవలన తవ మార్గము తెలియబడు వానిగా ధ్యానము చేయుము. ఆయన ఉదరముపై పూలమాల యున్నది. సహనము, సామర్థ్యము ఆయనయే. ఆయన సమస్త భూమండలము యొక్క భారమును వహించును. సృష్టియందలి భాగ్యమంతయూ తానే, వేగమే ఆయన రూపము. సృష్టిని పుట్టించి మరల నశింపచేయుచు తానే వెలుగుచున్నాడు.

వివరణ :- 1. సృష్టి యందు నాశనము లేనిది '' ఓం'' కారమే. మిగిలిన అక్షరము లన్నియూ జీవులచేనుచ్చరింపబడి వారితోనే నశించుచుండును. ''ఓం''కారము అట్లు నశింపదు. అది జీవుల శ్వాసయందు పుట్టి మొట్టమొదటి శబ్దముగా వ్యక్తమగును. ఈ శ్వాస నారాయణునినుండి వచ్చినది. అనగా ఆయన శ్వాసయే జీవులశ్వాస. ఆయన తన శ్వాస యందు '' ఓం'' కారముగా బయలుదేరి జీవుల హృదయములలో '' ఓం'' కారముగా వ్యక్తమగును. ఇదియే ఉపదేశము కనుక ఎవరెట్టి ఉపదేశములను గురువువలన పొందినను, అన్నిటికన్న ముందుగా పరమాత్మ శ్వాస ద్వార తమ హృదయములందు ఉపదేశించుచున్న ''ఓం'' కారము నుచ్చరించుచున్నారు. కనుక ఓంకారము నాశనము కాదు.

2. ఉదయించుచున్న సూర్యుని రంగు ఎరుపు. ఇదియే రుద్రసూక్తము నందు ''నమస్తామ్రాయచ, అరుణాయచ'' అని చెప్పబడినది. సృష్టి

వ్యక్తమగుటకు యిది సూచన. రజస్సు సృష్టి వ్యక్తమగుటకు కారణము గనుక ఎరుపు వర్ణము రజస్సునకు సంకేతము. ఈ ఎరుపు వర్ణమే సౌరమండలము పుట్టుటకు, జీవుల పుట్టుటకు కూడా కారణము. తల్లి కడుపునందలి పసిబిడ్డ మొట్టమొదట పుట్టగానే ఎఱ్ఱగా నుండును.

3. సూర్యోదయమునుండి సూర్యాస్తమయమువరకూ గల మార్గమే జీవులకు తమ మార్గమగుచున్నది. దానిని బట్టి జీవులు తమ మార్గములను, అయుర్దాయములను నిర్ణయించుకొనుచున్నారు. జీవుల మార్గముగా పనిచేయునది భగవంతుడే. అతడు వారి వారి మనస్సులయందు బుద్ధులయందు పనిచేయుచు జీవితములను నడిపించుచున్నాడు. ప్రతివాడును తన జీవితమును గంటలుగా, రోజులుగా, సంవత్సరములుగా, లెక్కించుకొనుచూ సంఘటనలుగా అనుభవించుచున్నాడు. కాని తమను నడిపించుచున్న అంతర్యామిని గమనించుటలేదు. అట్లు వారు వారి మార్గములందు నడుచుచున్ననూ వారు ఆయన మార్గముననే నడుచుచున్నారు. అనగా వారి మార్గములు ఆయనవే అగుచున్నవి.

4. తర్కించుట అనగా జరిగిన విషయములను, సంఘటనలను మనస్సునందు ఒక వరుసలో ఊహించుకొని ఏర్పాటు చేసుకొనుట. ఇట్లు జరిగిన మరియు జరుగుచున్న విషయములను ఒక క్రమము ననుసరించి ఊహించుట మనసు లక్షణము. ఇట్టి ఈ లక్షణము మనస్సునకు భగవంతునివలన కలుగుచున్నది.

5. పరమాత్మ వాడిపోని పూలమాలలను ధరించియుండును. సృష్టియందలి దేవతలు, మహర్షులు మున్నగువారు చేయుపనులు మరియు వాటి ఫలితములే వారు భగవంతునికి సమర్పించు పుష్పములు, అట్టి పుష్పములతో కూడిన మాలను ఆయన నిరంతరమూ ధరించియుండును. దాని పేరు వైజయంతి. అనగా విజయమునకు కారణమైనది. తమపనులనూ, ఫలితములనూ భగవంతుని పాదములవద్ద సమర్పణము చేసుకొను వారికి జీవితములో ఎన్నడునూ విజయమే.

6. సహనము వలన తనకనుకూలము, వ్యతిరేకము అనువాని యన్నిటి

యందును సామ్యమేర్పడును. మరియూ ఈ సహనము వలన తాను ఆధారమై, తనకు ఆధారమక్కర లేని స్థితి యందుండును. ఇతరులు తన మీద ఆధారపడుటయే గాని తానితరులపై ఆధారపడడు. భగవంతుని ఈ గుణము జీవులయందు సహించు మరియూ రక్షించు శక్తిగా పనిచేయును. అవసరమైనప్పుడు భగవంతుడు ఇట్టి లక్షణములు గలవారిని పరిపాలకులుగా భూమికి పంపును.

7. పై లక్షణమును కలిగిన పాలకులు ప్రజలను రక్షించుట అనుభారమును స్వీకరించుచున్నారు. ఇట్లు వారి ద్వారా భూమి యొక్క భారమును భగవంతుడే నిర్వహించుచున్నాడు. ఈ భౌతిక ప్రపంచమును, అట్టి ద్రవ్యమయ జగత్తునూ, ఆదిశేషువే మోయుచున్నాడు. భూమి తనచుట్టూ తాను తిరుగుట మరియూ సూర్యుని చుట్టూ తిరుగుట శేషుని చుట్టలు. దీనివలన భౌతిక సృష్టి ఏర్పడుచున్నది. అట్లు చుట్టలు చుట్టలుగా చుట్టుకొని యున్న కాలమే ఆదిశేషువు. ఆయనయందు నారాయణుడున్నాడు. కనుక శేషువు ద్వారా భౌతిక ప్రపంచమును నారాయణుడే మోయుచున్నాడు.

8. పై లక్షణములవలన భగవంతుడు ఈ సృష్టియంతటికి భాగ్యవంతుడగుచున్నాడు. మానవుని భాగ్యమునకు కర్త, బాధ్యుడు మానవుడే యగుచున్నాడు. తన భాగ్యముతోబాటు తను సృష్టించుకొను సమస్యలకు కూడా తానే బాధ్యుడు. సంపదయున్నదని మితిమీరి తినువారికి, మత్తు పానీయములు సేవించువారికి కలుగు అనారోగ్యమునకు వారే బాధ్యత వహించవలెను. భగవంతునికి ఈ సృష్టియంతయూ భాగ్యమే. అనగా సంపదయే గాని సమస్యలు లేవు.

9. ఈ సౌరమండలమునందలి అన్ని వేగములకన్నా సూర్యునివేగము హెచ్చు. మిగిలిన వారి వేగములన్నియూ సూర్యుని వేగముతో పోల్చినచో అల్పములు. సూర్యుని కిరణములు మిక్కిలి వేగవంతములైనవి.

10. సూర్యుని అగ్నిగోళమే మన సౌరమండలమునకు శ్వాస. వెలుగు అచ్చటనుండి ప్రారంభమయి సౌరమండల మంతయూ వ్యాపించుచున్నది. ఈ సూర్యుని కిరణములే లేక వెలుగే మిగిలిన జీవులు, గ్రహములు పుట్టుటకు,

నశించిపోవుటకు కారణమగుచున్నది. సౌరమండలము నశించినప్పుడు ఈ గ్రహములన్నియూ సూర్యుని వెలుగునందు లీనమగును. అనగా సమస్త సృష్టియూ అగ్నిచే భక్షింపబడుచున్నది. నారాయణుడే అగ్నిగా వచ్చెను గనుక ఆయన అమితాశనుడు.

41. శ్లో॥ ఉద్భవః క్షోభణోదేవః శ్రీగర్భః పరమేశ్వరః ।
కరణం కారణం కర్తా వికర్తా గహనోగుహః ॥

**ప్రతిపదార్థము :-** 1. ఉద్భవః = పుట్టుకయైనవాడు, 2. క్షోభణః = క్షోభింప చేయువాడు, కలతపెట్టువాడు, 3. దేవః = ప్రకాశవంతుడు, 4. శ్రీగర్భః = సంపదకు పుట్టుకయైనవాడు, 5. పరమేశ్వరః= పరమాత్మ, 6. కరణం = నిర్వహణ, 7. కారణం = కారణము, 8. కర్తా = చేయువాడు, 9. వికర్త = చేయనివాడు, 10. గహనః = గ్రహించుటకు కష్టమయినవాడు, 11. గుహః = గుహవలె రహస్యమయినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను అన్నిటికి కారణమైనవానిగా, కలత పెట్టువానిగా, ప్రకాశవంతునిగా, సంపదలకు మూలముగా, ఆచరణగా, కారణముగా, చేయువానిగా, మరియు చేయనివానిగా, గ్రహించుటకు కష్టమైన వానిగా, గుహవలె మనలో దాగియున్న ప్రజ్ఞగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ప్రతివానికిని తన స్వభావమే తనకు మూలమైయున్నది. అట్టి స్వభావము భౌతికరూపమున వ్యక్తమగుచున్నది. కాని ఈ స్వభావము, భౌతిక రూపము రెండునూ పరమాత్మనుండి పుట్టినవే. కనుక ఆయన అన్నిటి పుట్టుకకూ కారణమైనవాడు.

2,3. సృష్టియందలి అనేకత్వము సృష్టికి కారణము. ఈ అనేకత్వము వలననే బ్రహ్మకు సృష్టిచేయుట సాధ్యమగుచున్నది. ఈ అనేకత్వమునందుగల ఏకత్వము జీవులను పుట్టించుచున్నది. ఈ ఏకత్వము, అనేకత్వము మున్నగునవి భగవంతుడు క్షోభింపచేయుటవలన లేక కలత పెట్టుటవలన జరుగుచున్నవి. ఇవియే సృష్టియందు ఆకర్షణ, వికర్షణ అను శక్తులుగా పని చేయుచున్నవి. పరమాత్మచేయు ఈ క్షోభణము వలన సృష్టిస్థితి లయములు జరుగుచున్నవి. ఇంకనూ వివిధ ఆకారములు, వర్ణములు, పరిమాణములు, కొలతలు కూడా

ఏర్పడుచున్నవి. ఇవన్నియూ అందంతర్లీనమై యున్న భగవంతునిగూర్చి తెలియజేయును. అనగా ఆయా రూపములు మున్నగువాని వలన భగవంతుని ప్రకాశము వ్యక్తమగుచున్నదని యర్థము.

4. సిరి లేక సంపద పరమాత్మనుండియే పుట్టును, సకల సృష్టియందలి సంపదయే భగవంతుని సంపద, మరియూ ఇది అంతయు సృష్టినుండియే పుట్టును. ఆ సృష్టి భగవంతునినుండి పుట్టుచున్నది. కనుక అతడు తన సంపదకు తానే కారణమై యున్నాడు.

5. ఈశ్వరుడనగా పరిపాలకుడు. పరమేశ్వరుడనగా ఈ సృష్టిని నడిపించుచూ పరిపాలించుచున్న దేవతలందరి సమాహార స్వరూపమే తానైన వాడు. ఆయన జీవులనూ, ప్రకృతిని, వారి గుణములుగా, స్వభావములుగా పరిపాలించును. సకల జీవులు తమతమ స్వభావములకు లోబడినవారే. తమ స్వభావములను అతిక్రమించి ఎవరూపోలేరు. ఎవరి స్వభావము ననుసరించి వారు పనిచేయుచుండగా సృష్టి నిర్వహింపబడుచున్నది. ధర్మము ననుసరించియే గుణములు, స్వభావములు పుట్టినవి. కనుక జీవులు తాము పని చేయుచుండుటలో ధర్మమునే నిర్వహించుచున్నారు. అట్టి ధర్మము పరమేశ్వరుని వలన కలుగుచున్నది.

6. లోకమునందు ప్రతివాడునూ పరిసరములనూ, వస్తువులను మరియు వ్యక్తులనూ తన పనులకు సాధనములుగా నుపయోగించుకొనును. అట్లు పయోగించుకొనుటలో తాను కూడా ఒక సాధనమే అగుచున్నాడు. ఇట్లు పరిసరములు, వ్యక్తులు, ఒకరి కొకరు సాధనములగుట భగవంతుని సంకల్పమే. ఆయన ప్రణాళికయందు లోకములన్నియు సాధనములే. అనగా భగవంతుడే వాటిరూపమున సాధనమగుచున్నాడు. ఎప్పుడు ఎవరికేది కావలెనో వానిని నిర్వహించుటయందు, సమకూర్చుటయందు తాను సాధన మగుచున్నాడు.

7. కార్యకారణ సంబంధమన్నది సృష్టియందలి ఒకభాగము. పనులకు కారణములు, కారణములకు ఫలితములు, మరల ఆ ఫలితములు మరికొన్ని పనులకు కారణములై, మొత్తమంతయు నొక గొలుసువలె నేర్పడును. ఒకడు నెలకు 1000 రూ. సంపాదించుకొనుచు 1200 రూపాయలు ఖర్చు

పెట్టినచో ప్రతినెల అప్పు పెరుగును. అప్పు తీర్చుటకు క్రొత్త అప్పు చేయవలసి ఉండును. ఇట్లు అప్పులు వానిపై వడ్డీలు పెరిగిపోవుచుండును. ఈ సమస్యకు అంతుండదు. అట్లు పనులకు కారణములు, ఫలితములు ఒకదానినొకటి బంధించుచుండును. అట్లే మనమేపని యైననూ చేయవలసి యున్నచో దానికి కారణము .కావలెను. పనిచేయుట ముఖ్యముకాని, కారణము కాదు. తల్లిదండ్రులు తమ పిల్లలను పోషించుటకు వారియందు గల మమకారము కారణము కావచ్చును. కానీ యిచ్చట పోషింపబడుట ముఖ్యము గాని మమకారము కాదు. భగవంతుడు సకల జగత్తులనూ అందలి జీవులను ఏకారణము లేకయే రక్షించి పోషించుచున్నాడు.

8. అట్లు పనిచేయుటకు కారణమున్నది, కనుక పనిచేయుచుంటినని తలుచువాడు పనులకు కర్తయగును. నిజమునకు పనిచేయుటకు ప్రేరణ పరమాత్మనుండియే జీవుని మనస్సునకు తోచును. తనకు తోచినది కనుక చేయుచున్నానని తలచువానికి, తనకెట్లు తోచుచున్నదో తెలియదు. కనుక అందరి యందునూ భగవంతుడే కర్తగా యున్నాడు.

9. భగవంతుడు పనులు చేయుటకు కారణమెట్లగుచున్నాడో, నశింపచేయుటకు కూడా అట్లే కారణమగుచున్నాడు, పూవు విచ్చుకొని మరల పూవు నశించి కాయ అగుచున్నది. అట్లే గింజలు పట్టుట వలన కాయ నశించుచున్నది. భగవంతుడు సృష్టిని విస్తరింపచేసి మరల నశింపచేయుచున్నాడు అనగా తనలోనికి లీనము చేసుకొనుచున్నాడు. ఇట్లు చేయుట, నశింపచేయుట అను రెండు ప్రక్రియలు తానే.

10. గ్రహించుట అనునది మనస్సు, వివేకము మున్నగు వానికి సంబంధించినది. ఈ మనస్సు, బుద్ధి, మొదలగునవి ప్రకృతి నుండిపుట్టినవి. ప్రకృతి పరమాత్మ నుండి పుట్టినది. కనుక మనస్సు భగవంతునిలో ఒక భాగమే యగుచున్నది. కాబట్టి మనస్సు భగవంతుని గూర్చి గ్రహింపలేదు. సముద్రము పై నున్న కెరటమునకు సముద్రము లోతు తెలియదు. అట్లే మనస్సు పరమాత్మయను సముద్రమునందలి కెరటము. కనుక పరమాత్మను గూర్చి మనస్సుకు తెలియదు తెలిసికొనలేదు.

11. గుహ యనగా రహస్యము. మానవుని యందు, భౌతిక శరీరము, మనస్సు, బుద్ధి మున్నగు వేరు వేరు పొరలు ఒకదాని యందొకటి యిమిడియున్నవి. అట్లే శరీరము నందు అవయవములు, రక్తనాళములు, గుండె, ఊపిరి తిత్తులు మొదలగునవన్నియు పని చేయుచున్నవి. వీటన్నిటిని పరిశీలించినచో వేటికవి సమర్థవంతముగా పని చేయుచు పరస్పరత్వము కలిగియున్నవి. కాని వీటి యందు పరస్పరత్వము కలిగించు సమాహార ప్రజ్ఞ ఒకటి పనిచేయుచున్నదని తెలియనిచో అవి పనిచేయుట యందలి సామర్థ్యము తెలియదు. ఇట్లు అన్ని వస్తువులయందును, లోకములయందును భగవంతుడు అంతర్లీనముగా పని చేయుచున్నాడు. కాని బయటికి మాత్రము వేటికవియే స్వతంత్రముగా పనిచేయుచున్నట్లు, ఒకదాని కొకటి సంబంధములేనట్లు కనిపించును. కాని గమనించినచో, అవి ఒకదానిపై మరి యొకటి ఆధారపడి యున్నట్లు తెలియును. ఈ ఆధారమే భగవంతుడు. అతడు కనిపించడు. వానిని తెలియవలెనన్నచో మన మనస్సు పని చేయుటను గమనించవలెను. దీనికై ముందుగా ఒక చోట ప్రశాంతముగా కూర్చుండి కనులు మూసికొని 'ఓం' కారమును ఉచ్చరించుచూ, మనస్సులో అది పుట్టుచోటు, దానికి కావలసిన శ్వాస పుట్టుచోటు గమనింపవలెను. అదియే పరమాత్మ. ఇట్లు ధ్యానమునందు తనలోనికి తాను ప్రవేశించుటనే గుహలోనికి ప్రవేశించుట అని చెప్పబడినది. పెద్దలు గుహలలో తపస్సుచేయుట అని చెప్పునది దీనిని గూర్చియే. అట్లు గుహయందు తెలియబడువాడు గనుక నారాయణుడు గుహః అని పిలువబడుచున్నాడు.

42. శ్లో॥ వ్యవసాయో వ్యవస్థానః సంస్థానః స్థానదో ధ్రువః ।
పరర్ధిః పరమ స్పష్టః స్తుష్టః పుష్టశ్శుభేక్షణః ॥

**ప్రతిపదార్థము :-** 1. వ్యవసాయః = నిరంతరము యత్నించువాడు, 2. వ్యవస్థానః = వేరువేరుగా విభజించువాడు, 3. సంస్థానః = స్థాపన చేయువాడు, 4. స్థానదః = చోటుయిచ్చువాడు, 5. ధ్రువః = ధ్రువము లేక యిరుసు అయినవాడు, 6. పరర్ధిః = ఇతరులకు అభివృద్ధి కలిగించువాడు, 7. పరమస్పష్టః = వ్యక్తము, అవ్యక్తము అను ఉత్తమోత్తమ స్థితులు, 8. తుష్టః

= తృప్తి చెందినవాడు, 9. పుష్టః = చక్కగా పోషింపబడువాడు, 10. శుభేక్షణః = శుభము కలిగించు చూపులు కలవాడు.

**తాత్పర్యము** :- భగవంతుని నిరంతరము యత్నించువానిగా, ఇతరులను తరగతులుగా విభజించి స్థాపన చేసి స్థలము ఏర్పరచు శక్తిగా, నిన్ను తన చుట్టు త్రిప్పుకొను కేంద్రముగా ధ్యానము చేయుము. అతడు యితరులకు అభివృద్ధి కలిగించి శ్రేష్టము, ఉత్తమములైన వ్యక్తము అవ్యక్తము అను శక్తులుగా యున్నాడు. ఇంకనూ తృప్తిగా, పోషణగా, శుభ దృష్టిగా తెలియబడుచున్నాడు.

**వివరణ** :- 1. నిరంతరము పనిచేయుట అను శక్తివలన మానవుడు నిలిచియున్నాడు. మన శరీరమునందు గుండె, ఊపిరితిత్తులు, మున్నగు భాగములు క్షణకాలమైననూ విశ్రాంతి కోరక పని చేయుచున్నవి గనుకనే బ్రతికి యున్నాము. అట్లే మనస్సునకు ఆలోచించుట పని. వీటివలననే మానవులు పరమాత్మ కన్నా వేరుగా నుండుట సంభవమగుచున్నది; దీనినే తమస్సు అందురు. ఈ తమస్సు తొలగినచో మనసు అంతర్యామియందు లీనమగును. కనుక సృష్టి కొనసాగవలెనన్నచో ఈ మనసు మున్నగునవి నిరంతరమూ అట్లే పనిచేయుచుండవలెను.

2. మనలోగల జీవప్రజ్ఞ వలననే భౌతిక ప్రపంచమును వేరువేరుగా విభజించి చూపుచున్నాము. అణువునందు, కణమునందు ఇట్లు తనను తాను విభజించి కొను గుణము పనిచేయుచున్నది. ఈ శక్తియే సూర్యునియందు పని చేయుట వలన సౌరమండలము వేరుగా నేర్పడుచున్నది. ఇట్లు తనని తాను వేరుగా విభజించుకొను శక్తి వలననే మనము మిగిలిన ప్రపంచము కన్నా వేరుగా నుండగలుగుచున్నాము.

3. ఇట్టి విభజించు కొను శక్తివలన తనని తాను వేరుగా స్థాపన చేసుకొన గలుగుట సాధ్యమగుచున్నది. ఇట్లు ఈ వేరుగా స్థాపన చేసుకొనుటవలన తన శరీరమును, అందలి భాగములను, మనస్సునూ నిర్మించుకొని స్థాపింప గలుగుట సంభవమగుచున్నది. అంతేకాక ఇట్టి స్థాపించుకొనుశక్తి వలననే వ్యక్తి సమాజమునందు నిలబడి పనిచేయగలుగుచున్నాడు. నాయకులు, పరిపాలకులు, చక్రవర్తులు చివరకు గురువులు కూడా ఇట్లు తమ నివాసము స్థాపించుకొనుట

వల్లనే మిగిలినవారికి రక్షకులు, మార్గదర్శకులు అగుచున్నారు.

4. కాలము మరియు ఆకాశముగా దిగివచ్చిన శక్తియే జీవులకు సృష్టిలో స్థలమును కల్పించుచున్నది. ఇతరులకు చోటు యిచ్చు సహృదయత, వారు జీవించుటకు సహకరించు సజ్జనత్వము వలన వ్యక్తిని ఒక కుటుంబమునకు గాని, సమాజమునకు గాని అధిపతిని చేయును. వారిని ఫలాపేక్ష లేక ప్రేమించుటవలన ఆదరించుట వలన ఇది సాధ్యమగుచున్నది. మనలోనున్న ఈ శక్తి నారాయణుడే.

5. జీవులయందున్న నేనను ప్రజ్ఞచుట్టునూ, మనస్సు పరిభ్రమణము చేయుచున్నది. దీనివలననే తనచుట్టు తాను తిరుగు ప్రవృత్తి మనయందేర్పడుచున్నది. ఈ శక్తి పనిచేయుటకు యిరుసుగా వెన్నుపాము పనిచేయును. ఈ వెన్నుదండమే మనస్సుకు, శరీరమునకు కేంద్రమై నిలిచి యున్నది. శిరస్సునుండి మూలాధారము వరకూ గల ఈ దండము ఇరుసు వలె పనిచేయును. అట్లే భూమి పరిభ్రమణమునకు కారణముగా ఉత్తర ధ్రువమునుండి దక్షిణధ్రువము వరకుగల ఇరుసు ఆధారముగా నున్నది. ఈ పరిభ్రమణమునకు కేంద్రము ధృవనక్షత్రము. కనుక ఈ ధ్రువ నక్షత్రమే మనస్సు, భూమి, మున్నగువాని పరిభ్రమణమునకు కారణము, లక్ష్యమునై యున్నది. ఇట్టి ఈ ధ్రువ నక్షత్రముద్వారా పనిచేయు శక్తి నారాయణుడే.

6. సూర్యునివలన భూమి వృద్ధి చెందుచున్నది. అట్లే జీవునివలన వానిపై ఆధారపడి యున్నవారు అభివృద్ధి చెందుచున్నారు. ఇట్లు అభివృద్ధి చెందుటకు కారణము ప్రేమయే. అది సూర్యుని నుండి భూమికిని, యితర గ్రహములకునూ ప్రసరించి వానిని పట్టియుంచుటయే గాక పోషించి రక్షించుచున్నది. అట్లే వ్యక్తులయందు ప్రేమవలన అభివృద్ధి కలుగుచున్నది. ఇట్టి ప్రేమ నారాయణుని రూపము.

7. అన్నిటికన్నా గొప్పది, ఉత్తమమైనది, ఆకాశమే. ఎందుచేతననగా మనకు తెలిసినంతలో గొప్పవి ఉత్తమమైనవి అగు సమస్తమునూ ఆకాశము నుండియే పుట్టుచున్నవి. ఈ ఆకాశము వ్యక్తముగా నుండి, దానియందు అన్నియును అవ్యక్తముగా నున్నవి. అనగా తరవాత పుట్టబోవు తారలు

గ్రహములు, చోటుయందు అవ్యక్తముగా నున్నవి. కనుక నారాయణుడే అన్నిటికన్నా ఉత్తమము గొప్పదియగు ఆకాశముగా నున్నాడు.

8. తృప్తి భగవంతునియొక్క రూపము. తృప్తి చెందినవాడు పరిపూర్ణతకు దగ్గరగానుండును, ఎవడు ఏ ఏ విషయములయందు, లేక లోకములయందు తృప్తి చెందునో ఆయా విషయములయందు పరిపూర్ణత సాధించినవాడని అర్థము. తృప్తి చెందినవాని మనస్సునందు కలిపురుషుడు పనిచేయడు. అట్టి వానివలన ఇతరులకు ధర్మము లభించును. ఈ రహస్యము తెలిసినవాడు మనస్సును తృప్తిగా నుంచుకొనుట అభ్యాసము చేసుకొనుచుండును.

9. శరీరము పనిచేయుటకు ఆహారము, నీరు మొదలగునవి కావలెను. ఇవి జీవునికి జీర్ణమగుటవలన శరీరమునకు పుష్టికలుగుచున్నది. ఆహారము సక్రమముగా జీర్ణము కావలెనన్నచో శరీరమారోగ్యముగా నుండవలెను. ఈ ఆరోగ్యము శరీరమునందు పని చేయుచున్న అనేక శక్తుల సామ్యము వలన లభించును. ఈ సామ్యమును నారాయణుడే జీవుల కిచ్చుచున్నాడు. కనుక నారాయణుడే జీవులను పోషించుచున్నాడు.

10. పైన చెప్పబడిన పోషణము జీవులకు కలిగించువాడు సూర్యుడు. సూర్యుని కిరణములవలన జీవుల కాహారము లభించి, ప్రాణశక్తి పనిచేయుట సంభవించుచున్నది. అంతేకాక ఈ సూర్యకిరణములు వలననే జీవులు ఒకరినొకరు ప్రేమాదరములతో చూచుకొనుచున్నారు. అట్టి శుభమగు చూపులతో సూర్యునిద్వారా భగవంతుడే చూచుచున్నాడు.

43. శ్లో॥ రామో విరామో విరజో మార్గోనేయో నయోఽనయః ।
వీరశ్శక్తిమతాం శ్రేష్ఠో ధర్మో ధర్మవిదుత్తమః ॥

**ప్రతిపదార్థము :-** 1. రామః = శ్రీరాముడు, 2. విరామః = **లయము** చేయువాడు, 3. విరజః = రజస్సుకతీతమైనవాడు, 4. మార్గః = మార్గమైనవాడు, 5. నేయః = నడుపువాడు, 6. నయః = నీతి రూపమైనవాడు, 7. అనయః = నీతికతీతమైనవాడు, 8. వీరః = వీరుడు, 9. శక్తిమతాం = శక్తిమంతుడు, 10. శ్రేష్ఠః = మిక్కిలి ఉత్తముడు, 11. ధర్మః = ధర్మము

యొక్క రూపమైనవాడు, 12. ధర్మవిత్ = ధర్మము తెలిసినవాడు, 13. ఉత్తమః = గొప్పవాడు.

**తాత్పర్యము :-** భగవంతుని శ్రీరామునిగా, సృష్టిని లయము చేయువానిగా, రజస్సున కతీతునిగా, మార్గముగా మరియు నీతి పథముగా, మరియు నీతికతీతునిగా ధ్యానముచేయుము. ఆయన శక్తిగల వారందరికన్నా శ్రేష్ఠుడైన వీరునిగా, ధర్మరూపునిగా, ధర్మము తెలిసినవానిగా, ఇతరులు అందరికన్నా గొప్పవానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. శ్రీరాముడు, ధర్మమును, నీతిని, ప్రజలయందు స్థాపించుటకు దిగివచ్చెనం. నారాయణుని ధర్మస్వరూపమయిన అవతారమే శ్రీరాముడు.

2,3. ఏ పని ఎప్పుడు నిలుపవలెనో తెలియుట, దైవదత్తమయిన వరము. ప్రకృతియందలి ఈ లక్షణమే ప్రకృతిని మరల పరమాత్మయందు లయము చేయును. సృష్టిచేయుట, లయముచేయుట అనునవి సామాన్యుల ఊహకందని విషయములు. కాని మనస్సు, ఇంద్రియములు లయము చేసి జీవితమంతయు ఒకే వర్తమానముగా నుండు స్థితి భగవదనుగ్రహముచే లభించును. తాను కల్పించుకొనిన కర్మలవలన ఫలితములను అనుభవింపవలసి యుండును. ఇట్లు ఫలితములకై ప్రాకులాడు స్థితి నశించి నిరంతరము వర్తమానమున జీవుడు నిలువగలుగుట కూడా లయమగుటయే. ఇది మనస్సు మున్నగు లోకములకు ప్రళయ స్థితి వంటిది. అనగా అంతర్యామి తప్ప ఏమియూ మిగులని స్థితి. రజస్సనునది పనులు చేయుటకై మనస్సునకు కలుగు దురద వంటిది. అనగా ఏదియో ఒకపని చేయునంతవరకూ మనస్సును గిలిపెట్టుచుండును. ఈ రజస్సునకు మనస్సు అతీతమైనచో సత్వస్థితి లేక ప్రశాంతత లభించును. మరియూ రజస్సు అనగా మొట్టమొదటి భౌతిక ద్రవ్యము, విరజము అనగా రజస్సునకు ముందున్న స్థితి. అనగా అణువులు, పరమాణువులు పుట్టుటకు ముందున్న స్థితి. పరమాత్మ యిచ్చట నుండి జీవులను పరిపాలించును. నిజమైన సన్యాస స్థితిలో నున్న వారలు విరజము అను స్థితి యందుందురు.

4. మార్గమనగా జీవులు భగవంతుని గూర్చి తాము కల్పించుకొన్న ఊహలు. అట్టి తన ఊహాలననుసరించి భగవంతుని తెలిసికొనుటకు ప్రతివాడును యత్నించి చివరకు ముక్త స్థితిని పొందును.

5. నాయకుడు కావలెనన్నచో తోటివారి హృదయములను గూర్చి చక్కగా తెలియుటయే గాక, తగు శక్తి సామర్థ్యములు గూడా కలిగియుండవలెను. భగవంతుడే జీవులకు అట్టి స్థితి కలిగించును. ప్రతి జీవియందు వాని సంకల్పముగా తానే పనిచేయుచు అనేక పరిస్థితులను దాటించి పరిపూర్ణత్వమునకు నడిపించుకొని పోవును. కనుక భగవంతుడే జీవులకు నిజమైన నాయకుడు.

6.7. మానవుని యందలి అసుర లక్షణములు నిగ్రహింప బడవలెనన్నచో నీతిమార్గమున జీవించుట తప్పని సరి. క్రమశిక్షణతో గూడిన సాధు జీవనమే జీవి యందలి నీచ ప్రకృతిని **(Lower Nature)** అదుపులోనికి తెచ్చును. దీనికి ముందు దుష్టలక్షణములతో కూడి నీతినియమములు లేని జీవితము గడుపువానికి అట్టి జీవితమువలన కలుగు ఫలితములే, మరియు కష్టములే వానిని క్రమేణా మంచి మార్గమునకు త్రిప్పును. అంతేగాక నీతినియమములతో కూడిన ఉపాసన లేక సాధన కొంతవరకు మాత్రమే ఉపయోగించును. అటుపైన నీతి నియమముల అవశ్యకత తొలగిపోవును. అట్టివానికి ఇవి తప్పనిసరి కావు. ఇతరులవద్ద ధనము ఉచితముగా తీసకొనరాదను నియమము కొంతవరకూ మాత్రమే సత్యము. కాని ధనముపై వ్యామోహము లేని యోగి అవసరమైనచో తాను చేసిన సహాయమునకు ప్రతిఫలముగా ధనము అడిగి తీసుకొని, మిక్కిలి కష్టములో నున్న మరియొకనికి ఇచ్చివేయవచ్చును. అట్లే నిరంతరము భగవంతునియందు మనస్సు సమర్పణ చెందినవారు ప్రత్యేకముగా నియమిత కాలమునందు ప్రార్థనచేయుట, పూజచేయుట మున్నగునవి చేయనక్కరలేదు. ఇతరులకు ఉదాహరణగ నుండుటకై వారు అట్లు చేసిననూ, వారు చేయుచున్న ఉత్తమకార్యములకు ఇవి ప్రతి బంధకమైనచో మానివేసిననూ పొరబాటు లేదు. కనుక నీతి మార్గముతో బాటు నీతిలేని మార్గము కూడా నారాయణుడే.

8,9,10. బలవంతులలో బలమును నేనే అని భగవద్గీతలో కృష్ణుడు చెప్పెను. దీనికి ఉదాహరణ శ్రీరాముడు, పరశురాముడు మున్నగువారు. ఈ బలము దుష్టులలోను సజ్జనులయందు కూడా సమముగా పని చేయుచున్నది.

దుష్టులు తమ బలమును, ఇతరులను బాధించుటకై వినియోగింతురు, సజ్జనులు తమ బలమును, ఇతరులను సుఖపెట్టుటకై వినియోగింతురు. కనుక మంచివారి యందలి బలము పరమాత్మయే. మొదటి వర్గము వారిని రాక్షసులనియూ, రెండవ వర్గము వారిని దేవతలనియూ పిలుతురు. ఇట్లు దేవతల యందలి బలము నారాయణునికి చెందినది.

11,12. ధర్మము అంతర్యామిచే ప్రకృతియందు స్థాపింపబడినది. కనుక జీవులందరికి అప్రయత్నముగా ధర్మము వర్తించును. అనగా వారికి తెలిసిననూ, తెలియకున్ననూ, ఇష్టమైననూ, కాకున్ననూ, ధర్మము వారియందు పనిచేసి తీరును. ప్రతివారును తమకు తెలియకుండా ధర్మము నవలంబించుచున్నారు. ఈ ధర్మము వారి వారి మనస్సులనుండి పని చేయుచున్నది. అదియే అలవాట్లుగా, ఇష్టాయిష్టములుగా పని చేయును. ఇది అంతయు నారాయణునిచే కల్పింపబడినది.

13. ఈ ధర్మము గూర్చి తెలిసినవారు ధ్యానము చేసి భగవంతుని ధర్మ స్వరూపునిగా తెలుసుకొనగలుగుచున్నారు. అనగా భగవంతుడే ధర్మము యొక్క రూపముగా దిగివచ్చెను. దీనిని తెలిసి ఆచరించువారు ఉత్తమజీవులు. శ్రీరాముడు ఈ ధర్మస్వరూపమే తన జీవితముగా ఆచరించి చూపెను. ఆయన కుమారుడుగా, భర్తగా, స్నేహితునిగా, శత్రువుగా, వీరునిగా, శిక్షకునిగా, రక్షకునిగా, సోదరునిగా, తన ధర్మములను చక్కగా ఆచరించి చూపెను. ఇన్నింటి యందునూ నాటికి నేటికి శ్రీరాముడే ఆదర్శము.

44. శ్లో॥ వైకుంఠః పురుషఃప్రాణః ప్రాణదః ప్రణవః పృథుః ।
హిరణ్య గర్భశ్శత్రుఘ్నో వ్యాప్తోవాయురధోక్షజః ॥

**ప్రతిపదార్థము** :- 1.వైకుంఠః = వైకుంఠము, నారాయణుని లోకము, 2. పురుషః = పురుషుడు, 3. ప్రాణః = మానవునికి, విశ్వాసను నడుపు లోకము, 4. ప్రాణదః = ప్రాణము నిచ్చువాడు, 5. ప్రణవః = ఓంకారము, 6. పృథుః = పృథుచక్రవర్తి, 7. హిరణ్యాగర్భః = బంగారపు గ్రుడ్డువలె ప్రకాశించువాడు, 8. శత్రుఘ్నః = శత్రువులను సంహరించువాడు, 9. వ్యాప్తః = వ్యాపించువాడు, 10. వాయుః = వాయువు, 11. అధోక్షజః =

జన్మనెత్తుటకై దిగివచ్చిన అంతర్యామి.

**తాత్పర్యము :-** భగవంతుని అన్నిటికన్నా పైనున్న లోకము నందుండువానిగా, జీవియందునూ, విష్ణువునందునూ గల ప్రజ్ఞగా, జీవితముగా, శ్వాసగా, జీవితము నిచ్చువానిగా, ఓంకారముగా, పృధు చక్రవర్తిగా, హిరణ్యగర్భునిగా, శతృవులను సంహరించువానిగా, శతృవులందు వ్యాపించువానిగా, వాయువుగా, సృష్టిలోనికి దిగివచ్చు లేక జన్మించు శక్తిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. వికుంఠములేని స్థితిని వైకుంఠమందురు. ఇది నారాయణుడుండు లోకము. అనగా ఈ లోకమునందు నారాయణుడు, నారాయణలోకము అని రెండుండవు. నారాయణుడే ఆ లోకముగా నుండును. అనగా అట్టి స్థితియందున్న వారందరూ నారాయణుని యందుందురు. లేక వారియందు నారాయణుడుండును. అన్నిలోకములకు పైన గల లోకము నందుండు ఏడవలోకమునందు (ఉత్తమ స్థితి) వారుందురు. అనగా ఏ మాత్రము అపరిపూర్ణత మిగిలియుండని స్థితి. భాగవతము నందలి వైకుంఠపుర వర్ణనమునందు అక్కడివారు కారణమక్కర లేకయే నిరంతరము సంతోషముగా సరససల్లాపములతో జీవించుచుందురని వర్ణింపబడినది. శ్రీకృష్ణుడు గోపికలను, గోపకులను, బృందములు బృందములుగా తీర్చి, వారు ఎల్లప్పుడు ఇట్టి స్థితిలోనే జీవించునట్లు శిక్షణనిచ్చెను. వారందరు పూర్వ జన్మలలో వేద, వేదాంగములును, సకల శాస్త్రములు తెలిసిన యోగులు, మునులు, కాని వారిజ్ఞానమే వారి పురోగతికి అడ్డువచ్చుటచే శ్రీకృష్ణుడు వారిని అమాయకులైన పల్లెజనులుగా పుట్టించి, వారి మనస్సులను తానాకర్షించి తన యందే నిలిచియుండునట్లు చేసెను. అట్టి స్థితినే వైకుంఠమందురు. కనుక దీనిని గూర్చి ఎంత తెలుసుకున్ననూ, ప్రయత్నించిననూ అంత దూరమగును. తెలియుట వేరు, ఆచరించుట వేరు. వంటగూర్చి తెలియుటవలన ఆకలి తీరదు. వంట చేయుటవలన మాత్రమే ఆకలితీరును. అట్లే ఇతరులను కారణమక్కరలేకయే ప్రేమించి, వారిని సుఖపెట్టి తాను సుఖపడుట మాత్రమే యోగజీవనము. అనగా జీవులు వైకుంఠము అను స్థితియందు ఉండుటయేకాని మరే విధముగను యిది లభ్యముకాదు.

2. పురుషః అను శబ్దమునకు ఈ లోకమునందున్న ''నేను'' అను ప్రజ్ఞ అని అర్థము. భౌతిక లోకమునుండి అన్ని లోకములందును ఆయా లోకములుగా నున్న ప్రజ్ఞయే అని అర్థము. అట్లే దేహామునందు కూడా ఈ పురుషుడు పని చేయుచున్నాడు. ఆ పురుషుడు నారాయణుడే అయి వున్నాడు.

3. ప్రాణశక్తి మన శరీరమునందు శక్తిగను, విశ్వమునందు రుద్రులుగను పనిచేయును. భౌతిక పదార్థమునకు, ప్రజ్ఞకు మధ్య ఈ ప్రాణశక్తి అనుసంధానము చేయును.

4. ప్రాణదః అనగా మానవులకు ప్రాణశక్తి నిచ్చువాడు సూర్యుడు. ఆయన కిరణముల ద్వారా ప్రాణశక్తి జీవులకు లభ్యమగుచున్నది. అంతరిక్షమునందలి ప్రాణశక్తిని సూర్యుడు గ్రహించి, జీవులకు పంచిపెట్టుచున్నాడు. అందుచేతనే సూర్యుడు సుపర్ణ సూక్తమునందు ఆవు యొక్క పాలపొదుగుగా వర్ణింపబడినాడు. కనుకనే సూర్యుడు జీవులకు తండ్రిగా కూడా వేదమునందు చెప్పబడినాడు.

5. ప్రణవమనగా ఓంకారము. ఈ ఓంకారమే మొట్టమొదటి శబ్దము. దీనినుండి చోటు పుట్టినది. చోటునుండి మిగిలిన సమస్తము వచ్చినది. ఈ ''ఓం''కారము నుండియే జీవునికి శ్వాస పుట్టుచున్నది. కనుక ఈ '' ఓం'' కారమును ధ్యానము చేయవలెనన్నచో మొదట శ్వాసను ధ్యానము చేయవలెను. (శ్వాసను గూర్చిన ధ్యానము ఇంతకు ముందు వివరింపబడినది) శ్వాసను ధ్యానము చేయువాడు ''ఓం'' కారము నందుండును. అనగా తాను శ్వాస తీయుట మాని తనయందు శ్వాస యుండును.

6. పృథు చక్రవర్తి భూమియొక్క భౌతిక రూపము తీర్చి దిద్దెను. ఆయన భూమికి ఉత్తర ధృవమునకు పైన పని చేయుచున్న శక్తుల సమాహారమును నిర్మాణము చేసినవాడు. సుడిగా పని చేయుచున్న ఈ సమాహార శక్తికి మేరువు అని పేరు. ఆయన మేరువును గోవుగా చేసి సమస్త సంపదలను పిదికెనని భాగవతమునందు చెప్పబడినది. ఈ మేరువను శక్తి వలన భూమిపై పంటలు, వృక్షములు, జీవులు, మొదలగు సకలసంపదలు ఏర్పడినవి. ధృవుని నుండి భూమిపైకి శక్తులను ఈ మేరువే ఆవాహనము చేయును. అట్టి ధృవుని

నుండి వచ్చు ప్రజ్ఞ వలననే భూమి బొంగరము వలె త్రిప్పబడుచున్నది. అట్లే త్రిప్పుటకు కావలసిన శక్తి అంతయు మేరువను కేంద్రము వద్ద పని చేయుచున్నది. ఇట్లు భూమియందు సంపద లేర్పడుటకు పని చేయుచున్న ప్రజ్ఞయే పృథువు.

7. బంగారు వర్ణముతో కూడిన వెలుగే తన రూపముగా సృష్టి మొట్టమొదట వ్యక్తమయ్యెను. ఈయన పురుష దేవతగా చెప్పబడినపుడు, బ్రహ్మగా చెప్పబడెను. స్త్రీ దేవతగా చెప్పబడినపుడు ప్రకృతిగా చెప్పబడెను. కనుకనే శ్రీ సూక్తము ''హిరణ్యవర్ణాం'' అని ప్రారంభమగును. దీనికి పైనున్న వెలుగు జీవప్రజ్ఞ కందనిది కనుక, అది చీకటి అని పిలువబడినది. వేదమునందు భగవంతుని ఈ తత్వమే కృష్ణ తత్త్వమని చెప్పబడును. పురుష సూక్తమునందు చీకటి కవ్వలనున్న వెల్గుగా భగవంతుడు కీర్తింపబడినాడు. ఆయననుండి వ్యక్త రూపములలోనికి దిగివచ్చు నేను అను ప్రజ్ఞయే హిరణ్య గర్భుడు. శరీరమునందు కూడా నేను అను ప్రజ్ఞగా ఈయన వుండును.

8. శతృవులనగా జీవుని మనస్సునందు పని చేయుచున్న పరస్పర విరుద్ధమగు శక్తులు. ఇవియే మంచి, చెడు, యిష్టము, అయిష్టము మున్నగునవి. ఇవి ప్రధానముగా మనయందు ఆరు వర్గములుగా పని చేయును. వాటినే అరిషడ్వర్గము లందురు. ఇవి కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము, అనునవి. ఇవి నశింపవలెనన్నచో సంఘటనలను, వ్యక్తులను, చూచుట మాని, వానియందు భగవంతుని చూడవలెను. వెంటనే అవి నశించును. కనుక జీవులయందలి ఈ శతృవులను సంహరించువాడు నారాయణుడే. శతృవులెవ్వరైనను మన మనస్సుయందలి భావముల వలన ఏర్పడుచున్నారు గాని నిజమునకు వారు కూడా పరమాత్మనుండి దిగివచ్చిన వెలుగులే.

9. అట్లు ధ్యానము చేసినవానికి వాని మనస్సు వ్యాపించి అంతర్యామి యందు లీనమగును. అట్లు మనస్సు వ్యాపించ గలుగుట భగవంతుని స్మరించుట వలననే. కనుక నారాయణుడే జీవుల మనస్సునకు వ్యాపనము కలుగ చేయుచున్నాడు.

10. చోటునందు చైతన్యము లేక స్పందనము కలిగినచో దానిని వాయువు అందురు. ఈ వాయువు చోటునుండి పుట్టుచున్నది. చోటు పరమాత్మనుండి పుట్టుచున్నది. కనుక నారాయణుడే చోటునందు స్పందనను కల్పించి తానే వాయువుగా పుట్టుచున్నాడు.

11. భూమియందు జీవులు పుట్టుటకు సూర్యుడు కారణమగుచున్నాడు. అట్లే చోటునందు వేలు లక్షలకొలది తారలు పుట్టుటకు చోటుగానున్న నారాయణుడు కారకుడు. అట్లు పైనుండి క్రిందకు ప్రతిలోకమునందును ఆయా లోకములు మరియు లోకస్థులు పుట్టుటకు నారాయణుని వెలుగే కారణము కనుక నారాయణుడు అధోక్షజుడు.

45. శ్లో॥ ఋతుఃస్సుదర్శనః కాలః పరిమేష్ఠీ పరిగ్రహః ।
ఉగ్రస్సంవత్సరో దక్షో విశ్రామో విశ్వదక్షిణః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఋతుః =ఋతువుల కధిపతియైనవాడు, 2. సుదర్శనః = సుదర్శనచక్రము, 3. కాలః= కాలుడు, 4. పరమేష్ఠి = సృష్టియను మహాయజ్ఞ స్వరూపమైనవాడు. 5. పరిగ్రహః = గ్రహింపబడునది. 6. ఉగ్రః = తీవ్రమైనవాడు, 7. సంవత్సరః = సంవత్సర రూపుడు, 8. దక్షః = సమర్థుడు (ప్రజాపతి), 9. విశ్రామః= ప్రశాంతుడు, 10. విశ్వదక్షిణః = విశ్వమే దక్షిణగ గలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను ఋతువుల కధిపతిగా, శత్రువులను సంహరించు చక్రముగా, సంవత్సరము అందలి భాగములేగా, వ్యక్తమగుచున్న కాలముగా, సృష్టి అను మహాయజ్ఞముగా, కర్మఫలములు మనచే గ్రహింపబడువానిగా, రాక్షసులను సంహరించువారిలో తీవ్రమైన వానిగా, సమర్థుడైన దక్షుడను ప్రజాపతిగా, జీవుల మనస్సునందుగల విశ్రాంతిగా, ఈ విశ్వమే దక్షిణయైనవానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. ఋతువులు ఆరు. అవి (1) వసంత ఋతువు, (2) గ్రీష్మ ఋతువు, (3) వర్ష ఋతువు, (4) శరదృతువు, (5) హేమంత ఋతువు, (6)శిశిర ఋతువు. సృష్టి ప్రారంభమును వసంత ఋతువు సూచింపగా, ప్రళయమును శిశిర ఋతువు సూచించును. ఋతువుల రూపమున

సృష్టియందు మార్పు కలిగించినది నారాయణుడే కనుక అతడే ఋతువుల రూపము.

2. సుదర్శనమనగా చక్కని దర్శనము. సృష్టియందలి అన్ని అణువుల యందును, రూపములయందును నారాయణుడే వున్నాడు. ఆయనను అన్నిటియందును చూచువారికి శత్రువులు నశింతురు.

3. కాలము నారాయణుని వ్యక్తరూపములలో ఒకటి (దీనిని గూర్చి యింతకు ముందు వివరింపబడినది).

4. విరాట్ అనునది పరమాత్మయొక్క మొట్టమొదటి రూపము. నారాయణునినుండి మొట్టమొదటి సృష్టి ఈ రూపముననే దిగివచ్చెను. సమస్త సృష్టియొక్క పరిపూర్ణ రూపమే ఈ విరాట్ రూపము. భగవంతుడు చేసిన ఈ మొట్టమొదటి యజ్ఞమునందు నారాయణుడే తనను తాను యజ్ఞముగా సమర్పించుకొనెను. పురుష సూక్తమున ''అబధ్నన్ పురుషంపశుమ్'' అన చెప్పబడినది. పురుషుడను పశువును బంధించి వానినుండి దేవతలు యజ్ఞము చేసిరని వర్ణంపబడినది.

5. జీవులు తాము చేసిన పనుల ఫలితములనే తిరిగి పొందుచున్నారు. ఇదియే కార్యకారణ సంబంధముగా చెప్పబడినది. ఇది మన అంగీకారముతో సంబంధము లేకయే మనచేత గ్రహింపబడును. ఇట్లు కర్మలు, వాటి ఫలితములు మున్నగునవన్నియు నారాయణుని రూపములు. ఈ పని చేసినచో ఇట్లు జరుగునని భావించి సూత్రీకరించుటవలన కార్యకారణ సంబంధ మేర్పడును. చిక్కుడు గింజ నాటినచో చిక్కుడు చెట్టు వచ్చుట. అట్లే ఆహారము అధికముగా తిన్నచో అజీర్ణరోగము వచ్చుట దీనికి ఉదాహరణలు. ఇందు చిక్కుడు గింజ, అధికముగా తినుట అనునవి బీజములు లేక కారణములు. చిక్కుడుచెట్టు లేక కడుపు నొప్పి, ఫలితములు లేక కార్యములు. ఇది ఇంతవరకు మాత్రమే తెలుసుకొన్నవాడు ఇటువంటి సూత్రములతో తననుతాను బంధించుకొనును. కాని ఇది యిట్లు జరుగవలెనను నియమము భగవంతునినుండి వచ్చినది. కనుక అతడే నిజమైన కార్యకారణ సంబంధము. ఇది తెలిసినవాడు ఈ ధర్మములను, సూత్రములను నారాయణుని రూపములుగా తెలిసి, వానికి

విధేయుడగుచున్నాడు. అట్లు విధేయుడైన వానికి ధర్మములు, నియమములు కూడ విధేయములగును. అనగా వానిని బంధింపవు. అపుడు ఫలితములు కలుగుట, కలుగకుండుట వాని చుట్టుగల ఇతరుల ఆవశ్యకత ననుసరించి జరుగును. అనగా బంధించును. కాని విధేయుడైన వానికి దానితో సంబంధము లేదు. కనుక నారాయణుడే కర్మ ఫలితములను కలిగించుచున్నాడు.

6. రాక్షసులను లేక దుష్టులను సంహరించుటకై నారాయణుడు భయంకరమైన రూపము ధరించును. అట్టి రూపమునే ఉగ్రః అందురు. హిరణ్య కశిపుని సంహరించునపుడు నారాయణుడు ఉగ్రమైన నరసింహస్వామి రూపమున వచ్చి వానిని సంహరించెను.

7. సంవత్సర రూపమైనవాడు నారాయణుడు. (ఇంతకుముందు వివరింపబడినది.)

8. దక్షుడు అనగా జీవులయందుగల సామర్థ్యము. తాను ఈ పని చేయగలనను సంకల్పమే సామర్థ్యము. ఈ సంకల్పము జీవుని అహంకారము వలన యేర్పడుచున్నది. కనుక దక్షుడు జీవులయందు అహంకారముగ పనిచేయుచున్నాడు. దక్షుడు అను రూపమున నారాయణుడే జీవులయందు సామర్థ్యముగ పని చేయుచున్నాడు.

9. విశ్రాంతి లేక విరామము అనగా పనిచేయకుండుటగా జీవులు అభ్యసించుచున్నారు. పరమాత్మ జీవుల యందున్నప్పటికి జీవులు పని చేయుచున్నారు కాని తాను పనిచేయుటలేదు. అనగా భగవంతుడు జీవుల యందు విశ్రాంతిగ యున్నాడు. దీనిని గమనించినవారు తాము కూడ పనులు చేయుచున్నప్పటికి విశ్రాంతిగానుండుట అభ్యసించుచున్నారు. ఇట్లు విశ్రాంతిగ నుండుట నారాయణుని లక్షణములలో నొకటి.

10. భగవంతుడు యజ్ఞస్వరూపుడు. అతడు ఈ సృష్టి యజ్ఞమునకు తనను తానే దక్షిణగ ఇచ్చెను. అనగా తానే జీవులుగ, ప్రకృతిగా, వచ్చెను. ప్రతిజీవియందును వాని దేహకోశాదులుగ తానేయున్నాడు. ఇట్లు సృష్టియందలి ప్రతిజీవికి తనను తాను దక్షిణగ సమర్పించుకొనెను.

46. శ్లో॥ విస్తారః స్థావరస్థాణుః ప్రమాణం బీజమవ్యయం ।
అర్థో౽నర్థో మహాకోశో మహాభోగో మహాధనః ॥

**ప్రతిపదార్థము** :- 1. విస్తారః = సృష్టిగా విచ్చుకొనుట, 2. స్థాణుః = కదలికలేనివాడు, 3. ప్రమాణం = ప్రతిదానికి కొలతయైనవాడు, 5. బీజమ్ = అన్నిటికి విత్తనమైనవాడు, 6. అవ్యయం = వ్యయము కాని వాడు, 7. అర్థః = ప్రయోజనము మరియు భావము, 8. అనర్థః = ప్రయోజనము, భావములకు పైనున్నవాడు, 9. మహాకోశః = గొప్ప నిధియైనవాడు, 10. మహాభోగః = గొప్పసుఖమునకు కారణమైనవాడు, 11. మహాధనః = గొప్ప సంపదయైనవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను సృష్టిగా వికసించువానిగా, మరియు సృష్టియందు స్థిరముగా నున్న వానిగా, మార్పులేని వానిగా, మొట్టమొదటగా కొలతగా ఏర్పడిన వానిగా, సృష్టికి మొదటి విత్తనముగా, వ్యయము లేని వానిగా, సృష్టికి భావము మరియు ప్రయోజనము తానేయైనవానిగా, మరియు ఆ రెండింటికి అతీతమైన వానిగా, గొప్ప నిధిగా, సంపదగా, మరియు సుఖముగా, ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. విచ్చుకొనుట కాలమునకు, చోటునకు సంబంధించినది. కనుక సృష్టిలో పుట్టిపెరుగు ప్రతి వస్తువును నారాయణుని వ్యక్తస్వరూపమే. ఆయన చోటుగను, కాలముగను పుట్టి సృష్టిగా వ్యక్తమగుచున్నాడు.

2,3. అట్లు పుట్టి పెరుగుచున్న సమస్త సృష్టియు కదలుచున్నదే. కదలనట్లు కనిపించు పర్వతములు సైతము ఆకాశమునందు భూమితో కలిసి పరిభ్రమించుచున్నవని సుప్రసిద్ధ శాస్త్రవేత్తయగు అయిన్‌స్టీన్ అను మహానుభావుడు చెప్పెను. సృష్టియందలి సమస్తమును పరిభ్రమించుచున్నదని (See the Theory of relativity) అణువు మొదలు కదలనిది లేనే లేదని చెప్పెను. సూర్యుడు గ్రహగోళాదులు కూడా ఈ అనంత విశ్వమునందు పరిభ్రమించుచున్నవి. కాని వీటి యందున్న పరమాత్మ మాత్రము కదలుట లేదు. అనగా సృష్టి పుట్టి పెరిగి నశించుచున్నను తానందు చలనము లేని వానిగా ఉన్నాడు.

4. అట్లు సమస్తమునకు కదలని వానిగా నిల్చియున్నవాడు కనుక ఆయనయే ప్రమాణమై యున్నాడు. అనగా కొలతగా ఉన్నాడు. కొలతయనునది కాలము దూరమునకు సంబంధించినది. అవి రెండును పరమాత్మయే కనుక ఎవరు దీనిని కొలిచినను ఆయన నుండియే కొలువవెను.

5. పరమాత్మ నుండియే సమస్త సృష్టియు పుట్టుచున్నది కనుక ఈ సృష్టి కంతటికి ఆయనయే విత్తనమై యున్నాడు. విత్తనమునుండి మహా వృక్షము వ్యక్తమైనట్లు, పరమాత్మ నుండి ఈ సృష్టియంతయు వ్యక్తమగుచున్నది. అట్లు విచ్చుకొనిన మహావృక్షము కొంతకాలము తర్వాత ఎండిపోయి నశించును. కాని దాని విత్తనమునందు మరల రాబోవు మహావృక్షమునకు ప్రణాళిక యుండును. ఇట్లు విత్తనము నుంచి చెట్టు, చెట్టునుండి విత్తనము ఒకదానికొకటి కారణమై నిల్చియున్నవి. ఈ రెండింటికి నడుమ గల సంబంధమే కార్యకారణ సంబంధమని చెప్పబడినది. ఈ సంబంధమే నారాయణుడు. ఆయన చెట్టునకు మరియు విత్తునమునకు కూడ తానే కారణమైయున్నాడు. ఇట్లు విత్తనమునందు వికసించు శక్తిగా నున్నపుడు ఆయననే ప్రజాపతి అందుము. సృష్టి మొత్తమునకు బీజముగానున్న ఈయననే నారాయణుడందుము.

6. ఇట్లు విత్తనములు వృక్షములుగా వ్యక్తమైననూ మరల వృక్షములనుండి విత్తనములు పుట్టుచున్నవి. కనుక విత్తనములుగాని, వృక్షములు గాని ఒకప్పుడుండుట. ఒకప్పుడుండకుండుట లేదు. విత్తనములు వృక్షరూపమునను, వృక్షములు విత్తన రూపమునను నిరంతరము ఉన్నవి కనుక అవి అవ్యయములు. అనగా నశింపనివి. వాటి యందున్న నారాయణుడు ఈ రెండింటికి కారణరూపముగా తానే యున్నాడు. కనుక ఆయన అవ్యయుడు. చిత్రమేమనగా ఆయనతోబాటు సృష్టికూడ ఆయన యందు అవ్యయమై యున్నది. అనగా సృష్టి లేనప్పుడు, అది పరమాత్మగా నున్నది. అట్లే సృష్టి యున్నపుడు పరమాత్మ తానే సృష్టిగా యున్నాడు గనుక నారాయణుడు ఇన్నిటి యందును అవ్యయుడుగా నున్నాడు.

7. ప్రయోజనములు వ్యక్తిగతములు. ఎవరి లక్ష్యమునను సరించి, ప్రయోజనము ననుసరించి వారు తమ తమ కర్తవ్యములను నిర్ణయించుకొనుచున్నారు. ఇట్లు ఎవరి కర్తవ్యములు వారి కున్ననూ అందరి

కర్తవ్యములు, ప్రయోజనములు సమాజ శ్రేయస్సుకై ఉద్దేశింపబడినవి. ఈ విశ్వశ్రేయస్సు పరమాత్మ ప్రయోజనమై యున్నది. భగవంతునికి కర్తవ్యము లేకున్నను ప్రయోజనము మాత్రము జనుల సుఖజీవనము పేర సిద్ధించుచుండును. ఆయన ఇతరులయందు కర్తవ్యమును కలిగించి పనులు చేయించుచున్నను తాను చేయనివాడే యగుచున్నాడు. వారి పనుల ప్రయోజనమనుపేర పరమాత్మ తానే వారి మనసులయందు పని చేయుచున్నాడు.

8. అట్లు పని చేయుచున్నను ప్రయోజనము ఇతరులు సుఖపడుటకే గాని తాను ప్రత్యేకముగా సుఖపడుటలేదు. సకల జీవుల, భూతముల సుఖమే పరమాత్మకు సుఖమగుచున్నది. ఆయనకు వేరుగా సుఖపడుట అను కోరిక లేదు. ఈ రహస్యము తెలిసిన నేర్పరులు ఇతరులను సుఖపెట్టి తాము సుఖపడుచున్నారు. ఇందరి యందును పరమాత్మయే సుఖపడుచున్నాడు, కాని తానే సుఖపడవలెనను కోరిక, ప్రయోజనము ఆయనకు లేవు.

9. ఈ సృష్టి సకల సంపదలకు ఆశ్రయము. ఇన్ని సంపదలు సృష్టియందే పుట్టి అందే నశించుచున్నవి. ఈ సంపదలన్నింటికి, సృష్టియను మహాసంపదకు భగవంతుడే నిజమైన కారణమై ఉన్నాడు. కనుక అన్నిటిని మించిన మహాకోశము నారాయణుడే.

10. మరియు మానవుడు సంపదలవలన కలుగు సుఖములకై సంపదలను సాధించుటకై నిరంతరము ప్రయత్నించు చుండును. అట్లు ప్రయత్నించుటలో సంపదలు లభించుట, లభింపకపోవుట, లభించిననూ మరల కోల్పోవుట జరుగుచుండును. కాని వీటికి మూలకారణమైన నారాయణుని ధ్యానించిన వానికి సకల సంపదల కన్న మించిన సుఖము, శాంతి లభించును. కనుక పరమాత్మయే మహాసుఖము లేక భోగము యగుచున్నాడు.

11. ఇట్లు సంపదలెన్ని యున్ననూ, అవి అన్నియూ నారాయణుని వల్లనే కలుగుచున్నవి. గనుక ఆయన మహాధనుడని పిలువబడుచున్నాడు. ధనమనగా సంపదలను సాధించుటకు కారణమగు వస్తువు. సంపదలను సాధించుటకై నిరంతరము మానవుడు ప్రాకులాడుచుండును. ధనము వలన సకల సంపదలు లభించునని మానవుని విశ్వాసము. ధనము అనేక కారణములలో

నొకటిగాని ప్రధాన కారణము కాదు. మరియు యెంత ప్రయత్నించినను ధనము లభింపవచ్చును, లేక లభింపక పోవచ్చును. ఇవి రెండును జరుగుటకు కారణములు మానవుని అధీనమున లేవు. అవి పరమాత్మవల్ల కలుగుచున్నవి, కనుక ఆయనయే నిజమైన ధనము.

47. శ్లో॥ అనిర్విణ్ణస్థవిష్ఠో ఽభూర్ధర్మయూపో మహామఖః ।
నక్షత్రనేమి ర్నక్షత్రీక్షమః క్షామస్సమీహనః ॥

**ప్రతిపదార్థము :-** 1. అనిర్విణ్ణః = విస్మయము చెందనివాడు, 2. స్థవిష్ఠః = స్థిరమైన వారిలో శ్రేష్టుడు, 3. భూః = భౌతిక జగత్తులోనికి వ్యక్తమగువాడు, 4. ధర్మయూపః = ధర్మమను యజ్ఞస్తంభమునకు మూలమైనవాడు, 5. మహామఖః = అన్ని యజ్ఞములకు ఆధారమైన యజ్ఞ స్వరూపుడు, 6. నక్షత్రనేమిః = రాశిచక్రము భాగములుగా విభజింపబడుట, (దానిని 28 సమభాగములుగా విభజించినచో ఆ భాగములే జీవుల పుట్టుకకు, రూపురేఖలకు, స్త్రీ గర్భధారణము, ఋతుక్రమము మున్నగునవి కలుగుటకు కారణమగును) 7. నక్షత్రీ = ఈ రాశి విభాగములే తనకు మార్గమైనవాడు, 8. క్షమః = సహనము, 9. క్షామః = కరువు, 10. సమీహనః = కోరికల వరుస తానే అయినవాడు.

**తాత్పర్యము :-** భగవంతుని విస్మయము చెందని వానిగను, స్థిరమైనవారిలో శ్రేష్టునిగను, మొక్కలు మున్నగునవి మొలిపించువానిగను, జీవులను పుట్టించువానిగను, ఈ సృష్టియను యజ్ఞమునకు ఆధారమగు ధర్మమను స్తంభమునకు జీవులను కట్టి యుంచువానిగను, సృష్టియందలి అన్ని యజ్ఞములకు ఆధారమైన మహా యజ్ఞముగను, రాశిచక్రము, నక్షత్ర విభజనమున్నగు వానికి అధిపతిగను, సహనము, సామర్థ్యము మున్నగు అంశములు తానే అయిన వానిగను, కరువు, ఆకలి, అనువానిరూపమున జీవులకు క్రమశిక్షణ నిచ్చువానిగను, జీవుల కోరికలయొక్క వరుస తానే అయిన వానిగను ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. పరమాత్మ జీవులందరి యందును అంతర్యామిగా నుండుటవలన అందరికన్న అధికుడు, పెద్దవాడును అగుచున్నాడు. అందరినీ

తనయొక్క విష్ణుత్వము లేక వ్యాపనముచేత సమ్మోహితులను చేయుచున్నను, తాను మాత్రము విస్మయము చెందుట లేదు. జీవులు వేరుగా ఒకరినొకరు చూచుకొనుచున్నారు. కనుక ఒకరి యందొకరికి విస్మయము, మోహము, భ్రమ, కలుగుచున్నవి. ఇవి అన్నియు నారాయణుని నుండి పుట్టుచున్నవి కనుక అవి ఈయన యందు పనిచేయవు.

2. ఈ సృష్టియంతయు బ్రహ్మమునందే పుట్టి మరల అందే లీనమగుచున్నది. మనకు తెలిసిన సమస్తము స్థిరమైనవి. మరియు అస్థిరమైనవి. అన్నియు కలిపి బ్రహ్మము నందే పుట్టి మరల అందే లీనమగుచున్నవి. కనుక భగవంతుడు ఈ స్థిరమైన వాటన్నింటినికన్నా శ్రేష్ఠుడు, పూర్వీకుడును అయియున్నాడు.

3. భూః అను శబ్దమునకు భౌతిక లేక పంచేంద్రియములచే గ్రహింపబడుటకు వీలైన స్థితియని అర్థము. అవ్యక్తమగు స్థితి నుండి ఈ భౌతిక స్థితికి ప్రాణులు, జీవులు, వ్యక్తమగుదురు. లేక పుట్టుదురు. అట్లు పుట్టించుట నారాయణుని శక్తియే.

4. ఈ సృష్టికి ధర్మమే మూలస్తంభమై యున్నది. ప్రతి వస్తువు, జీవి, ధర్మముపైననే ఆధారపడి పుట్టుచున్నారు, జీవించుచున్నారు. ఈ ధర్మము జీవులయందు, వస్తువులయందు వారి వారి స్వభావములుగా, లక్షణములుగా వ్యక్తమగును. ప్రతి జీవియు తన స్వభావము చేతనే బంధింపబడుచున్నాడు. అనగా ఎట్టివాడైనను తన స్వభావములను, గుణములను తప్పించుకొనలేడు. వస్తువైనను అంతే. ఉప్పు ఉప్పుగా నుండుట మాని తియ్యగా నుండలేదుకదా ! ఇట్లు వ్యక్తుల స్వభావములు, వస్తువుల లక్షణములు నియమింపబడి ప్రకృతి ధర్మము అను మహా స్తంభమునకు కట్టివేయబడి యున్నవి.

5. ఈ విశ్వమను మహా యజ్ఞమునకు పరమాత్మయే యజ్ఞపురుషుడు. అనగా సమస్త సృష్టియజ్ఞమునకు ఈయనయే ఆధారము. తాను అను ప్రజ్ఞగా జీవులయందు దిగి వచ్చుటయేగాక వారి చైతన్యమునకు మూల కారణమైన ప్రాణశక్తి మరియు భౌతిక ద్రవ్యము కూడా తానే. అనగా మొట్టమొదట ''నేను'' అను ప్రజ్ఞ నుండి చైతన్యము లేక శక్తి అనునది వేరుగా ఏర్పడుచున్నది.

ఈ ''నేన''ను ప్రజ్ఞయందు కదలిక ఏర్పడినచో చైతన్యము లేక శక్తి ఏర్పడును. ఇది ఎట్లనగా, తన యందు మనస్సు పుట్టి భావముల రూపమున కదలిక ఏర్పడును. అట్లే శక్తి కూడా పుట్టుచున్నది. ఈ శక్తి మరల అనేక చిన్న చిన్న చైతన్యవంతమైన కేంద్రములుగా విడిపోయి వేరుపేరు శక్తి కేంద్రములుగా కట్టుకొన్నచో వానినే అణువులు, పరమాణువులు అందుము. ఈ అణువులే భౌతిక ద్రవ్యస్థితికి మూలకారణమైయున్నవి. ఇట్లు తానను ప్రజ్ఞనుండి మూడు స్థితులుగా, భౌతిక స్థితి వ్యక్తమగుచున్నది. ఈ మూడు స్థితులు వరుసగా ప్రజ్ఞామయము (The plane of consciousness) శక్తిమయము (The plane of forces or energies) ద్రవ్యమయము (The plane of materialisation or matter). యిట్లు సమస్త సృష్టి యజ్ఞమునకు పరమాత్మ కారకుడు. కనుక ఆయన మహామఖుడు అని పిలువబడును.

6. రాశి చక్రము అనేక విధములుగా విభజింప బడినది. విభజనకు ఒక్కొక్క ప్రయోజనమున్నది. ఇట్లు విభజించిన ఒక్కొక్క విభాగమునకు నక్షత్రము అని పేరు. 28 భాగములుగా రాశిచక్రము విభజించు పద్ధతి ప్రధానముగా స్త్రీ ఋతుక్రమము, గర్భోత్పత్తి మున్నగువానికి సంబంధించియున్నది.

7. ఇట్టి 28 అను విభజనమునకు చంద్రుడు అధిపతియై యున్నాడు. చంద్రుడు రాశిచక్రముచుట్టు తిరుగుచున్నపుడు అయా లక్షణములుగల జీవులను పుట్టించుటలో ప్రధాన పాత్ర వహించుచున్నాడు. చంద్రుడు పితృలోకమునకు అధిపతి. అనగా గర్భధారణము, సంతానోత్పత్తి మున్నగు వానికి సంబంధించిన శక్తులు చంద్రలోకమునుండి పని చేయును.

8. సహనము, ఓర్పు అనునవి జీవుల శక్తి సామర్థ్యములకు నిజమైన పరీక్షలు. ఇతరుల తప్పులను సరిపెట్టుకొనుట, కాదనలేక పోవుట, భయపడుటకాక. వారి యందలి అంతర్యామిని చూచి తనకు సహనమును నేర్పించుచున్న శిక్షకులుగా గ్రహించి వారియందు ప్రేమ చూపుట మాత్రమే నిజమైన పద్ధతి. ఏసుక్రీస్తు తనని బంధించి బాధించువారి గూర్చి భగవంతునితో 'వారేమి చేయుచున్నారో వారికి తెలియదు. వారిని క్షమించుము' అని ప్రార్థించెను. తోటివారియందు ఇట్టి సహనముతోకూడిన ప్రేమనే క్షమ అందురు. జీవులయందు

ఇట్టి క్షమను నారాయణుడే కలిగించుచున్నాడు. మరియు ఒకరి యందొకరి దురాగతములను ఎదుటివారిలో తానే యుండి సహించి క్షమించుచున్నాడు. మానవులు తోటివారిపైననూ, ఇతర జీవులపైననూ, ప్రకృతి పైననూ సాగించు అపరాధములును, దుర్జనత్వమును భూమి సహించి భరించుచున్నది కదా ! ఈ సహనము నారాయణుని నుండి కలుగుచున్నది, కనుక ఆయన క్షమ యగుచున్నాడు.

9. కరువు, కాటకము మున్నగునవి జీవుల దుష్టవర్తనకు, అధర్మమునకు శిక్షలుగా పనిచేయును. పరస్పరత్వము, సహకారము, అన్యోన్యత అనునవి జీవులయందు లోపించినప్పుడు, వారియందలి ఆయా లక్షణములు తొలగింపబడుటకై కష్టములు వ్యక్తిగతముగా వచ్చును. ఈ లక్షణములు ఒక జాతియందలి లేక దేశమునందలి ప్రజలలో మిక్కిలి హెచ్చుగా కనిపించినప్పుడు కరువు, కాటకములు, ఇతర దేశములు దండెత్తి ఆదేశము నాక్రమించి వారిని బానిసలుగా పనిచేయించుట మున్నగునవి సంభవించి ఆయా పరిస్థితులనుండి బయటపడుటకై వారు తప్పనిసరిగా సహకారము గలిగి జీవింపవలసిన పరిస్థితి వచ్చును. కనుక జీవికిట్లు సత్ప్రవర్తన కలిగించుటకై నారాయణుడే క్షామము అను రూపమున వచ్చుచున్నాడు.

10. కోరికల పరంపర మానవునికి అస్థిరత, ఆందోళన కలిగించి, కోరికలయొక్క నిష్ప్రయోజనత్వము తెలియజేయును. కోరికలు మానవుని యందు కామక్రోధములను పెంచి అశాంతిని కలిగించును. దీనిని గుర్తించిన మానవుడు తనయందు కోరికల రూపమున పనిచేయుచున్న అంతర్యామి రూపమును స్మరించి కోరికలను దాటుచున్నాడు. జీవులకు కోరికలు పుట్టించినది అంతర్యామియే అని తెలిసినవాడు ఆయా కోరికలవలన కలుగు సుఖముకూడ అంతర్యామివలననే అని తెలుసుకొనుచున్నాడు. ఇట్లు తెలుసుకొనినవాడు అంతర్యామిగానున్న పరమాత్మయొక్క సాన్నిధ్యమును అన్ని కోర్కెలను తీర్పగలుగు నిజమైన సుఖముగా గుర్తించి అందే శాశ్వతముగా నిలిచి పోవుచున్నాడు. కనుక పరమాత్మయే జీవులకు కోరికల వరుసగా యున్నాడు.

48. శ్లో॥ యజ్ఞ ఇజ్యో మహేజ్యశ్చ క్రతుస్సత్రం సతాంగతిః ।
సర్వదర్శీ విముక్తాత్మా సర్వజ్ఞో జ్ఞానముత్తమమ్ ॥

**ప్రతిపదార్థము :-** 1. యజ్ఞః = యజ్ఞము, 2. ఇజ్యః = యజ్ఞమువలన సాధింపదగిన ఫలితముగా నున్నవాడు, 3. మహేజ్యః = గొప్ప యజ్ఞస్వరూపుడు, 4. చ=మరియు, 5. క్రతువు = యజ్ఞార్థముగా చేయుకర్మ లేక పని, 6. సత్రం = సజ్జనుల కూటమి, 7. సతాం = మంచివారికి, 8. గతిః = మార్గము, 9. సర్వదర్శీ = అందరిని చూచువాడు, 10. విముక్తాత్మా = మోక్షము పొందినవాడు, 11. సర్వజ్ఞః = అన్నియూ తెలిసినవాడు, 12. ఉత్తమమ్జ్ఞానం = ఉత్తమమైన జ్ఞానము.

**తాత్పర్యము :-** పరమాత్మను యజ్ఞముగా, మరియు కోరికతో కూడిన యజ్ఞముగా, అన్నిటికన్నా గొప్ప మరియు శాశ్వత యజ్ఞఫలము తానే యైనవానిగా, క్రతువుగా, సత్రము అని పిలువబడు సజ్జనకూటమిగా, అట్టి వారి మార్గము, గమ్యము తానే యైనవానిగా, అన్నిటిని చూచువానిగా, మరియు తెలుసుకొనువానిగా, ముక్తి పొందినవానిగా, పరిపూర్ణ జ్ఞానస్వరూపునిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. యజ్ఞమనగా అందరికి ఉపయోగించు మంచిపనిని, ఔదార్యముతో ఫలాపేక్షలేక ఇతరుల యందలి అంతర్యామినిచూచి, చేయుట. ఇట్లు యజ్ఞార్థము ప్రపంచమునందు జీవించు సజ్జనుల, మహర్షుల రూపమున వారియందలి యజ్ఞస్వరూపముగా నారాయణుడే యున్నాడు.

2. ఒక ఫలితము నాశించి యజ్ఞమునందు సమర్పణము చేయుటను ఇజ్యము అందురు. యజ్ఞమునందు సమర్పింపబడునని దీనికర్థము. తమకు గల కోరికలను తీర్చుకొనుటకై యజ్ఞము పూజ మున్నగునవి చేయుదురు. అంతేకాక జీతమున్నకై ఉద్యోగము చేయుట, ధనము సంపదల కాశించి వృత్తి వ్యాపారాదులు చేయుట, ఇజ్యము అనబడును. జీవుల కిట్టి కోరికలు కలిగించి నారాయణుడే వారి ద్వారా ఇతరులకు పనులు చేయించి పెట్టుచున్నాడు గనుక, ఇజ్యాడు అని పిలువబడినాడు.

3,4. అన్ని యజ్ఞములకన్నా మహాయజ్ఞము ఆత్మ సమర్పణము.

అనగా తన పనులను, సంకల్పములను నారాయణునికి సమర్పణచేసి సకల జీవులయందు అంతర్యామిగా నున్నవానిని సేవించుటకై త్రికరణ శుద్ధిగా పనిచేయుట. అట్లు తనను తాను ఇజ్యముగా, పరమాత్మయొక్క సృష్టి యజ్ఞమునకు సమర్పణ చేయుటవలన మానవుడు ఆత్మోద్ధరణ మొనరించుకొనుచున్నాడు. ఇట్లు జీవులచే సమర్పింపబడు పరిపూర్ణ సమర్పణము తానే గనుక నారాయణుడు 'మహేజ్యః' అని పిలువబడుచున్నాడు.

5. క్రతువనగా ఒక నిర్దిష్ట పద్ధతిలో ఆచరింపబడు యజ్ఞము. జీవులు తన జీవితమునే క్రమమైన పద్ధతిలో యోగసాధన చేయుచు జీవించుట వలన జీవితమును క్రతువుగా మార్చుకొనుచున్నారు.

6. సత్రమనగా సజ్జనులు ఒక కూటమిగా నేర్పడుట. ముక్తజీవులైన మహర్షులు మున్నగువారు ఒకచోటచేరి మానవులందరి ఆత్మవికాసమునకు, పరిపూర్ణత్వమునకు సంకల్పించి పథకము నేర్పరచుకొనుట. ఇవి ఒక దినమునుండి వేయి సంవత్సరములవరకు ఎంతకాలమైనా ఉండవచ్చును. సూతుడు, శౌనకుడు మున్నగు మహానుభావులందరు శ్రీకృష్ణ నిర్యాణానంతరము నైమిషము అను ప్రదేశమునందు ఒక కూటమిగా నేర్పడి వేయి సంవత్సరముల ప్రణాళిక సిద్ధము చేసుకొనిరి. ఒక తరము నుండి మరియొక తరము వారికి ఈ పథకము చెడకుండ అప్పచెప్పుటవలన వేయి సంవత్సరముల పాటు ఈ మహాయజ్ఞము కొనసాగెను. ఇది అనిమిషము అనుచోట ఏర్పరుపబడినది. అనిమిషమనగా రెప్పపాటు లేనిస్థితి లేక కాలాతీతమయిన స్థితి. అచ్చట కూడిరనగా పరమాత్మకు సమర్పణముగా ప్రారంభింపబడిన ఈ మహాయజ్ఞమునందు వారి వారి వ్యక్తిగత సంకల్పములు, పథకములు నశించి, అంతర్యామి భావన వారి అందరియందు స్థిరమై నిలబడియుండుట. ఈ ప్రణాళికయందు పని చేయుచున్న వారికిది అప్రయత్నముగా అభ్యాసమగును. అంతర్యామియైన పరమాత్మయే ఆ ప్రణాళిక రూపమున, ఆ కూటమినందు పనిచేయుచున్న వారందరి మనస్సులలో తానేయై యుండును. ఇట్లు సంకల్పింపబడి ప్రారంభించి చేయు మహాయజ్ఞములను సత్రములని అందురు. సాధారణముగా ఇట్టి సత్రయాగము చేయువారు భౌతికముగా కూడా ఒకచోట చేరి సామూహికముగా భోజనాదికములు నిర్వర్తించుకొందురు. అందులో కొందరు

వంటచేయుట, కొందరు పండించుట, కొందరు వస్త్రములు నేయుట, కొందరు ప్రవచనము చేయుట. కొందరు తమ వద్దకు వచ్చు కూటమికి చెందని ఇతర జీవులకు కూడా వైద్యము చేయుట, కష్టములు తీర్చుట, మున్నగు కార్యక్రమములు ఎవరి సౌలభ్యమును బట్టివారు ఎన్నుకొని పనిచేయుదురు. ఇందు పాతతరముల వారు నశించుచుండగా క్రొత్తతరముల వారు ఆయా స్థానములను భర్తీ చేయుచుందురు. ఇట్టి పథకముతో కూడిన సమావేశములను సత్రములు అందురు.

(ఈ గ్రంథమునకు ఆంగ్ల వ్యాఖ్యానము వ్రాసిన కులపతి శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యగారు ఇట్టి కూటములను గురుపూజలనుపేర అనేక సంవత్సరములు అవిచ్ఛిన్నముగా చేసిరి. వారి తదనంతరము వారి శిష్యులు అదే ప్రణాళిక ప్రకారము విశాఖపట్నం, హైదరాబాదు మున్నగు చోట్ల గురుపూజలను నిర్వహించుచున్నారు. ఇట్టి ఈ పథకములనే సత్రములందురు.

7.8. అట్టి సత్రములే సజ్జనులను మోక్షమార్గములు. అనగా సజ్జనులు తామున్నచోట తోటివారితో ఇట్టి గుంపుగా నేర్పడి ప్రజల సుఖశాంతులకు, ఆత్మవికాసమునకు సంకల్పించి, ఒక పథకము నేర్పరుచుకొని ఆ పథకము నిర్వర్తించుటయే తమ జీవితలక్ష్యముగా నున్నచో, వారియందలి ఈవికాసము స్థిరమై పరిపూర్ణమగును. జ్ఞానము, విజ్ఞానము, మరియూ మోక్షము వీరి పరమావధి గనుక అంతర్యామియైన నారాయణుడే వీరి ఈ లక్ష్యముగా పని చేయుచున్నాడు.

9. అట్లు పరమాత్మ జీవులందరి యజ్ఞములకు, వ్యూహములకు, ప్రణాళికలకు సాక్షియైయున్నాడు. ఆయన ఈ ప్రణాళికలద్వారా వహార్పులు కలిగించుచున్నడు కనుక సర్వదర్శి అని పిలువబడుచున్నాడు. ఈ సృష్టి మహాయజ్ఞమునకు ఆయనయే పర్యవేక్షకుడు, మరియూ అధ్యక్షుడు.

10. జీవుడు ముక్తుడగుట యనగా భగవంతునితో నొకటి యగుట. అట్టి ముక్తజీవుల రూపమున నారాయణుడే సంచరించును.

11. తెలిసికొనుట జీవి మానసిక పొరలలో నొక పొర. తెలిసికొనుటకు ప్రయత్నించు వానికి ఎంత తెలిసికొన్ననూ ఇంకనూ తెలియవలసినది మిగిలియే

యుండును. కనుక విషయములను తెలిసికొనవలెనను కుతూహలము కాక వాని ప్రయోజనము తెలియవలెను. జ్ఞానమునకు సార్థక్యము ప్రయోజనము. వంట గురించి తెలియుటకు సార్థక్యము చక్కని రుచికరమైన వంట చేయగలుగుట. అట్లు చేయలేనివారికి వంట చేయుట గురించి ఎన్ని డిగ్రీలున్ననూ అవి నిష్ప్రయోజనములు. ఏ శాస్త్రమున కైననూ ఇట్టి ఇతరులకుపయోగింపగల ప్రయోజనముండవలెను. ఇతరుల హితము కోరి వారి సుఖమునకై పాటుపడు వానికి జ్ఞానము అప్రయత్నముగా లభించును. ఇది తెలిసి ఆచరించిన వాడు పరిపూర్ణజ్ఞానము కలవాడు, సర్వజ్ఞుడు అనబడును. ఇట్లు జీవుల సర్వజ్ఞత్వమునకు నారాయణుడే కారణము.

12. ఇట్టి ఆచరణతో కూడిన సర్వజ్ఞత్వమే ఉత్తమ జ్ఞానమనియు, పరిపూర్ణ జ్ఞానమనియు చెప్పబడినది. అది నారాయణుని యొక్క స్వరూపము.

49. శ్లో॥ సువ్రతస్సుముఖ స్సూక్ష్మః సుఘోషస్సుఖదస్సుహృత్ ।
మనోహరో జితక్రోధో వీర బాహుర్విదారణః ॥

**ప్రతిపదార్థము :-** 1. సువ్రతః = సత్కర్మము సంకల్పించువాడు, 2. సుముఖః = మంచి ముఖము కలవాడు, 3. సూక్ష్మః = సూక్ష్మమైనవాడు, 4. సుఘోషః = మంచి కంఠస్వరము, 5. సుఖదః = సుఖమునకు కారణము, 6. సుహృత్ = సహృదయుడైన మిత్రుడు, 7. మనోహరః = మనస్సును హరించువాడు, 8. జితక్రోధః = క్రోధమును జయించువాడు, 9. వీరబాహుః = శౌర్యసంపన్నములైన బాహువులు కలవాడు. 10. విదారణః = శత్రువులను చీల్చివేయువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను సత్కర్మకు అంకితమైనవానిగా, మంచి ముఖము కలవానిగా, సూక్ష్మమైన వానిగా, తన వాక్కుచే ఆనందము కలిగించు మంచి మిత్రునివలె హృదయమును తాకువానిగా, తనవాక్కు వలన మనస్సును తనలోనికి హరించువానిగా, ఆయన క్రోధము నశింప చేసిననూ బాహువుల యందు శౌర్యము కలిగి శత్రువులను చీల్చివేయు వానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. మంచిపనులయందు కలుగు సంకల్పమే మంచివారిని రక్షించుచున్నది. అట్టి సత్కర్మలయందలి వ్రతమే నారాయణుడు.

2. ఒకరికి పనిచేసిపెట్టుట యందు సుముఖత్వము గలిగెననగా అది భగవంతుని సంకల్పము. ఇట్లు జీవులయందు ఒకరి యందొకరికి గల సుముఖత్వమే నారాయణుడు. సుముఖమనగా మంచి అందమైన ముఖమని అర్థము. ఒకని ముఖము అందముగా నున్నదనగా అది వాని యందలి సౌందర్యోపాసనము తెలియచేయును.

3. సూక్ష్మత్వము సృష్టికిగల రెండు చివరలలో నొకటి. సూక్ష్మము, స్థూలము అనునవి సృష్టికి గల రెండు చివరలు. ఆత్మ, దేహము; అణువు, బ్రహ్మాండము మొదలగునవి సృష్టియందు జంటలు జంటలుగా యున్నవి. ఈ జంటలు నారాయణుని రూపమే. కంఠ స్వరము ధ్యానమునకు మూలము. తన కంఠస్వరమును తాను విను వారికి తనయందు నారాయణుడు వ్యక్తమగు స్థితి తెలియును. ఇట్లు నారాయణుని పుట్టుకను తనయందు ధ్యానము చేయువానికి ఇతరుల కంఠములయందు కూడా నారాయణుని అస్తిత్వము క్రమేణా గోచరించును. అట్లు ఇతరుల కంఠములయందు నారాయణుని దర్శించుట కభ్యంతరమున్నవానికి ధ్యానమున నారాయణుడు మాయమై అహంకారము మిగులును.

4.5. సుఖమును కలిగించు వాడు నారాయణుడు. తన కంఠమును ఉచ్ఛారణను వినువానికి ఉచ్ఛ్వాస నిశ్వాసములు క్రమబద్ధమై, హృదయ స్పందనమందలి వేగమును తగ్గించి మనస్సునకు ప్రశాంతత కలిగించును. యిదియే నిజమైన సుఖము. అట్లు ప్రశాంతమైన మనసు గలవానికి హృదయము వికసించి బుద్ధి మేల్కొనును. అనగా తానను ప్రజ్ఞ మేల్కొనుచు తనయందు తాను మేల్కొనువానికి మనస్సు హరింపబడును.

6,7. ఇట్లు హరింపబడుటవలన తన కంఠమే తన హృదయమును మిత్రుని వలె తాకుచుండును. ఇట్టి మిత్రత్వమే సృష్టియందలి నిజమైన మిత్రత్వము. శ్రీరాముడు తన వాక్కు చేతను, శ్రీకృష్ణుడు తన వేణువు చేతనూ మిగిలిన వారియందు యిట్టి మిత్రత్వము నిలిపి, వారి హృదయములకు సన్నిహితులై వారి మనస్సులను హరించిరి.

8. జీవులయందలి కోపము, పగ మున్నగునవి ఒకరి యందొకరికి

శత్రుత్వము కలిగించును. అంతర్యామి యొక్క వాణి తన లోపలనుండి ధర్మము, వివేకము మున్నగు రూపములతో వ్యక్తమై భయము కలిగించి ధర్మ మార్గమునకు త్రిప్పును. ఒక్కొక్కసారి పరమాత్మ వాక్కు పరిసరములయందు, తోటి జీవులయందు ఆజ్ఞగా వ్యక్తమై ధర్మబద్ధుని చేయును. ఇట్లు తన లోపల నుండి, వెలుపలనుండి పని చేయు ధర్మమే తనను, తన క్రోధమును నిగ్రహించి పరిపూర్ణుని చేయును.

9,10. ఒక్కొక్కసారి యిట్టి ధర్మరక్షణము భౌతికముగా కూడా జరుగవచ్చును. అప్పుడు పరమాత్మ వ్యక్తమై దుష్టశక్తులను తన బాహువులతో చీల్చి సంహరించును, నరసింహుడు, శ్రీరాముడు, పరశురాముడు మున్నగు అవతారములు ఇందులకుదాహరణములు.

50. శ్లో॥ స్వాపన స్స్వవశో వ్యాపీ నైకాత్మానైకకర్మకృత్ ।
వత్సరో వత్సలోవత్సీ రత్నగర్భో ధనేశ్వరః ॥

**ప్రతిపదార్థము :-** 1. స్వాపన: = స్వప్నములు కలిగించువాడు, 2. స్వవశః = తన వశమందు తానుండువాడు, 3. వ్యాపీ = వ్యాపించి విస్తరించువాడు, 4. నైకాత్మా = అనేక ఆత్మలు కలవాడు, 5. నైకకర్మకృత్ = అనేక పనులను చేయువాడు, 6. వత్సరః=సంవత్సరమున కధిపతి, 7. వత్సలః=వాత్సల్యము కలవాడు, 8. వత్సః=అనేక ఆవుదూడలు కలవాడు, 9. రత్నగర్భః = అనేక సద్గుణములకు నిలయమైనవాడు, 10. ధనేశ్వరః = ధనమున కధిపతి.

**తాత్పర్యము :-** నారాయణుడు స్వప్నములు కల్పించును. ఆయన అస్తిత్వము జీవులకు తమతమ అస్తిత్వములుగా భ్రాంతిని కల్పించి ఆయన అస్తిత్వము తను ప్రపంచముగా స్వప్నము కల్పించును. సంవత్సర చక్రమునకు ఆయన అధిపతియై, జీవులందరిలోకి వారి వారి మంచి గుణములుగా విస్తరించును. ఆయన వశము కావలెనన్నచో తనకు తానే వశము కావలెను. జీవులయందలి వాత్సల్యమే ఆయన రూపము. కనుక జీవులందరూ ఆయనకు దూడలై సంరక్షింపబడుచున్నారు. అన్ని సద్గుణములకు ఆయన నిలయము. ఇంకనూ ఆయన సంపదల కధిపతి.

**వివరణ :-** 1. పరమాత్మ తన మాయవలన జీవులకు ఎవరి లోకములను

వారికి కల్పించును. ఇట్లు ఎవరి లోకమునందు వారుండుటవలన వారు పరమాత్మ యందు నిద్రించుచున్నారు. ఎవరి జీవితము వారికి కలగా నడచుచున్నది. ఈ కలనుండి మేల్కొలుపుటకు మరి యొకరుండవలెను. అతడే పరమాత్మ. ఇట్లు జీవులకు కలలను కల్పించువాడు మరల మేల్కొలుపువాడు పరమాత్మయే.

2. భగవంతుడు తన వశమున తానుండును. కనుకనే ఈ సృష్టియంతయు ఆయన వశమున యున్నది. జీవులందరు తమ వశమున తామున్నట్లు కనిపించుచున్నను నిజమునకు వారందరినీ పరమాత్మయే నడుపుచున్నాడు. వీరందరూ వాని వశమున నుండి, పని చేయుచున్నారు.

3. నారాయణుడు ఈ సృష్టి యంతయూ తానుగా వ్యాపించుట వలన జీవులకు ఆయన సాన్నిధ్యము సాధ్యమగుచున్నది. అనగా తమయందలి నేనను ప్రజ్ఞగా మేల్కొని యున్న నారాయణుని యందు జీవులు తాముగా మేల్కొనియున్నారు. ఇట్లు నారాయణుడు సృష్టి యంతటను వ్యాపించియుండుట వలననే సృష్టి నిలిచియున్నది.

4,5. పరమాత్మ అనేక జీవులుగా నున్ననూ వారందరియందు తానొక్కడుగనే యున్నాడు. ఎవరికి వారు తమను గూర్చి చెప్పుకొనుచున్నపుడు ''నేను నేనని'' చెప్పుకొందురేగాని అతడని చెప్పుకొనరు. ఇందరిలో నున్న ఒకే ''నేను''గా పరమాత్మ వ్యాప్తి చెంది మేల్కొని యున్నాడు. జీవులకు ఎవరి శరీరములు వారివి. ఎవరి ప్రవృత్తులు వారివి, కాని అనుభవము ఒక్కటే. ఎవరి అనుభవము వారికి సిద్ధించుచున్ననూ, అనుభవింపబడు విషయమొక్కటిగనే యుండును. శ్రీకృష్ణుడు ఒకసారి నారదునకు తానొకే సమయమున తన భార్యలందరి యిండ్లయందున్నట్లుగా చూపించెను.

6. సంవత్సర చక్రము భూమి తిరుగుట వలన ఏర్పడుచున్ననూ, భూమి తన అక్షముపై తిరుగుటకు సూర్యుడే కారణమగుచున్నాడు. సూర్యుని నుండి ప్రసరించు శక్తి భూమినట్లు త్రిప్పుటయేగాక, భూమిపై జీవులు పుట్టుటకు, శరీరము లేర్పడుటకు కారణమగుచున్నది. ఇట్లు సంవత్సరములు, ఋతువులు

మున్నగు వానిని సూర్యుడే కల్పించుచున్నాడు. అట్టి సూర్యుడు నారాయణుని రూపమే.

7,8. జీవులకు పరమాత్మకుగల సంబంధము వాత్సల్యమే. కనుకనే ఆయన జీవులకు తల్లి. తండ్రియూ కూడా నగుచున్నాడు. పరమాత్మకు, జీవులకు నడుమ గల ప్రేమయను అనుబంధమే జీవులమధ్య పనిచేయుచు, వారి మధ్య ప్రేమగా, స్నేహముగా, బంధుత్వముగా, అనుభవింపబడుచున్నది. దీనివలననే జీవులు కుటుంబములుగా నేర్పడి, తమ మధ్య అంతర్యామి రూపమగు ప్రేమను అనుభవముగా సాధించుకొనుచున్నారు. మనువు యిట్టి అంతర్యామి సాధనకొరకే జీవులను కుటుంబములుగా నేర్పరచెను. తన కుటుంబములోని వారిని ప్రేమించి సేవచేయలేనివాడు ఎట్టి వాడైననూ మోక్షమునకు అర్హుడుకాడు. అనగా వారియందున్న అంతర్యామి అట్టి వానిని మన్నింపడు. ఈ రహస్యము తెలిసినవారు తమకు తమ బిడ్డలకు మరియు తమను ప్రేమించి అభిమానించువారికిని మధ్యగల అనుబంధమే నారాయణునికి తమకు మధ్యవున్నదని గ్రహించి, ఆచరించుచున్నారు.

9. అన్ని సద్గుణములకు నారాయణుడే పుట్టుక స్థానము. ఆయన మనయందు మేల్కొనుట యనగా మనయందు సద్గుణములు పుట్టి ఆచరింపబడుటయే. ఇట్టి గుణములు పుట్టుటకు కూడా వానినే స్మరింపవలెను. కనుకనే దుష్టులైనవారు మంచివారిని, భగవంతుని, ద్వేషించుట అనుపేర నిరంతరమూ స్మరించుచున్నారు. ఇట్లు స్మరించుటవలన నారాయణుడు వారియందు సద్గుణములుగా మేల్కొని వాని రాక్షసప్రవృత్తిని క్రమేణా దమింపచేయును. ఇట్లు నారాయణుడు సద్గుణరూపమున జీవులయందు పనిచేయుచున్నాడు.

10. సృష్టియందలి ధనమునకు నారాయణుడధిపతి. సామాన్యముగా ధనము వస్తువినియోగమునకు, మార్పిడికి ఉపయోగపడును. ధనమనునది ఒక వూహయే కాని సత్యముకాదు. సృష్టియందలి సంపదలు జీవులకు చక్కగా పంచిపెట్టబడుటకు, ధనము ఉపయోగపడును. ఇంతియేగాని ఎవరునూ ధనమును సూటిగా అనుభవింపలేరు. ఇది తెలిసినవారు ధన మక్కరలేయే

తమ మధ్య వస్తు మార్పిడి వినియోగమును చేసుకొనుచున్నారు. పూర్వము జనకుడు ఇట్టి సంప్రదాయమునే స్థాపించి జీవులను గ్రామములను పేర బృందములుగా తీర్చిదిద్ది వారి మధ్య ధనముయొక్క ఆవశ్యకతను లేకుండా చేసెను. ఇది మొట్టమొదట మనువు ఏర్పరచిన సంప్రదాయము. దీనినే జనకుడు మరల మరల పునర్వ్యవస్థీకరణ మొనర్చి ''మిధిల'' అనుపేర ఈ సంప్రదాయమును జనులమధ్య స్థాపించెను. కుబేరుడు ధనమున కధిపతి. అనగా జీవుల మనస్సులయందు ధనమును గూర్చిన అభిప్రాయమునకు కుబేరుడే కారణమగుచున్నాడు.

51. శ్లో॥ ధర్మగుప్ ధర్మకృద్ధర్మీ సదసక్షర మక్షరమ్ ।
అవిజ్ఞాతా సహస్రాంశు ర్విధాతా కృతలక్షణః ॥

**ప్రతిపదార్థము :-** 1. ధర్మకృత్ = ధర్మము నిర్మించువాడు, 2. ధర్మగుప్ = ధర్మము గుప్తముగా నుంచువాడు, 3. ధర్మీ=ధర్మమున కధిపతి, 4. సత్=సత్యము (తానున్నానని తెలియుట), 5. అసత్ = అసత్యము, తానుగా లేకుండుట, 6. క్షరమ్ = నశించునది, 7. అక్షరమ్ = నశింపనిది, 8. అవిజ్ఞాతా = తన జ్ఞానమునకు లేక బుద్ధికి అందనివాడు, 9. సహస్రాంశుః = వేయికిరణములు కలవాడు, 10. విధాతా = వస్తువుల స్వభావము ననుసరించి స్థానములను నిర్ణయించువాడు, 11. కృతలక్షణః = తన లక్షణములు తానే సంకల్పించి నిర్మించుకొనువాడు, తనను గూర్చిన సిద్ధాంతములను తానే నిర్మించుకొనువాడు.

**తాత్పర్యము :-** నారాయణుడు ధర్మమును నిర్మించువాడు. మరియు అధిపతి, మరియు తనయందు గుప్తముగా నుంచుకొనువాడు. ఆయన ఉండుట, లేకుండుట అను రెండూ తానేయైనవాడు మరియు నశించువాడు, నశింపనివాడు కూడా. ఆయన తన వేయి కిరణములతో ఎవరి స్థానమున వారిని నియమించువాడు. ఆయన జ్ఞానమే ఆయనకు తెలియలేదు. అనేక లక్షణములు, సిద్ధాంతములు ఆయనను గూర్చి కల్పింపబడినను ఆయనను తెలియుట లేదు.

**వివరణ :-** 1. సృష్టి ప్రారంభమయినపుడు పరమాత్మ సృష్టి ధర్మముగా

తానే దిగివచ్చును. ఆ సృష్టి ధర్మమునుండి సకల లోకములు, వాని ధర్మములు ఏర్పడినవి. అట్లు లోకములనుండి జీవులకు ధర్మము లేర్పడినవి. కనుక నారాయణుడే ధర్మమునకు నిర్మాత.

2. అట్లు దిగివచ్చిన పరమాత్మ, జీవుల ధర్మములయందు గుప్తముగా నుండును. తనయందున్న ధర్మము ననుసరించి తనకు ప్రవృత్తి లేక ప్రవర్తన ఏర్పడును. ఇట్టి ప్రవర్తన సంస్కరింప బడినప్పుడు తన యందలి ధర్మమే తానుగా ప్రకాశించును. అప్పటి వరకు ఆ ప్రజ్ఞ లేక వెలుగు తనయందు మాటుపడి మనస్సుగా, ఇంద్రియ జ్ఞానముగా అర్థముచేసుకొనబడుచున్నది. ఇట్టి జీవప్రజ్ఞయందలి సాంసారిక ప్రవృత్తి పరమాత్మ యొక్క మాటువడిన స్థితి అనగా జీవధర్మముగా, ఇంద్రియముల ధర్మముగా, మనస్సు యొక్క ధర్మముగా నారాయణుడే గుప్తముగా నున్నాడు.

3. ఆయన ధర్మమును నిర్మించుటయే గాక దానికధిపతిగా కూడ నున్నాడు. ఆయన ధర్మమును తెలియవలెనన్నచో ఆయనయే అనుమతింపవలెను. తన ధర్మమును తాను భక్తితో ఆచరించుటవలన ధర్మలక్షణము తెలియుచున్నది. అనగా తనయందు ధర్మము పనిచేయువిధము, అది తనయందు పుట్టుచోటు, దాని వెనుక గల అంతర్యామి మొదలగు విషయములు తెలియును.

4,5. సత్ అనగా నారాయణుడు సృష్టియందు వ్యక్తమగుట. దీనినే సత్యమందురు. అనగా తానున్నానని తెలియుట. ఇట్టి తెలియుటకు సంబంధించిన మొట్టమొదటి స్థితినే సత్యలోకము అందురు. దీనికి బ్రహ్మ అధిపతి. సత్యలోకమువేరు, బ్రహ్మవేరు కాదు. బ్రహ్మయే సత్యలోకముగా నుండును. ఇది ''సత్'' యొక్క మొట్టమొదటి రూపము. అసత్ అనగా దానిపై స్థితి. ఇది పరమాత్మయొక్క అవ్యక్త స్థితిని తెలుపును. ఇదియే అసత్యము (లేకుండుట) యని అర్థము చేసుకొనబడుచున్నది. ఈ సృష్టి ఉండుట, లేకుండుట అను స్థితులు తాత్కాలికములే గాని సత్యములు గావు. ఒక వస్తువు లేదన్నచో, ఆ వస్తువునందలి అణువులు చోటునందున్నవి. వస్తువు రూపము తయారుచేయువాని మనస్సునందున్నది. వస్తువు భౌతికముగా వ్యక్తమగునపుడు తయారు చేయువాడు ప్రకృతియందలి పదార్థములనుపయోగించి

తన మనస్సునందలి రూపమునకు రూపకల్పనము చేయును. ఇది కుమ్మరివాడు కుండలుచేయుట వంటిది. కుండ తయారు కాకముందు మట్టిగా నున్నది. మరియు కుండ ఆకారము వాని మనస్సునందున్నది. ఈ రెండు సంఘటితమైనప్పుడు భౌతికముగా కుండ ఏర్పడుచున్నది. అప్పుడు సంఘటితము చేయువాడు పరమాత్మయే గనుక ఆయనయే ''సత్తు'', ''అసత్తు'' అను రెండు రూపములుగా నున్నాడు. పరమాత్మయను దండమునకు ఇవి రెండునూ రెండు చివరలు.

6,7. అట్లే నశించునవి, నశింపనివి అను రెండును భగవంతుని రూపములే. భౌతికముగా కనిపించు వస్తువులే గాక మనస్సు కూడా నశించును. మనస్సు భౌతిక వస్తువులను ఆశ్రయించుకొని పనిచేయును గనుక మనస్సు కూడ నశించు లక్షణము గలది. కాని ఇవియన్నియు నారాయణుని నుండి దిగివచ్చును గనుక అతడు నశింపనివాడు.

8. జ్ఞానము భగవంతుని గూర్చి తెలియచెప్పును గాని, అనుభవము లేనిచో, దర్శనము జ్ఞానము వలన సాధ్యముకాదు. పరమాత్మ యొక్క దర్శనము లేక సాన్నిధ్యము కలుగవలెనన్నచో భగవంతుని యందు భక్తి కలుగవలెనేగాని ఇంకొక విధముగా సాధ్యముకాదు. ఎన్ని విధముల ప్రయత్నించినను వానిని గూర్చి తెలుసుకొనుట సాధ్యముకాదు, ఎందుకనగా తేనె తియ్యగా నుండునని రుచి చూచి తెలుసుకొనుటవేరు, పుస్తకములలో చదివి తెలుసుకొనుట వేరు. ఇందు మొదటిది అనుభవము, రెండవది జ్ఞానము. అనుభవము చేత జ్ఞానము వచ్చును గాని జ్ఞానము చేత అనుభవమురాదు. కనుక భగవంతుని అంతర్యామిత్వము అనుభవముచేత తెలియదగినది, కాని జ్ఞానము చేత కాదు. అట్టి అనుభవము కలుగ వలెనన్నచో మరల ఆయన అనుగ్రహమే కావలెను. అట్టి అనుగ్రహము కావలెనన్నచో, భక్తి పుట్టవలెనన్నచో మరల జ్ఞానమే కావలెను. దీనిని బట్టి తెలియుచున్నదేమనగా జ్ఞానముతో కూడిన శరణాగతియే జీవులకు మోక్షము కలిగించును కాని, కేవలము జ్ఞానము కలిగించలేదు.

9. పురుష సూక్తమునందు ''సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షస్సహస్రపాత్'' అని పరమాత్మను గూర్చి గానము చేయబడినది.

పురుషుడు నేను అను ప్రజ్ఞగా జీవుల యందున్నాడు. ఆయన సృష్టికి పూర్వముకూడా నేనను ప్రజ్ఞగా నున్నాడు. ఆయన మొట్టమొదటి వాడు గనుక "1" (ఒకటి) అను సంఖ్యచే తెలియబడినాడు. అట్లే బ్రహ్మ హిరణ్యగర్భాండముగా పుట్టెను. అనగా బంగారపు రంగుతో నున్న గ్రుడ్డు ఆకారము. ఇది మొట్టమొదటి వెలుగు. ఈ వెలుగు భౌతిక రూపములకు సంబంధించినది కాదు. దీనికి సంకేతము పూర్ణము లేక సున్న కనుక ఈ రెండు కలిసి "10" (పది) అను సంఖ్యగా నేర్పడి సృష్టి యందు మొట్టమొదటి సంఖ్యా శాస్త్రము ఏర్పడినది, పంచభూతములు, మనస్సు, బుద్ధి, అహంకారము, మూలప్రకృతి లేక చైతన్యము, ఆత్మ అను 10గా నారాయణుడు సృష్టియందు వ్యక్తమగుచున్నాడు. ఈ పది (10) అను సంఖ్య మూడు లోకములలోను వర్తించును. అనగా ద్రవ్యమయము, ప్రజ్ఞామయము, శక్తిమయము అను మూడు లోకముల యందు ఈ ప్రజ్ఞ వ్యక్తమగుచున్నది. పురుష సూక్తము నందు "అత్యతిష్ఠద్ద శాంగుళమ్" అని వర్ణింపబడినది. మూడు లోకములయందును ఈ 10 (పది) అను సంఖ్య ప్రవర్తించును. కనుక అది భౌతిక లోకముల లోనికి 10X10X10 గా వృద్ధి చెంది 1000గా దిగి వచ్చెను. కనుక నారాయణుడు వేయి కిరణములు గలవాడు.

10. సృష్టియందలి సమస్త వస్తువులను, జీవులను, ప్రాణులను, వాని వాని ప్రయోజనమునుబట్టి కర్మలను బట్టి నియోగించును లేక పుట్టించును. జీవులకు ప్రాణులకు తాము పూర్వజన్మలలో సాధించిన దానినిబట్టి ఈ జన్మయందు పొందవలసిన శిక్షణ నిర్ణయింపబడును. ఇట్లు నిర్ణయింపబడుటనే కర్మయందురు. జీవులను వారి వారి కర్మలనుబట్టి పుట్టించువాడు గనుక పరమాత్మకు విధాత అను పేరు గలదు. బ్రహ్మద్వారా నారాయణుడే ఇట్లు నిర్వహించుచున్నాడు.

11. సిద్ధాంతములు, ప్రతిపాదనలు దేనినిగూర్చి చేసిననూ, ఇవి యన్నియు సృష్టిలోని భాగములే. ఈ సృష్టి పరమాత్మయొక్క రూపము కనుక నారాయణుడే సృష్టి లక్షణముయొక్క స్వరూపమై యున్నాడు. అయినను వీటి కతీతుడుగా కూడా నున్నాడు.

52. శ్లో॥ గభస్తినేమిస్సత్త్వస్థస్సింహో భూత మహేశ్వరః।
ఆదిదేవో మహాదేవో దేవేశో దేవ భృద్గురుః ॥

**ప్రతిపదార్ధము** :- 1. గభస్తి = వెలుగుయొక్క గోళము, 2. నేమిః = రథ చక్రమువలన నేర్పడిన మార్గము లేక గాడి, 3. సత్వస్థః = సత్యస్థితి యందు లేక సామ్యముగా నుండువాడు, 4. సింహః = సింహము, 5. భూతమహేశ్వరః = అన్ని జీవరాశులకు అధిపతిగా నున్నవాడు, 6. ఆదిదేవః = మొట్టమొదటి దేవుడు, 7. మహాదేవః = మహాదేవుడు, 8. దేవేశః = దేవతల కధిపతి, 9. దేవభృత్ = దేవతలను భరించువాడు లేక పోషించువాడు, 10. గురుః= ఉపదేశికుడు.

**తాత్పర్యము** :- నారాయణుని మార్గము సూర్యగోళము యొక్క వెలుగుచే నిర్ణయింపబడుచున్నది. ఆయన మనయందు, సామ్యముగను, సింహముగను, అన్ని భూతములయందలి ఈశ్వరునిగా, మొట్టమొదటి దేవునిగా, మహాదేవునిగా, దేవతల కధిపతిగా, మరియు దేవతలను సంరక్షించువానిగా, ఉపదేశకునిగా ధ్యానము చేయవలెను.

**వివరణ** :- 1.2. మన సౌరకుటుంబమునకు సూర్యుడు అధిపతి. ఆయన కంటికి చూపు ఇచ్చుటయేగాక సమస్తమును సమకూర్చుచున్నాడు. ఆయన కిరణములవలననే ఇతర గ్రహములన్నింటికి గమనము, స్థితి కలుగుచున్నవి. కనుక నారాయణుని వెలుగు సూర్యుని ద్వారా వ్యక్తమై జీవులకు, గ్రహములకు పరిధులు నిర్ణయించుచున్నది.

3. **సత్వము**, రజస్సు, తమస్సు అను మూడునూ త్రిగుణములు. ఇందు రజస్సు తమస్సులు రెండునూ సామ్యము (Equilibrium) నందుట వలన సత్వస్థితి కలుగుచున్నది. దీనినే మనము శాంతి, సుఖము అనుపేర అనుభవించుచున్నాము. అట్టి శాంతి చెందినట్టి మనస్సునకు మాత్రమే పరమాత్మ యొక్క సాన్నిధ్యము తెలియును. కనుకనే పరమాత్మ సత్త్వగుణ సంపన్నుడిగా కీర్తింపబడినాడు.

4. సింహరాశి రాశి చక్రమునందు నాయకత్వమును సూచించును. ఈ రాశియందు పుట్టినవారు మిగిలిన గ్రహములు అనుకూలించినచో

నాయకులగుదురు. వారియందు ఆత్మ వికాసమున్నచో తోటిమానవుల ఆత్మ వికాసమునకు దారిచూపగలరు. ''మాడమ్ బ్లావెట్స్కీ'', మాస్టర్ C.V.V.", ''కులపతి ఎక్కిరాల కృష్ణమాచార్య'' ఈ సింహరాశియందే పుట్టిరి. జీవుల హృదయ స్థానమునకు ''గుహ'' అని వేదపురాణములయందలి సంకేతము. అట్టి గుహనుండి వెలువడు ప్రజ్ఞయే (పురుషుడు) పురుష సింహమని వర్ణింపబడినది. ఈయనయే నరసింహుడని కూడా నందురు. ఈయన జీవుల హృదయమునుండి పుట్టి శత్రువులను నశింపచేయును. అనగా జీవులలో అంతర్యామి దర్శనము చేయించి మనస్సుననున్న శత్రుభావమును చీల్చి వేయును.

5. జీవులు మనస్సు, పంచేంద్రియములు, అహంకారము అనువాని రూపమున, పంచభూతములవలన ఏర్పడిన సృష్టియందు ప్రవర్తింతురు. కనుక ఇట్టి పంచేంద్రియంవులతో కూడిన ప్రవర్తనతో వర్తించు జీవులనం భూతములందురు. పంచభూతములతో కూడిన దేహమునకు ఇంద్రియములకు, మనస్సునకు, జీవుడధిపతి. ఇట్టి జీవులందరకూ పరమాత్మ అధిపతి గనుక ఆయన భూత మహేశ్వరుడని పిలువబడినాడు.

6,7,8. సూర్యుడు ప్రతి సౌరమండలమునందునూ మొట్టమొదటివాడు. అనగా ఆ సౌరమండలము అస్తిత్వమునకు ఆధారమైనవాడు. ఆయనయందు పరమాత్మయే యున్నాడు. అనగా సూర్యుని యందుగల నేనను ప్రజ్ఞ నారాయణుడే కనుక మొట్టమొదటగా వ్యక్తమైన దేవుడు పరమాత్మయే. అంతేకాక సృష్టియందలి ప్రతి కుటుంబము యందును ఒక అధిదేవత యున్నాడు. ఈ కుటుంబములయందలి అధిదేవతలందరూ నారాయణుని యొక్క రూపములే. కనుక నారాయణుడు దేవతలందరికన్నా మొట్టమొదటి ఒకే ఒక దేవత.

9. ప్రతి జీవియందునూ మానవుడు కాని, దేవుడు కానీ, ఎవ్వరైననూ వానియందు ప్రాణశక్తి పనిచేయును. ఆ ప్రాణశక్తి వలననే శరీరమునందు ఆహారము దహనమై శరీరము పనిచేయుటకు కావలసిన శక్తి లభించుచున్నది. ఈ ప్రాణశక్తియే వెన్నెముక యందలి శక్తి కేంద్రముల యందు కుండలిని అను శక్తిగా పనిచేయును. ఈ శక్తి నారాయణునినుండి పుట్టుచున్నది గనుక నారాయణుడు అన్ని భూతములనూ భరించువాడగుచున్నాడు.

10. గురువనగా తెలియని విషయములను ఉపదేశించువాడు. ఇట్లు గురువు ఉపదేశించవలెనన్నచో ఆయన కొక గురువు అంతకు ముందుండవలెను. ఇట్లు జీవులందరి యందునూ గురువుగా ప్రకాశించుచున్నవాడు పరమాత్మయే.

53. శ్లో|| ఉత్తరో గోపతిర్గోప్తా జ్ఞాన గమ్యః పురాతనః |
శరీర భూత భృత్ భోక్తా కపీంద్రో భూరిదక్షిణః ||

**ప్రతిపదార్థము :-** 1. ఉత్తరః = మిక్కిలి ఎత్తైనది, 2. గోపతిః = గొప్ప వృషభము, 3. గోప్తా = గుప్తముగా నుండి రక్షించువాడు, 4. జ్ఞానగమ్యః = జ్ఞానముచేత మాత్రమే పొందబడువాడు, 5. పురాతనః = అన్నిటికన్నా మొదటివాడు, 6. శరీరభూతభృత్ = శరీరమునందలి పంచభూతములను భరించి, పోషించువాడు, 7. భోక్తా = భుజించి సంతోషపడువాడు, 8. కపీంద్రః = కోతులకు అధిపతి, హనుమంతుడు, 9. భూరిదక్షిణః = యజ్ఞమునందు, సంపదలను విశేషముగా దానమిచ్చువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను రోజురోజుకూ ఉత్తముడైనవానిగా, ఉచ్చస్థితిలో నున్నవానిగా ధ్యానము చేయుము. ఆయన మహా వృషభము, మరియు గుప్తముగానుండి రక్షించువాడు. మిక్కిలి పురాతనమై జీవించి యున్నవాడు, జ్ఞానము ద్వారా మాత్రమే గ్రహింపదగినవాడు. శరీరము నందలి పంచభూతములను నిర్వహించుచు మరల శరీరమునందే యుండి భుజించి తృప్తి పడువాడు, హనుమంతునిగా అవతరించినవాడు, యజ్ఞమును నిర్వహించునప్పుడు విశేషముగా సంపదలను పంచిపెట్టువాడు.

**వివరణ :-** 1. ఉత్తరము అను పదమునకు గొప్పది, ఎత్తైనది అని అర్థము. పరమాత్మ సూక్ష్మ లోకములలో నున్నాడు. అవియే ఉత్తమ లోకములు అని కూడా పిలువబడుచున్నవి. మనయందలి భౌతిక అంశము లన్నింటికిని సూక్ష్మలోకములలో మూలములు కలవు. ధ్యానము చేసినచో భగవంతుడను పదము సూక్ష్మలోకములందలి ప్రజ్ఞలకు చెంది, చివరకు అన్ని లోకములయందలి, జీవులందరియందలి సమాహార ప్రజ్ఞగా భగవంతుడు తెలియబడుచున్నాడు. అన్ని పురాణములకునూ, వేదములకునూ ఇదియే పరమార్థము. దీనిని తెలియుటయే వేదమని చెప్పుదురు. మరియు ''ఉత్తర''

అను పదమునకు ఉత్తర దిశ అని కూడా అర్థమున్నది. మన శరీరమునందు శిరస్సుపై ప్రకాశించుచున్న ''సహస్రారము'' అను ప్రజ్ఞాకేంద్రము ఉత్తర ధృవమునకు సంకేతము. అట్లే వెన్నెముక చివరనున్న ప్రజ్ఞా కేంద్రము దక్షిణ ధృవమునకు సంకేతము. భూమియందలి ఉత్తర ధృవము భూమిని సామ్యములో నుంచ గలుగుచున్నది. గిరగిర తిరుగుచున్న బొంగరము, 'మొన' పై నుండి సామ్య స్థితిలో నుండును. అట్లే భూమి సామ్యములో నుండగలుగును. ఆ ఉత్తర ధృవమునకు ధృవ నక్షత్రమునుండి ఆకర్షణ శక్తి ఏర్పడి భూమిని ఉత్తర ధృవము ద్వారా సామ్యములో నుంచును. అట్లే ప్రతి వానికిని సూర్యునియందలి ప్రజ్ఞవతి శిరస్సునందలి సహస్రారమను కేంద్రము బుద్ధిని ప్రచోదనము చేయుచున్నది. కనుక పరమాత్మ శిరస్సు నందలి సహస్రారమును వెలుగుగా ధ్యానము చేసినచో నారాయణుని యందు మనస్సు నిలబడును.

2. మధ్యాహ్న సూర్యుడే మహావృషభము. భూమియే గోవు. ఈ సూర్యుడు పురుషశక్తిని భూమియందు తన కిరణముల ద్వారా గర్భస్థము చేయుచున్నాడు. వృషభరాశియందు ప్రయాణము చేయుచున్న సూర్యుడు కూడా వేదములయందు మహావృషభముగా కీర్తించబడినాడు, సూర్యుడు వృషభరాశియందు సుమారు ఏప్రిల్ 21 నుండి మే 21 వరకు నుండును. అప్పుడు సూర్యుడు తన కిరణములయందలి తీక్షణతచే భూమిని బీజవంత (Fertility) మొనరించి పంట పండుటకు సిద్ధము చేయుచున్నాడు. అట్లే మన శరీరమునందు కంఠము నందు గల విశుద్ధి చక్రము అను ప్రజ్ఞా కేంద్రము మనోమయ శరీరముద్వారా పని చేయుచున్నది. ఇది కూడా వృషభమునకు సంకేతము. వాక్కు ద్వారా శ్రోతయందు భావమయమగు ప్రజ్ఞను ఆధానము చేయును. అనగా వాక్కు ఉచ్చరించువానినుండి బయలుదేరి శ్రోతను చేరి వానియందు చెప్పబడిన విషయమునందుగల భావమును ఆధానము చేయును. తరువాత ఆ భావమే శ్రోతకు ద్విజత్వము కలుగుటకు కారణమగుచున్నది. ఇట్లు జరుగు ప్రక్రియనే ''ఉపదేశము'' అందురు. ఉపదేశమనగా గురువుచే చెప్పబడిన మాటలు, పదములు, అర్థము గాక ఆ భావమునందు ఇమిడియున్న నేనను ''ప్రజ్ఞ'. ఇదియే మంత్రోపదేశము జరిగినప్పుడు ఆ మంత్రమునందలి శబ్దము ద్వారా శిష్యుని బుద్ధిని ప్రచోదనము చేయుచున్నది. లేక మేలుకొలుపుచున్నది. ఈ

ప్రజ్ఞనే గాయత్రి అని కూడా నందురు.

3. పరమాత్మ గుప్తముగా నుండువాడు. అనగా ఆయన వున్నట్లు పరోక్షముగా మాత్రమే తెలియును. ప్రకృతి యందలి ధర్మములుగా, జీవధర్మములుగా, ఆయనయే వున్నాడు. ఇట్లు అనేక ధర్మములు ప్రకృతిలో నున్నను ఒకదానికొకటి, అవరోధములగుటలేదు. అనగా పడుగు పేకవలె కలిసి యున్నవి. పగలు, రాత్రి, మంచి, చెడు, తూర్పు, పడమర మున్నగునవన్నియూ ఒకదానికొకటి వ్యతిరేకములైనను అవరోధములుగాదు. ఇట్లు సామ్యము గమనించిన వానికి మాత్రమే తెలియును గనుక అది గుప్తము. ఇట్లు గుప్తముగానుండువాడు గనుక గోప్త అని పిలువబడినాడు.

4. నామము, రూపము, ప్రభావము అను ప్రకృతి యందలి ధర్మములు పరమాత్మయే. పరమాత్మ నామరూపములుగల జీవులుగా, వస్తువులుగా తెలియబడుచున్నాడు. కనుక పరమాత్మను గూర్చి తెలియవలెనన్నచో ఆలోచించుట వలన, తర్కించుట వలన తెలియబడదు. తనయందు గల నేనను ప్రజ్ఞ పరమాత్మ రూపముగా ధ్యానము చేసినచో అతడు మన యందుండును. కనుక నారాయణుడు జ్ఞానము చేత మాత్రమే తెలియబడువాడు.

5. పరమాత్మ సృష్టియందేగాక ప్రళయస్థితి యందు కూడా నిలిచి యున్నాడు. ఆయనయే మరల సృష్టిగా దిగివచ్చుచున్నాడు. కనుక అన్నిటికన్నా పురాతనుడు, మొట్టమొదటివాడు నారాయణుడే అగుచున్నాడు.

6. జీవుడు పూర్వజన్మ కర్మవలన గర్భస్థుడగుచున్నాడు. అట్లు గర్భస్థుడైన జీవిచుట్టు ప్రాణశక్తి ఏర్పడుచున్నది. ఆ ప్రాణశక్తి శరీరము నందలి ధాతువు లేర్పడుటకు కావలసిన పంచభూతములను తల్లి శరీరమునుండి గ్రహించును. పుట్టిన తరువాత సూటిగా ప్రకృతినుండి గ్రహించును. ఇవి ఆహారము, పానీయము, గాలి, కాంతి, ఆకాశము అను అయిదు విధములు. ఈ పంచ భూతములను శరీరమునందు గ్రహింపగల శక్తివలన శరీరము నిలబడియున్నది. ఆ శక్తినే ప్రాణశక్తి యందురు. ఈ ప్రాణశక్తి వలననే పంచేంద్రియ వ్యాపారము జరుగుచున్నది. ఈ ప్రాణశక్తి మన శరీరమునందు విద్యుచ్ఛక్తివలె పనిచేయును. ఈ ప్రాణశక్తి వలననే చోటులో గ్రహములు,

తారలు ఏర్పడి వాటి వాటి కక్ష్యలలో పరిభ్రమింపగలుగుచున్నవి. అట్టి ప్రాణశక్తి నారాయణుని నుండియే దిగివచ్చెను. గనుక నారాయణుడు జీవుల శరీరములను భరించి, పోషించుచున్నాడు.

7. అట్టి ప్రాణశక్తివలన జీవులకు ఆకలి దాహము మున్నగునవి పుట్టి జీవుడాహారము తీసుకొనగలుగుట జరుగుచున్నది. జీవులయందలి ఈ తినుట, త్రాగుట, అను ప్రవృత్తులు ప్రాణశక్తివలననే పుట్టుచున్నవి.

8. ఈ ప్రాణశక్తియే ఉచ్ఛ్వాస నిశ్వాసములను, లేక శ్వాసను, స్పందించుట అను ప్రజ్వలన నడుపుచున్నది. ఈ శ్వాసకు కావలసిన శక్తియే వాయుపుత్రుడగు హనుమంతుడు. హనువులనగా దవడలు. ఈ దవడల సహాయమున కంఠమునుండి పుట్టుశబ్దము అక్షరములుగా, పదములుగా వ్యక్తమగుచున్నది. అట్లు వ్యక్తమగుటకు కావలసిన ప్రాణశక్తియే హనుమంతుడు. కపియను పదమునకు నీటిని త్రాగువాడని అర్థము. సూర్యుడు వేసవికాలమునందు తన తీక్షణమైన కిరణములచే భూమి యందలి నీటిని ఆవిరిగా చేసి పైకి మేఘములుగా తీసుకొనుచున్నాడు. కనుక సూర్యుడు కూడా కపీంద్రుడే. అట్లే మన శరీరమునందలి ప్రాణశక్తి శరీరమునందలి నీటి సాంద్రతను నిలబెట్టి శరీరమును కాపాడుచుండును.

9. సంవత్సరాధిపతియైన సూర్యుడు నీటిని గ్రహించి మరల మేఘముల రూపమున తిరిగి భూమిపై నీటిని వర్షించుచున్నాడు. అట్లు సకాలమున వర్షములు కలుగుటవలన భూమిపై సంపద లేర్పడుచున్నవి. అంతేకాక సూర్యకిరణముల యందలి ఏడు వర్ణముల వలన భూమియందు ఏడు విధములైన ఖనిజములు, లోహములు పుట్టుచున్నవి. భూమి (మట్టి) యందలి అణువుల యందు సూర్యకిరణముల ద్వారా ప్రాణశక్తి ప్రవహించి రసాయనికచర్య, అణుచర్యలను కలిగించి, తత్ఫలితముగా ఇట్టి మార్పు కలిగించును. ఇట్లు సూర్యుడు జీవులకు సమస్త సంపదలను తన కిరణములద్వారా పంచిపెట్టుచున్నాడు. గనుక ఆయనభూరి దక్షిణుడు.

54. శ్లో॥ సోమపో ऽమృతపస్సోమః పురుజిత్ పురుసత్తమః
వినయో జయస్సత్యసంధో దాశార్హ స్సాత్త్వతాంపతిః

**ప్రతిపదార్థము** :- 1. సోమపః = సోమరసమును త్రాగువాడు, 2. అమృతపః = అమృతమును త్రాగువాడు, 3. సోమః = సోముడను గంధర్వుడు, 4. పురుజిత్ = మరల విజయమును సాధించువాడు, 5. పురుసత్తమః = సద్గుణవంతులలో మిక్కిలి ఉత్తముడు, 6. వినయః = వినయవంతుడు, 7. జయః = జయము, 8. సత్యసంధః = సత్యమున కంకితమైనవాడు, 9. దాశార్హః = దాశవంశమునకు చెందినవారు, 10. సాత్త్వతాం = సాత్వతులను కులమునకు చెందినవారు, 11. పతిః = రక్షించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను యజ్ఞము చేసి సోమరసమును, అమృతమును స్వీకరించువానిగా, తిరిగితిరిగి విజయములను సాధించువానిగా, మానవునియందలి ఉత్తమమోత్తమ మానవునిగా, వినయవంతునిగా, జయము కలిగించువానిగా, సత్యమున కంకితమయిన వానిగా, దాశ కులమునందు పుట్టినవానిగా, సాత్వతులవంశము వానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. యజ్ఞము చేయుటవలన సోమరసము పుట్టును. ఈ సోమరసము యజమానిచే త్రాగబడుట వలన అతడు సోమయాజి యగుచున్నాడు. యజ్ఞము చేయువాడు యజమాని, అనగా జీవుడు. శ్వాసయందలి ఉచ్ఛ్వాస నిశ్వాసములను ప్రక్రియలను ''సోహం'' అను మంత్రము ద్వారా ఉపాసన చేయవలెను. అనగా ఈ మంత్రము మనము చేయునదిగాక మనచేత చేయింపబడుచున్నది. సకార, హకారములతో కూడిన ''ఓం'' కారమును ధ్యానము చేయటయే ఈ యజ్ఞము. శ్వాసను లోపలికి తీసుకొనినపుడు ''సో'' అను శబ్దమును, బయటకు వదలినప్పుడు ''హం'' అనుశబ్దమును దీర్ఘముగా, ప్రశాంతముగా మనస్సుతో నుచ్చరింపవలెను. దీనివలన హృదయమునందు ప్రణవనాదము మేల్కొనుచున్నది. అనగా జీవుడు తాను శ్వాసించుటమాని ఓంకారమునందుండుటవలన తనయందు శ్వాస పుట్టుచు, లయమగుటను గమనించుచున్నాడు. ఇట్లు తన హృదయమునందు పుట్టిన ప్రణవనాదమును వినుటయే సోమరసపానము. ఇట్టి సోమరసపానము లేక ప్రణవమునుపాసన చేయువానికి చావు పుట్టుకలు లేవు. వానియందే శరీరములు పుట్టుచు నశించుచుండును గాని వానికి మాత్రము అవి వర్తింపవు. అతడు నిరంతరమును, లేక తన్మయత్వమును అనుభవించుచుండును. దీనిని గూర్చియే శ్రీ సూక్తము

ఫలశ్రుతి యందు ''సోమంపిబతు వృత్రహా'' అని చెప్పబడినది. శరీరమే నేను అను జీవగత ప్రజ్ఞయే, లేక అహంకారమే వృత్రాసురుడు. అట్టి వృత్రాసురుని సంహరించుటవలన జీవుడు సోమమును త్రాగుచున్నాడు. అనగా అహంకార నిర్మూలనమువలన జీవులకు ఇట్టి స్థితి సాధ్యమగుచున్నది.

2. దేవతలు అమృతమును త్రాగుచున్నారు. అనగా దేవతలు మృతి చెందుటలేదు. మృత్యువనునది శరీరమునకు మరియు మనస్సునకేగాని ''తాను'' అను ప్రజ్ఞకుకాదు. శరీరము పుట్టుచున్నది కనుక నశించును. అనగా మృత్యువు శరీరమునకు కలుగును. అంతేగాక శరీరముపై ఆధారపడి పనిచేయుచున్న మనస్సునకు కూడా మృత్యువు కలదు. కనుక శరీరము నశించిన తరువాత మనస్సు నశించునుకాని ''నేను'' అను ప్రజ్ఞకు మాత్రము మృత్యువు లేదు. అనగా దేవతలు ప్రజ్ఞామయ మూర్తులై శరీరమునందు శ్వాసను నడుపుట, జీర్ణ ప్రక్రియ, చూచుట, వినుట మున్నగు ధర్మములను నిర్వర్తించుచున్నారు. అనగా వీరు చోటులోనుండి శరీరమునందు వ్యక్తమగుచున్నారు. శరీరము నశించినను వీరు నశింపరు, సృష్టి సమస్తము నశించిన వెనుక కూడా వీరు నారాయణునియందు లీనమై నిద్రించుచుందురు. మరల సృష్టి ప్రారంభమగుటతోడనే వీరు చోటునందు మేల్కొని తమతమ కార్యక్రమములను ప్రారంభింతురు. కనుక వీరు అమృతమునందున్నవారుగా చెప్పబడుచున్నారు. ఈ అమృతమే ఆనందము లేక తన్మయత్వము. అనగా తాము వేరు, ఇతర జీవులు లోకములు వేరు, అను ప్రజ్ఞ నశించి ఆనందమను ఒకేస్థితి ఇన్నింటియందునూ మేల్కొని యుండుట. ఇది చక్కని గానము చేయుచు శ్రోతలను ముగ్ధులనుచేసి ఆనందపరచు వాడున్నటువంటి స్థితి. నిజమైన గాయకునిగా తానుచేయు గానమునందు తనకు తన్మయత్వము కలుగనిదే శ్రోతలకు కలిగింపలేడు. అట్టి ఆనందమయ స్థితియందు దేవతలందరుండి తమ ధర్మములను నిర్వర్తింతురు. అనగా వారు నిర్వర్తించుటగాక వారియందు నారాయణుడే నిర్వర్తించుచున్నాడు. దేవతలు ఇట్టిస్థితిలో నున్నారు గనుక వారు అమృతమును త్రాగినవారు అని చెప్పబడినది.

3. సోమలత అను పేరుగల మూలిక కలదు. ఈ మూలికయొక్క దుంపరసమును త్రాగుట సోమపానమనుపేర ఆయుర్వేద గ్రంథములలో

పేర్కొనబడినది. అట్టి సోమరసమును త్రాగుటవలన శరీరము, మనస్సు శుభ్రపడి వ్యాధుల బీజములు కూడా తొలగిపోయి, శరీరము పుష్టివంతమై ఆరోగ్యవంత మగును. దీనివలన యోగసాధన సుకరమగును. కాని వేదములయందు వర్ణింపబడిన సోమపాన మిదికాదు. శరీరము, మనస్సు, యింద్రియములు, బుద్ధి, అనునవి సామ్యస్థితిలో నిలబడినచో, వాటి అన్నిటి అస్తిత్వము నశించి తానను ప్రజ్ఞయే మేల్కొనియుండును. అనగా తన యందు ఇవియన్నియూ నిద్రించును. ఇట్టి సామ్యము సాధించుకొన్నవానియందు సామగానము లేక వేదము గానము చేయబడుచున్నది. ఈ సామవేదమునే సోమమని, సోమరసమని కూడా నందురు. సోముడను గంధర్వుడు విశ్వేదేవతలలో నొకడు. ఆయన తాళము, లయ (Rythm) అను ప్రజ్ఞలకధిపతి. లయాత్మకముగా నుచ్చరింపబడు వాక్కు, శ్వాస, అట్లే రాత్రింబగళ్ళు, సూర్యోదయ, సూర్యాస్తమయములు, సంవత్సర చక్రము మున్నగువాని కన్నిటికిని (Pulsation) ఈయనయే అధిపతి. అంతేకాక సంగీతము, స్వరము, తాళము, లయ మున్నగు వానికి కూడా సోముడే అధిపతి. సోముడు ఇంద్రుడను మరియొక ప్రజ్ఞతో కలసి సంగీతమును జీవులలో మేల్కొలుపుచున్నాడు. ఇంద్రియగతమయిన ప్రజ్ఞకు ఇంద్రుడధిపతి. శిరస్సులో పెద్దమెదడు క్రిందగల ఇంద్రగ్రంథి (Pineal Gland) ద్వారా ఈ ధర్మములు జీవులయందు మేల్కొలుప బడుచున్నవి. అట్లే గ్రహములయందు నెప్ట్యూన్ (Neptune) అను గ్రహము వీరిద్దరి కార్యక్రమములకు అధిపతిగా పురాణములయందును, జ్యోతిశ్శాస్త్రముల యందునూ వర్ణింపబడినది. ఈ నెప్ట్యూన్ గ్రహమునే ఇంద్రుడు అని పిలుతురు. యింకనూ సోముడు వేదములయందు రసజ్ఞత, సౌందర్యము, శృంగారము, అను ధర్మములకు అధిపతిగా వర్ణింపబడినాడు. ఆయన చంద్రునిద్వారా భూమిపైగల జీవులకు, ఈ లక్షణములను కలిగించును.

4,5. భగవద్గీతలో కృష్ణుడు జ్ఞానవంతులలో జ్ఞానము తానేయనియూ, సత్యవంతులలో సత్యము తానేయనియు చెప్పెను. ఇట్లు సద్గుణవంతులలో సద్గుణముగా తానే యుండుటవలన జీవులకు జయము కలుగుచున్నది. ఈ జయము భౌతికలోకములకు సంబంధించినది కాక అంతర్లోకములకు చెంది యున్నది. దుష్టుని, బలముతో జయించుట కన్నా, వానిని సద్గుణవంతునిగా

మార్చుట నిజమయిన విజయము. మరియూ ఈ విజయము శాశ్వతమైనది. అట్లు ఎదుటి వానిని సద్గుణవంతునిగా మార్చవలెనన్నచో, తాను మొదట సహనముతో ఇతరులకు మంచి పనులు, వారి యందు ప్రేమతో ఆచరించి చూపవలెను. ఇట్లు ప్రేమతో అచరించుట వలన వారియందు కూడా ఆ గుణము మేల్కొని పునీతులను చేయుచున్నది. భగవంతుడు అట్టి పుణ్యమూర్తుల ద్వారా మరల మరల జయించుచున్నాడు. అట్లు సద్గుణ సంపన్నులయినవారికి మార్గదర్శకములగువారు కొందరు కలరు. వారినే అవతారపురుషులని కీర్తింతురు. అట్టి అవతార మూర్తులు భూమికి దిగివచ్చి ఇతరుల యందలి సద్గుణములను ఆచరించుట యందు సామ్యతయందు జీవులను నిలుపుచున్నారు. ఇట్లాచరించుటలో కౌశలము కావలెను. అనగా అనేకులకు ఆచరింపవలెనను కోరిక, సామర్థ్యము కలిగిననూ, కౌశలము లేకపోవచ్చును. ఒక ఆగర్భ శ్రీమంతునికి దానధర్మములు చేయు మంచి గుణముండవచ్చును. ఆయన అడిగినవారికి లేదనడు. కాని దుష్టులైనవారు ఆయన మంచి తనమును తమ స్వార్థమునకుపయోగించుకొనవచ్చును. సంపదలను కాజేయుట, అబద్ధములు చెప్పి పెద్ద మొత్తములను దానములుగా పుచ్చుకొనుట, చేయుదురు. దీనివలన ఆ శ్రీమంతునికి చిక్కులు కలుగవచ్చును. మరియ ఇట్టి దాతృత్వమువలన వారి దుష్టతనము మరియూ హెచ్చునేగాని తగ్గదు. ఒక్కొక్కసారి అతడు పూర్తిగా ధనమును కోల్పోయి భార్యాబిడ్డలకు అన్యాయము చేయు పరిస్థితి సంక్రమింపవచ్చును. కనుక మంచి పనులు ఆచరించుటకు సద్గుణములు. సామర్థ్యము మాత్రమే కాక నేర్పరితనము కూడా కావలెను. యిట్టి నేర్పరితనము సజ్జనులకు కలిగించుటకే అవతార పురుషులు దిగివత్తురు.

6,7,8. వినయము కలిగినవానికి పనులప్రయత్నముగా సాధింపబడును. కానీ ఇట్టి వినయవంతుడు తప్పనిసరిగా సత్యవాక్కు కలిగియుండవలెను. లేనిచో వాని వినయము కపటమగును. సత్యవాక్కును సాధించువానికి వినయము తోడయినచో వానికపజయము లేదు. ఇట్టి సామర్థ్యము జీవులకు నారాయణుడే కలిగించుచున్నాడు.

9. దశార్హమనునది యాదవులకు చెందిన ఒక ప్రాంతము, ఆ ప్రాంతము వారిని దాశార్హులు అందురు. శ్రీకృష్ణుడు ఈ దశార్హకులమునకు చెందినవాడు.

10,11. శ్రీకృష్ణుని పూర్వీకులలో ఒకరు సాత్వతులు. ఆయన తరువాత పుట్టిన వారిని సాత్వతులు అందురు. సత్వమనగా త్రిగుణములలో నొకటి. ఈ పదమునకు సామ్యము లేక స్థిరత అని అర్థము. కృష్ణుడు జీవులకు సత్వస్థితిని కలిగించువాడు కనుక ఆయన సాత్వతులను రక్షించువాడుగా చెప్పబడెను.

55. శ్లో|| జీవో వినయితా సాక్షీ ముకుందో ఽమిత విక్రమః |
అంభోనిధి రనంతాత్మా మహోదధి శయో ఽంతకః ||

**ప్రతిపదార్థము :-** 1. జీవః = జీవము, 2. వినయితా = వినయముచే మార్గదర్శియైనవాడు, 3. సాక్షీ = చూచువాడు, 4. ముకుందః = అంతర్యామిగా నుండువాడు, 5. అమిత విక్రమః = సాటిలేని పరాక్రమము కలవాడు, 6. అంభోనిధిః = నీటికి నిలయము (సముద్రము), 7. అనంతాత్మా = అనంతమయిన ఆత్మ, 8. మహోదధిశయః = మహా సముద్రముపై శయనించి యుండువాడు, 9. అంతకః = అంతమును కలిగించువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను జీవునిగా, వినయముచే మనస్సును ముందుకు నడుపువానిగా, సాక్షిగా, అంతర్యామిగా, గొప్ప పరాక్రమవంతునిగా, జీవులను బిందువులతో కూడిన మహా సముద్రముగా, అట్టి మహా సముద్రమునందు అనంతముగా శయనించి యుండు వానిగా, మరల అట్టి సముద్రమే భౌతిక జీవులకు లయస్థానముగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. జీవులయందలి జీవశక్తి పరమాత్మ యొక్క అస్తిత్వమును తెలియచేయును. జీవులు నశించినను జీవము నశించదు కనుక భగవంతుడే జీవులయందలి జీవము.

2. జీవులయందు ఒక జన్మనుండి మరియొక జన్మకు కర్మ సంస్కారములు సంక్రమించుచుండును. వీటినే వాసనలు అని కూడా నందురు. ఇవి గుణములను పేర జీవులయందు దాగి యుండును. అట్లు ఒక జన్మము నుండి ఇంకొక జన్మకు ప్రయాణము చేయుచు కోరికలతో సంఘర్షణము చేయు జీవికి వీటి ఫలితముగా వినయము చిలుకబడిన వెన్నవలె జన్మల సారముగా లభించును. పనులకు తానే అధికారి యనియూ, తనవలననే పనులు జరుగుచున్నవనియూ,

అహంకరించు స్థితినుండి అన్ని లోకములను నడుపు వాడొకడున్నాడనియూ, అతని సంకల్పము వలననే పనులు జరుగు చున్నవనియూ గ్రహింప గలుగు విషయము వచ్చుసరికి అనేక జన్మలు పట్టవచ్చును. ఇట్టి విషయమును అనేక జన్మల వెంట జీవులకు సాధించియిచ్చువాడు భగవంతుడు.

3. పరమాత్మ జీవులలోనుండి మనస్సునకు శిక్షణ నిచ్చుచున్నాడు. అట్లు శిక్షణ యిచ్చుచున్ననూ ఆయనకు కర్మవాసనలు అంటవు. అనగా పనులయందు సంకల్పములుగాని, వికల్పములు గాని లేవు. కనుక అవి ఆయన నంటవు. అంతేగాక జరుగుచున్న పనులకతడు సాక్షిగా యున్నాడు. అనగా గుర్తించుచున్నాడు. పనులు గుర్తించి గమనించుట వలన నారాయణుడే అన్నిటికి సాక్షిగానున్నాడు.

4. జీవునియందు నారాయణుడు అంతర్యామియై యున్నాడు. ఈ జీవ ప్రజ్ఞ మొదట వస్తువులుగను, వ్యక్తులుగను, పరిసరములుగను భ్రాంతి చెందును. తరువాత క్రమేణా తన కిష్టమయిన వారి యందు, పరిస్థితులయందు, పరమాత్మ సాన్నిధ్యమును అనుభవింప నారంభించును. మరికొంత కాలమునకు అన్ని పరిస్థితులయందును, కాలములయందును, వ్యక్తులయందును ఆయన సాన్నిధ్యమును అనుభవించును. అట్లు నిరంతరము పరమాత్మ సాన్నిధ్యమునందుండు స్థితినే ముక్తి యందురు. ఇట్లు ముక్తిని యిచ్చువాడు గనుక భగవంతుడు ముకుందుడని పిలువబడినాడు.

5. భగవంతుడు మిక్కిలి పరాక్రమము కలవాడు. విక్రమము అనగా విశేషమయిన క్రమము కలవాడు. అమిత విక్రముడు అనగా కొలతల కందని విశేషమయిన క్రమము లేక సమీకరణము కలవాడు. అనగా ఆయన వ్యాప్తి మరియూ సమీకరణము లేక కూర్పు, ఊహలకు మనస్సునకు అందనిది. దేహము, మనస్సు, యింద్రియములు, బుద్ధి మున్నగునవన్నియు నేనను ప్రజ్ఞ యందు కూర్చబడి లేక సమీకరింపబడియున్నవి. ఇట్లే అన్ని లోకములునూ పరమాత్మయందు ఒకదానితో నొకటి సమీకరణము చెందియున్నవి. ఇట్లు తనయందున్న లోకములన్నిటియందు విక్రమము లేక సంక్రమముగల వాడుగా నారాయణుడే యున్నాడు. మరియూ శౌర్యవంతులైన వీరులలోగల విక్రమము తానేయైనవాడు.

6,7,8,9. జీవులను అనేక నీటి బిందువులతో కూడిన మహా సముద్రమే క్షీరసాగరము అనబడు వెలుగుల సముద్రము. అట్టి వెలుగులకు కారణములుగా నారాయణుడు శయనించి యుండును. ఆయన తన వెలుగుతో అనంతుడై అనగా అంతులేని వాడై యున్నాడు. ఆయన శయనించి యున్న ఈ మహా సముద్రమే సృష్టియను వెలుగు. ఇట్టి సృష్టి అంతమునకు కూడా ఆయన తానే కారణమై యున్నాడు.

56. శ్లో॥ అజో మహార్హ స్స్వాభావ్యో జితామిత్రః ప్రమోదనః ।
అనందో ऽనందనో నందస్సత్య ధర్మాత్రివిక్రమః ॥

**ప్రతిపదార్థము** :- 1. అజః = పుట్టుకలేనివాడు, 2. మహార్హః = అర్చింపదగిన గొప్పవాడు, 3. స్వాభావ్యః = తన స్వభావము ననుసరించి వర్తించువాడు, 4. జితామిత్రః = మిత్రులు కానివారిని జయించువాడు, 5. ప్రమోదనః = ఆత్మతృప్తికి కారణమైనవాడు, 6. ఆనందః = ఆనందము, 7. నందనః = సంతోషము కలిగించువాడు, 8. నందః = తనకు తానే సంతోషపడువాడు, 9. సత్యధర్మా = సత్యమే ధర్మముగా కలవాడు, 10. త్రివిక్రమః = మూడు అడుగులతో ఆక్రమించువాడు.

**తాత్పర్యము** :- నారాయణుని జన్మల కతీతునిగా, గొప్ప అర్హునిగా, స్వభావముగా, అమిత్రులను జయించువానిగా, తృప్తికి కారణమైనవానిగా, ఆనందముగా, తానే సంతోషము కలిగించువానిగా, తనంతటతానే సంతోషపడువానిగా, సత్యమే తనధర్మమైన వానిగా, మూడడుగులలో సమస్తమును ఆక్రమించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. పుట్టుక భౌతికస్థితికి సంబంధించినది. అణువులు ఒక వస్తువుగా లేక దేహముగా లేక గోళముగా సమీకరింపబడినప్పుడు అవి పుట్టినవని చెప్పబడుచున్నది. యిట్టి సమీకరణము చెందిన అణువులు మరల చోటులోనికి మార్పుచెందినప్పుడు ఆ గోళము లేక వస్తువులు నశించెనని చెప్పబడుచున్నది. జీవులయందు వస్తువులయందు రూపములు మారుచున్ననూ అణువులుగను, అందలి ప్రజ్ఞగను మార్పు చెందని వ్యక్తిగా నారాయణుడే యున్నాడు.

2. ఎవరిని ఏ పేరుతో పూజించిననూ పూజింపబడువాడు ఎప్పుడునూ ఒక్కడే. కనుక జీవుల పూజలు, అర్చనలు, అన్నియు ఒక్కనికే చెందుచున్నవి, "సర్వ దేవనమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి" అని పెద్దలు చెప్పిరి.

3. తననుండి పుట్టినది ప్రకృతి. ప్రకృతి పరమాత్మనుండి పుట్టుచు మరల ఆయనలోనికే లీనమగుచున్నది. ఇట్లు పుట్టిన ప్రకృతి కాలముగా వ్యక్తమగును. జీవులలోకూడా ఈ ప్రకృతియే వారివారి స్వభావములుగా పనిచేయుచున్నది. ఎవరి స్వభావము వారికుండగా ఇందరి స్వభావములు కలసి ఒకే స్వభావముగా ఏర్పడుచున్నది. దానినే ప్రకృతి యందురు. అట్టి ప్రకృతియే తన స్వభావముగాగల నారాయణుడు ప్రకృతియందు స్వభావమను పేర తెలియబడుచున్నాడు.

4. అమిత్రుడనగా స్నేహితుడు కానివాడు. జీవులయందు ఒకరియందు ఒకరికి మిత్రుడుగా నారాయణుడున్నాడు. అట్లు తోటివారియందు మిత్రత్వము నంగీకరింపనివానికి సర్వము యితరముగనే అనగా మిత్రత్వము లేకుండా కనిపించును. దీనివలన ఇట్టివారు ఒకరితో ఒకరు శతృత్వము వహించి యుద్ధము చేసుకొని బాధలుపడి చివరకు బలహీనులగుదురు. దిక్కుతోచని దీనస్థితిలో భగవంతుడే దిక్కుయని వారికి మొట్టమొదటగా తోచును. అప్పటినండి క్రమేణా వారు కూడా సజ్జనులగుదురు. ఇట్లు ఇతరులుగా చూచువారిని జయించి మిత్రులుగా చేయువాడు పరమాత్మయే.

5. సంతోషము, తృప్తి, అనునవి జీవుల సహజగుణములు, కాని జీవులు సంసారతాపత్రయము వలన వీనికి దూరమగుచున్నారు. ఆకలియైన వారికి అన్నము పెట్టినచో వానికి తృప్తి కలుగును. అట్లే నిద్ర వచ్చువానికి నిద్రించుటకు కొద్దిపాటి చోటుచాలును. దీనినిబట్టి తృప్తి అనునది మానవుని యందు సహజ గుణముగా నున్నదని తెలియుచున్నది. పరిసరములను, వ్యక్తులను చూచి మోజు పెంచుకొనువారికి ఇది లభింపక మాయమై అసంతృప్తి, నిరాశ, మున్నగునవి ఈ సత్యమును తెలిసిన వాడు పరిసరములను, వ్యక్తులను చూడక అంతర్యామియైన నారాయణుని చూచి తనలో తాను తృప్తి చెందుచున్నాడు.

6. ఆనందమనగా జీవునియందుగల కోశములన్నియూ ఒకదానితో నొకటి కూర్పు చెంది సమీకరణము చెందుట. ఒకదానికొకటి, ప్రతిబంధకము, అపసవ్యముగాక పరిపూరకమగుట. కడుపునొప్పితో బాధపడువానికి మిఠాయివస్తువులను చూచినచో నోరూరుట, తినవలెననిపించుట ఉండును. కాని వాని జీర్ణకోశము అందుకంగీకరించుట లేదు. యిచ్చట మనసు, నోరు, కడుపు అనునవి ఒకదానితో నొకటి సమీకరణము చెందుట లేదు. వేటికవిగా వర్తించుచున్నవి. కనుక సామ్యము లోపించినది. అందుచే వానికి మనస్సు వేగిరపడుట. చికాకుపడుట మున్నగునవి కలుగును. చక్కటి నేర్పరియైన వంటవాడు వంట చేయుచున్నపుడు ప్రక్కవానితో కబుర్లు చెప్పుచు, హాస్య సంభాషణము చేయుచు వంటచేయుచుండును. కాని తయారయిన వంట పదార్థములు, ఉప్పుకారములు ఎక్కువ తక్కువలు లేక మిక్కిలి రుచిగా నుండును. వంటచేయునప్పుడు వాని ధ్యాస ప్రత్యేకముగా వంటయందు లేకున్నను వాని అవయవములన్నియు ఒకదానితో నొకటి సమీకరణము చెంది సామ్యస్థితియందు నిలిచి యున్నవి, కనుక అతడు వంట చేయుచున్నను సరదాగా నుండుట, సంతోషముగా నుండుట జరుగుచున్నది. యిట్టి సామ్యస్థితిలో నుండుటనే ఆనందము అందురు.

7,8. ఇట్లు సామ్యత ఘటించిన పిదప వంటచేయువాడు, వంట చేయుట, వంట, అనుమూడు నశించి ఒక్కటియగును. ఇట్లే పాడువాడు, పాట, పాడుట అనుమూడును సామ్యము చెందును. ఇట్లు కర్త, కర్మ, క్రియ అను మూడును ఒకదానియందొకటి లయమగుట వలన నిజమయిన ఆనందము కలుగును. ఇట్లు ఆనందపడువాడు, ఆనందపడుట, ఆనందము అను మూడును సామ్యత చెందుచుండును.

9. పరమాత్మయందు సృష్టి మొట్టమొదట సత్యముగా వ్యక్తమయినది. ఈ సత్యమునందే ధర్మము పుట్టినది. ఈ ధర్మమే ప్రకృతికి స్వభావముగా నేర్పడి జీవులకు స్వభావములు, ధర్మములు ఏర్పడినవి. యిట్లు సృష్టియందలి ప్రతి అణువునకును ధర్మములు వేరువేరుగా నేర్పడినవి. ఇట్లు అన్ని ధర్మములయందును అంతర్లీనముగా ఒక ధర్మమున్నది. దానినే పరమధర్మము లేక సత్యము అందురు. అట్టి సత్యమే నారాయణుడు.

10. వామనావతారమున పరమాత్మ భూలోకము, భువర్లోకము, సువర్లోకము అను మూడడుగులచే నాక్రమించెను. ఇదియే వరుసగా ద్రవ్యమయము, శక్తిమయము, ప్రజ్ఞామయము అను మూడు లోకములు. శరీరగతమైన జీవప్రజ్ఞ శరీరమును, ఇంద్రియములను, వస్తువులను, సంపదలను, తనవిగా పొరపడును. అట్లు పొరపడిన వానికి విష్ణువు సాన్నిధ్యము కలుగుట వలన వానికి జీవప్రజ్ఞ యందలి అహంకారము నశించి, అందు పరమాత్మ నిలుచును. ఇదియే బలి చక్రవర్తిని పాతాళమునకు అణగద్రొక్కుటగా వర్ణింపబడినది. జీవునికి యెంతటి అస్తిక్యత, భక్తి, ఉన్ననూ భగవంతుని తననుండి వేరుగా చూచుచున్నంత కాలము వారిలో బలి చక్రవర్తి వామనావతారముల కథ జరుగక తప్పదు. పరమాత్మ యొక్క మూడు పాదములే పైన చెప్పబడిన మూడు లోకములు.

57. శ్లో॥ మహర్షిః కపిలాచార్యః కృతజ్ఞోమేదినీ పతిః ।
త్రిపద స్త్రి దశాధ్యక్షో మహాశృంగః కృతాంతకృత్ ॥

**ప్రతిపదార్థము :-** 1. మహర్షిః =గొప్ప ఋషి, 2. కపిలాచార్యః = కపిల మహర్షి, 3. కృతజ్ఞః = కృతజ్ఞుడు, చేసినమేలు మరువనివాడు, 4. మేదినీపతిః = పృధివికి అధిపతియైనవాడు, 5. త్రిపదః = మూడడుగులతో కొలుచువాడు, 6. త్రిదశా అధ్యక్షః = దేవతలకు అధ్యక్షుడైన వాడు, 7. మహాశృంగః = గొప్ప శిఖరము, 8. కృతాంతకృత్ = చేయబడిన కర్మను అంతము చేయువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను గొప్ప ఋషిగా, కపిలుడను గురువుగా ధ్యానము చేయుము, చేసినమేలు మరువని వానిగా, భూమి కధిపతిగా, సృష్టిని మూడు అడుగులతో కొలుచువానిగా, దేవతలకధిపతిగా, గొప్ప శిఖరముగా, జీవులు చేసిన కర్మను తనయందు లయము చేయువానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. ఋషియనగా ద్రష్ట లేక చూచువాడు. సృష్టిని కేవలము సాక్షిగా చూచువానికి సృష్టి రహస్యములు తెలియును. అట్టివారికి నేను, నాది అను బుద్ధి పని చేయదు. కనుక అట్టివారి ద్వారా భగవంతుని సంకల్పము తెలియును. అట్టివారే మహర్షులు.

2. కపిలుడు సాంఖ్య యోగమును ప్రతిపాదన చేసినవాడు. ఆయన ఒక వ్యక్తిగాక సిద్ధుడైయున్నాడు. ఆయన ద్రవ్యము వేరు వేరు స్థితులుగా వర్గీకరణమగుటకు అధిపతియై యున్నడు. గర్భస్థమగు పిండమునందు సంఖ్య అను ప్రజ్ఞ కధిపతియై యున్నాడు. ఆయన తన తల్లి దేవహూతికి సాంఖ్యయోగమును బోధించెనని పురాణములు చెప్పుచున్నవి. భౌతిక ద్రవ్యము వివిధ స్థితులలోనికి వర్గీకరణము చెందుట, పిండమునందు అవయవములేర్పడుట, అవి నియమిత సంఖ్యచే పరిపాలింపబడుట మున్నగునవి తాను గర్భస్థుడై యుండగా చెప్పెను. దీని కర్థమేమనగా తల్లి గర్భమునందు జీవునికి పిండమేర్పడినప్పుడు కపిల మహర్షి అధ్యక్షుడై శరీర భాగ నిర్మాణమును, వాని సంఖ్యను నియమించును. ఆయన పుట్టిన తరువాత జీవులకు సాంఖ్యమునకు, యోగమునకు గురువై శిష్యులుగా తీర్చిదిద్దును.

3. జీవులు ఒకరికొకరు కృతజ్ఞులై యున్నారనగా తోటివారివలన పొందిన ఫలితములు, మేలును విస్మరింపలేదని అర్థము. ఇది కూడా నారాయణుని ఒక రూపము.

4. సూర్యుడు భూగోళమునకు అధిపతియైయున్నాడు. భూమి తన చుట్టు తాను తిరుగుటకు, సూర్యుని చుట్టు తిరుగుటకు, సూర్యుడే ఆధారము. అంతేకాక భూమిపై గల సమస్త సంపదలను సూర్యుడే కలిగించుచున్నాడు.

5. విష్ణువు వామనావతారమున మూడు పాదములతో సృష్టిని మొత్తము ఆక్రమించెను.

6. దేవతలు, నారాయణుని సంకల్పము ననుసరించి పుట్టుటయేగాక వేరువేరు గణములుగా వర్గీకరణము చెందుచున్నారు. కనుక ఈ దేవతలందరకు నారాయణుడే అధిపతి.

7. సృష్టియందు మనస్సుతో నిర్మాణమయిన ఒక మూర్తి సౌరకుటుంబమునకు ప్రతీకగానేర్పడును. ఈ మూర్తి ననుసరించియే తరువాత సౌరమండలమేర్పడుచున్నది. కనుక ఇది సౌరమండలమునకు శిఖరము లేక శృంగముగా చెప్పబడినది.

8. ప్రతి జీవియూ పరిస్థితుల యందు మంచి చెడు అనువానిని పుట్టించుచుండును. ఇట్లు తనంతట తాను సృష్టించుకున్న పరిస్థితులచే చుట్టు ముట్టబడును. జీవి నిస్సహాయుడగును. అట్టి నిస్సహాయ స్థితిలో సర్వము నశించుట లేక లయమగుట జరుగును. ఇట్లు పరిస్థితుల యందలి చిట్టచివరి దశయగు లయము అను స్థితిని నారాయణుడే కలిగించుచున్నాడు.

58. శ్లో॥ మహా వరాహో గోవిన్దస్సుషేణః కనకాంగదీ ।
గుహ్యో గభీరో గహనో గుప్తశ్చక్రగదాధరః ॥

**ప్రతిపదార్థము** :- 1. మహావరాహః = గొప్ప వరాహము, 2. గోవిందః = ఇంద్రియముల యందలి ప్రజ్ఞగా వెలుగుచున్నవాడు, 3. సుషేణః = గొప్ప సేనలు కలవాడు, 4. కనకాంగదీ = బంగారు అభరణములు కలవాడు, 5. గుహ్యః = రహస్యముగా నుండువాడు లేక గుహయందుండువాడు, 6. గభీరః = మిక్కిలి లోతయినవాడు, 7. గహనః = గ్రహించుటకు దుష్కరమైనవాడు, 8. గుప్తః = గుప్తముగా నుండు వాడు, 9. చక్రగదాధరః = చక్రమును, గదను ధరించినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను చక్రము, గద హస్తములలో ధరించిన వరాహముగా, గొప్ప సేనను వెంబడించుచున్నవానిగా, బంగారు ఆభరణములు ధరించి, గంభీరమై, గుప్తమై గ్రహించుటకు సాధ్యముకాని వానిగా, ఇంద్రియములందలి ప్రజ్ఞగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. విష్ణువు వరాహావతార మెత్తి భూమిని పైకెత్తి రక్షించెను. ఆయన తన కోరలపై భూగోళము నెత్తెను. సూర్యుడు, చంద్రుడు, అను రెండు కిరణములే ఆయన రెండు కోరలు. రసాతలమని చెప్పబడిన అంతర్లోకములనుండి భౌతికగోళ సృష్టిని తారలుగా, గ్రహములుగా వ్యక్తమగునట్లు చేసెను. సమస్త విశ్వమను మహాచైతన్యమును సముద్రమునుండి భౌతికగోళ సృష్టిగా వ్యక్తము చేసినవెనుక ఈయన వరాహావతారముగా కీర్తింపబడినాడు. మొత్తము సృష్టిని తన కోరలతో పైకెత్తెననగా ఈయున పరిమాణము ఊహకందునదికాదు. ఇచ్చట సూర్యచంద్రులు అనగా భౌతిక గోళములు కాదు. చోటునందు వెలుగు బిందువుగా వ్యక్తమగుట, అట్టి వెలుగును స్వీకరించి

పరిసరములకు పంచుట అను రెండు ప్రజ్ఞలే సూర్యచంద్రులు.

2. గోవులనగా ఇంద్రియములు. గోవిందుడనగా ఇంద్రియములందలి వెలుగుగా అర్చింపబడువాడు. భౌతిక ప్రపంచమును చూచినప్పుడు ఇంద్రియములు తమ అస్తిత్వమును కోల్పోవును. కాని భౌతిక ప్రపంచమున అంతర్యామి యొక్క రూపమును ధ్యానము చేయువానికి ఇంద్రియములు అంతర్ముఖమై పరమాత్మకు వెలుగు దారులగును. కనుక అట్టివారికి ఇంద్రియములందు కూడా పరమాత్మ వెలుగు ప్రకాశించుచుండును. ఇట్లు ఇంద్రియములుగా నారాయణుడు వ్యక్తమగుటయే గోవిందుడని వర్ణింపబడుచున్నది.

3. గొప్ప సంఖ్యగల దేవతలనగా సంఖ్యాదేవతలని అర్థము. వీరే సృష్టికి మొదటి సంఖ్యలుగా దిగివచ్చిరి. మరియూ మంచి సేనయనగా యుద్ధము చేయువారు గాక సృష్టి నిర్వహణకు సహకరించు దేవతా సమూహము అని అర్థము.

4. కనకమనగా బంగారము. పరమాత్మ బంగారపు వర్ణముతో ప్రకాశించును. శుద్ధమైన ఆవునెయ్యితో దీపము వెలిగించినచో అది స్వచ్ఛమయిన బంగారపు వర్ణముతో వెలుగును. ఇట్లు సృష్టియందలి మొట్టమొదటి వెలుగు పరమాత్మయొక్క వర్ణము లేక వెలుగు. అగ్ని సూక్తములందు పరమాత్మ భౌతిక రూపముగా ఈ వర్ణముతో కూడిన వెలుగుగా చెప్పబడినది. ఇదియే హిరణ్మయమైన భగవంతుని వర్ణము. అనగా ''హ'' కార ''ర'' కారములతో కూడిన శ్వాస. శ్వాస కంఠమునందలి స్వరపేటిక నుండి బయటకు వచ్చునపుడు అచ్చట చేటులోనుండి పుట్టు మొదటి ఘర్షణమే రేఫము. శ్వాస వదలునప్పుడు ''హం'' అను శబ్దముతో బయటకు వచ్చును. అది కంఠమునందలి స్వర్ణపేటికయందు ఘర్షణ చెంది రేఫముతో కూడి భౌతికశబ్దముగా వ్యక్తమగును. ''హ'' కార ''ర'' కారములతో కూడిన ఈ శబ్దమే ''హ్రీం'' అను మంత్రముగా ధ్యానము చేయబడినది. ఇదియే శ్రీసూక్తము నందలి మూలబీజము. కనుకనే శ్రీసూక్తము ''హిరణ్యవర్ణాం'' అని ప్రారంభమగును. ఇట్టి హిరణ్మయమైన వెలుగుతో కూడిన సృష్టి తన శరీర భాగములుగా గలవాడు భగవంతుడు.

5. గుహ్యః అనగా గుహయందుండువాడు. లేక దాగియుండువాడు అని అర్థము. మనము భౌతిక విషయములందు ప్రవర్తించునపుడెల్ల పరమాత్మ మరపుకు వచ్చును. ఆయన భౌతికములగు విషయములందు గుప్తమై తాను ఆయా విషయములుగా దాగియుండును. కనుక భగవంతుడు రూపము, గుణము, పేరు మున్నగు వాని రూపమున దాగియుండును. కనుక గుహ్యుడు అని పిలువబడును.

6. పరమాత్మయొక్క సాన్నిధ్యము భౌతిక విషయములకన్నా లోతుగా యుండును. కనుక ఆయన సాన్నిధ్యము లోతుగా మనస్సు తరచిన వానికి గాని లభించదు.

7. ఇట్లు లోతుగా తరచుట వలననే నారాయణుడు దొరుకును గనుక ఆయన గ్రహించుటకు కష్టమయినవాడు.

8. ఇట్లు లోతుగా తరచుట చేతగాని, నారాయణుని సాన్నిధ్యము లభింపదు. అట్లు లభించు సాన్నిధ్యము జీవునియందే తానను ప్రజ్ఞగా మరుగుపడి యుండును. తననుండి వేరుగా నారాయణుని వెదకువానికి ఎంతకాలము ఎన్ని జన్మలు వెదకిననూ దొరకడు. అనగా తాను వేరు, దైవము వేరు అని భావించువానికి, దైవమనగా కొన్ని ఉత్తమ గుణములు గలిగిన ఒక ప్రత్యేక రూపమేగాని అంతర్యామికాదు; ఆ రూపము దర్శించువాని మనస్సునందే పుట్టును. తన మనస్సునందలి రూపమునే తాను దర్శించిదానినే, దేవుని ప్రత్యక్షముగా భ్రమపడుదురు. నిజమునకు చూచువాని యందుగల పరమాత్మయే చూచువాని మనోరూపమయిన అంశగా దిగివచ్చును. ఇట్లు అతడూహించుకొనునది అంతర్యామిలోని ఒక భాగమే కాని అంతర్యామి కాదు. అందుకనే పురాణములలో దైవ సాక్షాత్కారమైన వెనుక కూడ జీవులు మాయలకు భ్రమలకు లోనైనట్లుగా వర్ణింపబడినది. దీనినిబట్టి భక్తిలక్ష్యముగా దేవుడు ప్రత్యక్షమగుట మాత్రమే కాదు. అన్ని వస్తువుల యందును, వ్యక్తులయందును, పరిస్థితులయందును, నారాయణుడే యుండుట; ఇట్లు అన్నిటియందు గల నారాయణుడు తనయందు కూడా తానను ప్రజ్ఞగా నున్నాడని తెలియుట జీవునికి పరిపూర్ణత్వము కలిగించును. ఇన్ని రూపములుగా, వ్యక్తులుగా తనని

తానే చూచుకొనుచున్నాననియు, ఇందరి యందును తానొక్కడే యున్నాననియు, తెలియుట నిజమైన సత్యము. ఇట్టి తనకు తాను తెలియుట అనగా జీవునకు నేను, ఇతరులు, అను రెండు ప్రజ్ఞలు నశించి నిరంతరము, అకారణమగు సంతోషముగా పరిపూర్ణత్వము సిద్ధించును. పైన చెప్పబడిన రెండు ప్రజ్ఞలే విష్ణుద్వార పాలకులు, అట్టి ద్వారము దాటిన తర్వాత కలుగు నిరంతర ఆనందానుభూతియే నారాయణుడు. ఎంతటి సద్గుణ సంపన్నుడైనను తాను, యితరులు అను భేదము నశింపనిచో, నారాయణుని దర్శనమునకు అనుమతింపబడడు. ఇదియే భాగవతము తృతీయ స్కంధమునందు చెప్పబడినది. సనక సనందనాదులను మహర్షులు వైకుంఠమునకేగి నారాయణుని దర్శనమునకై లోనికి పోవుచుండగా యిద్దరు ద్వారపాలకులు అడ్డగించిరి. వారిని మహర్షులు శపింపగా నారాయణుడు కనిపించెను. సనక సనందనులు తమ తప్పిదము తెలుసుకొని నారాయణుని శరణుపొందిరి. ఈ ద్వారపాలకులే నేను, యితరము అను రెండు ప్రజ్ఞలు, సనక సనందాదులే జీవులయందలి సద్గుణములు. ఎన్ని సద్గుణములున్నను నారాయణుని అనుగ్రహము లేనిచో వానిని దర్శించుట సాధ్యముకాదు. అనగా ఆత్మ సంతృప్తి, అకారణ సంతోషము నిరంతర ఆనందస్థితి, ఇవి తనకి తాను కలిగియుండుటయే గాక యితరులకు కూడా కలిగించుటవలన తాను, యితరులు అనుభేదము నశించి, అందరి యందలి నేనను సమాహార ప్రజ్ఞ ఆనందమను పరిపూర్ణ స్థితిగా నిలుచును. ఇదియు వైకుంఠమనియు, నారాయణుని సాన్నిధ్యమనియు పురాణములయందు వర్ణింపబడినది. ఇట్టి స్థితి జీవునియందే నేనను ప్రజ్ఞగా, గుప్తముగా, భద్రపరుపబడి యున్నది.

9. ఇట్లు సాధన చేయుచున్న భక్తులను నారాయణుడు ఎల్లపుడు రక్షించుచుండును. భూమి, ఆకాశము కలసినట్లు కనిపించు దిక్చక్రమే నారాయణుని చక్రాయుధము. యిదియే సుదర్శనమని చెప్పబడినది అనగా పైన చెప్పబడిన పరిపూర్ణస్థితిని దర్శించి జీవించువానిని నారాయణుడు చక్రాయుధుడై రక్షించును. అనగా సూర్యుడు ఆకాశము, భూమి మున్నగు వానియందుగల విష్ణు ప్రజ్ఞయే తనని రక్షించునని భావము.

59. శ్లో॥ వేధాస్స్వాంగో ఽజితః కృష్ణో ధృఢస్సఙ్కర్షణో ఽచ్యుతః ।
వరుణో వారుణో వృక్షః పుష్కరాక్షోమహామనాః ॥

**ప్రతిపదార్థము** :- 1. వేధాః = సృష్టికర్త, మరియు తండ్రి, 2. స్వాంగః = తానే తన శరీరముగా కలవాడు, 3. అజితః = జయింప శక్యము కానివాడు, 4. కృష్ణః = నల్లనివాడు, 5. ధృఢః = అన్నిటియందును నిలిచి యుండుటయేగాక అన్ని మార్పులకు తట్టుకొనువాడు, 6. సంకర్షణః = జీవుల వాహికలను లేక శరీరములను నశింపచేసి తనలోనికి స్వీకరించువాడు, 7. అచ్యుతః = జారుట లేక పొరపడుట అనునది లేనివాడు, 8. వరుణః = నీటికి అధిపతియైనవాడు, ఈయన పశ్చిమదిక్కున అధిపతి, 9. వారుణః = వరుణుని కుమారుడు లేక భృగువు, 10. వృక్షః = ప్రకృతి పుట్టుటకు కారణమైన వృక్షరూపము తానేయైనవాడు, 11. పుష్కరాక్షః = పద్మమువంటి కన్నులు గలవాడు, 12. మహామనాః = గొప్ప మనసు గలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను సృష్టికర్తగా మరియూ శరీరములు, రూపములు, తనలోని భాగములుగా, వ్యక్తమైనట్టి తండ్రిగా ధ్యానము చేయుము. మనసుకు, ఇంద్రియములకు అందని గొప్ప చిత్రమయిన చీకటి యను అంతర్యామిగా, తనయందు జీవించుచు మరల తనలోనికి స్వీకరింపబడు దేహములుగా, జారిపడు వానిగా, నీటి కధిపతియైన వరుణునిగా, మరియూ ఆయన కుమారుడైన భృగువుగా, విశ్వవృక్షమును పుట్టించుటకు కారణమైన వానిగా, పద్మమునందలి దళములుగా, అందరి యందలి ఒక్కటిగా నున్న మనస్సుగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. తండ్రియే కుమారుడుగా, పుట్టుచున్నాడని వేదము స్థాపించుచున్నది. కనుక తండ్రి, పుత్రులను బంధము భౌతిక దేహమునకు సంబంధించినది కాదు. అంతర్యామి యైన నారాయణుడు మొట్టమొదట తన అంశగా బ్రహ్మను పుట్టించెను. మరల బ్రహ్మకు కుమార సర్గము, మనువులు, ప్రజాపతులు పుట్టిరి. మనువులు, ప్రజాపతులనుండి సకల జీవులు పుట్టిరి. అనగా నారాయణుడే బ్రహ్మగను, వాని ద్వారా ప్రజాపతులు మున్నగు వారిగను దిగివచ్చి, తుట్టతుదకు సకల జీవుల రూపములుగా తానే నిలిచియున్నాడు.

ఆయన బ్రహ్మకు కూడా తండ్రి యగుట వలన అందరకు ఆయనయే తండ్రి యగుచున్నాడు. అందరియందు తండ్రి యను ప్రజ్ఞగా దిగివచ్చుచున్నది నారాయణుని ప్రజ్ఞయే. ఇది ప్రతి తండ్రినుండి కుమారునికి ప్రసరించుచున్నది. తండ్రిగా చనిపోయి కుమారుడుగా పుట్టుచున్నాడని వేదములు ప్రతిపాదన చేసినది ఇదియే.

2. శరీరము, మనస్సు, ఇంద్రియములు, మున్నగునవి జీవులకు అంగములుగా నేర్పడి పని చేయుచున్నవి. ఈ అంశములన్నియు నేనను ప్రజ్ఞనుండి ఏర్పడినవే. గనుక ఆయన స్వాంగః అని వర్ణింపబడినాడు.

3. పరమాత్మ సమస్తమునను తానే అయియుండుటచే ఆయన జయింపబడుట సాధ్యముకాదు. కనుక నారాయణుడు అజితుడు.

4. మహా విష్ణువు నీల వర్ణము గలవాడుగా వర్ణింపబడినాడు. కనుక ఆయన కృష్ణుడని పిలువబడినాడు. నలుపనగా కంటికి కనిపించని వెలుగు అని అర్థము. ఆకాశము పగలు నీలముగనూ, రాత్రి నల్లగానూ వుండును. ఈ రంగులు కంటికి కనిపించు రంగులు మాత్రమే. ఆకాశము యొక్క అసలు రహస్యము ఎవరికి అందనిది. అంతు చిక్కనిది. వస్తువులుగా, వ్యక్తులుగా, గోళములుగా, వ్యక్తమగుచున్న భౌతిక ప్రపంచమంతయు అనేక చిత్ర విచిత్రమయిన వర్ణములతో, వైఖరులతో ఈ ఆకాశము నుండియే పుట్టి వ్యక్తమగుచున్నది. మరల సమస్తము ఈ ఆకాశములోనికి. లయమగుచున్నది. మానవునికి గల జ్ఞానమంతయూ ఇంతవరకే పరిమితమగుచున్నది. తనకందని యిట్టి విషయములే మానవుడు చీకటి యని పిలిచినాడు. కంటికి అందని ఈ వెలుగునే వేదములయందు మహర్షులు చీకటి వెనుకనున్న అసలైన వెలుగని కీర్తించినారు. ఈ నిజమయిన వెలుగునుండియే మనకు తెలిసిన భౌతికములైన వెలుగులు పుట్టుచున్నవి. సూర్యుడు, తారలు ఇట్లు పుట్టి వెలుగుచున్నవారే. అవ్యక్తమయిన ఆ మహా తేజస్సునుండి వెలుగును సూర్యుడు, తారలు స్వీకరించి భౌతికమగు వెలుగు పంచి పెట్టుచున్నారు. భగవద్గీతలో శ్రీకృష్ణుడు ''తేజస్ తేజస్వినామహం'' అని చెప్పెను. ఇట్టి కంటికి అందని ఆ మహా తేజస్సునే చీకటి అని పిలిచెదము. వెలుగులకు కారణమైన మహా తేజస్సునుండియే సూర్యుని యందలి ప్రజ్ఞ పుట్టుచున్నది. మనస్సు, ఇంద్రియములు, దేహము

మున్నగువాని యందు ఆయా భాగములుగా కట్టుకొని యున్న ఈ మహా వెలుగును మనము గమనింపలేము. వస్త్రమునందు పత్తిని మనము జ్ఞాపకముంచుకొనలేము. అట్లే యిన్నిటి యందు గల నేనను ప్రజ్ఞ ఆయా వస్తువుల, జీవుల అంతర్వర్తియైన తాత్కాలిక ప్రజ్ఞగా మరుగుపడి యున్నది. వస్తువులు, చెట్లు, జీవులు మున్నగు వానియందు వాటి వాటి ప్రవర్తనల మూలమున గుణముల మూలమున వ్యక్తమగు ఈ మహా తేజస్సును ఆయా వస్తువులుగనూ, వ్యక్తులుగనూ మాత్రమే గుర్తించుచున్నాముగాని, అన్నిటి యందుగల అఖండ తేజస్సును గుర్తింప లేక చీకటిగా భ్రమపడుచున్నాము. ఒక నూలు వస్త్రముతో చొక్కాలు, ధోవతులు, గౌన్లు, చీరెలు మున్నగునవి తయారు చేసినచో అవి వేరు వేరు వస్తువులుగనే గమనింపబడుచున్నవి గాని వాటియందు గల (ఒకే) ప్రత్తి స్ఫురణకురాదు. అట్లే ఈ పరిపూర్ణమయిన మహా తేజస్సును గుర్తింపలేక పోవుటచే చీకటిగా అర్థము చేసుకొనుచున్నాము. ఈ చీకటినే కృష్ణుడని పిలిచెదరు. కనుక అన్ని వస్తువులయందు, జీవులయందు, లోకములయందు, కాలములయందు ఆయా వస్తువులుగా, జీవులుగా, కాలములుగా, దాగి యుండు ఒకే ఒక వెలుగు కృష్ణుడు.

5. ప్రకృతి యందు అంతర్లీనమై శ్రీకృష్ణుడుండుట వలన ఆ ప్రకృతి అన్ని కాలముల యందును, పరిస్థితుల యందును నిలిచియుండగలుగుచున్నది. అంతేగాక ప్రకృతిలోని వైపరీత్యములకు లోపల అంతర్లీనమై యున్న ఈ మహాశక్తియే చెక్కు చెదరక నిలిచియున్నది. గనుక పరమాత్మ ధృఢమైనవాడుగా చెప్పబడినాడు.

6. జీవుల శరీరములు సృష్టి సంకల్పము ననుసరించి ఏర్పడుచున్నవి. అవి ఎంతకాలముండవలెనో, ఏమి నిర్వహింపవలెనో అన్నది పరమాత్మ సంకల్పము ననుసరించి ఏర్పడుచున్నది. అట్టి సృష్టి సంకల్పము పూర్తియైన వెంటనే వారి శరీరములు మృత్యువునకు లోనగుచున్నవి. అట్టి మృతి చెందిన వారి భౌతిక శరీరములు రసాయనిక మార్పులకులోనై పంచభూతములుగా విడిపోవుచున్నవి. నారాయణుడే పంచభూతములుగా వచ్చెను గనుక అవి మరల ఆయనయందే లయమగుచున్నవి.

7. ఇట్లు కాలము ననుసరించి సకలము నశించుచున్నది. అనగా అవ్యక్తములోనికి జారి పోవుచున్నది. కాని వాని యందలి అంతర్యామి అట్టి అవ్యక్తముగా కూడా తానే యున్నాడు గనుక ఆయన జారిపోవుట లేదు.

8. వరుణుడు నీటికి అధి దేవత. సృష్టికి పూర్వము అంతయు జలమయముగా నుండును. అట్టి నీటియందు విరాట్ అను గ్రుడ్డు పుట్టెను. ఇతడే మొట్టమొదటి పురుషుడు. ఇట్లు ఈ సృష్టి పుట్టుకకు కారణమైన మహా జలములే ఆపస్సులని వేదములయందు వర్ణింపబడినది. యిదియే క్షీరసాగరమని కూడా వర్ణింపబడినది. ఈ నీటినుండి సృష్టి పుట్టుచున్నది కనుకనే జీవుల పుట్టుకకు, ప్రాణుల పుట్టుకకు మొక్కలు మొలకెత్తుటకు ఈ నీరే ఆధారము. వరుణుడు తన కుమారుడుగా పుట్టుటకు ఈ నీటియందే కర్దముడు తపస్సు చేసెను.

9. భృగువు వరుణుని కుమారుడు. ఆయన తన తండ్రిని, సృష్టిని గురించి అందలి రహస్యముల గురించి ప్రశ్నించి (భృగువల్లి) తెలుసుకొనెను. అనగా జీవుడు పుట్టుటకు ముందు తండ్రివద్దనుండి శరీరమేర్పడుటకు కావలసిన ప్రజ్ఞలను ప్రణాళికను జ్ఞానముగా స్వీకరించుటవలన, కుమారునికి గూడా దేహభాగములు అదే విధముగా ఏర్పడుటయే గాక తల్లిదండ్రుల పోలికలు కూడా సంక్రమించుచున్నవి. భృగువనగా తెల్లని కిరణమని అర్థము. అనగా సృష్టిగా దిగి వచ్చిన మొట్టమొదటి వెలుగు.

10. సత్వము, రజస్సు, తమస్సు అను మూడుగుణములతో కూడియున్న ప్రకృతి ఒక మహావృక్షముగా చెప్పబడినది. అదియే భగవద్గీత 15వ అధ్యాయమున చెప్పబడిన ''అశ్వత్థ వృక్షము''. దీనికి వ్రేళ్ళు పైకి, కొమ్మలు ఆకులు క్రిందికి యున్నవి. అనగా సృష్టికి లేదా పుట్టుకకు కారణములు అంతర్లోకములలోనుండి, కర్మలు వాటి ఫలితములు అను పేర కొమ్మలు, ఆకులు, ఫలములు భౌతికముగా వ్యక్తమగుచుండును. ఇదియే సృష్టియను మహావృక్షము. వ్రేళ్ళు, కొమ్మలు ఎన్ని యున్ననూ (బోదె) మూలము ఒక్కటే. అదియే పరమాత్మ. జీవుల పుట్టుకకు మరియు పనులకు, కారణములు మరియు ఫలితములు అనేకములు, అనంతములు, కాని వీటన్నింటికి మూలము పరమాత్మయే.

11. పద్మము సూర్యోదయమునకు గుర్తు. సూర్యుని కిరణములకు పద్మము వికసించును. కనుక మనస్సను పద్మమును వికసింప చేయువాడుగా నారాయణుడు కీర్తింపబడినాడు. కనుక ఆయన పుష్కరాక్షుడని వర్ణింపబడినది. పుష్కరమనగా 12 అని అర్థము కలదు. సంవత్సరము నందు పన్నెండు నెలలోను సూర్యుడు ఒక్కొక్క నెలలో ఒక్కొక్క రాశి యందుండును. ఇట్లు 12 రాశులలో ప్రకాశించు సూర్యుడు పుష్కరాక్షుడు అని స్తోత్రము చేయబడినాడు.

12. మనస్సులన్నియూ చోటునుండి పని చేయును. ఈ విశ్వమంతయూ ఒక్కటే మనస్సుగానుండి ఎవరి శరీరమునందున్న మనస్సు, వారి మనస్సుగా పని చేయును. ఇది యెట్లనగా, పంపు త్రిప్పినచో నీరు వచ్చును. ఎవరి ఇంటిలో పంపువారిదే యైనను, నీరు మాత్రము నీటి సరఫరాశాఖవారిది, కనుక మన మనస్సు అనగా మన ఇంటి పంపులోనుండి వచ్చు నీరు. కాని నిజమునకు అంతయూ ఒక్కటే మనస్సు. అట్టి మహా మనస్సుగా నారాయణుడే యున్నాడు.

60. శ్లో॥ భగవాన్ భగహా ఽనందీ వనమాలీ హలాయుధః ।
ఆదిత్యో జ్యోతిరాదిత్యస్సహిష్ణుర్గతి సత్తమః ॥

**ప్రతిపదార్థము** :- 1. భగవాన్ = భగవంతుడు, శక్తులు, మహిమలు గలవాడు, 2. భగహా = చీకటిని నశింప చేయువాడు, 3. ఆనందీ = ఆనందమే రూపముగాగలవాడు, 4. వనమాలీ = వన పుష్పములతో కూడినమాలను ధరించినవాడు, 5. హలాయుధః = హలమును ఆయుధముగా ధరించినవాడు, 6. ఆదిత్యః = ఆదితియొక్క కుమారుడు, 7. జ్యోతిరాదిత్యః = ప్రకాశముతో కూడిన ఆదితియొక్క కుమారుడు, 8. సహిష్ణుః = అన్నిటిని భరించువాడు, లేక సహించువాడు, 9. గతిసత్తమః = ఆయన మార్గముననుసరించు వారిలో ఉత్తముడు.

**తాత్పర్యము** :- పరమాత్మ శక్తులను, మహిమలను గలవాడు. చీకటిని నశింప చేయువాడు. ఆనందము కలుగ చేయువాడు. వన పుష్పములచే చేయబడిన మాలను ధరించినవాడు. అదితియొక్క కుమారుడు. నాగలిని

ధరించినవాడు. మిక్కిలి ప్రకాశవంతమైన కుమారుడై సృష్టి నంతటిని భరించి సహించువాడు. సన్మార్గమున నడచువారిలో అత్యంత ముఖ్యుడైనవాడు.

**వివరణ** :- 1. భగవంతుడనగా అనేక శక్తులను, మహిమలను గలిగి భక్తులను రక్షించుటకు భూమి కవతరించువాడు. ఆయన దుష్టశక్తులను శిక్షించి సత్పురుషులను రక్షించును.

2. అంతర్యామి స్మరణనుండి విస్మృతి చెందుటయే నిజమయిన చీకటి. అట్టి చీకటినుండి రక్షించువాడు పరమాత్మయే. ఆయన భక్తుల హృదయములయందు నిలిచి తన స్మరణ మరపుకు రాకుండా వారిని కాపాడును. ఒకవేళ వారు తాత్కాలికముగా మరచిననూ కష్టములయందు వారిని తన స్మరణ జ్ఞప్తికి వచ్చునట్లు చేసి రక్షించును.

3. అట్టి స్మరణ మరపుకు రానంతకాలము జీవులు ఆనందమున నుందురు. అట్టి నిరంతర ఆనందమయ స్థితియే నారాయణుడు. నిజమునకు జీవులలోనుండి ఆనందించువాడు కూడా నారాయణుడే.

4. సృష్టియందలి పుష్పవృక్షములు, మొక్కలు, ప్రకృతిని తమ పూలతో అలంకరించుచుండును. వివిధ వర్ణములతో, పరిమళములతో అవి ప్రకృతిని శోభాయమానముగా, మనోహరముగా తీర్చిదిద్దును. అట్టి దృశ్యమును చూచువారలకు అప్రయత్నముగా మనస్సు ఆనందముతో పులకరించును. ఇట్లు జీవులద్వారా సంతోషపడువాడు నారాయణుడే కనుక ప్రకృతి తను సృష్టించిన పూలతో నారాయణుని జీవులరూపమున అర్చించుచున్నది. నిజమయిన సేవ యిదియే. ఎందుచేతననగా ఆ పూలను కోసి తానొక్కడే ధరింపవలెననుకొనువానికి ఆ పూలు వాడిపోవుటతో నిరాశ మిగులును. అట్లుకాక ఆ పూలు మొక్కయందేయున్నచో అవే ఎక్కువ కాలము అనేక మందిని, వారిలోనున్న నారాయణుని సంతోషపెట్టగలవు. మరియూ ఈ ప్రకృతి యంతయూ నారాయణుని యొక్క భౌతిక రూపమే గనుక ఈ పూల మొక్కలన్నియు తమ పూలతో నారాయణుని అలంకరించుచున్నవి.

5. బలరాముడు నాగలినాయుధముగా ధరించి, రాక్షసులను సంహరించి, యమునా నది ప్రవహించు మార్గమును కూడా మళ్ళించెను. అట్టి బలరాముడు

నారాయణుని అవతారమే. జనకుడు హలమును ధరించి భూమిని దున్ని పంటను పండించునట్టి మనువు యొక్క సంప్రదాయ మార్గమును మరల భూమియందలి జనులందరికి తప్పనిసరియగునట్లు విధించెను. అట్లు విధించుట తాను కూడా దున్నుట లేక ఆచరించుటతో ప్రారంభమయ్యేను. ఇట్లు మానవులందరికి ఆహారమును సాధించు ప్రయత్నమున జీవులందరి రూపమున నారాయణుడే నాగలిని ధరించుచున్నాడు.

6. సూర్యోదయమునకు ముందున్న చీకటిని అదితి అందురు. అనగా సూర్యుడు కనిపించుటకు ముందున్నస్థితి అని అర్థము. ఇదియే ఉపనిషత్తులయందు ''పరావాక్కు'' అనబడు స్థితిగా, మరియు పురాణములయందు ''పరాదేవి'' అని జగన్మాత యొక్క మొట్టమొదటి రూపముగా వర్ణింపబడినది. అట్టి అదితికి పుట్టినవాడు గనుక ఆదిత్యుడు అని పిలువబడినాడు.

7. అట్టి సూర్యుడు మొట్టమొదటి వెలుగు అనగా ''విరజము'' (Pre-Atomic state) అనుస్థితినుంచి రజస్సు (Atomic state) లనబడు వెలుగు రవ్వల స్థితిలోనికి దిగివచ్చును. చోటులో వెలుగుయొక్క రవ్వ లేర్పడి (Nebular state) అవి క్రమేణా గోళాకారముగా కట్టుకొనుట వలన సూర్యుడను మహా వెలుగుల గోళమేర్పడును. అట్టి వెలుగులు తానే యైనవాడు గనుక నారాయణుడు జ్యోతిరాదిత్యః అని పిలువబడినాడు.

8. ఈసౌర కుటుంబము నందలి జీవులు, గ్రహగోళములు అన్నియూ సూర్యునిపై నాధారపడి వానిచుట్టు తిరుగుచున్నవి. అట్లు సూర్యుడే సమస్త జగత్తునకు ఆధారమైయున్నాడు. ఆయనయే గోళములను, వానిపైగల జీవులను, భరించి సహించుచున్నాడు.

9. సృష్టియందలి జీవులందరు తెలిసిననూ తెలియకున్నను, జీవులైనను, కాకున్ననూ, సూర్యుని అనుసరించుచున్నారు. వీటన్నిటిని సూర్యుడే నియమించి పాలించుచున్నాడు. కనుక సూర్యుడే వీటన్నిటికి అసలైన గమ్యమై యున్నాడు.

61. శ్లో॥ సుధన్వా ఖణ్డపరశుర్దారుణో ద్రవిణ ప్రదః ।
దివస్పృక్సర్వ దృగ్వ్యాసో వాచస్పతి రయోనిజః ॥

**ప్రతిపదార్థము :-** 1. సుధన్వా = గొప్ప విలుకాడు, 2. ఖండపరశుః = విరిగిన గొడ్డలి గలవాడు, 3. దారుణః = భయంకరమయినవాడు, (క్రొయ్యవలె గట్టివాడు), 4. ద్రవిణప్రదః = సంపదల నిచ్చువాడు, 5. దివస్పృక్= ఆకాశమును తాకువాడు, (చోటు తన శరీరముగా గలవాడు), 6. సర్వదృక్ = అన్నింటిని చూచువాడు, 7. వ్యాసః = వ్యాసుడు, 8. వాచస్పతిః = వాక్కునకధిపతి, 9. అయోనిజః = భౌతికమయిన పుట్టుకలేనివాడు, లేక స్త్రీ గర్భమునందు పుట్టనివాడు.

**తాత్పర్యము :-** గొప్ప విలుకాడు, విరిగిన గొడ్డలిని ధరించి భయంకరముగా నున్ననూ, సంపద లిచ్చువాడుగా నున్నాడు. ఆయన రూపము ఆకాశమంతయూ వ్యాపించి సమస్తము చూచుచున్నది. వేదవ్యాసుడు వాక్కునకు, భాషకు అధిపతియై భగవంతుని అవతారమగుటచే స్త్రీ గర్భమందు పుట్టనివాడై యున్నాడు.

వివరణ :- 1. సారంగమను ధనుస్సును ధరించి నారాయణుడు భక్తులను రక్షించును. ఈ సారంగమను ధనువు భృగుమధ్యమునుండి ప్రారంభమై శిరస్సును చుట్టి వెన్నెముక క్రింద వరకు వ్యాపించి యున్నది. ధ్యానము చేయువారి శ్వాసయే ఈ ధనుస్సుగా నిలచును. ఓంకారమే ఈ ధనుస్సు. బాణము సంధించి, లాగి, ఎక్కుపెట్టిన విల్లు ఓంకార రూపమున నుండును. శ్వాసను పూరించి ప్రశాంతముగా ఉచ్ఛరించు ఓంకారమే ఈ సారంగమను ధనువు.

2. రుద్రునకు, నరునకు (అర్జునునికి) జరిగిన యుద్ధమందు శివుని గొడ్డలి విరిగినది. కనుక రుద్రుడు ఖండపరశుడు. మరియు పరశురాముడు తన పరశువుతో ప్రపంచమునందలి దుష్టులైన రాజుల శిరస్సులను ఖండించెను. అతడట్లు ఇరవయి ఒక్కమార్లు భూప్రదక్షిణము చేసి భూమిపై క్షత్రియుడనువాడు లేకుండా చేసెను. పరశురామునినాటికి భూమిపై గల రాజులందరు అహంకరించి దుష్టులై ప్రజలను బాధించుచు ప్రజాకంటకులైరి. అందుచేత పరశురాముడు దుష్టులైన రాజులను భూమిపై లేకుండా చేసెను. ఇట్లు ప్రజలు బాధపడుచున్నపుడెల్ల నారాయణుడు అవతరించి ప్రజాకంటకులను శిక్షించి శాంతిని నెలకల్పును.

3. నారాయణుడు అట్టి రాక్షసులను, దుష్టులను సంహరించుటకు తన శాంతము, ప్రసన్నమయిన రూపముతోగాక భయంకర రూపము ధరించి స్త్రీలను, గోవులను, మంచివారిని బాధించు దుష్టులను సంహరించును. అంతే గాక దారుణమనగా దారుమయమయిన రూపము. నారాయణుడు, చెట్లయందు వృక్షజాతులయందు వసియించువాడుగా స్తోత్రము చేయబడెను. ఇట్టి ఆరాధనకు ప్రతీకగా పూరి జగన్నాధ క్షేత్రమునందలి జగన్నాధుడు, సుభద్ర, బలరాముల విగ్రహములు కొయ్యతో చేయబడినవి.

4. పరమాత్మ కాలమను యజ్ఞమును నిర్వర్తించుచున్నాడు. సూర్యుడు, భూమి, గ్రహములు అనువానితో ఈ యజ్ఞము నిర్వహింపబడుచున్నది. ఈ యజ్ఞమునకు ఫలము సంపదలు కనుక భూమియందలి సంపదలకు పరమాత్మయే కారణము.

5. పరమాత్మ ఆకాశముననున్నాడు. భూమినుండి ఆకాశమంతటా ఆయన పొరలు పొరలుగా విస్తరించి యున్నాడు. చోటుగా తానే యున్ననూ భూమిగా మరల తానే యుండుటచే భూమి రూపమున ఆకాశమును తాకుచున్నాడు.

6. సూర్యుడు సర్వసాక్షి. అందువలన ఆయన కిరణములు ప్రసరింపని చోటు ఆకాశమునందు లేదు. ఆయన తన కిరణములతో సమస్తమును చూచుచున్నాడు.

7. వ్యాసుడను మహర్షి జ్ఞాన స్వరూపుడై శాశ్వతమయిన సృష్టి విజ్ఞానమును లేక వేదమును పునర్వ్యవస్థీకరణమొనర్చి జీవులకందించెను. అనేక దేశములలో అనేక జాతులలో సృష్టి ప్రారంభమయిన నాటినుండి వ్యాసుడు అవతార మూర్తిగా వచ్చుచున్నాడు. ఈయననే కొన్ని అవతారములలో బుద్ధుడని కూడా పిలుచుదురు. మనకు తెలిసిన గౌతమ బుద్ధుడు, బుద్ధుని అనేక అవతారములలో ఒకటి మాత్రమే.

8. అట్టి వ్యాసుడు వేదములను తన వాక్కుగా నుచ్చరించెను. కనుక ఆయన వాక్పతి.

9. వ్యాసుడు సత్యవతి యను కన్యకు, పరాశర మహర్షికి కుమారుడై పుట్టెను. సత్యవతి యనగా సత్యమును ధరించియున్న ప్రకృతి అని అర్థము.

పరాశరుడనగా పరమునకు ఎక్కుపెట్టపడిన శరీరము లేక లక్ష్యము కలవాడు. కనుక వ్యాసుడు అయోనిజుడై పుట్టెను.

62. శ్లో॥ త్రిసామా సామగస్సామ నిర్వాణం భేషజం భిషక్ ।
సన్న్యాస కృచ్ఛమశ్శాన్తో నిష్ఠాశ్శాంతిః పరాయణమ్ ॥

**ప్రతిపదార్థము** :- 1. త్రిసామా = మూడు విధములుగా, గానము చేయువాడు, 2. సామగః = గానమునందలి విషయము మరియు గానమువలన మాత్రమే సమీపించుటకు సాధ్యమయినవాడు, 3. సామ = గానము, 4. నిర్వాణం=శరీరమును వదలుట, 5. భేషజం = చికిత్స, 6. భిషక్ = చికిత్సకుడు, 7. సన్న్యాసకృత్ = సన్యాసమును కలిగించువాడు, 8. శమః = సంయమముగలవాడు, 9. శాన్తః = శాంతికలవాడు, 10. నిష్ఠః = నిష్ఠ లేక దీక్షకలవాడు, 11. శాన్తిః = శాంతిరూపుడు, 12. పరాయణం = పరమముయైన స్థితియే తన మార్గముగా గలవాడు.

**తాత్పర్యము** :- మూడు స్థాయిలలోగానము చేయబడు సోమము అను యజ్ఞము నారాయణునియొక్క రూపము. పరమాత్మయే ఆ గానమందలి విషయము. బృందములచే ఆలపింపబడు గానమునందు లీనమగుటచే నారాయణుని సాన్నిధ్యము కలుగును. ఆయన నిర్వాణము, చికిత్స మరియు చికిత్సకుడు. ఆయన జీవులను, సన్యాసమార్గమున నడిపించుచు ఉద్రేకములను సంయమసమువలన ఉపశమింపచేసి, తన ప్రశాంతత అనుభవములో కూడిన సాన్నిధ్యమును అనుగ్రహించుచున్నాడు. దీక్ష మరియు మార్గమున కంకితమగుట అను తన లక్షణములచే నిరంతరము జీవులను శాంతియుతులుగా చేయుచున్నాడు.

**వివరణ** :- 1. సామము జీవుల శ్వాసయందు జీవిత గానముగా ఆలపింపబడుచుండును. దీనికిని సూర్యోదయమునకును సంబంధము కలదు. ఈ సామగానమే దినము, అందలి విభాగములు. ముఖ్యముగా సూర్యోదయము, మిట్టమధ్యాహ్నము, సూర్యాస్తమయము అను మూడు స్థితులు సామముయొక్క మూడు స్థాయిలలోనున్న గానము. ఉచ్ఛ్వాసము, నిశ్వాసము మరియూ శ్వాసకు కావలసిన సత్తువ ఈ మూడును సామములే. గానము నందలి విషయము భగవంతుడే.

2,3. గానమునందలి రసము మరియూ గానము చేయు విధానము ఇవియన్నియు నారాయణునియందలి విభాగములే.

4. నిర్వాణమనగా జీవికి గల కర్మ సంస్కారములన్నియు దగ్ధమై బంధములు తెగుట. అంతే కాని చనిపోవుట కాదు. ధ్యానము వలన జీవుల కిట్టి స్థితి కలుగును.

5. చికిత్స అనగా క్రమము తప్పిన జీవప్రజ్ఞ మరల సక్రమమగుట. జీవప్రజ్ఞ క్రమము తప్పినపుడు మనసు ఉద్వేగములకు లోనగును. ప్రకృతి ఏర్పరిచిన నియమములను పాటించి జీవించువానికి ఈ క్రమము తప్పుట యుండదు. అందుచేతనే జంతువులకు వైద్యశాల లక్కరలేదు. అట్లు నియమములను పాటించుట మానినతోడనే ప్రాణశక్తి క్షీణించి శరీరము వ్యాధి గ్రస్తమగును. అట్లు వ్యాధిగ్రస్తమయిన జీవుని మరల సత్కర్మాచరణము చేతనూ, ధ్యానముచేతనూ, సరిదిద్దినచో మరల శరీరకోశములు సక్రమమై ఒకదానితో నొకటి సామ్యము చెందుటవలన రోగనిర్మూలనము కలుగును.

6. ఏ వైద్యమయినను నిజమైన నివారణ జరుగ వలెనన్నచో వైద్యుని మనస్సునందు పరమాత్మయే నిలిచి రోగికి రోగ నివారణము చేయును. కనుక రోగికి త్వరగా నివారణ జరుగవలెనన్నచో అంతర్యామి స్మరణ జరుగవలెను. ఇది కేవలము భగవంతుని నామమును మాత్రమే జపించుటగాక, రోగికి వైద్యుని యందు భక్తి గౌరవములు, ఇతరులయందు ప్రేమాభిమానములు కలిగి, మనస్సునకు ప్రశాంతము కలిగించు భక్తి గీతములను పాడుట చేయవలెను. పూజయందు, వేద పఠనములయందు పాల్గొనుచుండవలెను. అట్లే నియమిత కాలములయందు ధ్యానము చేయుటగాని, ధ్యానము చేయువారి ప్రక్కనగాని యుండవలెను. అట్లే వైద్యుడు కూడా తనకున్న వైద్యశాస్త్ర విజ్ఞానమును గూర్చి గర్వపడరాదు. భగవంతుని అనుగ్రహము వలననే తనకట్టి ధారణ. అర్థము చేసుకొన గల శక్తి కలిగినదని అర్థము చేసుకొనవలెను. ఉదయము, సాయంత్రము నియమిత కాలమందు భగవద్ధ్యానము చేసుకొనుట, పూజ చేయుట, గానము, అవకాశమును బట్టి చేయుచుండవలెను. సాధ్యమయినంతవరకు మానరాదు. తనకున్న శాస్త్ర విజ్ఞానమును గూర్చి గర్వపడక

దానిని పెంపొందించుటకొరకు వైద్యశాస్త్ర గ్రంథములు చదివి అవగాహన చేసుకొనవలెను. తెలియనివి తోటివారినడిగి తెలుసుకొనుటకు మొగమాట పడుట, సంకోచపడుట చేయరాదు. వీటిన్నంటికిమించి రోగియందు ప్రేమ, సానుభూతి కలిగియుండవలెను. అతనికి (రోగికి) ఉన్న పదవినిబట్టి, ఆర్థిక స్థితినిబట్టి, పలుకుబడిని బట్టిగాక, రోగ స్థితినిబట్టి ప్రాముఖ్యత నివ్వవలెను. ఇట్లు ఆచరించువారి హృదయములందు నారాయణుడే ఉండి రోగికి నివారణ కలిగించును. ఎట్టి వైద్య విధానమయినను ఆ విధానమునుబట్టి గాక చికిత్స చేయువారి, మరియు పొందువారిని బట్టి చికిత్స ఆధారపడును. (ఈ విషయములను గూర్చి మరియు వివరములు కావలసినవారు "Esoteric Healing" అను అంగ్ల గ్రంథము A.A. Baily అను నామెచే వ్రాయబడినది చదువగలరు).

7. సన్యాసమనగా త్యజించుట. జీవితమునందలి అన్ని సంఘటనలు మానవునకు ఇట్టి శిక్షణనిచ్చుట కేర్పడినవి. భగవంతుడే మానవుని మనస్సునందలి బంధములు తొలగించి జీవన్ముక్తుని చేయును.

8,9. నారాయణుని ధ్యానము చేయుటవలన మనస్సు, ఇంద్రియములు, మున్నగునవి అన్నియు సంయమనము చెందును.

10,11. క్రమము తప్పిన మనస్సును మరల సక్రమమగునట్లు సరిచేసుకొనవలెను. ఇది ఆహార విహారాదుల యందును, అలవాట్లయందును మార్పులు చేసుకొనుటతోబాటు సత్కర్మాచరణమును కూడా జోడింపవలెను. సత్కర్మతో జమచేయనిచో మనస్సునకు ఉద్వేగములు తొలగింపబడవు. అట్టి సత్కర్మము ప్రతివారును తమ తమ సామర్థ్యము ననుసరించి ఎదుటి వారి కుపయోగించు విధానమున చేయుటకు సంకల్పింపవలెను. అట్టి సంకల్పమే నిరంతరము ఉన్నచో దానినే దీక్షయందురు. దీనిని గూర్చియే శ్రీకృష్ణుడు భగవద్గీతలో ''శ్రద్ధ'' యని చెప్పెను.

''అశ్రద్ధ ధానాః పురుషాః ధర్మస్యాస్య పరంతప
అప్రాప్య మాం నివర్తంతే మృత్యు సంసారవర్త్మని''

ఇట్టి శ్రద్ధ లేనివారికి నన్నుపొందుట సాధ్యముకాదని శ్రీకృష్ణుడు చెప్పెను. కనుక మనస్సు పరిపూర్ణము గావలెనన్నచో నిష్ఠను కలిగి యుండవలెను. అట్లే నిష్ఠవలన చేయుచున్న పనియందు సామర్థ్యము లభించుటయేగాక, నైపుణ్యముతో ప్రశాంతముగా నిర్వహించగలుగు శక్తి లభించును. కారునడుపుట నేర్చుకొనువానికి మొదట కొంతకాలము అంతయు గందరగోళముగా, చికాకుగా యుండును. మధ్యలో మానివేయవలెననిపించును. మరికొంతకాలము శ్రద్ధతో నేర్చుకొన్న తరువాత నైపుణ్యము కలిగి క్రమేణా సుఖముగా నడుపుట అలవాటగును. మరికొంతకాలము తరువాత, కారునడుపుట కరతలామలకము. కారు నడుపుచున్ననూ ప్రక్కవారితో హాస్య సంభాషణము చేయుచు సరదాగా నుండును. కాని కారు మాత్రము కుదుపులు లేక ప్రయాణించువారికి మిక్కిలి సౌఖ్యవంతముగా, అహ్లాదకరముగా నుండును. ఇట్లు చేయుటనే శ్రీకృష్ణుడు ''యోగస్థః కురుకర్మాణి'' అని చెప్పెను. అట్టి స్థితి రావలెనన్నచో నేర్చుకొనునప్పుడు నిష్ఠయుండవలెను.

12. కనుక జీవుడు ప్రయాణముచేయు ఈ మార్గము నారాయణునిచే నిర్ణయింపబడినది. ఈ మార్గమునందు మార్గము వేరు గమ్యమువేరు కాదు. మార్గమే గమ్యము లేక లక్ష్యము. కనుక సాధకుడు యోగి కావలెనన్నచో యోగము సాధనముగాకాక జీవనముకావలెను. అనగా జీవించుట వేరు, యోగమార్గము వేరు అని గాక జీవితమునందలి అన్ని గంటలు, సంఘటనలు యోగజీవనముగా రూపొందవలెను. నారాయణుడే జీవునికిట్టి మార్గముగా దిగివచ్చినాడు గనుక అయన పరాయణుడు.

63. శ్లో॥ శుభాంగ శ్శాంతిద స్స్రష్టా కుముదః కువలేశయః ।
గోహితో గోపతిర్గోప్తా వృషభాక్షో వృషప్రియః ॥

**ప్రతిపదార్థము** :- 1. శుభాంగః = శుభమైన అవయవ నిర్మాణము కలవాడు, 2. శ్శాంతిదః = శాంతిని కలిగించువాడు, 3. స్రష్టా = సృష్టించువాడు, 4. కుముదః = భూలోకమునకు సంతోషము కలిగించువాడు, 5. కువలేశయః = భూగోళమంతయు శయనించువాడు, 6. గోహితః = గోవులకు హితము కోరువాడు, 7. గోపతిః= దాంపత్యమునకు సిద్ధముగా

వున్న వృషభము, 8. గోప్తా = గుప్తముగా నున్నవాడు లేక రక్షించువాడు, 9. వృషభాక్షః = వృషభముయొక్క కన్నుకలవాడు, 10. వృషప్రియః = వృషభమును యిష్టపడువాడు.

**తాత్పర్యము :-** ఆయన శుభమయిన శరీరము లేక విగ్రహము కలవాడు. ఆయన సృష్టించునవి భూగోళమందంతట ఆయన సాన్నిధ్యముచే శాంతిని ఆనందమును జీవులకు కలిగించును. ఆయన గోవులు, వృషభముల హితము కోరుచు, వాటిని గుప్తముగా నుంచి సంరక్షించును. ఆయన వృషభ నేత్రముతో నుండి వృషభమును యిష్టపడును.

**వివరణ :-** 1. భగవంతుని శరీరము లేక విగ్రహము చూచుట తోడనే మనస్సును ఆకర్షించి అప్రయత్నముగా హృదయములను తనలోనికి లయము చేసుకొనును. శ్రీరాముని అయోధ్యానగర ప్రజలు మిక్కిలి ఇష్టపడువారు. ఎల్లప్పుడు ఆయనను చూడవలెనని, ఆయనవద్దనే వుండవలెనని కుతూహలపడువారు. అట్లే శ్రీకృష్ణుని సాన్నిధ్యము గోపికలు, ద్వారకావాసులు మున్నగు వారందరు అభిలషించేవారు. చిత్రమేమనగా శ్రీకృష్ణుడు రాక్షసులతో యుద్ధము చేయునపుడు ఆ రాక్షసులుకూడ ఆయనను సమీపించి ఆయన కన్నులలోని ఆకర్షణకు వివశులై, నిశ్చేష్టులైరి. అప్పుడు శ్రీకృష్ణుడు వారిని సంహరింపగా, వారి ప్రాణములు కృష్ణునిలో లీనమయ్యెను. ఇట్టి దివ్యమంగళ విగ్రహము లేక మూర్తివలన అప్రయత్నముగ మనస్సు వికసించును.

2,3. నారాయణుడు శాంతినిచ్చువాడు. మరియు సృష్టించువాడు. ఆయన సమస్తమును సృష్టించెను. కనుక శాంతిని కూడా ఆయనయే సృష్టించిజీవులకిచ్చెను.

4,5. పరమాత్మ భూగోళమంతయు వ్యాపించి యుండుటవలన భూమి జనులకు సంతోషమును కలిగించుచున్నాడు. భూమిజనులనగా భౌతిక సంపదలను మాత్రమే విశ్వసించువారని అర్థము. కాని భగవంతుడు సర్వాంతర్యామి కనుక భౌతిక సంపదలందు కూడా తానే వున్నాడు. కనుక ఈ భౌతిక జీవులు తమపాటికి తాము జీవించుచున్నను, పరమాత్మ సాన్నిధ్యము భౌతిక సంపదల రూపమున అనుభవించుచునే యున్నారు. శాస్త్రీయముగా

చెప్పవలెనన్నచో చంద్రుడే భూమి జనులకు ఆనందమును కలిగించుచున్నాడు. చంద్రుడు మనస్సునకు, పంచేంద్రియములకు అధిపతి. కనుక భగవంతుని కరుణ చంద్ర కిరణముల ద్వారా పనిచేయును.

6. కృష్ణావతారమున శ్రీకృష్ణుడు పశువులను పాలించెను. వృషభరాశికి శ్రీకృష్ణుడు అధిదేవత. అంతేకాక ఆయన ఈ రాశియందే జన్మించెను. కనుక ఈ రాశికి అధిపతియై యున్నాడు.

7,8,9. వృషభరాశి లక్షణములలో భూమి యొక్క వైభవములు (వ్యవసాయము), పశువుల వైభవము (పాలనుండి వచ్చు పదార్థములో) దాగి యున్నది. ఇది రోహిణీ నక్షత్రము యొక్క ప్రభావము వలన సంభవించును. దీనినే వృషభరాశి యొక్క నేత్రమందురు. Western Astrology లో దీనిని The Eye of the Bull అందురు.

10. కనుక ఆయన గోవులకు మిక్కిలి ఇష్టమయిన వాడు. శ్రీకృష్ణుని వేణుగానమునకు పశువులు మైమరచి యుండెడివి. ఆయన గానమునకు మానవులేగాక పశువులు, వృక్షములు కూడా పులకించెడివి.

64. శ్లో|| అనివర్తీనివృత్తాత్మా సంక్షేప్తా క్షేమకృచ్ఛివః |
శ్రీవత్సవక్షాశ్శ్రీవాసశ్శ్రీపతిః శ్రీమతాం వరః ||

**ప్రతిపదార్థము** :- 1. అనివర్తీ = వెనుకకు మరలనివాడు, 2. నివృత్తాత్మా=కర్మలయందు చిక్కుకొనని ఆత్మ కలవాడు, 3. సంక్షేప్తా = సంఘటనలు, వస్తువులు కూర్చువాడు, 4. క్షేమకృత్ = క్షేమము సంకల్పించువాడు, 5. శివః = శుభమయినవాడు, 6. శ్రీవత్సవక్షాః = వక్షస్థలముపై శ్రీవత్సమను శుభ చిహ్నము కలవాడు, 7. శ్రీవాసః = లక్ష్మికి నిలయమైనవాడు, 8. శ్రీపతిః = లక్ష్మిని రక్షించువాడు, 9. శ్రీమతాంవర = శ్రీమంతులలో ఉత్తముడు.

**తాత్పర్యము** :- పరమాత్మను తన పథమునుండి వెనుకకు మరలనివానిగా, కర్మలకు లోబడని ఆత్మగలవానిగా, వస్తువులను, సంఘటనలను చక్కగా కూర్చి క్షేమము కలిగించువానిగా, శుభము కలిగించువానిగా, వక్షస్థలముపై శుభమయిన చిహ్నము కలవానిగా, శుభాకారునిగా, సంపదలకు, వైభవములకు అతీతమై

యుండి రక్షించువానిగా, సంపదలు కలిగించు వారిలో ఉత్తమునిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. సృష్టి చుట్టలు చుట్టలు విచ్చుకొనుచు, కాలముగా వ్యక్తమగుచున్నది. ఇట్లు వ్యక్తమగుచున్న కాలము అనంతమై నిరవధికముగా నున్నది. ఇట్లు సాగిపోవుచున్న కాలమునందు ఎవ్వరైనను కలిసిపోవుటయే కాని, ఆపగలుగుట వెనుకకు లాగుట సాధ్యముకాదు. ఎవడైనను తాను రేపు ఏమి చేయవలెనో ఆలోచించి నిర్ణయించగలడు కాని, నిన్నటిది సరిచేయలేడు. ఈ కాలమును మించుట ఎవరికిని సాధ్యముకాదు.

2. అన్ని సంకల్పములు, లక్ష్యములు, సంఘటనలు ఆత్మకు సంబంధించినవి కాదు. మనసునందలి ఊహలు ఉద్దేశ్యములు ఆత్మనంటవు. జీవితమునందలి అన్ని సంఘటనలయందు, విషయములయందు ఆత్మ ప్రవర్తించుచున్ననూ ఆత్మకేదియూ నంటుకొనదు. చేతికి రబ్బరు తొడుగుకున్న వానికి మంచుగడ్డను తాకిననూ చల్లదనము తగలనట్లు భౌతిక విషయములయందు ప్రవర్తించుచున్ననూ ఆత్మ వాటినంటదు, ఆత్మ చుట్టు గల పొర ఆత్మకివి అంటనీయదు. అట్లుగాకున్నచో సృష్టి మొత్తము కోరికలతో కలుషితమైపోయి యుండెడిది.

3. మానవుని సంకల్పములన్నియూ చావు, పుట్టుకలపై నాధారపడి యుండును. ఈ చావు పుట్టుకలు పరమాత్మచే నిర్దేశించబడి జీవితమునందు క్రమముననుసరించి కూర్చబడును. కనుక జీవితమునందలి ప్రతి సంఘటన భగవంతుని సంకల్పము ననుసరించి జీవుని మనస్సులో ప్రతిబింబించును. ఇట్లు తన మనస్సునందు వ్యక్తమయినవి, తన సంకల్పములుగా మనస్సు భ్రమపడును. కాని ఇవియన్నియూ పరమాత్మచే నిర్ణయింపబడి కూర్చబడినట్టివే.

4,5. కనుక భగవంతుడు జీవునికి క్షేమము కలుగు సంఘటనలను, మార్గమును నిర్ణయించును. అందుచేత శుభమే కలుగును. శుభమనగా మన మనుకొనినట్లు యిల్లు కట్టుకొనుట, ధనము సంపాదించుట మున్నగునవి కాక జీవునికి దేనివలన ఎడతెగని ప్రశాంతత, ఆనందము చేకూరునో, అది కలిగించుట. అట్టి శుభమును కలిగించువాడు గనుక భగవంతుడు శివుడని పిలువబడినాడు.

6. విష్ణువునకు వక్షస్థలముపై శ్రీవత్సమను పుట్టుమచ్చ కలదు. సృష్టియందలి హృదయస్థానమునిది సూచించును. ప్రతి వారికిని వారి హృదయము విలువైనది. ప్రీతికరమయినది. ఇంకొక చిత్రమేమనగా ఎట్టి పరిష్కరింపరాని సమస్యనైననూ హృదయమందు గల పరమాత్మను ధ్యానము చేసినచో ఆ సమస్యకు సమాధానము వచ్చును. ఇది ఎట్లు జరుగుననగా హృదయమున ధ్యానము చేసినప్పుడు ఆ సమస్య గలవారిపై లేక సంబంధించినవారిపై ప్రేమ కలుగును. ఎవరినైననూ మనము ప్రేమించినచో వారి సమస్యలు పరిష్కారములతో సహా మన హృదయమునందు ప్రతిబింబించును. మహర్షులకు, సద్గురువులకు ఎదుటి వారి మనస్సు తెలియుననగా అది వారికి ప్రేమ వలననే సాధ్యమగుచున్నది గాని, మరి ఏ విధముగాను కాదు. సకల జీవుల హితమును కోరి ప్రేమతో వారికి సేవ చేయుటకు సంకల్పించు మహాత్ములకు తమ కర్తవ్యము తమ హృదయములందే తెలుసుకొనగలరు.

7. సంపదయనగా నామ రూపాత్మకమయిన సృష్టి. నామము, రూపము మొదలైన వివరములతో సృష్టి యందలి సౌందర్యము, వైభవము వ్యక్తమగును. ఇట్టి వైభవమే జీవులు ఒకరినొకరు గుర్తుంచుకొనుటకు తోడ్పడును.

8. అటువంటి సృష్టి వైభవమునకు పరమాత్మయే రక్షకుడు, నివాసము, అయివున్నాడు. నామరూపములతో కూడిన ఈ సమస్త సృష్టికి సంపద మరియూ నివాసము కూడ నారాయణుడే.

9. ప్రపంచములో సంపదగలవారు అనేకులున్ననూ ఆ సంపద యొక్క అర్థము ఉపయోగము తెలిసినవారు లేరు. వారు కేవలము సంపద కలిగినవారే గాని పుట్టింపలేరు. సమస్త సంపదనూ పుట్టింపగలిగినవాడు నారాయణుడే. పుట్టింపగలిగినవాడు గనుక ఆయనకు వాని ఉపయోగము తెలియును. అనగా ఎవనికి ఎప్పుడు ఎటువంటి రూపమున సంపద కలిగింప వలెనో ఆయనకే తెలియును గనుకనే ఎవరి ద్వారా ఎటువంటి వినియోగము జరుగవలెనో ఆయనకే తెలియును. అనగా సంపదను వినియోగించుటయే గాని జీవులకు వినియోగము నందలి పరమార్థము తెలియదు. సంపదలు జనులు సుఖపడుటకు

సాధకములు. అనగా సంపదలు సూటిగా సుఖమును కల్పింపలేవు. కాని సంపదల ద్వారా సుఖపడుటకు వీలున్నది. సంపద దాచి యుంచువాడు, తనకు మాత్రమే ఉపయోగించువాడు, దానిని యితరులు అపహరింతురేమోయన్ని, భయపడుట ఆందోళన చెందుట, నిద్రపట్టకుండుట మున్నగువాని వలన సుఖమును కోల్పోవును. సంపదలను తోటి వారికి పంచి, వారితో కలిసి అనుభవించువాడు నిజమయిన సుఖవంతుడు. ఇది తెలిసిన వాడు నారాయణుడు. జీవులకు ఇట్లు జ్ఞానము కలిగించువాడు కూడా ఆయనయే.

65. శ్లో॥ శ్రీదఃశ్రీశ శ్శ్రీనివాసః శ్రీనిధిః శ్రీవిభావనః ।
శ్రీధరః శ్రీకరశ్శ్రేయః శ్రీమాన్ లోకత్రయాశ్రయః ॥

**ప్రతిపదార్థము :-** 1. శ్రీదః = సంపదనిచ్చువాడు, 2. శ్రీశః = సంపదకధిపతియైనవాడు, 3. శ్రీనివాసః = (లక్ష్మిదేవికి) సంపదకు నివాసమైన వాడు, 4. శ్రీనిధిః = సంపదకు మూలమైనవాడు, 5. శ్రీవిభావనః = సంపదను అనేక విధములుగా భావన చేయువాడు, 6. శ్రీధరః = సంపదను ధరించువాడు, 7. శ్రీకరః = ఇతరులకు సంపదను కలిగించువాడు, 8. శ్రేయః = ఇతరులకు హితము కూర్చువాడు, 9. శ్రీమాన్ = లక్ష్మీవంతుడు, 10. లోకత్రయాశ్రయః = మూడు లోకములకు ఆశ్రయమయినవాడు.

**తాత్పర్యము :-** నారాయణుడు సంపదలకు అధిపతి, మరియు ఇచ్చువాడు. ఆయన సంపదలకు మూలము, నివాసమే గాక ఇతరులకు కలిగించువాడు. అయన సంపదలను అనేక విధములుగా యితరులయందు భావన చేయువాడు మరియూ ఈ సమస్త సంపద తనయందు ధరించువాడు. ఆయన తనను ధ్యానించు వారికి హితమును గూర్చుటయే గాక మూడు లోకములకు ఆశ్రయమై యున్నాడు. ఎవరైననూ ఈ కోశములన్నింటిని సమీకరించి సామ్యము నందుంచుకొనగలిగినచో అతడు సమస్త సంపదలకు అధిపతియగును.

**వివరణ :-** శ్రీ అను శబ్దమునకు సంపద, వైభవము అని అర్థము. అనగా ఇంతకుముందు చెప్పినట్లు నామ రూపములతో కూడిన భగవంతుని సృష్టియే సకల జీవులకు నిజమయిన సంపద. ఈ సంపద తరుగనిది. ధనము వేరు, సంపద వేరు. ధనము సూటిగా సుఖమును కలిగింపలేదు. కాని సంపద

కలిగించును, సంపదలు తరిగిపోనివనగా అవి కావలసిన వానికి లభ్యములగును. ఆహారము, వస్త్రము మున్నగునవి నిజమయిన సంపదలు. అవి ఎంత కాలమయిననూ అయిపోవుటలేదు. మరల పండించుకొనుట, తయారు చేసుకొనుట, మున్నగువానివలన ఎప్పటికప్పుడు సంచితములగుచుండును. కనుక ''శ్రీ'' యను శబ్దమును ధ్యానము చేయువారికి సంపదలు కలుగును. అనగా అవి సాధించుకొను మార్గము సులువులు తెలియును. అంతేగాక ఈ శబ్దమును ధ్యానము చేయువానికి సృష్టియందు, జీవులయందు దాగియున్న నారాయణుని అస్తిత్వమే నిజమయిన సంపదయని తెలియును. నిజమయిన సంపద అనగా ఆయా వస్తువుల రూపము, నామము, మున్నగు వివరములతో అందు నారాయణుడే దాగియున్నాడన్న సత్యము అనుభవమగును. అట్టివారికి అజ్ఞానము, దురదృష్టము అనునవి లేవు. ఈ అక్షరమునే లక్ష్మీ మంత్రమందురు. ఈ మంత్రము భగవంతుని రూపముతో కలిపి ధ్యానము చేయుటకే ఇచ్చట యివ్వబడినది.

(ఇచ్చటనుండి మంత్రములు ఇవ్వబడును. అవి నారాయణుని యందు స్మరించి ధ్యానము చేయవలెను.)

66. శ్లో॥ స్వక్షస్స్వంగ శ్శతానందో నందిర్జ్యోతిర్గణేశ్వరః ।
విజితాత్మా విధేయాత్మా సత్కీర్తిశ్ఛిన్న సంశయః ॥

**ప్రతిపదార్థము :-** 1. స్వక్షః = చక్కని నేత్రములు గలవాడు, 2. స్వంగః = చక్కని అవయవములు కలవాడు, 3. శతానందః = నూరు విధముల ఆనందమును కలిగించువాడు, 4. నందిః = జీవుల ఆనందమునకు కారణమయిన వృషభము, 5. జ్యోతిః = కాంతి, 6. గణేశ్వరః = గణపతి, 7. విజితాత్మా = ఆత్మచే జయించువాడు, 8. విధేయాత్మా = ఆత్మచే అన్నిటిని లోబరచుకొన్నవాడు, 9. సత్కీర్తిః = మంచి పేరు, కీర్తి కలవాడు, 10. ఛిన్నసంశయః = సందేహములు నశించినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను చక్కని నేత్రములు, అవయవములు కలవానిగా, నూరు విధముల యితరులకానందము కలిగించువానిగా, జీవుల కానందము కలిగించు వృషభరాశిగా, అన్నిటి యందలి కాంతిగా, గణములకు అధిపతియైన

వానిగా, ఆత్మచే అన్నిటినీ నడుపువానిగా, మరియూ లోబరచుకొన్నవానిగా, మంచి పేరు మరియూ కీర్తి కలవానిగా, సందేహము నివృత్తి చేయువానిగా ధ్యానము చేయుము.

వివరణ :- 1,2. నారాయణుని నేత్రములు కరుణ, క్షేమము కలిగించునవి, భక్తులను దయతో చూచి రక్షించు చూపులు, నేత్రములు కలవాడు. అట్టి చూపులు మరియు రక్షించు సామర్థ్యము కలిగిన ఉత్తములైన వారందరూ నారాయణుని యొక్క భౌతిక వ్యక్త రూపములు. ఇందరిని వేరు వేరుగాకాక ఒక్కరి కనులు, ఒక్కరి అవయవములే ఇందరి యందును పని చేయుచున్నట్లు ధ్యానము చేయవలెను.

3. శతానందుడనగా బ్రహ్మ. ఆయన చూచువారికై అనేక భావములను కలిగించి, అంతర్యామియందు లయమగునట్లు కల్పించును.

4. రాశి చక్రమునందు వృషభరాశి చంద్రునికి ఉచ్చరాశి. శుక్రునికి స్వక్షేత్రము. శబ్దము, ఉచ్చారణ, సంగీతము, రంగు, కూర్పు, సమీకరణము, భౌతిక మనసుయొక్క సౌందర్యమును ఇది సూచించును. ఈ రాశియందు ధ్యానము చేయువారికి పై వానియందు దాగియున్న అంతర్యామి ప్రజ్ఞ మేల్కొనును. ఏప్రియల్ 21 నుండి మే 20 వరకు సూర్యుడు వృషభరాశిలో ఉండును. సూర్యుడు ఆత్మకు సంకేతము. అనగా ఆత్మ అయా లక్షణములు ధ్యానము చేయుటకు, ఆ నెలలో ఉన్ముఖమై యుండునని అర్థము. ధ్యానము, ధారణ, సమాధి అను అష్టాంగ యోగమునందలి చివరి మూడు స్థితులూ ఈ రాశి లక్షణములద్వారా మాత్రమే సాధ్యపడును. మనస్సు బుద్ధియందు లయమగుట, బుద్ధి ఆత్మయందు లయమగుట ఆత్మ అంతర్యామియందు లయమగుట, ధ్యానము, ధారణ సమాధి అనుస్థితులుగా చెప్పబడినవి.

5. వృషభరాశి కాంతి పుట్టుటకు కారణము. ఎందుచేతననగా కంటికి, చూపుకు ఈ రాశి అధిపతి. సూర్యుడు భౌతికముగా వ్యక్తమగుటకు, వెలుగుకు, అధిపతికాగా వృషభము కాంతి, పుట్టుక అనువాటికి ఆధిపత్యము వహించును.

6. గణపతి ఏనుగుతల గల దేవత. ఆయన గణములకు అధిపతి. గణములనగా గుంపులు. అంకెలను, శబ్దములను గుంపులుగా గణవిభజన

చేసి, అర్థము చేసుకొనుటను ఈయన కలిగించును. అందుచేతనే ఈయన విద్య నేర్చుకొనుట అనుదాని కధిపతి. జ్ఞానమునకును, వాక్కు, ఉచ్చారణకును సరస్వతి అధిదేవత. ఎదుటివారినుండి విద్యను నేర్చుకొనుటకు గణపతి అధిదేవత. ఈయన అనుగ్రహము వలననే వాక్యములు పదములుగా, అక్షరములుగా, విభజించి గ్రహించుట సాధ్యమగుచున్నది. అందుచేతనే గ్రంధపఠనముకూడా ఈయన అనుగ్రహము వలననే జరుగును.

7,8. ఇంద్రియములు, శక్తులు, దేహము, అనువాని సంయోగముతో శరీరమేర్పడును. వీటన్నిటిని ఒక్కటిగా పట్టియుంచుటయే యోగము. అట్లు ఆత్మయందు మేల్కొనినవాడు తన ఆత్మయందుగాక పరమాత్మయందు మేల్కొనును. ఇట్లు మేల్కొనుట మనస్సు, యింద్రియములు. దేహము అనువాని ఉపయోగము తెలిసి, నిత్యజీవితమునందు వానిని సద్వినియోగమొనర్చుకొనువానికి మాత్రమే సాధ్యమగును. అట్టి వారికి ఆత్మ జయింపబడి వశమగును. అనగా తాను, యితరులు, అను భేదము నశించి తానుగా మేల్కొనియుండుట సాధ్యమగును.

9. మానవుని సత్ప్రవర్తన, సత్‌చింతన అనువానికి వాని కీర్తియే ప్రతీక. ఒక వ్యక్తికి మంచి పేరున్నదన్నచో అతడు మంచిగుణములు కలవాడని అర్థము. కనుకనే పెద్దలు నలుగురిలో మంచి పేరు తెచ్చుకొనుట కూడా సాధకుని లక్షణములలో నొక్కటి అని చెప్పిరి. మంచి పేరు తెచ్చుకొన వలెనన్నచో తనయందు గల దురభ్యాసములను, కోపము, లోభము, పరుషముగా మాట్లాడుట మున్నగు దుర్లక్షణములను తగ్గించుకొని, ప్రశాంతముగా నుండుట, ప్రియముగా మాట్లాడుట, ఇతరులకు పనులు చేసి పెట్టుట, అను మంచి లక్షణములు తప్పనిసరిగా సాధించుకొనవలసి యుండును. కనుక మంచికీర్తి భగవంతుని రూపములలో నొకటి.

10. ఇట్లు సత్కీర్తిని సాధించుట, ఆత్మయందు మనస్సు మున్నగు వానిని లయము చేసుకొని, అన్ని కోశములకు సామ్యము సాధించుట అను వానివలన, జీవుడు పరిపూర్ణత చెందును. అట్టి స్థితిలోనున్నవానికి సంశయములుండవు. సంశయములు, పనులకు కారణములు వెతుకుట,

ఫలితములు కోరుట, మొదలగు మనస్సులోని కొన్ని పొరలు. మనస్సు బుద్ధియందు లయమగువానికి సంశయములుండవు. సృష్టియందలి అన్ని అణువుల యందునూ అంతర్యామిని దర్శించువానికి సందేహము లెక్కడనుండి వచ్చును?

67. శ్లో॥ ఉదీర్ణ స్సర్వతశ్చక్షురనీశ శ్శాశ్వతస్థిరః ।
భూశయో భూషణో భూతి ర్విశోక శ్శోకనాశనః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఉదీర్ణః = పైకి ప్రకాశించువాడు, 2.సర్వతశ్చక్షుః= అన్నిటియందు నేత్రము కలవాడు, 3. అనీశః = తనకన్నా పైన మరియొకడు లేనివాడు, 4. శాశ్వతః = శాశ్వతమయినవాడు, 5. స్థిరః = స్థిరమైనవాడు, 6. భూశయః = భూమియందు శయనించి యుండువాడు, 7. భూషణః = ఆభరణమైనవాడు, 8. భూతిః = వైభవము కలిగించువాడు, 9. విశోకః = శోకము లేనివాడు, 10. శోకనాశనః = శోకము నశింప చేయువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను పైకి ప్రకాశించువానిగా, అన్నివైపులా చూచువానిగా, తనకిపైన అధిపతిగా, యింకొకరు లేనివానిగా, శాశ్వతునిగా, స్థిరమైనవానిగా, భూలోకమునకు ఆభరణమై వైభవము కలిగించువానిగా, భౌతిక స్థితికి కారణమైనవానిగా, దుఃఖమునకు అతీతుడై దుఃఖము నిర్మూలనము చేయువానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1,2. సూర్యుడు తూర్పున ఉదయించి, మధ్యాహ్నము వరకు పైకి ప్రయాణము చేయును. అట్లే జీవునియందు, భౌతికస్థితినుండి ఆత్మయను స్థితికి ప్రయాణము చేయుటకు మార్గము కలదు. ఇది ఊర్ధ్వగమనమని చెప్పబడినది. ఇట్లు పైకి ప్రయాణము చేయుచున్న కొలది, మనస్సు వికాసవంతమై తేజోవంతమగును. అన్నిటియందు ''నేన''ను ప్రజ్ఞయే మేల్కొనును. ఇట్లు మేల్కొనుటకు సూర్యుడే కారణము. అన్ని వస్తువులను చూచుటకు సూర్యుని కాంతి ఎట్లు సహకరించుచున్నదో, అట్లే ఆత్మయను సూర్యుడు హృదయమునందు వెలుగుటవలన అన్నిటియందునూ పరమాత్మ అస్తిత్వము వెలుగును. కనుక సూర్యుడే జీవులకు నిజమైన నేత్రము. సూర్యుడు సౌరకుటుంబమున కధిపతి.

3. సూర్యుడనగా సూర్యగోళము కాదు. అందు ప్రకాశించుచున్న నేనను వెలుగు. ఈ నేనను వెలుగే అన్ని సూర్యగోళములయందు ప్రకాశించుచున్నది. సూర్యుని పైననే భౌతిక ప్రపంచము సమస్తము ఆధారపడి యున్నది. కనుక అయనకు వేరే అధిపతిలేడు. అయనయే అన్నిటికి అధిపతి.

4,5. కనుక సూర్యుడు సమస్తమునూ పరిపాలించుచున్నాడు. అయన సృష్టి ప్రారంభమునండి సూర్యగోళములుగా పుట్టుచూ మరల మరల క్రొత్త గోళములను శరీరములుగా ధరించుచున్నాడు. అనగా గోళములు పుట్టుచు అంతరించుచున్ననూ, సూర్యుడను వెలుగు మాత్రము అంతరించుట లేదు. కనుక ఈ వెలుగు శాశ్వతమైనది, మరియూ స్థిరమయినది. నారాయణుడే యిట్టి వెలుగుగా ప్రకాశించుచున్నాడు.

6. భౌతిక స్థితిలో నున్న సృష్టి రూపము, కొలతలు మున్నగువానికి లోబడి యుండును. కాని అందలి అణువులు, అణువులయందలి శక్తి మున్నగునవి మాత్రము ఈ కొలతలకు, రూపములకు అతీతమయినవి. అవి వాని యందలి అంతర్యామికి చెందియున్నవి. కనుక అంతర్యామియైన పరమాత్మయే భౌతిక స్థితిలోనున్న వస్తువులయందు, భూమియందు శయనించుచున్నాడు.

7. అట్లు నామ రూపములతో కూడి వ్యక్తమయిన భౌతిక సృష్టి అంతర్యామియైన పరమాత్మకు ఆభరణమువంటిది. మనస్సు నాకర్షించి తన్మయత్వము కలిగించుట వలన పరమాత్మయందు జీవప్రజ్ఞను లయము చేయుటలో, సౌందర్యము ప్రధాన పాత్ర వహించుచున్నది. ఈ సౌందర్యము రూపురేఖలతో కూడిన భౌతిక సృష్టి ద్వారా వ్యక్తమగును. కనుక అట్టి భౌతిక సృష్టియందు అంతర్యామిగా నున్న పరమాత్మకు మరల ఆ భౌతిక సృష్టియే ఆభరణమగుచున్నది.

8. కనుక భౌతిక సృష్టియందలి వైభవము పరమాత్మ సాన్నిధ్యమును జీవుల కప్రయత్నముగా కలిగించుచున్నది. ఇట్టి వైభవము వలన మనస్సు, ఇంద్రియములు ఒక దానితోనొకటి యోగము చెంది జీవునికి ఆత్మ సాన్నిధ్యమును కలిగించుచున్నది.

9,10. శోకము జీవునియందలి కామమయ శరీరమునకు చెందిన ప్రవృత్తి, సంబంధ బాంధవ్యములు భౌతికముగా మాత్రమే సత్యమని భావించువారు అధోలోకములకు చెందినా ప్రవృత్తి కలవారు. అట్టివారికి వారి అభిప్రాయములను పేర ఇతరులతో భేదములు కనిపించును. ఆ భేదములు తమ కయిష్టమయినచో దుఃఖము కలుగును. పరమాత్మ ఇట్టి దుఃఖముల కతీతముగా వారియందే ఉన్నాడు. మనస్సు దుఃఖపడుచున్నను మనస్సుగానున్న పరమాత్మ దుఃఖింపడు. మనస్సను వస్త్రమునకు పరమాత్మ ప్రత్తివంటి వాడు. దీనిని గమనించినవానికి దుఃఖమునకు కారణము తెలియును. అట్టి కారణములు తనయందలి కోరికలవలననే కలుగుచున్నవని తెలుసుకొన్నవానికి ఆ కారణములనుపసంహరించుకొనుట తెలియును. అనగా ఈ కారణముల వెనుక అసలు కారణమైన పరమాత్మయందు మనస్సు లీనమగుటచే దుఃఖము శాశ్వతముగా తొలగును. ఎందుచేతననగా పరమాత్మను గూర్చి ఆలోచించిన క్షణముననే తాను పరమాత్మగ నుండును. పరమాత్మయందు దుఃఖమునకు తావు లేదు. కనుక అట్లు ధ్యానము చేయు వానికి అప్రయత్నముగా దుఃఖము నశించి సంతోషము కలుగును.

68. శ్లో॥ అర్చిష్మానర్చితః కుంభో విశుద్ధాత్మా విశోధనః ।
అనిరుద్ధో ఽప్రతిరథః ప్రద్యుమ్నో ఽమితవిక్రమః ॥

**ప్రతిపదార్థము :-** 1. అర్చిష్మాన్ = తేజోవంతమైనవాడు, 2. అర్చితః = పూజింపబడినవాడు, 3. కుంభః = కుంభరాశి, 4. విశుద్ధాత్మా = పరిశుద్ధమయిన ఆత్మకలవాడు, 5. విశోధనః = శోధించి నిర్మలము చేయువాడు, 6. అనిరుద్ధః = నిరోధించుటకు శక్యముకాని వాడు, 7. అప్రతిరథః = ఎదురు లేనివాడు, 8. ప్రద్యుమ్నః = తేజస్సుతోకూడిన సృష్టిశక్తి, 9. అమితవిక్రమః = అమితమయిన పరాక్రమము గలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను తనంతట తాను ప్రకాశించుచు అర్చింపబడువానిగా, కుంభరాశియందు వ్యక్తమగు వానిగా, నిర్మలమయిన ఆత్మయను రూపమున తెలియబడువానిగా, మరియూ ఆత్మలను శోధించువానిగా, నిరోధించుటకు సాధ్యముగాని సృష్టియను రూపముగా, ఎదురు లేని రథముగలవానిగా, సృష్టిగా వెలుగుచున్న రూపమైనవానిగా, అమితమయిన

పరాక్రమము గలవానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. తేజస్సు భౌతికముగా ద్రవ్యముపై నాధారపడి యున్ననూ, అందలి వెలుగు అంతర్లోకములకు సంబంధించినది. ప్రజ్ఞ అంతర్లోకములకు సంబంధించినది. ప్రజ్ఞయనగా అంతర్లోకములలోనుండి భౌతిక లోకములలోనికి వ్యక్తమగు తేజస్సు. అట్టి నిజమయిన వెలుగు పరమాత్మయే.

2. అట్టి వెలుగును తెలియవలెనన్నచో సంప్రదాయ సిద్ధమయిన పూజ అవశ్యకము. అట్టి పూజ సక్రమముగా నియమితవేళకు ప్రతిదినము నిర్వహించుటవలన మనలో వెలుగు పుట్టును. ప్రశాంతముగా, స్పష్టముగా మంత్రములను, స్తోత్రములను ఉచ్చరించుచు, ఆ దేవతను హృదయము నందలి శ్వాస పుట్టుస్థానమున ధ్యానము చేయుచు, భౌతికముగా విగ్రహములనర్చించుచు, తనలోని వెలుగు భౌతికముగానున్న ఆ విగ్రహమునందలి వెలుగు ఒక్కటేనని ధ్యానము చేయవలెను. ఎన్ని దేవతల స్తోత్రములు చదివి పూజ చేసినను అభ్యంతరము లేదుకాని ఇన్నిటి రూపమున ఒక్కటే వెలుగు ఆయా దేవతలుగా వ్యక్తమగుచున్నదని మరువరాదు. పూజచేయునపుడు ఆతృతతో, చికాకుతో, వేగిరపాటుతో చేయరాదు. పూజకెట్టి ఆటంకములు కలిగిననూ అవి తన మనస్సును పరీక్షించుటకు భగవంతునిచే కల్పింపబడినవను విషయమును విస్మరింపరాదు. పూజచేయుటను గూర్చి పట్టుదల, తాపత్రయము నుండక, ప్రతిదినము నియమిత వేళకు అప్రయత్నముగా చేయవలెను. షికారు పోవువాడు, గానము చేయువాడు, ఎట్లు అప్రయత్నముగా వానిని నిర్వహించునో, తాను కూడా అట్లే నిర్వర్తింపవలెను. పూజయన్నది మన మనస్సునందలి ఆవేదనలు, ఆందోళనలు తొలగి నేనను వెలుగు స్థిరముగా నిలుచుటకేనని మరువరాదు. అన్ని స్తోత్రములు ప్రతిదినము చదివి తీరవలెనని పట్టుదల యుండరాదు. వీలుననుసరించి చేయవలెను. ఇట్లాచరించువానికి కొంతకాలమగుసరికి అప్రయత్నముగా నేనను వెలుగు అందరియందు గోచరించును. మనసు; ప్రశాంతముగా, ఆహ్లాదముగా, సంతృప్తికరముగా నుండును.

3. కుంభరాశి మానవజాతి పరిపూర్ణతయందు ప్రథమ స్థానము వహించును. ప్రస్తుతము మనము కుంభయుగము (Aqarian Age) నందున్నాము.

ఈ రాశి వలన మనస్సు విశాలమై మానవజాతికి జ్ఞానమునందు పరిపూర్ణత కలుగును. పరిపూర్ణత చెందిన జీవులు అంతర్యామియందు లీనమగుదురు. ఇట్టి పరిపూర్ణస్థితిని కుంభరాశి సూచించును.

4. అట్టి పరిపూర్ణస్థితిలో నున్న ఆత్మను పరిశుద్ధాత్మ యందురు. దేహమునందలి అన్ని కోశములు నిర్మలమై ఇన్నిటియందలి ''నేను''ను ఒకటే వెలుగు దర్శనమగుట విశుద్ధాత్మ యనబడును. విశుద్ధి చక్రము అనగా కంఠమునందు ప్రకాశించుచున్న అంతర్యామి వెలుగు. ఇది జ్ఞానమునూ కర్మాచరణమునూ జీవులకు కలిగించును. మనస్సు వికసించి స్వచ్ఛమగు ప్రక్రియ ఈ రాశియందే కలుగును. తనకు తెలిసిన విషయములను ఆచరించుట వలన మరికొన్ని సత్యములు తెలియును ఇట్లు అచరించుట, తెలియుట, ఒకదానిపై నొకటి ఆధారపడి యున్నవి. ఇవి ఒకే నాణెమునకు రెండు వైపులవంటివి. దీనినే జ్ఞానయోగము, భక్తియోగము అను పేర జీవులు విభజించుకొని మాయలోపడి నిజమయిన జ్ఞానమును, భక్తిని కోల్పోవుచున్నారు. తెలిసినదానిని ప్రేమతో ఆచరించుట వలన మాత్రమే ఈ రెండిటికి సమన్వయ మేర్పడి అన్ని సత్యములయందు అంతర్లీనముగానున్న పరమ సత్యము గోచరించును. ఇట్లు జీవుని మనస్సు క్షాళనమై పరిపూర్ణత్వము చెందుట విశుద్ధి చక్రమువలన జరుగును. గనుక పరమాత్మ విశుద్ధాత్మ యనుపేర అర్చింపబడుచున్నాడు.

5. అట్లు కర్మాచరణమువలన మనస్సునకు పరిపూర్ణత కలుగును. కర్మలు, వాటికి కారణములు, మరియు వాటి ఫలితములు అను త్రికోణమునకు పరమాత్మయే అధ్యక్షుడుగానున్నాడు. జీవునియందు కోరికలు, పనులు, వాని ఫలితములుగా ప్రతిబింబించుచున్న త్రికోణమునందు తానుగాక పరమాత్మయే అధ్యక్షుడని అంగీకరించి కర్మలనాచరించువానికి ఫలితములతో సంబంధము తెగిపోవును. జరుగు ఫలితములన్నియు సుఖదుఃఖముల సమ్మిశ్రమముగాకాక తన శిక్షణకై జరుగుచున్న నిత్యజీవితమునందలి సంఘటనలుగా బోధపడును. అప్పుడు శిక్షణయే ప్రాముఖ్యముగాని లాభనష్టములు ప్రాముఖ్యములుగావు. ఒక వ్యాపారస్థుడు తన కుమారుని వ్యాపారమునందు శిక్షణనిచ్చుటకై మొదట స్వల్పద్రవ్యమునిచ్చి స్వతంత్రముగా వ్యాపారము చేయమని ప్రోత్సాహించును.

కుమారుడు తప్పులు చేయుచున్ననూ, వ్యాపారమునందు నష్టము వచ్చుచున్ననూ చూచుచు నూరకుండునుగాని కల్పించుకొనడు. కుమారునకు తండ్రి ఉదాసీనత బాధకలిగించిననూ, తరువాత అందలి పరమార్థము తెలియును. పిదప అట్టివానికి ఎటువంటి వ్యాపారము అప్పచెప్పిననూ, ఎంత పెట్టుబడి నిచ్చిననూ కౌశలముతో వ్యాపారము నిర్వహించి లాభము గడించును. ఇందలి కుమారుడే జీవుడు. వ్యాపారమే జీవితము. పరమాత్మయే తండ్రి.

6,8. ఇట్లు జీవులకు శిక్షణనిచ్చుటకై పరమాత్మయను వెలుగు అంతర్లోకములనుండి బహిర్లోకములలోనికి మనస్సు, బుద్ధి, ఇంద్రియములను వాని రూపమున ప్రకాశించుచున్నది. ఆ వెలుగు భౌతికము కాదు గనుక అడ్డు పెట్టుటకు వీలుకాదు. కనుక పరమాత్మ ప్రద్యుమ్నుడనియూ అనిరుద్ధుడనియూ పిలువబడినాడు.

7. సూర్యుడు తూర్పున పుట్టి పడమట అస్తమించుచున్నాడు. మరల తూర్పున ఉదయించుచున్నాడు. ఇట్లు ఉదయించుచున్న సూర్యగోళమే సూర్యుని రథము, సూర్యుడు తన రథముతో భూమి చుట్టూ ప్రదక్షిణము చేయుచున్నాడు (అట్లు కనిపించుచున్నాడు), ఇట్లు తిరుగు ఆయన రథము అపుటకు అడ్డు పెట్టుటకు వీలు లేనిది. ఆయన సారథి అనూరుడు లేక అరుణుడు. సూర్యోదయమునకుముందు సూర్యుని ఎఱ్ఱని రేఖలు తూర్పున మొట్టమొదట ఉదయించును. ఈ అరుణవర్ణము మొట్టమొదట కనుపించును గనుక సారథిగా చెప్పబడెను. అట్లే జీవునికి వాని జీవితమను రథము ఒక జన్మనుండి మరియొక జన్మకు అప్రతిహతముగా సాగిపోవుచునే యుండును. అనగా శరీరములు మారుచున్ననూ ప్రయాణమాగదు. ఇట్లు జీవుడుగా, వాని రథముగా నున్నది పరమాత్మయే గనుక ఆయన రథము నిరోధించుటకు సాధ్యము కాదు.

9. జీవులలో నున్న పరాక్రమము భగవంతుని కళలలో నొకటి. అట్టి ఆయన పరాక్రమము కొలుచుటకు వీలులేనిది. అది ఆవశ్యకతను బట్టి దమింపవలసిన దుష్ట శక్తులకు మించిన పరాక్రమముగా వ్యక్తమగును. గనుక అట్టి పరాక్రమము పరమాత్మయే.

69. శ్లో|| కాలనేమినిహా వీర శ్శౌరిశ్శూరజ్జనేశ్వరః |
త్రిలోకాత్మా త్రిలోకేశః కేశవః కేశిహా హరిః ||

**ప్రతిపదార్థము** :- 1. కాలనేమి నిహా = కాలనేమి యను రాక్షసుని సంహరించినవాడు, 2. వీరః = వీరుడు, వీరత్వమే ఆయన రూపము మరియు సృష్టికి నాయకుడు, 3. శౌరిః = ప్రకాశించువాడు, 4. శూరః = శౌర్యము గలవాడు, 5. జనేశ్వరః = జనులకధిపతి, 6. త్రిలోకాత్మా = మూడు లోకములకు ఆత్మగానున్నవాడు, 7. త్రిలోకేశః = మూడులోకములకు అధిపతి, 8. కేశవః = కిరణములే తన కేశములైనవాడు (సూర్యుడు), 9. కేశిహా = కేశియను రాక్షసుని సంహరించినవాడు, 10. హరిః = చెడును, పాపమును నశింప చేయువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను కాలనేమి మరియు కేశి అను రాక్షసులను సంహరించువానిగా, జనుల కధిపతియై ప్రకాశించు నాయకునిగా, మరియు శూరునిగా ధ్యానము చేయుము. ఆయన మూడు లోకములకు ఆత్మ మరియు అధిపతి. ఆయన దుష్టశక్తులను, పాపములను నాశనము చేయువాడు.

**వివరణ** :- 1. కాలనేమి కాలమునననుసరించి మనసునందేర్పడు సంకుచితత్వము. దీనివలన పదవీ కాంక్ష, అధికార వ్యామోహము పుట్టును. ఈ లక్షణమే ద్వాపరయుగమున కంసుడను రాక్షసుడుగా జీవులను బాధింపగా శ్రీకృష్ణుడు వానిని సంహరించెను. అట్లే కేశి కంసుని సోదరుడు. అతడు కూడా శ్రీకృష్ణునిచే సంహరింపబడెను.

2,3,4. శ్రీరాముడు, శ్రీకృష్ణుడు, పరశురాముడు అనువారు వీరులై మరియు నాయకులై ప్రజలను రక్షించిరి. వారిలో శ్రీకృష్ణుడు పాండవులు మున్నగు వీరులకు నాయకుడై ప్రజలను ధర్మమార్గమున నడిపెను. అట్లే వారియందలి శౌర్యము, నాయకత్వమను లక్షణములు నారాయణుని రూపములే.

5. జనులనగా పుట్టుట అను స్వభావము గలవారని అర్థము. జీవుల పుట్టుకకు పరమాత్మ అధిపతి కనుక పరమాత్మ సర్వజీవులకు అధిపతిగా ఉన్నాడు.

6,7. పరమాత్మ మూడు లోకములయందునూ నిండి యున్నాడు. జీవుని యందలి ఈ మూడు లోకములు భౌతికము, మానసికము మరియూ ప్రజ్ఞామయము. ఇవియే మనకు శరీరము, మనస్సు మరియు ఆత్మగా అనుభవమగుచున్నవి. అవి నారాయణుని నుండి పుట్టినవి గనుక వాటి కధిపతి నారాయణుడు. ఈ మూడు లోకములయందు నారాయణుడే ఆధిపత్యము వహించి యున్నాడు గనుక 'త్రిలోకాత్మా' యని పిలువబడినాడు.

8. పరమాత్మ సృష్టి ప్రారంభమున హిరణ్యగర్భాండముగా పుట్టెను. అట్టి హిరణ్యగర్భమను వెలుగునుండి ప్రకృతి సత్యములు, ధర్మములు మరియూ జీవులు అను కిరణములు అనేకములు బయలుదేరి వచ్చును. ఇవియే నారాయణుని కేశములు. దీని ననుసరించియే తల్లి గర్భమున పిండమునకు శరీరమున వెంట్రుకలు పుట్టినవి.

9. కేశిహా అను పదమున కర్థము పైన చెప్పబడినది.

10. హరి యనగా జీవుల పాపములను హరించువాడు. చేసిన పాపములను హరించుటకాక పాపము చేయు బుద్ధిని, ధ్యానము చేయువారి యందు తొలగించును. కనుక పాపము చేయు బుద్ధి నశించినవారికి పాప ఫలితములను అనుభవింపవలసిన ఆవశ్యకత లేదు. రోగనివారణయైనచో మందు త్రాగనక్కరలేదు గదా!

70. శ్లో॥ కామదేవః కామపాలః కామీకాంతః కృతాగమః ।
అనిర్దేశ్య వపుర్విష్ణుర్వీరో ఽనంతో ధనంజయః ॥

**ప్రతిపదార్థము** :- 1. కామదేవః = కోరికలకధిదేవత, 2. కామపాలః = కోరికలను పరిపాలించువాడు, 3. కామీ = కోరువాడు, 4. కాంతః = కోరబడినవాడు, 5. కృతాగమః = శాస్త్రము, సంప్రదాయము నిర్మించుకొన్నవాడు, 6. అనిర్దేశ్యవపుః = నిర్దేశించుటకు వీలులేని శరీరము కలవాడు, 7. విష్ణుః = అంతటను వ్యాప్తి చెందువాడు, 8. వీరః = వీరుడు, 9. అనంతః = అనంతుడనుసర్పము, 10. ధనంజయః = ధనమును జయించినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను కోరికలకధిదేవతగా, కోరికలను కలిగించి పాలించువానిగా మరియూ కోరబడినవానిగా ధ్యానము చేయుము. ఆయన

మనయందు శాస్త్రమును, సంప్రదాయమును నిర్మాణము చేయువాడు. ఆయన శరీరము నిర్దేశించుటకు సాధ్యముకాదు. చుట్టలుగా విచ్చుకొనుచున్న అనంతుడను కాలసర్పముగా, ధనమును జయించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. కామదేవుడు కోరికలకధిపతి. ఆయన విష్ణువు కుమారులలో నొకడు. సృష్టి ప్రారంభమగుటకు కూడా సృష్టియందలి కోరికయే కారణము. కాని తన యందు కలిగిన ఈ కోరికకు నారాయణుడు అతీతముగా నిలచును గనుక ఆయన తన కోరికచే తాను బంధింపబడలేదు. జీవుడు తన యందు కలిగిన కోరికలు తనవిగా భ్రాంతి పడును. కనుక బంధితుడయ్యెను.

2. అట్లు బంధితుడు కానివానికి కోరికలు వాని సంకల్పములుగా కాక దైవసంకల్పములుగా పనిచేయును. అట్టివానికి కోరికలపై ఆధిపత్యము కలిగి కోరికలను పాలించువాడగును. అట్లు పాలింప వలెనన్నచో తనయందు కోరికలు ఎచ్చటనుండి పుట్టుచున్నవో దానిని గమనింపవలెను. ఇట్లు ప్రతి దినము ధ్యానము చేయువానికి కోరికలు తనయందు పుట్టుచున్నను, తనవిగావని తెలియును. అప్పుడు వానిద్వారా భగవంతుని సంకల్పములు పనిచేయును.

3. ఇది తెలిసిన వానికి సంకల్పములు పుట్టుచోటు మనస్సనియు, ఆ మనస్సు నారాయణునినుండి పుట్టినదనియు తెలియును. నిజమునకు కోరునది, సంకల్పించునది మనస్సేగాని జీవులయందలి ఆత్మకాదు.

4.. అంతేగాక మనము కోరు అంశములు లేక విషయములు నారాయణుని భౌతిక రూపములే. అట్టి నారాయణుని అస్తిత్వమే మనము సౌందర్యమని. ఆకర్షణయని పొరబడుచున్నాము.

5. శాస్త్రములనగా ప్రకృతియందలి సత్యములు లేక ధర్మములు. అట్టి ధర్మమునను సరించి మానవుడేర్పరచుకొనిన మార్గమే సంప్రదాయము. ఈ శాస్త్రములు, ధర్మములు, సంప్రదాయములు, పరమాత్మ వెలుగునుండి ప్రసరించుచున్న కిరణములే.

6. మన శరీరమని మనము భావించునది మనస్సు కల్పించుకొనుచున్న ఆకారమేకాని సత్యముకాదు. శరీరము ఎట్లు ఆకారముగా నిలబడియున్నది.

దాని పుట్టుక యున్నగుణవి గమనించుటకుగాని, నిర్వచించుటగాని, సాధ్యముగాదు. దాని నట్లుగానే గ్రహించి అర్థము చేసుకొనవలసియుండును. సౌరకుటుంబమునుండి మానవులవరకు శరీరములు ఎట్లు ఏర్పడుచున్నవో, వాని వెనుక ఎన్ని వేల శక్తులు పనిచేయుచూ సామ్యస్థితి యందున్నవో నేటికి ఊహకందని సత్యములు. ఇదియంతయు పరమాత్ముని క్రీడ.

7,8. (ఇంతకుముందు వివరింపబడినవి.)

9. కాలము మొదలు, చివరలు లేనిది. అనగా అంతులేనిది. దినము సూర్యోదయమయుతో ప్రారంభమయి రాత్రియందు అంతమగుచున్నట్లు కన్పించుచున్ననూ, దినములుగా, నెలలుగా, సంవత్సరములుగా కనిపించు కాలము అనంతమైనది. ఇట్లు అనంతమయిన కాలము, చుట్టుకొనియున్న సర్పముగా దర్శింపబడెను. ఇట్టి అనంతుడను సర్పము నారాయణుడే.

10. ప్రతివారిచే పొందదగిన ధనము నిక్షిప్తముగా వారియందే దాచియుంచబడినది. అట్టి ధనమే ''నేను''. ప్రతివారునూ తమయందే దాచియుంచిన ఈ ధనమును జయించి వశము చేసుకొనవలసియుండును. అట్లు జయించుట తమయందలి నారాయణుని వలననే సాధ్యమగుచున్నది.

71. శ్లో॥ బ్రహ్మణ్యో బ్రహ్మకృద్బ్రహ్మా బ్రహ్మ బ్రహ్మ వివర్ధనః ।
బ్రహ్మ విద్బ్రాహ్మణో బ్రహ్మీ బ్రహ్మజ్ఞో బ్రాహ్మణ ప్రియః ॥

**ప్రతిపదార్థము** :- 1. బ్రహ్మణ్యః = బ్రహ్మము ననుసరించువాడు, 2. బ్రహ్మకృత్ = బ్రహ్మను సృష్టించువాడు, 3. బ్రహ్మ = అంతటను వ్యాప్తి చెందువాడు, 4. బ్రహ్మ = సృష్టికర్త, 5. బ్రహ్మవివర్ధనః = జ్ఞానమును వివరించువాడు, 6. బ్రహ్మవిత్ = బ్రహ్మను తెలిసినవాడు, 7. బ్రాహ్మణః = బ్రహ్మననుసరించి జీవించువాడు, 8. బ్రహ్మీ = బ్రహ్మను కుమారునిగా పొందినవాడు, 9. బ్రహ్మజ్ఞః = బ్రహ్మను తెలిసినవాడు, 10. బ్రాహ్మణప్రియః = బ్రహ్మయందు జీవించువారికి ప్రియమయినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను బ్రహ్మ ననుసరించువానిగా, సృష్టికర్తను పుట్టించిన వానిగా, సృష్టికర్తగా, శ్వాసను జయించినవానిగా, అన్నిటిని అధిగమించి

పరమాత్మయొక్క అస్తిత్వమును ఎరిగినవానిగా, తెలుసుకొను వానిగా, యజమానిగా, పరమాత్మను గూర్చి తెలుసుకొనువానిగా, భగవంతుని అనుసరించు వారికి ప్రియమయిన వానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- బ్రహ్మము రెండు విధములుగా వ్యక్తమగుచున్నది. (1) ఒక్కటిగానున్న ప్రజ్ఞ అనేకముగా నగుట. (2) అట్లు అనేకముగా నున్నవి మరల ఒకదానికొకటి సారూప్యతచే తమయందలి ఏకత్వము తెలియుట. అందుమొదటిది బ్రహ్మదేవుడను ప్రజ్ఞగా వ్యక్తమై సృష్టిపుట్టుటకు కారణమగుచున్నది. ఒక్కటిగానున్న ఆత్మ లేక నేనను ప్రజ్ఞ బుద్ధిగా, మనస్సుగా, ఇంద్రియములుగా, భౌతిక అవయవములుగా భిన్నత్వము నందును. ఇట్టి భిన్నత్వమే బ్రహ్మయొక్క సృష్టి. బ్రహ్మకు నాలుగు ముఖములు కలవు. అవియే నాలుగు దిశలు, నాలుగు స్థితులుగా వ్యక్తమగుట. ఇది భగవంతుని పురుషస్థితి. రెండవ స్థితియందు భగవంతుడు అంతటనూ వ్యాప్తిచెందినవాడుగా దర్శించబడుచున్నాడు. ఈ రెండవస్థితి యందు ఆయన బ్రహ్మము అను స్త్రీ, పురుష తత్త్వములకు అతీతమగు శక్తిగా దర్శించబడుచున్నాడు. ఇదియే వేదము లేక సృష్టియందలి విజ్ఞానము. ఇట్టి జ్ఞానము కలిగినవాడు ''బ్రాహ్మణుడు'' అనబడును. అట్టివారికి బ్రహ్మయే ప్రియమైనవాడు కనుక నారాయణుడు బ్రాహ్మణప్రియుడు.

72. శ్లో॥ మహాక్రమో మహాకర్మా మహాతేజా మహోరగః।
మహాక్రతు ర్మహాయజ్వా మహాయజ్ఞో మహాహవిః ॥

**ప్రతిపదార్థము** :- 1. మహాక్రమః = గొప్ప అడుగులు కలవాడు. 2. మహాకర్మా = గొప్ప కర్మ కలవాడు, 3. మహాతేజా = గొప్పతేజస్సు కలవాడు, 4. మహోరగః = గొప్ప సర్పము, 5. మహాక్రతుః= గొప్పక్రతువు 6. మహాయజ్వా = గొప్ప యజ్ఞమును నిర్వహించువాడు, 7. మహాయజ్ఞః = గొప్ప యజ్ఞము, 8. మహాహవిః = గొప్ప హవిస్సు.

**తాత్పర్యము** :- పరమాత్మను గొప్ప అడుగులు గలవానిగా, గొప్ప కర్మగలవానిగా, గొప్ప తేజస్సుగా, గొప్పసర్పముగా, గొప్ప యజ్ఞముగా, గొప్ప యజ్ఞకర్తగా, గొప్ప క్రతువుగా, క్రియనిర్వాహకునిగా, గొప్ప హవిస్సుగా, ధ్యానము

చేయుము.

**వివరణ** :- 1. పరమాత్మ మూడడుగులలో సమస్తసృష్టిని అక్రమించెను. మిక్కిలిపెద్దవైన తన పాదములలో ఒక పాదముతో భూమిని, ఒక పాదముతో ఆకాశమును, మరియొక పాదముతో తానను ప్రజ్ఞను ఆక్రమించెను. ఇదియే త్రివిక్రమావతారము.

2. పరమాత్మ సృష్టియను గొప్ప కర్మకలవాడు. భగవంతునిచే సంకల్పింపబడిన ఈ కర్మ, కార్యకారణ సంబంధముచే నేర్పడుచున్నది. ఈ కార్యకారణ సంబంధము గొలుసుకట్టుగా నేర్పడి ఒకదానితో నొకటి బంధింపబడి యుండును. అనగా ఎట్టి వాడైననూ కర్మను తప్పించుకొనలేడు. సృష్టియందలి సమస్త జీవులు కర్మచేయవలసినదే. అనగా కర్మ అప్రయత్నముగా వారిచేత చేయింపబడును. కనుకనే శ్రీకృష్ణుడు తనకు కర్మ చేయనవసరము లేకున్ననూ ఇతరులను గూర్చి కర్మ చేయుచున్నానని తెలిపెను. అనగా దేహధారులకు కర్మ తప్పనిసరి యనియూ, శ్వాసించుట, ఆహారము తీసుకొనుట, మున్నగు పనులు చేయనిదే జీవించుట అసాధ్యమనియూ తెలియుచున్నది. ఇట్లు తన వలన జరుగు కర్మకు తనకు సంబంధములేదు. కారణములు తాను సంకల్పించినవి కాకున్నచో ఫలితములు తనను బాధింపవు. ఒకడు ఇంకొకనిని కత్తితో చీల్చినచో వాడు శిక్షకు లోనగుట, బాధపడుట యుండును. కానీ ఆ చీల్చినవాడు, శస్త్ర వైద్యుడయినచో అతడు రోగి హితము కోరి చేసెను గనుక అతడు చేసిన పనికి బహుమానములు, పొగడ్తలు లభించును. ఇందు మొదటివాడు స్వార్థముతో ఉద్రేకముతో చీల్చెను. రెండవవాడు రోగి హితమును కోరి చీల్చెను. సంకల్పములు ఇద్దరి యందు సమానమే యైననూ మొదటి వానిని బంధించును. రెండవ వానిని బంధింపదు. పరమాత్మ తన కర్మచే తాను బంధింపబడడు. జీవులు బంధింపబడుదురు. అగ్ని, సూర్యుడు, చంద్రుడు మున్నగు వెలుగులన్నియూ పరమాత్మయను వెలుగువలన పుట్టుచున్నవి. ఈ వెలుగులన్నిటికన్నా నిజమయిన వెలుగు పరమాత్మయే. ఆయన వలననే జీవులలో నేనను ప్రజ్ఞ వెలుగుచున్నది. కనుక పరమాత్మ అన్ని వెలుగులను మించిన గొప్ప వెలుగు.

4. ఆది శేషువు లేక అనంతుడు, అంతులేని చుట్టలుగా వ్యక్తమగుచున్న శాశ్వతమయిన మహా సర్పము. ఈ చుట్టలయందే పరమాత్మయొక్క నివాసమున్నది. దానినే వైకుంఠమందురు. వ్యక్తమగుచున్న సృష్టియొక్క భౌతిక రూపమే వైకుంఠమునకు ప్రతిబంధకము. దానియందలి నారాయణుని అస్తిత్వమును గమనించినచో అదే వైకుంఠమగును.

5. క్రతువనగా సృష్టి. ప్రణాళిక ననుసరించి నిర్వహించబడు పనుల ప్రణాళిక.

6. అట్టి క్రతువును నిర్వహించువానిని కర్తయందురు. ఆ కర్త సృష్టియందు తన పాత్ర నిర్వహించుచున్న దేవత వంటివాడు. ఈ సృష్టియే ఒక మహాక్రతువైనచో నారాయణుడే ఆ మహాక్రతువునకు కర్తయగుచున్నాడు.

7. అట్టి పరమాత్మ నిర్వహించు ఈ యజ్ఞమునందు అయనకు స్వార్థము లేదు. కాలము, దేశము అను వానితో కూడిన యజ్ఞమునందు పరమాత్మ తననుతాను సమర్పణము చేసికొనును.

8. హవిస్సు అనగా హోమమునందు దేవతల కొరకు సమర్పించునది. సృష్టియను యజ్ఞమునందు ద్రవ్యము నిర్మాణమగుట, పచనమైన ఆహారము దహనము చెందుట మున్నగునవి దీనికుదాహరణములు.

73. శ్లో॥ స్తవ్యస్తవప్రియస్స్తోత్రం స్తుతిస్స్తోత్రారణప్రియః ।
పూర్ణః పూరయితా పుణ్యః పుణ్యకీర్తి రనామయః ॥

**ప్రతిపదార్థము** :- 1. స్తవ్యః = పొగడ దగినవాడు, 2. స్తవప్రియః = పొగడబడుటచే సంతోషపడువాడు, 3. స్తోత్రః = పొగడ్త, 4. స్తుతిః = పొగడబడినవాడు, 5. స్తోత్రాః = స్తోత్రము చేయువాడు, 6. రణప్రియః = యుద్ధమును యిష్టపడువాడు, 7. పూర్ణః = నిండి యున్నవాడు, 8. పూరయితా = నిండుటకు కారకుడైనవాడు, 9. పుణ్యః = పవిత్రము చేయువాడు, 10. పుణ్యకీర్తిః = పవిత్ర మొనర్చు కీర్తి కలవాడు, 11. అనామయః = అవయవ లోపము లేనివాడు.

**తాత్పర్యము :–** పరమాత్మను పొగడదగినవానిగా, ప్రార్థింపబడువాడు, ప్రార్థించుట, ప్రార్థన అను మూడు తానేయైనవాడుగా ధ్యానము చేయుము మరియు పూర్ణత్వముగా, పూర్ణత్వము కలిగించువానిగా, పుణ్యమే తన రూపముగా, పుణ్యమును కీర్తివంతము చేయువానిగా, అన్ని అవయవ లోపములూ, బాధలూ తన నామస్మరణచే నిర్మూలించువానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :–** 1. స్తోత్రము చేయదగినవాడు పరమాత్మ యొక్కడే. ఆయన స్తోత్రము చేసినవారికి తన సాన్నిధ్యము కలిగించును. భగవంతుని స్తోత్రము చేయుటయే ప్రార్థన. అట్లు ప్రార్థన చేసినవారికి తన సాన్నిధ్యము వారియందే కలిగించును. అనగా ధ్యానము చేయువారి రూపమున నారాయణుడే యుండును.

2. నారాయణుడు ధ్యానము చేయువారియందు ప్రసన్నుడై యుండును. ప్రసన్నుడగుట యనగా మనకు తెలిసినట్లు కాదు. మానవులు ఒకరింకొకరియందు ప్రసన్నులై అనగా సుముఖులై యుందురు. నారాయణుని ప్రసన్నత ధ్యానము చేయువారియందే, వారి రూపముగా వారి మనస్సుగా పని చేయును. నారాయణుడు ప్రసన్నత వహించుట యనగా ధ్యానము చేయువారు ఇతరులయందు ప్రసన్నులై యుండుట.

3. స్తోత్రములు నారాయణుని రూపములు శబ్దము, భావము, చేయుట, అను స్థితులయందు పరమాత్మయే వ్యక్తమగుచున్నాడు. స్తోత్ర ఉచ్చారణ వలన నారాయణుడే అట్టి స్తోత్రరూపమున నిలిచి తన సాన్నిధ్యమును జీవులకు కలిగించును.

4,5. స్తోత్రము చేయువాడు కూడా నారాయణుని రూపమే. అతడు పరమాత్మనుండి పుట్టి మరల పరమాత్మయందు లీనమగును గనుక అతడు నారాయణుని రూపము. స్తోత్రము చేయువాడు, స్తోత్రము, స్తోత్రము చేయబడువాడు అను మూడునూ ఒకే త్రికోణమునందలి మూడు కోణములు. ఈ త్రికోణమే నారాయణుని రూపము.

6. భాగవత ధర్మము సృష్టిధర్మమే. అట్టి ధర్మమును కాపాడుటకై పోరాడువారి పోరాటము భగవంతునికి ప్రియమయినది. దాని వలన వారు పవిత్రులగుచున్నారు.

7,8. నారాయణుడే పూర్ణత్వము, మరియూ ఇతరులకు పూర్ణత్వము కలిగించువాడు. సమస్త సృష్టికి తాను మూలము, ఆధారమునై యున్నాడు. అనగా

సృష్టి ఆయనయందు పుట్టుచూ, ఆయనయందే లయమగుచున్నది. కనుక ఆయనయే పూర్ణత్వము, మరియూ పూర్ణత్వము కలిగించువాడు.

9,10. మంచిపని, మంచిపేరు అనునవి తానేగాక ఇతరులు కూడా బాగుపడుటకు ఉపయోగించును. ఒక దేవాలయ నిర్మాణము నొకడు సంకల్పించి అందరిని ప్రోత్సహించి దగ్గరుండి పూర్తిచేయించెను. అతనిని చూచి అందరునూ విశేషముగా చెప్పుకొందురు. అదిచూచిన మరియొకడు తాను కూడా అట్టి మంచిపేరును ఎందుకు పొందరాదని తలచి మరియొక దేవాలయ నిర్మాణమునో, పాఠశాల నిర్మాణమునో సంకల్పించి పనిచేయును. ఇట్లు మంచిపని చేయుటవలన కలుగు కీర్తి, యితరులు మంచిపనులు చేయించుటకు ఉపయోగపడును. కనుక అట్టి కీర్తి, మంచిపని రెండును నారాయణుడే.

11. జీవులలోనున్న లోపములు, వైకల్యములు, జీవుల మనస్సులకు సంబంధించినవి. భౌతికముగా అంగవైకల్యముతో పుట్టువారికి కారణము ఇదియేనని నవీన వైద్యశాస్త్రములయందు ఇంకనూ పరిశోధింపబడని విషయము. శిశువు గర్భమునందున్నపుడు తల్లి మనస్సు తీవ్రసంఘర్షణకు లోనయిననూ, ఆకస్మిక మానసిక పరిమాణములు కలుగుటవలననూ, గర్భమునందలి శిశువునకు అంగవైకల్యమేర్పడును, పరమాత్మయందు భక్తికలిగి ధ్యానము చేయువారికి, వారి మనస్సులయందు వైకల్యములు తొలగింపబడి మనసు స్వచ్ఛమగును. అట్లు స్వచ్ఛమయినవారి శరీరములందుగల అవయవ లోపములు కూడా తొలగింపబడుటయూ కలదు. కనుక నారాయణుడు ఎట్టి వైకల్యములూ లేనివాడు.

74. శ్లో॥ మనోజవ స్తీర్థకరో వసురేతా వసుప్రదః
వసుప్రదో వాసుదేవో వసుర్వసుమనా హవిః ॥

**ప్రతిపదార్థము :-** 1. మనోజవః = వేగవంతమైన మనస్సు కలవాడు, 2. తీర్థకరః = మనస్సునందలి బంధములను తొలగించువాడు, 3. వసురేతా = విశ్వమే తనయందు బీజముగా గలవాడు, 4. వసుప్రదః = ఇతరులకు సంపద కలిగించువాడు, 5. వసుప్రదః = ఇతరులకు తన సాన్నిధ్యమును కలిగించి సంపద గలిగినవాడు, 6. వాసుదేవః = జీవుల ప్రవర్తనయను

రూపమున వ్యక్తమగువాడు, 7. వసుః = భౌతిక స్థితికి కారణమైన అష్టవసువులను దేవతలు తన రూపముగా గలవాడు, 9. వసుమనాః = సృష్టియందలి సమస్త సంపదలు తన మనస్సునందు గలవాడు, 10. హవిః=హవిస్సు, హోమమునందు వ్రేల్చబడునది.

**తాత్పర్యము :–** నారాయణుని మనస్సునందలి వేగముగా, సృష్టి బీజముగా, సంపద కలిగించువానిగా, తన సాన్నిధ్యము వలన సంపదగా నిచ్చువానిగా, సృష్టియందలి జీవులయందు నివసించువానిగా, ధ్యానము చేయుము. సృష్టి సమస్తమూ మహాయజ్ఞమై, విశ్వమే హవిస్సు కాగా అట్టి పరిణామమే తన మనస్సునందలి హవిస్సుగా నయ్యెను. అవియే ఆయన జీవులకిచ్చు సృష్టియను సంపద.

**వివరణ :–** 1. మనస్సునకు వేగము సహజము. ఆ వేగమువలననే మనస్సు నారాయణుని చేరగలుగుచున్నది. తన మనస్సునే పరమాత్మగా ధ్యానము చేయువానికి నారాయణుడుండి మనస్సు మాయమగును.

2. పరమాత్మ తన సాన్నిధ్యమును భక్తుల మనస్సుల యందు కల్పించుటచే జీవుల బంధములను తొలగించుచున్నాడు.

3. ప్రకృతియే సమస్త సృష్టికి బీజము కనుక ఆ ప్రకృతియే నారాయణుని సంపద.

4. పనులు నెరవేరుట నెరవేరకపోవుట సృష్టియందలి ఒక విచిత్రము. ఎవరికెప్పుడు పనులు నెరవేరునో, నెరవేరవో ఎవరునూ చెప్పలేరు. ఎన్ని శాస్త్రములు నేర్చిననూ ఏ విద్యను నేర్చిననూ ఇది చెప్పగలిగినవారు లేరు. జరుగుట, జరుగకపోవుట అను రెండింటియందునూ గల సత్యమును దర్శించినవారు అవి రెండునూ పరమాత్మ సంకల్పమే యని తెలియుచున్నారు. అట్లు తెలిసినవారు తమ తెలివితేటలపై నాధారపడక, పరమాత్మను సంకల్పించి పనులు నిర్వర్తించుచున్నారు. సంపదలు కలుగుట కలుగకపోవుట నారాయణుని సంకల్పమే యనియూ, భగవంతుని అంగీకరింపని భౌతిక వాదులకు సహితము వారి స్వప్రయత్న రూపమున, అనుకూల పరిస్థితుల రూపమున నారాయణుడే సంపదను కలిగించుచున్నాడు.

5. అట్టి సంపదలు భౌతికమైనవే యైననూ నారాయణుడే అట్టి సంపదల రూపమున జీవుల కానందము కలిగించి మరల ఆ యానందముగా తానే యున్నాడు. దేవుని విశ్వసించని భౌతిక వాదులను సహితము, నారాయణుడే అనుగ్రహించుచున్నాడు. అనుకొనని విపత్కర పరిస్థితులేర్పడి, తన ప్రయత్నములన్నియూ వ్యర్థములై, నిరాశ చెందినవానికి చిట్టచివరకు దేవుడు జ్ఞప్తికి వచ్చును. నిజముగా దేవుడున్నాడా? ఉన్నచో యిట్టి అనివార్యమైన ఆపద స్థితియందు తనను కాపాడగలుగునా! యనిపించును. వెంటనే ఆశ్చర్యకరమైన పరిణామమేర్పడి, చుట్టుముట్టిన విక్కు పరిస్థితులన్నియూ గాలికి చెదరగొట్టబడిన మేఘములవలె మాయమగును. అప్పటినుండి వానికప్రయత్నముగా భగవంతుని గూర్చి సంశయము కలుగును. భగవంతుడు నిజముగా వున్నాడేమో ననిపించును. అప్పుడప్పుడు యిటువంటి పరిస్థితులేర్పడుచుండుటయూ, అయాచితముగా అనుకోని విధముగా సహాయము లభించుటయూ వాని కనుభవమగుచుండును. క్రమేణా వానికి భగవంతుని అస్తిత్వమునందలి విశ్వాసము అధికమగుచుండును. ఇట్లు తనను గూర్చిన సంకల్పమే తన సాన్నిధ్యముగా అనుగ్రహించు పరమాత్మ, అట్టి సాన్నిధ్యమను, నిజమైన సంపదను జనులకు అనుగ్రహించుచున్నాడు.

6. జీవుల రూపమున చరించు నారాయణుడు వాసుదేవుడు.

7,8. సృష్టియందలి సంపద యంతయూ నారాయణుని అస్తిత్వము లేక భౌతిక రూపము.

9,10. ఇంతకుముందు వివరణ ఇవ్వబడినది.

75. శ్లో|| సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః
శూరసేనో యదుశ్రేష్ఠః సన్నివాసః సుయామునః ||

**ప్రతిపదార్థము :-** 1. సద్గతిః = సత్పురుషుల మార్గము, 2. సత్కృతిః = సత్పురుషులు చేయుపని, 3. సత్తా = సన్మార్గమున జీవించుట, 4. సద్భూతిః = సద్గుణసంపత్తి లేక వైభవము, 5. సత్పరాయణః = సన్మార్గమున జీవించుటకు నిశ్చయించినవాడు, 6. శూరసేనః = శూరులు తన సేనగా కలవాడు, 7. యదుశ్రేష్ఠః = మంచివారిలో మొట్టమొదట పుట్టినవాడు, 8.

సన్నివాసః = మంచివారియందు తన నివాసము కలవాడు, 9. సుయామునః = యమున ఒడ్డున తన మంచి మార్గము కల్పించినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను మంచివారి మార్గముగా, మంచివనిగా, మంచిగా, మంచి యొక్క వైభవముగా ధ్యానము చేయవలెను. మంచివారి మార్గమునకు అంకితమయినవానిగా, శూరులు కూడిన సేనగా ధ్యానము చేయవలెను. యదువంశములో శ్రేష్ఠునిగా, మంచివారి యందు నివసించువాడగుటచే తన మంచి మార్గమును యమున ఒడ్డున ప్రసాదించువానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. మంచి వారి **మార్గము** వారి మంచితనమే కనుక భగవంతుని చేరుటకు ప్రత్యేకముగా ఒక మార్గమనియుండదు. ఒకని స్వభావమునందలి మంచితనమే వానికి మార్గమై భగవంతుని వద్దకు తీసుకొనిపోవుచున్నది. కనుక భగవంతుని చేరుటకు ప్రత్యేకమైన మార్గము ఏదియూ లేదు. మార్గములుగా చెప్పబడుచున్నవన్నియూ తమ మార్గము తాము నిర్మించుకొనుటకు ఏర్పరచుకొనిన సులువులేగాని మార్గములు గావు. చెట్టెక్కువానికి ఏమి నేర్పిననూ, ఎక్కునపుడు తన సులువునుసరించి ఎక్కవలసినదే. కనుక భగవంతుని చేరుటకు తన మంచితనమే తనకు మార్గమగుచున్నది.

2. అట్టి మంచితనమువలన మంచిపనులు చేయగలుగును. తాను చేసిన మంచిపనుల వలన నారాయణుడు సంతోషించును. కనుక మనము చేయు మంచి పనులు భగవంతుని లీలలలోనొకటి. మనచేత మంచిపని చేయించుటయే ఆయన లీల.

3,4. అట్టివారు జీవించు విధానమే యోగ జీవనమని పెద్దలు చెప్పిరి. వారు ఏది చేసిననూ ఫలాపేక్ష లేకుండా చేయుదురు. అటుల పనులు చేయు విధానమే స్థిత ప్రజ్ఞ లక్షణమని భగవద్గీతలో చెప్పబడినది. శ్రీకృష్ణుడు ''యోగస్థః కురు కర్మాణి'' (యోగమునందుండి పనులను చేయుము) అని అర్జునునితో చెప్పెను. ఇతరులకు పనులు చేసి పెట్టుటయే గానీ వారినుండి ఆశించునది లేక జీవించుటయే నిజమైన యోగ మార్గము. మహర్షులు, దేవతలు అనుక్షణమూ ఇట్లు వర్తించుచున్నారు గనుక వారు శాశ్వతమూర్తులై వెలుగులైరి. వారు పరమాత్మయను పెద్ద వెలుగులోని భాగములేకాని యితరముకాదు. అట్టి

పరమాత్మయొక్క అస్తిత్వమునకు ఎట్టి ఋజువులూ అక్కరలేదు. ప్రకృతియే పెద్ద ఋజువు. ప్రకృతి యందలి వస్తువుల పుట్టుక, వాని ధర్మములు మున్నగునవి గమనించినచో అవి ఎవరిపైనాధారపడి వర్తించుచున్నవో తెలియును.

5. అట్లేమానవుని యందలి జీవాత్మను గూర్చి ధ్యానము చేసి అర్థము చేసుకొన్నచో పరమాత్మను గూర్చి తెలియును. అట్లు పరమాత్మ సాన్నిధ్యమును గూర్చి మనము మార్గము నిర్మించుకొనుచున్నామనగా అది మనము ధ్యానము చేయు మార్గమే కాని వేరుగాదు. మన మనస్సులోనికి మనము నిర్మించుకొను మార్గమే ఇది.

6. అట్లు మార్గము నిర్వర్తించుకొనుటకు గల అవరోధములనేకములు. మనస్సులో నున్న రాగద్వేషాదులు మనపై తిరుగుబాటు చేయును. హృదయమున కంగీకారమైన ప్రేమయను ఆధ్యాత్మిక మార్గము మనస్సున కంగీకారముకాదు. ఆ రెండిటికి మధ్య నిత్యమూ సంఘర్షణ జరుగుచుండును. నీటిపై తేలుచున్న పడవ తన బరువుచే నీటిని క్రిందకు అదుముచున్ననూ నీరు మరల తన బలముచే పైకి నెట్టుచున్నది కనుకనే పడవ నీటిపై తేలుచూ ప్రయాణము చేయగలుగుచున్నది. ఆత్మయను నీటియందు మనస్సను పడవ ప్రయాణము చేయుచున్నది. మనస్సు తన సంకుచితత్వముచే ఆత్మపై ప్రభావము చూపుటకు ప్రయత్నించును. ఇది సూర్యుని మేఘము కప్పుటకు ప్రయత్నించుట వంటిది. మేఘము సూర్యుని కప్పలేదు కాని తాత్కాలికముగా మనకు కనబడకుండా చేయగలదు. నిత్య జీవితమునందు రాగద్వేషములయందు చిక్కుకొని యున్న మానవుడు తన ఉనికిని తాను తెలియలేడు. జీవితమునందు మనస్సు, ఇంద్రియములు ప్రాధాన్యత వహించును. కంటికి నచ్చినవి కొనుట, నోటికి రుచించినవి భుజించుట మొదలగు ఇంద్రియ సుఖములతో జీవితము జరిగిపోవుచుండగా, వీటిననుభవించు తననుగూర్చి తనకు గురుతుండదు. తానెవరో తనకు తెలియదు. ఇట్లు మనస్సు ఇంద్రియములు తనపై ప్రభావము చూపుచుండగా, నేనను ఆత్మ తన దివ్యశక్తులతో మనస్సును నియమించును. ఆత్మకు గల దివ్య శక్తులే ప్రేమ, సానుభూతి, సత్కర్మాచరణము మున్నగునవి. వీటిపై మనస్సునకు అభిలాష పెరిగేకొలది కోపతాపాదులు తనకు తెలియకుండగనే క్షీణించును. ఇట్టి దివ్యశక్తులే భగవంతుని సేన. శూరులతో కూడిన సేన అనగా

అట్టి శక్తులకెన్నటికినీ అపజయము లేదని అర్థము.

7. ఇట్టి దివ్య శక్తుల, నీచ శక్తుల సంఘర్షణము మన యందు నిరంతరమూ జరుగుచుండును. ఇవియే దేవతల రాక్షసుల యుద్ధముగా చెప్పబడినది. భౌతికముగా కూడా ఇట్టివి సమాజమునందు ప్రతిబింబించినప్పుడు భూమిపై పెద్ద పెద్ద యుద్ధములు సంభవించుచుండును. అట్టివానిలోనొక సంఘటన యదు వంశజులు పరిపాలించుచున్నప్పుడు జరిగెను. ఆ యదు వంశము వారిలో నొకడుగా శ్రీకృష్ణుడవతరించెను.

8. పరమాత్మ అవతారములుగా దిగివచ్చుచున్ననూ ఆయన నిరంతరము మంచివారి మనస్సు, హృదయములందు కాపురముండును. మంచివారనగా తోటివారి సుఖమునకై త్రికరణ శుద్ధిగా పని చేయువారు.

9. శ్రీ కృష్ణుడు గోపికలనూ, గోపకులనూ ఉద్ధరించుటకై యమునా నదియొడ్డున బృందావనమందు వారితో విహరించెను. ''బృంద+అవనము'' అనగా బృందములుగానేర్పడుట. ఇట్లు బృందములు బృందములుగా జీవులేర్పడి జీవించుటయే బ్రహ్మ విద్యకు సింహద్వారము. ఇది చేయలేనివారు ఎన్నియుగములైనను తరించుట సాధ్యముగాదు. గురువులు తమ శిష్యులను ఇట్లు బృందములుగా సమీకరించి బ్రహ్మవిద్యను బోధించిరి. తమ వ్యక్తిత్వమును, ప్రత్యేకతను విస్మరించి ఇతరులతో కలసిమెలసి ఆనందముగా జీవించుటవలననే యోగ విద్య సాధ్యమగుచున్నది. దీనినే ఆచరణ పూర్వకముగా శ్రీకృష్ణుడు గోపికలచేత, గోపకులచేత అభ్యసింపజేసెను. వారికి తెలియకుండగనే వారు పరిపూర్ణులైరి. వారిలోనెవరికి ఎవరిని చూచిననూ శ్రీకృష్ణుడు కనిపించును. నిరంతరము తమ మనస్సు, ఇంద్రియములు, శ్వాస, సమస్తమూ శ్రీకృష్ణుని దివ్యరూపముతో నిండి వెలుగుచుండగా, వారికి సకల ప్రపంచమూ శ్రీకృష్ణమయమయ్యెను. ఇట్టి ఆచరణతో కూడిన దివ్యజీవనము శ్రీకృష్ణుడు యోగ విద్యకు పరమావధిగా నిలిపెను. నాటినుండి నేటి వరకూ అట్టి దివ్య జీవనము కావలసిన వారందరూ బృందములుగా ఆధ్యాత్మిక సాధు జీవనము నభ్యసించుచుండిరి. ఇట్లు తరించిన వారిలో హిమాలయముల యందు గల పరమ గురువుల శ్రేణిలో వారు తాము తరించుటయేగాక భూమి యందెల్లడలా

శిష్యులను సేకరించి, బృందములుగా తీర్చిదిద్ది, యోగ విద్యను ఆచరణతోకూడిన కౌశలముతో నేర్పుచుండిరి. సాయిబాబా, రమణ మహర్షి, శ్రీరామకృష్ణ పరమహంస మున్నగు అవతార పురుషులెల్లరూ తమ శిష్యులను ఇట్లు బృందములుగా తీర్చిదిద్దిరి. మరియూ యమున అను పదమునకు సూర్యుని కుమార్తె యనియూ, ఆమె భూమిపై నదిగా ప్రవహించుచుండెననియూ, చెప్పబడినది. అనగా అంతర్యామియైన పరమాత్మ వెలుగు నుండి భౌతిక దేహమందుగల నేను అను జీవప్రజ్ఞలోనికి ప్రవహించు ప్రజ్ఞా ప్రవాహము. ఇట్లు శరీరమునందున్న జీవాత్మ ప్రజ్ఞయే యమున. పరమాత్మ అంశయే శ్రీకృష్ణుడు. అట్టి శ్రీకృష్ణుని సాన్నిధ్యమున జీవాత్మయమున ప్రజ్ఞ నదియై ప్రవహించి తరించినది.

76. శ్లో॥ భూతావాసో వాసుదేవః సర్వాసునిలయో ऽనలః
దర్పహా దర్పదో దృప్తోదుర్ధరో ऽథా పరాజితః ॥

**ప్రతిపదార్థము** :- 1. భూతావాసః = పంచ భూతములకు నిలయమైన వాడు, 2. వాసుదేవః = వసుదేవుని కుమారుడు, 3. సర్వాసునిలయః = సమస్తప్రాణులకు (నిలయమైన) ఆశ్రయమైనవాడు, 4. అనలః = అగ్ని, 5. దర్పహా = దర్పమును నశింపచేయువాడు, 6. దర్పదః = దర్పమునకు కారణమైనవాడు, 7. అదృప్తః = గర్వములేని వాడు, 8. దుర్ధరః = ధరించుటకు వీలులేనివాడు, అథా = మరియు, 9. అపరాజితః = ఓడింపబడనివాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను పంచభూతములకు, అన్ని ప్రాణులకు ఆశ్రయమైన వానిగా, పవిత్రమైన అగ్నిగా, గర్వమును నశింపచేయువానిగా మరియూ గర్వమైనవానిగా, గర్వము లేనివానిగా, గర్వము కలిగినవారికి ధరించుటకు వీలుకాని వానిగా, జయించుటకు సాధ్యముకాని వానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. ప్రకృతియందలి వివిధ పొరలే పంచభూతములుగా వచ్చుచున్నవి. ఈ ఐదు పొరలూ ప్రకృతి యను ఒకే వస్తువునుండి పుట్టినవి. ప్రకృతి పరమాత్మనుండి పుట్టినది కనుక ఆయనయే అన్ని భూతములకు అధిపతి యగుచున్నాడు.

2. ఇంతకుముందు వివరింపబడినది.

3. ప్రాణశక్తి వలన జీవించి యుండుట సాధ్యమగుచున్నది. మానవులు, జంతువులు, వృక్షములకు మాత్రమేగాక, ద్రవ్యమునకు కూడా ప్రాణశక్తి యున్నది. అట్టి ప్రాణశక్తి వలననే భౌతికము. రసాయనికము అను మార్పులు సంభవించుచున్నవి. భౌతిక ద్రవ్యములందు అనగా పదార్థములయందు ఆయా పదార్థముల గుణములుగా, ధర్మములుగా ప్రాణశక్తి పనిచేయుచున్నది. కానీ ఈ ప్రాణశక్తి పై మూడిటియందును చైతన్యము కలిగియున్నది. పదార్థమునందు చైతన్యము లేకుండ నున్నది. ఈ ప్రాణ శక్తియే పరమాత్మయొక్క శ్వాసగా మనయందు స్పందించుచున్నది. జీవుడు శ్వాస తీసుకొనగా ఆ శ్వాస హృదయమునందు స్పందనమైనది. ఆ హృదయస్పందనము వలన శరీరమునందు రక్తము అలలు అలలుగా స్పందించుచు అన్ని భాగములకు ప్రవహించుచున్నది. అట్లే పరమాత్మ శ్వాసనుండి ప్రారంభమైన మొట్టమొదటి స్పందనమే విశ్వమునందు ప్రాణశక్తిగా ప్రతిబింబించి జీవులయందు, ప్రాణులయందు ప్రాణశక్తిగా స్పందించుచున్నది. ఇట్టి ప్రాణశక్తి స్పందనము ననుసరించి, మానవ శరీరమందలి వూపిరితిత్తులు, హృదయము భౌతికముగా ప్రతిస్పందనము చేయుచున్నవి. మరియు ఆ ప్రతిస్పందనమే రక్తమను జీవశక్తిగా అన్ని భాగములయందును ప్రసరించి జీవులను, శరీరములను జీవించునట్లు చేయుచున్నది.

4. ఇట్లు జీవులను ప్రాణవంతములుగా నొనర్చు ప్రాణశక్తి అగ్ని యొక్క రూపములలో నొకటి అని చెప్పబడినది. ఇదియే అశ్వమేధమని కూడా చెప్పబడినది. ప్రాణశక్తియే అశ్వమని వేదములయందు సంకేతింపబడినది.

5. ఇతరులు తనకన్న ఎక్కువవారని తలచువారికి గర్వము కలుగును. ఇతరులయందు పరమాత్మను చూచువారికి గర్వము మాయమై వినయము కలుగును.

6. అన్ని అనుభవములకన్న పరమాత్మను గూర్చిన అనుభవము మిక్కిలి ఉత్తమమైనది, గొప్పది. ఆయనను గూర్చిన అనుభవము జీవులకు అకారణమైన ఆనందమును, తన్మయత్వము నిచ్చును. జీవులకిదియే ఆయన కలిగించు గర్వము. అనగా కారణమక్కరలేకుండా లభించు సంతృప్తియే భగవంతునివలన

జీవులకు కలుగు ఒకే ఒక గర్వము.

7. కాని అయన మనస్సునందలి లక్షణములకు, వికారములకు అతీతుడు గనుక గర్వము అయనపై పనిచేయదు. చూచువారికి మాత్రము అట్టి స్థితిలో నున్నవాడు గర్వపోతువలె కనిపించును. వారు దేనిని లెక్కచేయనట్లు, పట్టనట్లు కనిపింతురు. ఎవరితోనైనను మొహమాటపడుటగాని ప్రాకులాడుటగాని వుండదు. ఎదుటివారు ఎట్టి స్థితిలో నున్నవారైనను, పదవిలో నున్నవారైనను ప్రత్యేకముగా గౌరవించుట యుండదు. ఇతరుల నుండి ప్రయోజనములు అపేక్షించు వారికి ఇతరుల పదవులనుబట్టి, ధనమును బట్టి గౌరవించుట యుండును. మహాత్ములందు వాటికి స్థానములేదు గనుక వారందరితోనూ ఒక్కటిగా నుండుటయేగాక వారిలో లోపములున్నచో సూటిగా తెలియజెప్పుదురు. ఇట్టి మహాత్ముల మార్గము సాంసారిక జీవులకు విపరీతముగా కన్పించును. కనుక అట్టి మహాత్ములయందున్న గర్వమను లక్షణము నారాయణుడే యగుచున్నాడు. కానీ ఈ గర్వము వారినంటదు. ఎందుచేతననగా వారు నిరంతరము తోటి వారియందు నారాయణుని చూతురు. కనుక నారాయణుడు గర్వము మున్నగు లక్షణములను జీవులనుండి తొలగించుచున్నాడు.

8. కాని సామాన్యులైన సాంసారిక జీవులు మహాత్ములయందు ఈ లక్షణమును గమనింపక, తమకు కావలసిన సాంసారిక విషయములకై వారిని ప్రాధేయపడుచుందురు. వారు ఏ దృష్టిలో మహాత్ములను సేవించినను మహాత్ములు వారినుద్ధరించు విషయమునకే ప్రాధాన్యమిత్తురు. కనుక వీరి కోరికలు, సంకల్పములు పరమాత్మయందు పనిచేయవు. వారికి కావలసినది ఆత్మవిశ్వాసమే గనుక అయన అట్టి మహాత్ముల రూపమున వారిని తీర్చిదిద్దును. కనుకనే సాంసారిక జీవులకు తాము కోరినవి జరుగక పోవుటయు కావలసినవి లభింపక పోవుటయు జరుగుచుండును. కనుక నారాయణుడు మన ఊహల, ఆశలరూపమున ధరించుటకు, బంధించుటకు దొరకడు. అతడు వీటన్నిటిని మించినవాడు.

9. ఇట్టి పరమాత్మ జీవులయందు జరుగు సంఘర్షణమునందు తానోడిపోవుట యుండదు. చిత్రమేమనగా జీవుడు కూడా ఓడిపోడు. జీవునికి

అట్టి పరిస్థితులవలన పరమాత్మ సాన్నిధ్యము దగ్గరగుచున్నది, గనుక జీవుడు కూడా గెలుచుచునే యున్నాడు. ఇట్లు ఓడిపోవుట లేని స్థితియే నిజమైన విజయము. మనస్సున్నవారికి ఓడిపోవుట, గెలుచుట అను రెండు స్థితులుండును. ఆ మనస్సు పరమాత్మయందు లీనమైనవారికి గెలుచుటయే తప్ప ఓడిపోవు వారెవ్వరునూ వుండరు. అనగా తాను, ఇతరులు అను భేదముపై విజయము పొందును.

77. శ్లో॥ విశ్వమూర్తిర్మహామూర్తి ర్దీప్తమూర్తిరమూర్తిమాన్
అనేకమూర్తి రవ్యక్త శ్శతమూర్తి శతాననః ॥

**ప్రతిపదార్థము** :- 1. విశ్వమూర్తిః = విశ్వమే తనరూపమైనవాడు, 2. మహామూర్తిః = పెద్ద ఆకారముగలవాడు, 3. దీప్తమూర్తిః = ప్రకాశించుచున్న రూపము కలవాడు, 4. అమూర్తిమాన్ = అసలు రూపమే లేనివాడు, 5. అనేకమూర్తిః = అనేక రూపములుగా నున్నవాడు, 6. అవ్యక్తః = భౌతికముగా గ్రహించుటకు తెలియనివాడు, 7. శతమూర్తిః = నూరురూపములుగా నున్నవాడు, 8. శతాననః = నూరు ముఖములుగలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను విశ్వమంతటా నిండిన పెద్దరూపముగా, ప్రకాశవంతముగా, అందు అనేక రూపములు, వివిధ ఆకారములతో, ముఖములతో, వందల సంఖ్యలో నుండగా మరల తన కట్టిరూపమే లేనివానిగా, భౌతిక రూపముగా దర్శించుట వీలుగానివానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. విశ్వము యొక్క రూపమునందు అనేక పొరలు గలవు. ఈ పొరలు భౌతికస్థితినుండి మొదలగును. సృష్టియనియూ బ్రహ్మాండమనియూ చెప్పబడిన వెలుగుయొక్క గోళమువరకు, ఈ పొరలున్నవి. ఈ పొరలే లోకములు, బ్రహ్మాండమని చెప్పబడిన పెద్ద వెలుగునందు ఈ లోకములన్నియయూ ఒకదానియందొకటి ఇమిడియున్నవి. అట్టి మొత్తము కలిపి ఒక్కటిగానున్న వెలుగునే విశ్వమూర్తి యందురు.

2. ఈ విశ్వమూర్తి అన్నిటికన్న పెద్దదైన రూపము. మనకు తెలిసిన రూపములన్నియు పెద్దవి, చిన్నవి, అన్నియూ, విశ్వమూర్తి యను ఒక పెద్ద వెలుగులోని రూపములు గనుక, అన్నిటికన్నా పెద్దదైన రూపము అయనదే.

3. ఈ వెలుగునుండియే మనకు తెలిసిన అన్ని వెలుగులు పుట్టినవి. పరమాత్మ సంకల్పమే ఈ వెలుగు కనుక, ఆయన వెలుగుచున్న రూపముగా చెప్పబడినాడు.

4. ఇట్లు ఎన్ని విధములుగా నున్నను నిజమునకు ఈయనకు ఒక రూపమన్నది లేదు. ఈ రూపములన్నియు చూచువారివే గాని ఆయనకు లేవు.

5. కాని అన్ని మూర్తులూ ఆ వెలుగునుండియే పుట్టుచున్నవి. పంచభూతములు, త్రిగుణములు, మొదలగు వానితో ఏర్పడిన సౌరమండల భౌతిక గోళములు, వ్యూహములు మున్నగునవన్నియూ ఆయననుండి పుట్టినవే.

6. ఈ పంచభూతములయందు, భౌతిక శరీరములయందు పరమాత్మ పనిచేయుచున్నను వేటికవిగా నున్నవి. కాని తానొక్కడే ఇన్నిటియందు అవ్యక్తముగానున్నాడు. అనగా ఆయా వస్తువులుగా, వ్యక్తులుగానున్నాడు గాని తానుగా లేడు. కనుక నారాయణుడు అవ్యక్తమూర్తి.

7. ఇట్లు దిగివచ్చిన ప్రకృతి యందలి విచిత్రమేమనగా ఎన్నికోట్ల వ్యక్తులున్ననూ ఒకరికి యింకొకరికి పోలికలేదు. అనగా రూపు రేఖాదులందు మాత్రమే గాక గుణగణములందు సహితము ఎవరి గుణము వారిది. ఎవరి రూపము వారిది కనుకనే సాధనచేయు మార్గములుకూడా అసంఖ్యాకములు. ఎవరి మార్గము వారికే యున్నది.

8. ఆననమనగా ముఖము. ఇచ్చట ముఖమనగా రూపురేఖలతోకూడిన చిహ్నములు, ఎప్పుడును ఒకదాని స్వభావము ఇంకొక దాని యందు పనిచేయదు. గాలికి వీచుట స్వభావము. వెలుగుకు ప్రకాశించుట స్వభావము. అట్లే కాంతి లేక తేజస్సు మనయందు ప్రజ్ఞగా తెలియుచున్నది. వేడికి చలనము స్వభావము. ఇవి రెండును కలిసినచో మనస్సగును. అనగా ప్రజ్ఞకు (Conciousness) చంచలత్త్వము కలిగినచో మనస్సగును. మనస్సునకు చంచలత్తము నశించినచో ప్రజ్ఞ యగును. అట్లే అకాశమునందు సహితము కోట్ల కొలది తారలు, వాటి చుట్టూ సూర్యకుటుంబములు వున్నను ఒక సూర్యకుటుంబమున్న స్థితిలో మరియొకటి యుండదు. ప్రతిదానియందు మన సౌరమండలము వలెనే గ్రహములు, భూమి, ప్రకృతి యున్నవి. ఒకదానియందు

సృష్టి వికాసము మొదటిదశ యందుండగా, ఇంకొక దానియందు చివరి దశలో నుండును. ఇట్లు ఒకదానికొకటి సంబంధము లేక, వివిధ దశలలో కోట్లాది సౌరకుటుంబములుండగా, ఏ రెండిటికిని పోలిక లేదు. ఈ సౌరకుటుంబములే విశ్వమూర్తియైన పరమాత్మకు ముఖములు గనుక, ఆయనకు వేలాది ముఖములన్నట్లు చెప్పబడినది.

78.శ్లో॥ ఏకో నైకస్స్వవః కః కిం యత్తత్పద మనుత్తమమ్
లోకబంధుర్లోకనాధో మాధవో భక్తవత్సలః ॥

**ప్రతిపదార్థము** :- 1. ఏక = ఒకడు, 2. నైకః = అనేకులు, 3. స్సవః = స్తోత్రము, 4. కః = ఎవడు, 5. కిం = ఏమిటి, 6. యత్ = ఏదైతే, 7. తత్ = అది, 8. పదం = పదము, 9. అనుత్తమమ్ = మిక్కిలి గొప్పది, 10. లోకబంధుః = జీవులకు సంబంధించినవాడు, 11. లోకనాధః = లోకములకు రక్షకుడు, 12. మాధవః = లక్ష్మీదేవి భర్త, 13. భక్తవత్సలః = తన భక్తులపై వాత్సల్యముకలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మ అనేకులలోనున్న ఒక్కనిగా, మరియూ ఒక్కనిలోనున్న అనేకముగా నున్నాడు. అతడు ఎవరు? ఏమిటి? ఏది? అది, మొదలగు శబ్దములచే తన సంబంధము నెరుక పరుచువాడు. ఆయన ఎల్లప్పుడూ లోకమునకు రక్షకుడై, బంధువై యుండును. ఆయన లక్ష్మీదేవికి భర్త, భక్తులకు భక్తుడు.

**వివరణ** :- 1,2. ఆయన సృష్టి మొత్తమునందునూ నిండియున్న ఒకే ప్రజ్ఞ. ఇదియే జీవులయందు నేనను ప్రజ్ఞగా తెలియబడుచున్నది. ఆయనయొక్క అట్టి వ్యక్త స్వరూపము ప్రతిజీవులయందునూ, అణువులయందునూ నేనుగా మేల్కొనియున్నది. జీవరాశులు, భౌతిక పదార్థములెన్ని యున్ననూ, ఇన్నిటిలోనున్నది తానొక్కడే.

3. ఇట్టి ఈయన వ్యక్తరూపమే వాక్కు. ఇదియే ఓంకారముగా జీవులయందు ఉచ్చరింపబడుచున్నది. దానినే జీవులు తమ వాక్కుగా నుచ్చరించుచున్నారు. అట్టి జీవుల వాక్కే పరమాత్మయందు ప్రార్థన లేక స్తోత్రము. ఇది తెలిసి ఉచ్చరించు వానిది స్తోత్రమగును. తెలియక

నుచ్చరించువానికి వ్యర్థ సంభాషణమే యగుచున్నది.

4 నుండి 9 వరకు. మనము ఎప్పుడు, ఏది అని చెప్పుకొనునప్పుడు అట్టి శబ్దములచే భగవంతుని మాత్రమే ఉద్దేశించుచున్నాము, తెలియక వేరు వేరు పేర్లతో పిలుచుచున్నాము. మనము చెప్పుకొను విషయములకు నిర్వచనములు, వివరణ మరియు సంబంధ బాంధవ్యములు, మున్నగు అనేకములుగా నున్నట్లు ప్రశ్నింపబడుచున్న, వినబడుచున్న విషయములన్నియూ పరమాత్మ యొక్క అస్తిత్వముపై తేలుచున్న మంచు ముక్కలవంటివి. అనగా ఇవన్నియూ పరమాత్మ అను నీటియందు పేరుకొనుచున్న మంచు ముక్కలే.

10,11. కనుక అట్టి మంచుముక్కలుగా నున్న జీవులు ఒకరికొకరు సంబంధము లేనట్లున్ననూ, ఒకరి యందొకరికి సంబంధము కలదు. ఆ సంబంధమే నీటిగానున్న పరమాత్మ, కనుకనే ఆయన లోకబంధువు మరియు రక్షకుడు.

12. ఇట్లు అనేకముగా వ్యక్తమైయున్న సృష్టియొక్క వైభవమే లక్ష్మీదేవి. ఆమె వైభవమునకు కారకుడు గనుక నారాయణుడు లక్ష్మీదేవికి భర్తయైనాడు.

13. జీవులకు పరమాత్మయందు భక్తి కలిగినదనగా దానియర్థము పరమాత్మకు జీవులయందనుగ్రహము కలిగినదనియే. భక్తి, అనుగ్రహము, అను పదములు ఒకేస్థితికి సంబంధించినవి. భక్తుడు భగవంతుడు చేరువయగుచున్నాడని అర్థము. దీనికి గల పేరే వాత్సల్యము. వత్స అనగా పుట్టిన బిడ్డ. వాత్సల్యమనగా తల్లి బిడ్డలకుగల సంబంధము.

79. శ్లో॥ సువర్ణ వర్ణో హేమాంగో వరాంగ శ్చందనాంగదీ
వీరహా విషమశ్శూన్యో ఘృతాశీరచలశ్చలః ॥

**ప్రతిపదార్థము** :- 1. సువర్ణవర్ణః = బంగారమువంటి రంగుకలవాడు, మంచి అక్షరములతో కూడిన శబ్దముచే పిలువబడువాడు, 2. హేమాంగః = బంగారపు వర్ణము కలవాడు, 3. వరాంగః = చక్కని అవయవ సంపదగలవాడు, 4. చందనాంగదీః = గంధము పూతచే అంగము అలంకరింపబడినవాడు, 5. వీరహా = రాక్షసులను సంహరించువాడు, 6.

విషమః = అస్తవ్యస్తములు కలవాడు, 7. శూన్యః = శూన్యముగా నున్నవాడు, 8. ఘృతాశీః = నేతిని త్రాగువాడు, 9. అచలః = కదలిక లేనివాడు, 10. చలః = కదలిక కలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను బంగారు వర్ణముగా, చక్కని శబ్దములతో, వర్ణములతో కూడిన నామముకలవానిగా, బంగారు ఛాయగలిగిన తన అవయవములందు గంధపు పూతగలవానిగా, ఆయన అవయవములు పొందికగలవిగా, అతిక్రమించువారిని తన పరాక్రమముతో సంహరించువానిగా, అస్తవ్యస్తములుగా కనిపించు లోకమే తన నివాసముగా, నేతిని స్వీకరించు అగ్నిగా, కదలునట్టి వాయువుగా, కదలనిచోటుగా, తనచేనిండిన శూన్యముగా ధ్యానము చేయుము.

**వివరణ :-** 1 బంగారు వర్ణమనగా గంధపు చెక్కలను నేయితో తడిపి హోమము చేయునపుడు వెలువడు జ్వాలయొక్క వర్ణము. అటువంటి వర్ణము కలిగినవాడు సూర్యుడు. కనుక అట్టి జ్వాలలు వచ్చుటకు గంధపు చెక్కలు, నేయి, మున్నగునవి భూమినుండి, భూమిపై నివసించు గోవు మున్నగువానినుండి లభించును. వాటి నిర్మాణమునకు కావలసిన ద్రవ్యము భూమినుండి లభించును. భూమి చోటునుండి పుట్టినది. కనుక చోటునందు ఇవి అవ్యక్తముగా నున్నవి. అట్టి చోటునందు ద్రవ్యము (Matter) శక్తి (Energy) గా నున్నది. సూర్యుడు చోటునందు నిక్షిప్తమైయున్న శక్తిని (Energy charged in space) సూటిగా గ్రహించి తనయందు జ్వాలగా వ్యక్తము చేయుచున్నాడు గనుక సూర్యునికి అట్టి వెలుగు ఉండుటలో ఆశ్చర్యములేదు. కనుక సూర్యుడు, సూర్యకిరణములు, బంగారు వర్ణముతో కూడి యుండును.

2. ఆయన సువర్ణములు అనగా మంచిశబ్దములతో కూడిన నామము కలవాడు. ''స'' కార ''హ'' కారములతో కూడిన ''సోహం'' అను మంత్రమే జీవుల శ్వాసయందు భగవంతుని నామముగా నుచ్చరింపబడుచున్నది. ఇందలి ''హం'' అనుబీజమే సృష్టిగా పరమాత్మనుండి వ్యక్తమగుచున్నది. ఈ 'హం' అను శబ్దమునుండి పుట్టిన పదమే హేమము అనుపదము. అట్టి హేమము అను వర్ణముకలవాడు నారాయణుడు. మరియూ ''సోహం'' అను

మంత్రమునందు ''ఓం'' అను మంత్రము దాగియున్నది. ఇట్లు '' ఓం'' కార రూపుడుగా పరమాత్మ అన్ని లోకములయందునూ నిండి యున్నాడు.

3. పరమాత్మయొక్క అంగములే త్రిగుణములు, పంచభూతములు మొదలగునవి. ఇవి అన్నియూ ఒకదానితో నొకటి అమరియుండి సృష్టిగా వ్యక్తమగుచున్నవి.

4. భగవంతుని విగ్రహము చందనముచే పూయబడి దివ్యపరిమళము కలిగియుండును. ఇట్టి పరిమళమువలన ఆయనను దర్శించు భక్తుల మనస్సు వారి ప్రయత్నమక్కర లేకుండగనే పరమాత్మపై నిమగ్నమగును. మరియూ సృష్టియందలి ప్రకృతిగానున్న ఆయన విగ్రహము అరణ్యము నందు గంధపుచెట్ల ఒరిపిడిచే అంటుకున్న దావాగ్ని జ్వాలలచే అలంకరింపబడుచున్నది. కనుక ఆయన గంధపు మైపూత కలవాడు.

5. రావణుడు, హిరణ్యకశిపుడు వంటి రాక్షసులు ధర్మశత్రువులై ప్రజలను బాధించెదరు. అట్టివారు వారి దుష్ప్రవర్తనకు పరమాత్మచే సంహరింపబడుదురు.

6. విరుద్ధ తత్వములతో గూడిన ప్రకృతియే పరమాత్మ శరీరము. సర్పములు, గ్రద్దలు ఒకదానికొకటి శత్రువులు. కాని సర్పము పరమాత్మకు శయనము. గ్రద్ద ఆయనకు వాహనము. ఇట్లు ఒకదానికొకటి విరుద్ధముగా నున్న తత్వములన్నియూ పరమాత్మను సేవించుచుండును.

7. మనము శూన్యముగా చూచుచున్నదంతయూ పరిపూర్ణత్వమే. సమస్తము భగవంతుడను వెలుగుచే నిండియున్ననూ, మనస్సునకూ, ఇంద్రియములకూ శూన్యముగా కనిపించును.

8. హోమమునందు అగ్నిహోత్రములో నేతిని సమర్పింతురు. అట్లే ఆహారమునందలి నేతిని లేక నూనెను శరీర నిర్వహణకై శరీరము నడుపు శక్తులచే క్రొవ్వుగా గ్రహింపబడుచున్నది. ఈ క్రొవ్వు శరీరము నడచుటకై వినియోగింపబడుచున్నది.

9,10. చోటుగా ఆయన కదలుటలేదు. అట్లే వాయువుగా, మరియూ సృష్టియందలి జీవులుగా, ఆయన కదలుచున్నాడు.

80. శ్లో॥ అమానీ మానదో మాన్యో లోకస్వామీత్రిలోకధృత్
సుమేధా మేధజోధన్య స్సత్యమేధా ధరాధరః ॥

**ప్రతిపదార్థము :-** 1. అమానీ - మానము లేనివాడు, 2. మానదః = ప్రకృతికి గౌరవము నిచ్చువాడు, 3. మాన్యః = అందరిచే గౌరవించదగినవాడు, 4. లోకస్వామీ = లోకములకు అధిపతియైనవాడు, 5. త్రిలోకధృత్ = మూడు లోకములనూ ఎత్తిపట్టి యుండువాడు, 6. సుమేధా = నిర్మాణాత్మకమైన మేధస్సు గలవాడు, 7. మేధజః = బుద్ధినుండి పుట్టినవాడు, 8. ధన్యః = తన ధనమును తానే పొందినవాడు, 9. సత్యమేధాః = బుద్ధియందు సత్యము కలవాడు లేక సత్యమును ధరించినవాడు, 10. ధరాధరః = భూమిని ధరించినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను ఆత్మగౌరవములేనివానిగా, తన స్పర్శచే సృష్టికి గౌరవమిచ్చువానిగా, అందరిచే గౌరవింపబడువానిగా, ధ్యానము చేయుము. ఆయన మూడు లోకములకు అధిపతియై అట్టి మూడు లోకములనూ తానెత్తి పట్టియున్నాడు. ఆయన అభివృద్ధి చెందుచున్న బుద్ధిగా, దాని ఫలితముగా, దానిని పొందువానిగా ధ్యానము చేయుమ. సత్యమే ఆయన ధర్మమై, భౌతికస్థితినుండి సత్యలోకము వరకూ తన బుద్ధియందు సమస్తము ధరించుచున్నాడు.

**వివరణ :-** 1. పరువు ప్రతిష్ఠలన్నవి మానవులు సృష్టించుకొన్నవి. కనుక భగవంతునియందు వానికి స్థానములేదు. నిజమునకు గౌరవమన్నది మనము చేయు పనులపై నాధారపడునుగాని మనమనుకొను పరువు ప్రతిష్ఠ వానిపై నాధారపడదు. అనగా యితరులు తనను గౌరవింపవలెనని ప్రాకులాడువాడు గౌరవింపబడడు. ఒకవేళ తాత్కాలికముగా గౌరవింపబడినను, అది పేకమేడవలె ఎప్పుడు కూలిపోవునో ఎవరునూ చెప్పలేరు. నిజమయిన గౌరవము తానుచేయు పనులపై నాధారపడి యుండును. ఒక అధికారిని యితరులు గౌరవించుచున్నచో, అది తాత్కాలికమే. ఆ యధికారి పదవినుండి విరమించిన మరుక్షణము వారిని ఎవ్వరూనూ పలుకరింపరు. అట్లు గాక ఒక గ్రామమునందు వైద్యాలయమో, సత్రమో, దేవాలయమో, యున్నగునవి నిర్మించుటకు నిర్వహించుటకు

సహకరించువాడు దారివెంట పోవుచున్నచో, గ్రామములోని వారందరూ లేచినిలబడి, వానిని గౌరవింతురు. అదివానిచే కోరబడినట్టిదికాదు. పదవికి సంబంధించినది కూడా కాదు. అదియే నిజమయిన గౌరవము.

2. అట్టి సద్గుణములు కలవారికి, నారాయణుడు గౌరవమిచ్చును. అనగా మంచిపనులను చేయువారిని ప్రజలు గౌరవింతురు. మంచివారికిగల మంచి గుణములు భగవంతునిచే ప్రసాదింపబడుచున్నవి గనుక, భగవంతుడే వారికి గౌరవము కల్పించుచున్నాడు.

3. భగవద్భక్తి కలవారు భక్తియనుపేర దేవుని గౌరవించుచున్నారు. కనుక భగవంతుడు అందరిచే గౌరవింపబడుచున్నాడు.

4. లోకములన్నియూ అంతర్యామియైన పరమాత్మలోనే నిలిచి యున్నవి. శరీరమునందలి ధాతువులు ప్రాణశక్తిచే పాలింపబడుచున్నవి. అవి రెండునూ మనస్సుచే పాలింపబడుచున్నవి. ఇవియన్నియూ పరమాత్మచే పాలింపబడుచున్నవి గనుక, అన్ని లోకములూ భగవంతునిచే పాలింపబడుచున్నవి.

5. విశ్వము మొత్తము మూడు స్థితులలో నున్నది. ఒకటి ప్రజ్ఞామయము రెండు ప్రాణమయము, మూడు ద్రవ్యమయము.

6. బుద్ధి నిర్మలమైనచో, పరమాత్మను ప్రతిబింబించును. అనగా పరమాత్మ వస్తువులుగా, వ్యక్తులుగా కాక తేజస్సుగా, నేనను ప్రజ్ఞగా ఆనందముగా, మనయందు ప్రతిబింబించును. కనుక మంచి బుద్ధి భగవత్ స్వరూపమే.

7. బుద్ధి పరిశుద్ధమైనచో, జీవితము పరిశుద్ధమై నిజమయిన సంతోషము కలుగును.

8. పరమాత్మ ధన్యత్వమునందుట యనగా, జీవులు అహంకారము తొలగి నారాయణుని యందు ఐక్యమగుట. కనుక జీవులు ధన్యత్వమునందుచున్నారనగా, వారియందలి నారాయణుడే ధన్యత్వమునొందుచున్నాడు.

9. స్వచ్ఛమయిన బుద్ధి నిరంతరమూ సత్యము నన్వేషించుటయందు లయమై ఉండును. అట్టి బుద్ధి పరమాత్మనుండి పుట్టును కనుక, ఆయన

సత్యమేధుడని పిలువబడినాడు.

10. పరమాత్మ సాన్నిధ్యము అన్ని లోకములయందునూ కలడు. భౌతికలోకమునందు కూడా ఆయన అస్తిత్వమున్నది. అట్టి అస్తిత్వము వలన ఆయన భౌతిక ప్రపంచమును ధరించుచున్నాడు. ఆయన మేధస్సుచే ఈ సృష్టియంతనూ సంకల్పించి సృష్టించుచున్నాడు. ఇట్లు భౌతిక ప్రపంచమును సృష్టించుచు, మరల తనలోనికి తీసుకొనుచున్నాడు. గనుక ఆయన భూమిని ధరించుచున్నాడు.

81. శ్లో॥ తేజోవృషో ద్యుతిధరస్సర్వ శస్త్ర భృతాంవరః
ప్రగ్రహో నిగ్రహో వ్యగ్రో నైకశృంగో గదాగ్రజః ॥

**ప్రతిపదార్థము** :- 1. తేజః = తేజస్సుగా నున్నవాడు, 2. వృషః = సత్త్వ కలవాడు, 3. ద్యుతిధరః = కాంతిని ధరించువాడు, 4. సర్వశస్త్రభృతాం = అన్ని ఆయుధములను ధరించిన వారిలో సమర్థుడు, 5. వరః = ఎన్నిక చేయబడినవాడు, 6. ప్రగ్రహః = పాలించువాడు, 7. నిగ్రహః = నిగ్రహము, 8. వ్యగ్రః = జాగరూకుడు, 9. నైకశృంగః = అనేక శృంగములు లేక కొమ్ములు గలవాడు, 10 గదాగ్రజః = గదుడను యాదవునకు అన్న.

**తాత్పర్యము** :- పరమాత్మను తేజోవంతమయిన సత్త్వగలవానిగా, కాంతిని ధరించినవానిగా, ఆయుధములు ధరించిన వానిలో గొప్ప వానిగా, దీక్ష కలిగి నిగ్రహము గల పాలకునిగా, అనేక శృంగములు గలవానిగా, గదునికి అన్నగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. సమస్తమును వెలిగించుచున్న మిక్కిలి ప్రకాశవంతమైనవాడు, సూర్యుడు, చంద్రుడు, తారలు మున్నగు వానియందలి కాంతితానేయైనవాడు. శ్రీకృష్ణుడు భగవద్గీతలో ''తేజః తేజస్వి నామహమ్'' అనియు, ''ప్రభాస్మిశశి సూర్యయోః'' అనియు చెప్పెను. అనగా తేజోవంతుని యందలి తేజస్సు నేనే మరియు సూర్య చంద్రులయందలి వెలుగు నేనే అని అర్థము.

2. అట్టి సూర్యునియందలి కాంతి నారాయణుడే యగుటచే, ఆయన

తన కాంతి యందలి సత్తువచే చోటును జీవవంతము లేక సత్త్వవంతము చేయుచున్నాడు.

3 నుండి 9 వరకు :- కనుక నారాయణుడు సూర్యుడు, తారలు మున్నగు వానియందు వెలుగును ధరించుచున్నాడు. అనగా ఆయన ఆయా గోళముల రూపమున పనిచేయుచున్నాడు. చోటునందు అఖండమయిన శక్తి యొక్క ప్రవాహము సుడిగానేర్పడి (Whirlpool of energy) ఒకచోట కేంద్రీకృతమై, చైతన్య శక్తిగా మారును. ఆ చైతన్య శక్తియే, అనగా అగ్నితో కూడిన అణువులే రజస్సులు అని చెప్పబడినవి. అట్టి అణువులు వెలుగుగా, మరియూ అగ్నిగా భౌతిక లోకములందు వ్యక్తమగుచున్నవి. అచ్చట నేర్పడిన సుడియే శృంగమని చెప్పబడినది. అట్టి శృంగములు అసంఖ్యాకములుగా చోటునందు లేక ఆకాశమునందు అగ్ని గోళములుగా వ్యక్తమగుచున్నవి. అట్లే ఒక్కొక్కసారి పరమాత్మయందు వెలుగు భౌతిక మానవ శరీరముగా అవతరింపవచ్చును. అట్లు వచ్చిన వెలుగులే రాముడు, పరశురాముడు, కృష్ణుడు, బలరాముడు మరియూ రాబోవు కల్కి మున్నగువారు. వారు వారి తేజస్సుచే దుష్టులను నిర్మూలనము చేసిరి. ఇట్టి దుష్ట శిక్షణకై వారు దీక్షతో ఆయుధములను ధరించి, ధర్మము స్థాపించి, ప్రజలను పాలించి నియమించిరి.

10. గదుడు శ్రీకృష్ణునికి తమ్మునివరుసయైన బంధువు. కనుక శ్రీకృష్ణుడు గదునికి అన్న.

82. శ్లో॥ చతుర్మూర్తిశ్చతుర్బాహుశ్చతుర్వ్యూహశ్చతుర్గతిః
చతురాత్మా చతుర్భావశ్చతుర్వేద విదేకపాత్ ॥

**ప్రతిపదార్థము** :- 1. చతుర్మూర్తిః = నాలుగు విధములైన రూపములు గలవాడు, 2. చతుర్బాహుః = నాలుగు బాహువులు కలవాడు, 3. చతుర్వ్యూహః = నాలుగు విధములైన పథకములు గలవాడు, 4. చతుర్గతిః = నాలుగు మార్గములు కలవాడు, 5. చతురాత్మా = నాలుగు విధములైన సృష్టి కలవాడు, 6. చతుర్భావః = నాలుగు విధములుగా ఆత్మనుండి వ్యక్తమగువాడు, 7. చతుర్వేదవిత్ = నాలుగు వేదములూ తెలిసినవాడు, 8. ఏకపాత్ = నాలుగువవంతు తన పాదముగా గలవాడు.

**తాత్పర్యము** :- నారాయణుని నాలుగు విధములుగా నున్న మూర్తిగా, నాలుగు బాహువులు గలవానిగా, నాలుగు వ్యూహములుగా, నాలుగుగా వున్న తన మార్గముగా, నాలుగు పద్ధతులలో తననుతాను తెలుసుకొనువానిగా నాలుగు లోకములలో వ్యక్తమగువానిగా, వేదము తెలిసి నాలుగుగా విభజించువానిగా. ఒకే పాదముగా వ్యక్తమయిన వానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1. పరమాత్మ నాలుగు మూర్తులుగా లేక దశలుగా సృష్టిని వ్యక్తము చేయువాడు. ఒకటి పరా వాక్కు, రెండు పశ్యంతీవాక్కు, మూడు మధ్యమావాక్కు, నాలుగు వైఖరీవాక్కు. పరమాత్మ నాలుగు వాక్కులుకలవాడు.

2. సూర్యోదయమునుండి సూర్యాస్తమయమువరకు, తూర్పు నుండి పడమరకు ఒక రేఖను, సూర్యుడు మిట్టమధ్యాహ్నము 12 గం. మన తలపైనుండు బిందువునుండి అర్ధరాత్రి 12 గం. మన పాదములక్రిందుగా భూమి క్రింద సూర్యుడున్న బిందువు వరకూ మరియొక సరళరేఖ నూహించుకొన్నచో, అవి రెండునూ చూచుచున్నవాని హృదయమునందు ఖండించుకొనును. ఈ ఖండించుకొను బిందువు నుండి నాలుగు వైపులగల రేఖలే నాలుగు బాహువులు. విష్ణువు చతుర్బాహుడై సూర్యుని గమనమును నిర్దేశించుచున్నాడు. కనుక ఆయనకు నాలుగు బాహువులన్నట్లు చెప్పబడినది.

3. పరమాత్మ నాలుగు వ్యూహములు కలవాడు. అనగా సంకర్షణ, అనిరుద్ధ, ప్రద్యుమ్న, వాసుదేవ అను నాలుగు వ్యూహములుగా వ్యక్తమయినవాడు. (వివరణ యింతకుముందు యివ్వబడినది).

4. పరమాత్మను చేరుకొనుటకు నాలుగు మార్గములు చెప్పబడినవి. అవి కర్మయోగము, భక్తియోగము, జ్ఞానయోగము. మరియూ వైరాగ్యము, అనగా తన ధర్మమును సత్కర్మగా నాచరించుట, ప్రేమతోకూడిన భక్తి, అట్టి భక్తిని కలిగింపగల జ్ఞానము మరియూ కోరికలులేని, ఆసక్తిలేని యోగసాధన అను నాలుగు స్థితులే ఈ నాలుగు యోగములు. తన ధర్మమనగా తనవారికి, సమాజమునందలి తోటి మానవులకు తాను చేయవలసిన, చేయదగిన సేవను సమర్థవంతముగా నిర్వహించుట, వారియందు ప్రేమ గలిగి వారిని భగవంతుని భౌతిక రూపములుగా సేవించుట. అట్లు వారిని సేవించుటకు వారియందు

అట్టి ప్రేమ, భక్తి, కలుగుటకు కావలసిన విషయములు క్షుణ్ణముగా తెలుసుకొనుట, ఎన్ని తెలుసుకొన్ననూ, ఏది చేసిననూ, దాని వలన కలుగు ప్రతి ఫలముగాని, మెచ్చుకోలునుగాని, ఎదురుచూడక, పట్టించుకొనక నిష్కామముగా జీవించుట అనునది ఈ నాలుగు యోగములను సమన్వయ పరచు నిజమైన యోగము.

5. చతురాత్ముడనగా నాలుగు దశలలో ఆత్మవికాసము కలవాడు. అహంకారము నాలుగు విధములుగా వ్యక్తమగుచున్నది. ఒకటి జీవాత్మ, రెండు మనస్సు, మూడు అంతరంగము, నాలుగు బుద్ధి.

6. చతుర్భావుడనగా తాను నాలుగుదశలలో సృష్టియందు వ్యక్తమగువాడు. అవి ఒకటి ఖనిజదశ, రెండు వృక్షదశ, మూడు జంతుదశ, నాలుగు మానవదశ. ఇవియే నాలుగు లోకములుగా కూడా చెప్పబడినవి.

7. నాలుగు వేదములే తన రూపముగా కలవాడు. అవి ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అధర్వణ వేదము.

8. పరమాత్మ ఈ సృష్టిని తన నాలుగు పాదములుగా సృష్టించెనని పురుషసూక్తము చెప్పుచున్నది. మూడు పాదములు అవ్యక్తముగా అమృతత్వము నందున్నవని, ఒక పాదము వ్యక్తమయిన భౌతిక స్థితిగానున్నదని వర్ణింపబడినది. అట్లు భౌతిక సృష్టియంతయూ తన ఒకేపాదముగా గలవాడు నారాయణుడు.

83. శ్లో॥ సమావర్తో ఽనివృత్తాత్మా దుర్జయో దురతిక్రమః
దుర్లభో దుర్గమో దుర్గో దురావాసో దురారిహా ॥

**ప్రతిపదార్థము :-** 1. సమావర్తః = సామ్యమునందున్న సృష్టి చక్రము, 2. నివృత్తాత్మా = వైరాగ్యముతో కూడిన ఆత్మకలవాడు, 3. దుర్జయః = జయించుటకు సాధ్యము కానివాడు, 4. దురతిక్రమః = అతిక్రమించుటకు సాధ్యము కానివాడు, 5. దుర్లభః = పొందుటకు వీలు కానివాడు, 6. దుర్గమః = సమీపించుటకు, చేరుటకు సాధ్యము కానివాడు, 7. దుర్గః = కోటవంటివాడు, 8. దురావాసః = కష్టసాధ్యమయిన ఆవాసము లేక నివాసము కలవాడు. 9. దురారిహా = దుష్టులైన శత్రువులను సంహరించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను తిరిగి వచ్చుచున్న మరియూ తిరిగిరాని ఆత్మలతో కూడిన సృష్టి చక్రముగా, ధ్యానము చేయుము. ఆయనను జయించుట, ఆయన ధర్మము నతిక్రమించుట మరియూ ఆయనను పొందుట మిక్కిలి కష్టము. ఆయనను సమీపించుట దుష్కరము. మాయతోకూడిన నివాసమే ఆయునది. ఆయున భక్తులకు కోటవంటివాడు. దుష్టులను జయించి సంహరించువాడు.

**వివరణ** :- 1. సృష్టియందు జీవులు పరమాత్మనుండి వేరుగా దిగి వచ్చుచుందురు. మరల తిరిగి పరమాత్మయందే లీనమగుచున్నారు. ఇది అనంతమైన సుడి లేక చక్రము. ఈ చక్రమును ధరించినవాడు మరల పరమాత్మయే. ఇది నిరంతరమై భౌతికముగా వ్యక్తమై సత్యముగా కనిపించుచున్ననూ, ఇది మొత్తము అంతర్యామి క్రీడయందలి ఒక భాగము మాత్రమే. అనగా ఇది సత్యమేయైననూ, దాని వెనుక మూడు రెట్లుగా పరిపూర్ణ సత్యమున్నది. అదియే శాశ్వతమయిన సత్యము. ఒక కంసాలి బంగారమును కరగించి, విగ్రహములుగా తయారు చేయుచున్నపుడు, బంగారము మిక్కిలి సత్యమయిన విషయము. విగ్రహములను మరల కరగించగా, బంగారమే యగుచున్నది. ఇట్టి వృత్తాకారమయిన మార్గమే సృష్టిచక్రము. ఈ మార్గమను చక్రమును ధరించియున్నవాడు నారాయణుడు. అనగా విగ్రహములు చేయుచున్న కంసాలివంటివాడు, మరియూ కుండలు తయారు చేయుటకై చక్రము త్రిప్పుచున్న కుమ్మరివంటివాడు.

2. అట్లు జీవాత్మ సృష్టిలోనికి ప్రవేశించి మరల భగవంతునియందు లీనమగుచుండగా గమనింపబడు సత్యమేమనగా, సృష్టియందలి కోరికగల జీవులు భూలోకమునకు తిరిగి వచ్చుచుండగా వైరాగ్యముగల జీవులు, తిరిగి పుట్టుటకు ఆవశ్యకత లేనివారు ముక్తస్థితి పొందుచున్నారు. అనగా ముక్తులైన వారికి పుట్టవలెనని సంకల్పముండదు. వారు తాము రూపములతో కూడిన విగ్రహములుగా కాక అందలి బంగారముగా నుంటిమని తెలిసినవారు. అనగా నారాయణుడను బంగారముతో కూడిన విగ్రహములుగా ఈ జీవులందరిని తెలిసినవారు. ఇదియే వైరాగ్యము అనుబడు స్థితి. ఇట్టి వైరాగ్యభావనను జీవులకు కలిగింప వలసినవాడు నారాయణుడే.

3. అట్టి వైరాగ్య భావన లేకుంటే, కేవలము మోక్షము కోసము ప్రయత్నించువారు వ్యర్థజీవులు. ఎందుకనగా తోటి జీవులయందు భగవంతుని చూచి వానికి సమర్పణ బుద్ధితో సేవించువారికి తప్ప ఇతర జీవులకు పరమాత్మను జయించుట సాధ్యముకాదు.

4. అతిక్రమించుట అనగా దాటుట. ఒకడింకొకనిని అతిక్రమించు చున్నాడనగా అట్లు అతిక్రమించుచున్నవాడు ముందున్న వానికన్నా గొప్పవాడు, బలవంతుడు. మానవుని శరీరము పంచభూతములచే తయారైనది. మనస్సు ప్రకృతివలన కలిగినది. కనుక మానవుడు ప్రకృతియందలి ధర్మమునకు బద్ధుడు. కనుక ప్రకృతిని దాటుట జీవునికి సాధ్యముకాదు. ఈ ప్రకృతిని పుట్టించినవాడు నారాయణుడు. కనుక అతిక్రమించుటకు సాధ్యము కానివాడు.

5,6. అంతేగాక భగవంతుడు పొందుటకు వీలుకానివాడు. మనమొక వస్తువును సంపాదించుచున్నామనగా ఇతరులకు దక్కకుండ జాగ్రత్తపడుచున్నామని అర్థము. అట్టి బుద్ధిని దొంగబుద్ధి అందురు. పతంజలి యోగసూత్రములలో యోగసాధకుని ముఖ్య లక్షణములలో ఒక లక్షణముగా ''అస్తేయః'' (దొంగబుద్ధి లేనివాడు) అని వర్ణించెను. కనుక నారాయణుడు దొంగబుద్ధి గలవారికి లభింపడు. వానిని సమీపించుటకు కూడా వారికి సాధ్యము కాదు.

7,8. అట్టివారికి భగవంతుడనగా ఒక మాయాజీవులతో కూడిన ప్రపంచము. వారు పరమాత్మను కరుణ వాత్సల్యములతోకూడిన ప్రేమమూర్తిగా చూడక తన మాయా జాలములతో జీవులను భ్రమపెట్టి మోసగించి, శిక్షించు ఇంద్రజాలికునిగా చూతురు. ఈ ప్రపంచమే ఆ ఇంద్రజాలికుని కోట లేక సభామందిరము. అనగా జీవుల కదియొక మయసభ. అనగా భగవంతునిగూర్చి తమ మనస్సునందు కల్పించుకొనినట్టి చిక్కులతో కూడిన సాధనామార్గమే తమకు, భగవంతునికి మధ్య కోటయై నిలిచి, వానిని చేరుటకు అడ్డంకి యగుచున్నది.

9. దుష్టసంకల్పములు గలవాడెవడైననూ ఈ భగవంతుని ఇంద్రజాలమునందు చిక్కుకుని నశింపక తప్పదు. దుర్బుద్ధి కలవానికి ఇతరులందరూ దుర్బుద్ధి కలవారుగా, తనను చంపుటకు కుట్రచేయువారుగా

కనిపింతురు. వారితో వివాదమునకుదిగి చివరకు వారిచేతిలో నశింతురు. ఇట్లు దుర్బుద్ధిగల శత్రువులను వారి బుద్ధిచేతనే నశింపచేసి, నారాయణుడు తనయందు లీనము చేసుకొనుచున్నాడు.

84. శ్లో॥ శుభాంగో లోకసారంగ స్సుతంతు స్తంతువర్ధనః
ఇంద్రకర్మా మహాకర్మాకృతకర్మా కృతాగమః ॥

**ప్రతిపదార్థము :-** 1. శుభాంగః = శుభమయిన ఆకారము కలవాడు, 2. లోకసారంగః = లోకముల సారమును అనుభవించువాడు, 3. సుతంతుః = చక్కని సూత్రము లేక దారము, 4. తంతువర్ధనః = దారము తీయువాడు, 5. ఇంద్రకర్మ = ఇంద్రుని కర్మలేక పని, 6. మహాకర్మ = గొప్ప కర్మ, 7. కృతకర్మ = చేయబడినపని, 8. కృతాగమః = నిర్మింపబడిన శాస్త్ర సంప్రదాయము కలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను శుభమైన ఆకారముతో శుభమయిన అవయవములతో కూడిన వానిగా ధ్యానము చేయుము. ఆయన సకలలోకముల సారము తానే యైనవాడు. సృష్టియను దారము లేక సూత్రము తానేయైననూ, మరల తానే తననుండి సృష్టిని దారముగా తీయువాడై యున్నాడు. ఆయన సృష్టియను మహాకార్యముగా మరిఅట్టి కార్యము పరిపూర్తి చేయువానిగా నున్నాడు. సృష్టియందలి శాస్త్రీయ సంప్రదాయము కూడా తానే నిర్మించుచున్నాడు.

**వివరణ :-** 1,2. భగవంతుని రూపము శుభము కలిగించును. అనగా ధ్యానము చేయువారికి అభివృద్ధి కలిగించి మానసిక ఉల్లాసమునే గాక భౌతికముగా కూడ సుఖశాంతులు కలిగించును, కనుక శాంతి సౌఖ్యములతో గూడిన జీవితసారము పరమాత్మయే. అనగా భగవంతుడే కారణమగుచున్నాడు. ఇటుల లోకములయందు సారము తానై యున్నాడు.

3,4. సృష్టియంతయూ ఒక సూత్రమువంటిది. ఈ సూత్రమునకు ఒక చివర జీవుడును మరియొక చివర నారాయణుడు ఉందురు. సృష్టి ప్రారంభమయినది మొదలు ప్రళయకాలము వరకూ ఈ దారము సాగుచునే యుండును.

5,6,7. ఇంద్రుని కర్మ అనగా ఒకచోట కేంద్రమేర్పడి ఆ కేంద్రము చుట్టూ సకల భూతములూ చేరుట. దీని కుదాహరణము సౌరకుటుంబము. ఇంద్రుడే సూర్యుడను కేంద్రముగా నేర్పడి, తనచుట్టూ గ్రహములను త్రిప్పుకొనుచున్నాడు. అట్లే ఒక దేశమునకు పరిపాలకుడు కూడా ఇంద్రుని అంశగా జీవులను పాలించుచున్నాడు. ఇట్లు జీవులను తనచుట్టూ ఆకర్షించుకొను గుణము నారాయణుడే. ఆయనయే విశ్వమునకు కేంద్రమై సమస్త సూర్యగోళములను లేక తారలను తన చుట్టు త్రిప్పుకొనం చర్యను నిర్వహించుచున్నాడు. కనుక ఆయన మహాకర్ముడు.

8. ఇట్లు నిర్వహింపబడు సృష్టియందు అనేక శాస్త్ర సత్యములు ఇమిడియున్నవి. అవి సృష్టిపుట్టుట, నిర్వహింపబడుట, మరియు లయమగుట అను మూడు దశలకు చెందిన రహస్యములు, ఈ రహస్యములను దర్శించు పెద్దలు వివిధ శాస్త్రములను రచించిరి. కాని ఈ శాస్త్రములే జీవులచే వేరువేరు విషయములుగా అర్థము చేసుకొనబడుచున్నవి. కాని ఈ శాస్త్రముల యొక్క మొత్తమును పరిపూర్ణముగా దర్శించినచో అదియే సృష్టియందలి సత్యముగా దాగియున్న పరమాత్మయొక్క రూపము.

85. శ్లో॥ **ఉద్భవ** స్సున్దర స్సుందో రత్ననాభ స్సులోచనః
**అర్కో** వాజసన శ్శృంగీ జయంత స్సర్వ విజ్జయీ ॥

**ప్రతిపదార్థము** :- 1. ఉద్భవః =మొలకెత్తుట, 2. సున్దరః = సుందరమైనవాడు, 3. సున్దః = అందమైన పలువరుస కలవాడు, 4. రత్ననాభః = నాభియందు వ్యక్తమగు ప్రజ్ఞకలవాడు, 5. సులోచనః = చక్కని నేత్రములు కలవాడు, 6. అర్కః = కిరణములు గలవాడు, 7. వాజసనః = అహారము నిచ్చువాడు, 8. శృంగీ = కొమ్ములేక శిఖరము గలవాడు, 9. జయంతః = నిరంతరము జయము పొందువాడు, 10. సర్వవిత్ = అన్నియూ తెలిసిన వాడు, 11. జయీ =జయము.

**తాత్పర్యము** :- పరమాత్మని సృష్టిలోనికి మొలకెత్తుచున్న సుందరమైన జీవులుగా ధ్యానము చేయుము. ఆయన అందమైన పలువరుస కలవాడు. చిత్రమైన రూపకల్పనలతో కూడిన కేంద్రములు గలవాడు. చక్కని ప్రకాశవంతమయిన

నేత్రములతో కాంతిని అన్నివైపులకు ప్రసరింపచేయుచున్నాడు. ఆయన ఈ సృష్టిచక్రమునకు శిఖరముగా ఆహారమును పుట్టించుచున్నాడు. తన సృష్టియందలి జీవుల జయమే తానైనవాడు. ఆయన సర్వమూ తెలిసినవాడు. మరియూ సర్వమును జయించినవాడు.

**వివరణ** :- 1. మొలకెత్తుట వృక్షజాతికి సంబంధించినది. మొక్క మొలకెత్తునప్పుడు గింజలోనుండి మట్టిని చీల్చుకొని పైకి మొలచును. సత్యమును గమనించినచో జీవుల పుట్టుక కూడా నిట్టిదే. జీవులు అంతర్యామినుండి భౌతిక ప్రపంచమునందు పుట్టుచున్నారు. ఇట్లు పుట్టుట లేక అంకురించుట అనునవి నారాయణుని శక్తులే.

2. సౌందర్యము ఆత్మగత మయినది. అది భౌతిక రూపములద్వారా వ్యక్తమగును. కానీ భౌతికముకాదు. ఈ సౌందర్యము సృష్టించువానియొక్క మరియూ గమనించువానియొక్క మనస్సులందు పుట్టి పనిచేయుచున్నది. ఒక వస్తువు అందముగా నున్నదనగా దాని యందము భౌతిక రూపమునందలిదే యైననూ భౌతికద్రవ్యమునకు సంబంధించినది కాదు. అనగా దానికుపయోగించిన రంగులు, పదార్థము, మున్నగు వానికతీతముగా దానియందు అందము కలదు. ఆ అందము ఆ వస్తువు సృష్టించినవాని మనస్సునుండి చూచువాని మనస్సులోనికి వస్తువు ద్వారా ప్రవహించుచున్నది. అట్టి అందము నారాయణునియొక్క రూపము.

3. ప్రతి జంతువునందునూ, మరియూ మానవుని యందునూ దంతములు నిర్ణీతమైన సంఖ్యలో ఏర్పడియుండును. ఇట్లు నిర్ణయించునది జీవులయందు పనిచేయుచున్న సృష్టికర్తయే. మరియూ అందమైన పలువరుస కలవాడనగా చిరునవ్వు నవ్వుచున్నాడని అర్థము. నిరంతరమూ చిరునవ్వుగల ముఖము కలవాడు నారాయణుడు. కనుక ఎట్టి పరిస్థితులలోనూ చిరునవ్వు చెరిగిపోని వారియందు నారాయణుడుండును.

4. శరీరమునకు నాభి నాడీ కేంద్రమగుచున్నది. అట్లే ఈ సృష్టియందు గల లోకములలో ఒక్కొక్క లోకమునందునూ ఒక్కొక్క కేంద్రము గలదు. ఈ లోకములన్నిటికీ కలిపి మరల ఒకే కేంద్రముండును. ఆ కేంద్రమే నారాయణుడు.

5. చూచుట అనునది చోటులో సూర్యునివలన ఏర్పడుచున్నది. అనగా భౌతిక రూపములైన కాంతికి, మరియూ కంటికి సూర్యుడే అధిపతి. మనయందు చూచుట అనుశక్తి పుట్టిన తరువాతనే భౌతికముగా కాంతి మరియూ కన్ను అను ఇంద్రియము పుట్టినవి.

6. అట్లు మొదట సూర్యునివలననే చూచుట, కాంతి మున్నగునవి పుట్టినవి. చోటులో కాంతి పుట్టుట నేటి శాస్త్రజ్ఞులకు అందని రహస్యము. చోటులో అనంతమయిన శక్తి (Energy) యిమిడియున్నదని మాత్రమే శాస్త్రజ్ఞులకు తెలియును. అట్టి శక్తి ఒకచోట కేంద్రీకృతమైనచో అది వెలుగుగా మారును. సూర్యుడు మరియూ నక్షత్రములు మున్నగువాని యందలి వెలుగు మరియూ కిరణములు ఇట్లే పుట్టుచున్నవి. చోటునందు అంతర్లీనముగానున్న పరమాత్మ వలననే ఇట్టి వెలుగు పుట్టుచున్నది.

7. ప్రకృతి యందలి మార్పులను గమనించినచో ఒక రహస్యము తెలియును. అది ఏమనగా జంతువులకు, క్రిమికీటకాదులకు మరియూ మానవులకు ఎవరి ఆహారము వారికి ప్రకృతి స్వతఃసిద్ధముగా నేర్పాటు చేయుచున్నది. ఇది ఒకరి ప్రయత్నము వలనగాక ప్రకృతి యందుగల సహజమైన ఏర్పాటు. ఈ ఏర్పాటు నారాయణుని వలననే జరుగుచున్నది.

8. జీవులకు అట్లు ఆహారమును కలిగించుటకు ప్రకృతి సంవత్సరమను యజ్ఞమును నిర్వహించుచున్నది. ఈ యజ్ఞమునకు శిఖరమువంటిది పంటలు పండుకాలము. వసంతకాలమున కూడా చెట్లు చిగిర్చి ఫలములను ఇచ్చును. ఇట్లు పంటలను, మరియూ ఫలములను జీవులకు కలిగించు కాలము సంవత్సరమునకు శిఖరమువంటిది.

9. అట్లు ఒక్కొక్క సంవత్సరము చుట్టివచ్చుటలో జీవులకు ఆహారము మున్నగునవేర్పడుచున్నవి. ఇట్లు ఒక్కొక్క చుట్టులేక ఆవర్తము భగవంతునికి ఒక్కొక్క విజయము. సూర్యుడు భూమిచుట్టూ పరిభ్రమించుచు విజయము సాధించుచున్నాడు. ఇట్లు జీవులకు సుఖము, శ్రేయస్సు కలిగించు సూర్యుని విజయమే చక్రవర్తిత్వము. చక్రమునందు వర్తించువాడు గనుక చక్రవర్తి. రాజులు ఈ సంప్రదాయము ననుసరించియే భూమియంతయూ ప్రజల క్షేమమున్కై

చుట్టివచ్చి ప్రజలను సుఖవంతులుగా చేయుచున్నారు. కనుక చక్రవర్తులనబడుచున్నారు. కనుక నారాయణుని నిజమైన విజయము ఇదియే.

10. అణువులనుండి సమస్త జీవులవరకు ఉత్తమ స్థితిలోనికి పరిణామము చెందుట జరుగుచున్నది. ఇట్టి పరిణామమును గమనించినచో వాటియందు ఒక మహాశక్తి పనిచేయుచున్నదనియూ అదియే జీవులకు మార్పులు కలిగించుచున్నదనియూ తెలియును. ఇట్లు అన్నింటియందునూ పనిచేయుచు, వాటియందు కలిగింపవలసిన మార్పులు కూడా తెలిసినవాడు గనుక, నారాయణుడు సర్వవిత్ అని చెప్పబడినాడు.

11. దీనిని తెలిసి విశ్వసించినవాడు, వాని (నారాయణుని) మార్గమును అనుసరించినచో, అట్టివానికి జీవితమున కావలసినది లేదు. అనగా అతడు కూడా సకలమును జయించుచున్నాడు.

86. శ్లో॥ సువర్ణబిందు రక్షోభ్యః సర్వవాగీశ్వరేశ్వరః
మహాహ్రదో మహాగర్తో మహాభూతో మహానిధిః ॥

**ప్రతిపదార్థము :–** 1. సువర్ణబిందుః = బంగారపు వర్ణముగల కాంతియొక్క బిందువు, మరియూ చక్కగా ఉచ్చరింపబడు వర్ణముయొక్క పుట్టుక స్థానము, 2. అక్షోభ్యః = క్షోభింపచేయుటకు వీలుకానివాడు, 3. సర్వవాగీశ్వరేశ్వరః = వాక్కునకు సంబంధించిన దేవతలందరకు అధిపతియైనవాడు, 4. మహాహ్రదః = అస్తిత్వము అను గొప్ప సరస్సుయైనవాడు, 5. మహాగర్తః = గొప్ప అగడ్త లేక కందకముగా యున్నవాడు, 6. మహాభూతః = గొప్ప భూతమైనవాడు, 7. మహానిధిః = గొప్ప సంపద యైనవాడు.

**తాత్పర్యము :–** పరమాత్మను బంగారు వర్ణముగల కాంతియొక్క బిందువు గనూ, మరియూ సృష్టి వాక్కుగా నుచ్చరింపబడుటకు కారణమైన బిందువుగనూ ధ్యానము చేయుము, ఆయన వాక్కుయను దేవతలకు అధిపతి గనుక, క్షోభింప చేయుటకు సాధ్యముకాదు. సృష్టియను సత్తు లేక అస్తిత్వముగానున్న మహాసరస్సువంటివాడు. భౌతికమగు మహాఅగడ్త లేక కందకము ఆయనయే. అన్ని భూతములకు కారణమైన మహాభూతము ఆయనయే. అన్ని సంపదలకు మూలకారణమైన మహానిధిగా ఆయనయే యున్నాడు.

**వివరణ :-** 1. చోటునందు సూర్యగోళములు పుట్టుటకుముందు సూర్యుడు దివి లేక వెలుగుల లోకములందు మొట్టమొదటి వెలుగుగా, అనగా నేనను ప్రజ్ఞగా పుట్టుచున్నాడు. ఇదియే హిరణ్మయమైన వెలుగు. ఇదియే జీవులయందుకూడా నేనను ప్రజ్ఞగా పనిచేయుచున్నది. సూర్యుని పుట్టుకకు కారణమైన ఈ వెలుగులను ''మరీచి'' అని అందురు. ఈ మరీచి యను వెలుగు నేనను ప్రజ్ఞనుండి పుట్టుచున్నది. ఈ నేనను ప్రజ్ఞ ''ఓం'' కారమునుండి పుట్టుచున్నది. ఈ ''ఓం'' కారమే మొట్టమొదటి శుభమైన శబ్దము లేక సువర్ణము. ఈ ''ఓం'' కారము జీవులయందు పుట్టుచోటు సువర్ణబిందుః అని పిలువబడుచున్నది.

2. క్షోభింపబడుటకు బాహ్యమైన కారణము కావలెను. నారాయణుని బాహ్యము, అంతరము రెండునూ తానే గనుక అయనను క్షోభింపచేయుట సాధ్యముకాదు. ఇతరులున్నప్పుడు వారి వలన తాను కలతపడుట జరుగును. ఇతరులయందు కూడా తానే యున్నవానికి కలతపడుట యుండదు.

3. వాక్కును పుట్టించుటకు అనేక దేవతలు పనిచేయుచున్నారు. వారు రాగము, తాళము, లయ మున్నగు వాని కధిపతులు, వానివలన చోటునందు శబ్దము పుట్టుట, మానవునియందు వాక్కు పుట్టుట జరుగుచున్నది. ఇట్టి దేవతలకందరికి నారాయణుడే అధిపతియై వారి ప్రజ్ఞలను పరిపాలించుచున్నాడు గనుక ఆయన అందరు వాగ్దేవతలకు అధిపతియై యున్నాడు.

4. ఈ విశ్వమంతయూ ఒక మహా సరస్సు వంటిది. దీనియందలి జలములే జీవము లేక ప్రాణశక్తి. సకల జీవరాసులునూ ఈ మహా సరస్సునందు చరించుచున్నవారే. అంతేగాక మనస్సు, బుద్ధి నేనను ప్రజ్ఞ అను వివిధ స్థితులన్నియూ ఈ మహా జలములయందే కరగియున్నవి. నీటియందు పంచదార కరగి యున్నట్లు ఈ లోకములన్నియూ ఉన్నవి. అట్టి లోకమను మహాసరస్సు నారాయణుని రూపమే.

5. భౌతిక దేహము పరిమితమైనది. అనగా ప్రజ్ఞ, బుద్ధి ఇతర శక్తులు మనయందు పనిచేయుచున్ననూ, భౌతికముగా వానిని దర్శించుట సాధ్యముకాదు. అవి యన్నియూ పరిమితములై భౌతిక స్థితిలోనికి పరిణామము చెందుచున్నవి

కనుక ఈ భౌతికలోకము ఒక అగడ్త లేక కందకము వంటిది. కందకములోని వానికి ఎటుల స్వాతంత్ర్యముండదో అట్లే భౌతికస్థియందు ప్రజ్ఞ మున్నగు వానికి స్వాతంత్ర్యముండదు. కాని ఇట్లు అన్నిటిని నియమించు భౌతిక లోకము కూడా నారాయణుని రూపమేయగుచున్నది.

6. సకల భూతములు లేక జీవులు అందరూ విరాట్ పురుషులలోని వారే. ఆయనయే విశ్వరూపుడని కూడా పిలువబడుచున్నాడు.

7. సృష్టియందలి సకల సంపదలూ పరమాత్మనుండి పుట్టినవి కనుక ఆయననుండి వేరుగానున్న సంపద లేదు. కనుక అన్ని సంపదలకూ మూలమయిన మహా సంపద ఈయనయే. అంతేగాక ఆయననుండి కొత్తవి సృష్టించుటకు సాధ్యముకాదు. కాని ఇంకొక చిత్రమేమనగా ఆయన సమస్తమునకు మూలము గనుక క్రొత్తవి ఎన్ని వచ్చిననూ ఆయననుండి రావలసినదే. కనుకనే ఆయన అన్నిటికి నిధి యైనవాడు.

87. శ్లో॥ కుముదః కుందరః కుందః పర్జన్యః పావనోఽనిలః
అమృతాంశోఽమృతవపుః సర్వజ్ఞః సర్వతోముఖః ॥

**ప్రతిపదార్థము** :- 1. కుముదః = భౌతిక సుఖము, 2. కుందరః = (సువాసనలతో కూడిన) పరిమళముగల పూవులను భూమికి తెచ్చువాడు, 3. కుందః = మల్లెపువ్వు, 4. పర్జన్యః = వర్షమునకధిపతి, 5. పావనః = పవిత్రము చేయువాడు, 6. అనిలః = వాయువు, 7. అమృతాంశః = మృత్యువును నశింపచేయు అంశ కలవాడు, మరియూ అమృతమయమైన కిరణములు కలవాడు, 8. అమృతవపుః = అమృతమే తన శరీరముగా కలవాడు, 9. సర్వజ్ఞః = అన్నియు తెలిసినవాడు, 10. సర్వతోముఖః = అన్నిటియందు సామర్థ్యము గలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను భౌతిక సుఖములు కలిగించు పరిమళ పుష్పములుగా ముఖ్యముగా మల్లెపువ్వుగా ధ్యానము చేయుము. ఆయన వర్షమున కధిపతియై జీవులకు సౌఖ్యము కలిగించుచున్నాడు. వాయువునందలి వీచు శక్తిగా అన్నిటిని పరిశుద్ధము చేయుచున్నాడు. అమృతమయములగు చంద్రకిరణములే ఆయన భౌతిక శరీరము. ఆయన అన్నియూ తెలిసినవాడు,

మరియూ అన్నిటియందు సామర్ధ్యము కలవాడు.

**వివరణ :-** 1. పరిమళముతో కూడిన పుష్పములు నిజమయిన భౌతిక సంపద. అవి నిత్యనూతనములై తమ పరిమళములచే జీవులకు అప్రయత్నముగా ఊర్ధ్వ లోకములయందు మనస్సు నిలుచునట్లు చేయును. పూవులు మాతృత్వమునకు చిహ్నములు. ఎందుచేతననగా పూవులు పిందెలై, కాయలై, ఫలములై మరల నూతన వృక్షమునకు కావలసిన బీజములను తమయందు ధరించును. కుముదమనగా కలువ పువ్వని కూడా అర్థము కలదు.

2,3. మల్లెపువ్వు నారాయణుని పూజలయందు విశేషముగా నుపయోగింపబడును. మల్లెపువ్వు స్వచ్ఛతకు, పరిశుద్ధ స్థితికి సంకేతము. కనుక భగవంతుని అర్చించుటకు మిక్కిలి శ్రేష్ఠమయినది.

4. సంవత్సరమునందు వర్షాకాలము వృక్ష సంపదకు మూలము. కనుక భగవంతుడు మేఘముల కధిపతియై సకాలమున వర్షములు కురిపించుచున్నాడు.

5,6. సంవత్సరమునందు వివిధ కాలములలో వీచు వాయువులు, గతకాలపు మలినములను ఎప్పటికప్పుడు తొలగించుచుండును. మరియూ మొక్కలు, జంతువులు, మానవులు శ్వాసించుటవలన వాయువు దేహములను, వాతావరణమును శుద్ధిచేసి, ప్రకృతిని మరల జీవవంతము చేయుచున్నది.

7,8. చంద్రకిరణములు మొక్కల పరాగ సంపర్కమునకు, అంకురమునకు, పెరుగుదలకు కారణమగుచున్నవి. కనుక భగవంతుడే చంద్రకిరణములద్వారా దిగివచ్చి, ప్రకృతిని మరల జీవవంతము చేయుచున్నాడు. మొక్కలు, వృక్షములు, మరియూ మానవులూ చనిపోవుచున్ననూ, మరల పుట్టుచునే యున్నారు. అనగా ఎన్ని మొక్కలు నశించుచున్ననూ వృక్షజాతి భూమిపై వృద్ధిచెందుచునే యున్నది. ఇట్లు ప్రకృతి యందలి వృక్షములకూ, జీవులకూ, నారాయణుడు అమృతత్వమును కల్పించుచున్నాడు.

9,10. కనుక నారాయణుడు సర్వము తెలిసినవాడు. ఆయన అన్ని విషయములయందు సామర్థ్యము కలవాడు. ఎవరికేది కావలయునో నిర్ణయము చేయుటయందు నైపుణ్యము కలవాడు. కాలములుగా, వర్షాదిపతిగా, విశ్వము

నందలి ప్రాణశక్తిగా ఆయన తన సామర్థ్యమును ప్రకటించుటయే గాక జీవులకు కావలసినవి సమకూర్చుచున్నాడు.

88. శ్లో॥ సులభః సువ్రతః సిద్ధః శత్రుజిత్ శత్రుతాపనః
న్యగ్రోధోదుంబరో ఽశ్వత్థశ్చాణూరాంధ్రనిషూదనః ॥

**ప్రతిపదార్థము** :- 1. సులభః = సులభమైనవాడు, 2. సువ్రతః = చక్కని వ్రతమైనవాడు, 3. సిద్ధః = పరిపూర్ణుడు, 4. శత్రుజిత్ = శత్రువులను జయించినవాడు, 5. శత్రుతాపనః = శత్రువులను నశింపచేసినవాడు, 6. న్యగ్రోధః = జమ్మి యను వృక్షము, 7. ఉదుంబరః = మేడి వృక్షమైనవాడు, 8. అశ్వత్థః = రావిచెట్టు, 9. చాణూరాంధ్రనిషూదనః = ఆంధ్రుడయిన చాణూరుని చంపినవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను సులభముగా పొందవలెనన్నచో, పవిత్రమైన జీవితమును గడుపుచు, వ్రతనియమములాచరించుచూ, అశ్వత్థ వృక్షము క్రింద జీవించుచూ, మేడి పండును తిని, జమ్మి ఆకులు నానబెట్టిన నీటిని త్రాగుచుండవలెను. ఇట్టి నియమముతో కూడిన ధ్యానమును వ్రతముగా నాచరించు వానికి పరమాత్మ వారి అంతశ్శత్రువులను జయించి నిర్మూలించును. ఆయన ఆంధ్రుడైన చాణూరుడను వానిని సంహరించెను. పైన చెప్పిన వృక్షముల సాన్నిధ్యమున వ్రత నియమముల నాచరించుచూ, నారాయణుని ధ్యానము చేయువానికి అన్ని సిద్ధులునూ లభించును.

**వివరణ** :- పైన చెప్పిన ప్రకారము జీవించువారికి నారాయణుడు వారి అంతశ్శత్రువులను నిర్మూలించును. కామము, క్రోధము, లోభము, మోహము, మదము, మాత్సర్యము అనునవి మానవుని అంతశ్శత్రువులు. నారాయణుడు వాటిని నశింపచేసి జీవులకు మోక్షము కలిగించును.

89. శ్లో॥ సహస్రార్చిః సప్తజిహ్వో సప్తైధాః సప్తవాహనః
అమూర్తిరనఘో ఽచింత్యో భయకృద్భయనాశనః ॥

**ప్రతిపదార్థము** :- 1. సహస్రార్చిః = వేయి కిరణములు గలవాడు, 2. సప్తజిహ్వో = ఏడు నాలుకలు గలవాడు, 3. సప్తైధాః = ఏడు కట్టెలు

గలవాడు, 4. సప్తవాహనః = ఏడు వాహనములు గలవాడు, 5. అమూర్తిః = రూపము లేని వాడు, 6. అనఘః = పాపమంటనివాడు, 7. అచింత్యః = మనస్సుకు, ఆలోచనకు అందనివాడు, 8. భయకృత్ = భయమునకు కారణమైనవాడు, 9. భయనాశనః = భయమును నాశనము చేయువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను వేయి కిరణములు గలవానిగా, ఏడు నాలుకలు గలవానిగా, ఏడు సమిధలుగా, మరియూ ఏడు వాహనములు గల వానిగా ధ్యానము చేయుము. ఆయనకు రూపము లేదు. మరియూ పాపమంటనివాడు. ఆయన మనస్సుకందడు. ఆయన పాపులకు భయమును కలిగించి, పుణ్యాత్ములకు భయమును పోగొట్టును.

**వివరణ :-** 1. సూర్యుడు తనవేయి కిరణములతో లోకములను వెలిగించుచున్నాడు. అట్టి సూర్యుడు విరాట్ పురుషుని యొక్క ప్రతిరూపము. ఆ విరాట్ పురుషుడు మిక్కిలి ప్రకాశవంతమైనవాడు. అన్ని వెలుగులు ఆయన నుండియే పుట్టుచున్నవి.

2. అగ్నికి గల ఏడు విధములైన జ్వాలలే ఏడు నాలుకలు. సూర్యుడు తన వేయి కిరణములతో పగటిపూట ప్రకాశించగా, అగ్నిహోత్రుడు తన ఏడు జిహ్వాలతో రాత్రిపూట ప్రకాశించును.

3. ఏడు లోకములే ఏడు సమిధలై ఏడు లోకములను వెలిగించుచున్నవి.

4. భగవంతుని ఏడు వాహనములు ఏడు దశలలో నున్న ప్రాణులు లేక జీవరాశులు:

అవి (1) గ్రద్ద, )2) పాము, (3) ఆకు లేక వృక్షము, (4) మట్టి లేక ఖనిజ సంపద, (5) వృక్షజాతి, (6) పశు జాతి, (7) మానవజాతి.

దేవాలయములలో రథసప్తమి నాటి ముందు పాడ్యమి మొదలుకొని ఈ ఏడు వాహనములతో దేవుని అర్చింతురు. ఏడవ రోజున రథోత్సవము జరుగును. ఇందు గ్రద్ద సువర్ణునికి ప్రతీక. సుపర్ణ సూక్తమునందు, సుపర్ణుడు అవ్యక్త లోకములలోనుండి బాహ్యలోకములలోనికి విస్తరించియున్న పరమాత్మ వెలుగుగా వర్ణింపబడినాడు. అవ్యక్త లోకములు ఒక రెక్కగనూ, బాహ్యలోకములు యింకొక

రెక్కగనూ, వర్ణింపబడినవి. పాము, దైవప్రజ్ఞ భౌతిక స్థితియందు బంధింపబడుటకు చిహ్నము. పాము పుట్టలలోను, రంధ్రములలోను దూరి చీకటియందు నివసించును. అట్లే ప్రకృతియందు బంధింపబడిన దైవప్రజ్ఞ, తాను వేరను చీకటియందు నివసించును. మరియూ పాముకుండలిని శక్తిని సూచించును. కుండలిని అనగా జీవునియందు మేల్కొనుచున్న దైవప్రజ్ఞ. వృక్షము, దైవప్రజ్ఞ ప్రకృతిగా మేల్కొనుటను సూచించును. మరియూ సృష్టియందలి కార్యకారణ సంబంధమును సూచించును. కారణములే విత్తనములు. ఫలములే పనులయొక్క ఫలితములు. ఇట్టి కారణములు, పనులు, వాటి ఫలితములు, అను మూడునూ ఒక చక్రముగా నేర్పడి ఈ సృష్టిచక్రమును త్రిప్పుచున్నవి. ఖనిజస్థితి ప్రకృతియందు నిద్రించుచున్న దైవ ప్రకృతిని సూచించును. ఖనిజములుగా, అందలి అణువులుగా ప్రజ్ఞ (Consciousness) నిద్రించుచున్నది. ఇది పరమాత్మయొక్క తమోగుణ ప్రవృత్తిని సూచించును. అనగా సత్వగుణము, రజోగుణము, తమోగుణము అను మూడిటియందు సత్వగుణమే ప్రధానమైనవనియూ, రజస్తమో గుణములు దైవప్రజ్ఞకు వ్యతిరేకమైనవనియూ తలచుట భ్రాంతి. ఎట్టిస్థితిలో నున్నవాని నైననూ, కోరిక లేక ఉపాసించినచో బంధవిముక్తి కలుగును. రాయి భగవంతుని తమోగుణస్థితి. దానిని విగ్రహముగా మలచుటవలన చూచువారికి అప్రయత్నముగా భక్తిని కలిగించుచున్నది. దానికది రాయి కావచ్చును గాని చూచువారికి భగవంతుడు. వృక్షస్థితిలో నున్న దైవప్రజ్ఞ కలతతో కూడిన నిద్రగా చెప్పబడినది. అనగా ఒడలు తెలియని నిద్రగాక, కొద్దిపాటి మెలకువతో కూడిన నిద్ర వృక్షమునందు ప్రజ్ఞ మేలుకొనుటకు మొట్టమొదటి దశలోనున్నది. జంతుదశలోనున్న ప్రజ్ఞ పూర్తి మెలుకువకు ముందున్న స్థితి. మానవజాతి దైవప్రజ్ఞ మేల్కొన్న స్థితిని సూచించును. మానవ శరీరము రథముతో పోల్చబడినది. అందు దేవుని విగ్రహము ఉంచి ఊరేగించుట అనగా మానవదేహము ఒక రథమనియూ అందు నివసించువాడు జీవుని రూపముననున్న నారాయణుడనియూ తెలిసిన స్థితిని సూచించును.

5. ఇన్ని దశలలో యిన్ని రూపములతో చరించుచున్ననూ దైవ ప్రజ్ఞకు, వేరే ఒకరూపము లేదు. అది ఏ రూపమునందున్నదో ఆ రూపమునే ధరించును.

నీరు గ్లాసులో గ్లాసు రూపమున, బిందెలో బిందె రూపమున, తొట్టిలో తొట్టి రూపమున వుండునుగాని, దానికి వేరే రూపము లేదు.

6. పాపము మనస్సునకు సంబంధించినది. ఒకడు పనిచేయు దృష్టిపై, వానికి పాపము సంభవించుట ఆధారపడి యుండును. కోరికలతో పనిచేయువానిని పాపము బంధించును. ఒకడు ఇంకొకనిని బాధించినచో పాపము వచ్చునుకాని, అతడే ఎదుటివాడు చేసిన తప్పుననుసరించి అధికారియై వానిని శిక్షించినచో శిక్షించువానికి పాపము లేదు. నారాయణుడు మనస్సునకు, కోరికలకూ పైనున్న వాడు గనుక ఆయనను పాపములంటవు.

7. అట్లే పరమాత్మను గ్రహించుట సాధ్యము కాదు. మనస్సు, బుద్ధి, గ్రహణశక్తి అనునవి భగవంతుని నుండి దిగివచ్చినవి. ఆయన వీటి కతీతుడు. కనుక ఆయన ఊహించుటకు, ఆలోచించుటకు పైవాడు.

8. తప్పుచేసినవారికి భయము కలుగును. నారాయణుడే వారియందు భయముగా నున్నాడు. తమ తప్పువలన బాధపడిన వారు తమను మరల ఏమి చేయుదురో అనుభయము ఎప్పటికని వెన్నాడుచుండును. తాము త్వరపడితిమని, అట్లు చేయకున్నచో బాగుండెడిదని అనిపించును. అట్లు వారి మనస్సాక్షియే వారికట్టి భావము కలిగించుచుండును. మనయందట్టి మనస్సాక్షిగా నారాయణుడే పనిచేయుచున్నాడు

9. పాపము చేయని వారికి భయము కలుగదు. అట్టివారు దేనికైనను భయపడరు. అట్టి ధైర్యముగా, జీవులయందు ధైర్యము కలిగించుచున్నవాడు నారాయణుడే.

90. శ్లో॥ అణుర్బృహత్కృశః స్థూలో గుణభృన్నిర్గుణోమహాన్
అధృతః స్వధృతః స్వాస్థ్యః ప్రాగ్వంశోవంశవర్ధనః ॥

**ప్రతిపదార్థము :-** 1. అణుః = అణువు, 2. బృహత్ = మిక్కిలి పెద్ద (విశ్వము) 3. కృశః = కృశించినది, 4. స్థూలః = స్థూలమైన, 5. గుణభృత్ = గుణములు ధరించినవాడు, 6. నిర్గుణః =గుణములులేనివాడు, 7. మహాన్ = మిక్కిలి గొప్పవాడు, 8. అధృతః = ధరింపనివాడు, 9. స్వధృతః

= తనని తాను ధరించువాడు, 10. స్వాస్థ్యః = పూర్వస్థితిని పొందుట, 11. ప్రాగ్వంశః = మన వంశమునకు మొదటివాడు, 12. వంశవర్ధనః = వంశమును వర్థిల్ల చేయువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను అణువుగా, మరియూ విశ్వముగా, పలుచనివానిగా, మరియూ స్థూలమైనవానిగా, గుణములు గలవానిగా, మరియూ గుణములు లేనివానిగా, ఆయనను ధ్యానము చేయుము. ఆయన తనని తాను ధరించుటవలన గొప్పవాడగుచున్నాడు. ఆయనను భరింపగల వారెవ్వరునూ లేరు. ఆయునలోనికి సమస్తమునూ చేరి పూర్వపుస్థితిని పొందుచున్నవి. ఆయన మన వంశములు ప్రారంభమగుటకు ముందే యున్నాడు. మరియూ మన వంశములను వర్థిల్ల చేసినవాడు.

**వివరణ** :- 1,2. అణువునందునూ, విశ్వమునందునూ ఉన్నది ఒక్కటే. అణువునందు పరమాణువులు పరిభ్రమించుచుండగా విశ్వమునందు సూర్యగోళములచుట్టు గ్రహములు పరిభ్రమించుచున్నవి. ఈ రెండునూ నారాయణుని రూపములే.

3,4. స్థూలముగా, పలుచగా నుండుట ఒకదానికొకటి విరుద్ధములు. ఇంకొక దానితో పోల్చినపుడు ఒక వస్తువు మొదటి దానికన్నా పలుచగా నున్నదనియూ లేక స్థూలముగా నున్నదనియు చెప్పుదురు. ఇట్లు పోల్చబడు రెండునూ నారాయణుని రూపములే గనుక, స్థూలము, సూక్ష్మము అనుభేదము కూడా నారాయణుడే.

5,6. సత్వము, రజస్సు, తమస్సు, అను మూడు గుణములు ప్రకృతినుండి పుట్టుచున్నవి. ప్రకృతి పరమాత్మనుండి కలుగుచున్నది. అట్టి త్రిగుణములవలన సృష్టి ఏర్పడుచున్నది. కనుక గుణములతో కూడిన ఈ భౌతిక సృష్టియంతయూ నారాయణుని వ్యక్తరూపమే. కాని ఈ గుణములు నారాయణునియందు పుట్టుచున్ననూ ఆయన వాటియందు చిక్కుకొనక వాటికతీతముగనే యున్నాడు. కనుక నారాయణుడు గుణములు లేనివాడు లేక నిర్గుణుడు.

7,8,9,10. పరమాత్మ ఈ సృష్టిని సమస్తమునూ తనయందు ధరించియున్నాడు. కాని సృష్టి పరమాత్మను ధరించుటలేదు. మనము మనచేతిని ధరించియున్నాము గాని మనచేయి మన దేహమును ధరించిలేదు కదా! ఇట్లు నారాయణుడు సమస్తమును ధరించుటయేగాక సృష్టి నశించిన తరువాత కూడా తానే మిగిలియున్నాడు. అనగా సమస్తమునూ పూర్వస్థితిలోనికి మార్చుచున్నాడు.

11,12. ఎన్ని వంశములున్ననూ, ఈ వంశములన్నియు పరమాత్మనుండి దిగివచ్చినవే. అన్ని వంశములకు మూలపురుషుడు నారాయణుడే. నారాయణుడు మొట్టమొదట బ్రహ్మను సృష్టింపగా బ్రహ్మ మనువును సృష్టించెను. ఈ మనువు మానవుల పుట్టుకకు కారకుడయ్యెను. కనుక నారాయణుడు మానవుల పుట్టుకకు మొదటనుండుటయేం గాక మానవజాతులు వృద్ధిపొందుటకు కూడా కారణమగుచున్నాడు.

91. శ్లో॥ భారభృత్కథితో యోగీ యోగీశః సర్వకామదః
ఆశ్రమః శ్రమణః క్షామః సుపర్ణోవాయువాహనః ॥

**ప్రతిపదార్థము :-** 1. భారభృత్ = భారమును మోయువాడు, 2. కథితః = చెప్పబడిన విషయము, 3. యోగీశః = యోగులకు ఈశ్వరుడు, 4. యోగీ = యోగమున కధిపతియైనవాడు, 5. సర్వకామదః = అన్ని కోరికలు ఫరిష్కరించువాడు, 6. ఆశ్రమః = ఆశ్రమము, పవిత్రస్థలము, 7. శ్రమణః = తనపని తానే చేసుకొను సన్యాసి, 8. క్షామః = చిక్కిపోయిన వాడు, సుపర్ణః = గరుత్మంతుడు, 10. వాయువాహనః = వాయువే వాహనముగా కలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను నీ సమస్త భారమును వహించు వానిగా, నీ జీవితమునందలి కథలుగా వర్ణింపబడువానిగా ధ్యానము చేయుము. నీలో నున్న యోగి అతడే. ఆయన అన్ని సమస్యలనూ పరిష్కరించు యోగీశ్వరుడు. ఆయనయే నీకు ఆశ్రమము. మరియూ నీ పనులను నీవే నిర్వర్తించు కొనగల సామర్థ్యము విష్ణువే. నీవు ఉపవాసము చేసినచో నీ యందు కృంగి కృశించువాడతడే. ఆయనయే గరుత్మంతుడు. వాయువే వాహనముగా గల అగ్ని ఆయనయే.

**వివరణ :-** 1. యోగ మార్గము ననుసరించి జీవించువానికి జీవితము నందు భారము లుండవు. అందరి భారములను ఆయన తానే స్వీకరించును.

2. అట్లు పరమాత్మకు జీవితమును సమర్పించి జీవించుచున్నచో వాని జీవితమునందలి సంఘటనలు, కథలు వానివి కావు. అవి పరమాత్మవే. ఎందుకనగా అతడు నిత్యజీవితమునందలి సంఘటనలయందునూ, వ్యక్తులయందునూ నారాయణునే చూచును.

3. కనుక అటువంటి నీ జీవితమునందు, నీవు చేయు యోగసాధన నీది కాదు. నీ యందు అతడే యోగిగా నుండును. అనగా వాని కరుణవలన నీకు అప్రయత్నముగా అన్నిటియందునూ సమత్వ బుద్ధి నిలుచును. సత్యము పలుకుట, తోటివారికి సేవ చేయుట. అందరినీ సమముగా ప్రేమించుట మున్నగు గుణములు నీ యందప్రయత్నముగా పనిచేయుచుండును.

4. అట్టి స్థితిలో నీయందున్నవాడు యోగీశ్వరుడనువాడు. ఆయన యోగమున కధిపతి. ఆయన జీవులలో సత్కర్మాభిలాషను కలిగించి యోగజీవనమునందు రుచి కల్పించి జీవులను యోగులుగా మార్చువాడు యోగీశ్వరేశ్వరుడు. ఆయనయే పరమాత్మ, నారాయణుడు.

5. కోరికలు మనస్సునందు పుట్టును. ఒకదాని కొఱకై మనస్సు అభిలాష పడుచున్నదనగా దానిని మనము ప్రయత్నించి నెరవేర్చు కొన వచ్చును. ధర్మమునకు వ్యతిరేకముగా కోరికలు కలిగినచో అది తప్పు కాదు. అవి నెరవేరుట, నెరవేరకపోవుట ఈశ్వర సంకల్పము ననుసరించి యుండును. నెరవేరలేదని దుఃఖించిననూ, నెరవేరినవని గర్వించిననూ అది మూర్ఖత్వమును తెలియచేయును. నిజమేమనగా నెరవేరిన వాటిని భగవంతుని అంగీకారము కలదనియు, నెరవేరని వాటికి భగవంతుని అంగీకారము లేదనియు అర్థము. కనుక జీవులయందలి కోరికలను నారాయణుడే తీర్చుచున్నాడు. ఇది తెలిసినవాడు తాను కోరికలను ప్రత్యేకముగా కోరడు. అట్లని తనయందు అప్రయత్నముగా పుట్టిన కోరికలను అణిచిపెట్టుకొనడు.

6. మనలో యిటువంటి స్థితి నిలబడవలెనన్నచో నిరంతరమూ పరమాత్మ యొక్క సాన్నిధ్యము కావలెను. పరమాత్మ సాన్నిధ్యమనగా సకల జీవులలోను,

పరిస్థితులయందు అతడే యున్నాడని తెలిసి ప్రవర్తించుట, అట్టి ఎరుకయే జీవికి నిజమైన ఆశ్రమము.

7. అట్టి ఆశ్రమమునందు నివసించువానికి దినచర్య పరమాత్మయే. తన పని తనదిగా కాక పరమాత్మదిగా నిర్వర్తించును. అట్టి స్థితిలోనున్న యోగిని శ్రమణుడు అందురు.

8. ఉపవాస దీక్షలోనున్నవానికి వాని మనస్సునందలి పరమాత్మ సాన్నిధ్యము కూడా కృంగి కృశించును. అనగా కటిక ఉపవాసము చేయువానికి శాంతి, ప్రసన్నత, ఆనందము, అనునవి తగ్గిపోయి వాటి స్థానముననే చిరాకు, ఆందోళన, భయము మున్నగు భావములు అనగా రజస్సు, తమస్సులు ప్రవేశించును. తాత్కాలికముగా వానియందలి నారాయణుడు అదృశ్యుడగును.

9. సుపర్ణుడనగా చక్కని విశాలములైన పర్ణములు లేక రెక్కలు గలవాడు, అతడే ఊపిరితిత్తుల యందుగల శ్వాసించుశక్తి. రెండు ఊపిరితిత్తులూ తనరెండు రెక్కలుగా అతడున్నాడు.

10. జీవియందలి నేనను ప్రజ్ఞయే అగ్ని అని పిలువబడినది. ఈ అగ్నికి ప్రాణము, జీవము, అని కూడా పేర్లు కలవు. ఈ అగ్ని శ్వాసవలననే నిలబడి యున్నది. కనుక శ్వాసయందలి వాయువే ఈ అగ్నికి వాహన మగుచున్నది. అట్టి అగ్నిని మనయందు ధరించి యున్నవాడు నారాయణుడే కనుక ఆయనకు కూడా వాయువే వాహనమగుచున్నది.

92. శ్లో॥ ధనుర్ధరో ధనుర్వేదో దండోదమయితా దమః
అపరాజితః సర్వసహో నియంతా నియమో యమః ॥

**ప్రతిపదార్థము** :- 1. ధనుర్ధరః = ధనుస్సును ధరించినవాడు, 2. ధనుర్వేదః = విలువిద్య, 3. దండః = దండము, 4. దమయితా = దమించువాడు, 5. దమః = దమించుట, 6. అపరాజితః = ఓడిపోనివాడు, 7. సర్వసహః = అన్నిటిని సహించివాడు సమస్తమును తనయందు కలిగియున్నవాడు, 8. నియంతా = నియమించువాడు, 9. నియమః = సక్రమముగా నుండునట్లు చేయువాడు, 10. యమః = క్రమశిక్షణనిచ్చువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను ధనుస్సును ధరించినవానిగా, విలువిద్య తెలిసిన వానిగా ధ్యానము చేయుము. ఇతరులను నియమించి నియమము కలుగునట్లు శిక్షణనిచ్చు న్యాయదండముగా తానేయుండి, మరల తానే ఆ దండమును ధరించుచున్నాడు. ఆయన ఎప్పటికీ ఓడిపోవుట లేదు. ఆయన సామర్థ్యము, సహనము, అన్నిటిని మించినవి. ఆయన జీవులకు నియామకుడు. సక్రమముగా తీర్చిదిద్దువాడు మరియూ శిక్షకుడునైయున్నాడు.

**వివరణ :-** 1. విల్లు ధరించిన వాడనియూ, ఆయుధము ధరించి ప్రజలను న్యాయమార్గమున పాలించు రాజనియు అర్థము. శ్రీరాముడు తన కోదండముతో రాక్షసులను శిక్షించి ప్రజలను కాపాడెను.

2. ధనుర్వేదమనగా కేవలము బాణములు వేయుట మాత్రమే అని భ్రమ పడుదురు. అది గొప్పదే యైననూ ఇంకొక రహస్యము కలదు. సూర్యుడు తూర్పు నుంచి పడమరకు ప్రయాణము చేయుచుండగా అట్లేర్పడిన మార్గమే ధనుస్సు. దీనిని ధ్యానము చేయువానికి, జీవికిని, చోటు నందున్న అంతర్యామికినీ, వీరిరువురికి సంధానకర్తగా పనిచేయుచున్న సూర్యునికి గల సంబంధము తెలియును. మరియూ ఇంద్రధనుస్సు అందలి వర్ణ విశ్లేషణము మరియొక చిత్రము. ఇది నీరు ఆవిరియై మేఘములగుట, మేఘములు మరల వర్షించుట అను చక్రమును సూచించును. దీనికి కూడా సూర్యుడే సంధానకర్తయగుచున్నాడు.

3. మానవులను శిక్షించి నియమించు విధానము సృష్టికర్త యొక్క అనుగ్రహముచే నేర్పడినది. దీనినే ధర్మమందురు. ఇట్టి ధర్మము సూర్యుని నుండి జీవులకు దిగివచ్చినది. సూర్యుడు సకల జీవులనూ ప్రాణులనూ నియమించుచున్నాడు. వాని కిరణములే వానికి బాణములు లేక ఆయుధములు. అట్టి సూర్యుని కిరణములనుండి వాని అంశతో భూమిపై జీవులను నియమించి క్రమశిక్షణతో పరిపాలించు రాజవంశ క్రమ మొకటి ఏర్పడినది. యిదియే సూర్యవంశము. ఆ సూర్యవంశమునందలి రాజుగా శ్రీరాముడవతరించి, తన ధనుస్సుతోను, బాణములతోను మానవులను నియమించి పాలించెను. ఇట్టి వరుసక్రమముగా ధర్మమే దిగివచ్చుచున్నది. అనగా సూర్యవంశమే ధర్మదండము

లేక రాజ దండము. అంతేకాక ప్రజలందరి యందునూ ఇట్టి ధర్మమే మేల్కొని వారికి సరియైన రాజులను ఇచ్చును. ప్రజాక్షేమము కోరి సమర్థవంతముగా పరిపాలించు రాజు ఎవరైనను ఏ దేశము వాడైనను వానియందు సూర్యుని అంశయే పరిపాలించును. కనుక అట్టి సూర్యుని అంశయే నిజమైన రాజదండము.

4. భగవంతుడు నియమించుట యనగా ఇతరులనేగాక తనను తాను దమించుకొను లేక నియమించుకొను మార్గమును జీవులకిచ్చువాడు. ఇతరులను దమించుట తేలిక. తనను తాను దమించుకొనుట కష్టము. అట్టి శక్తి నారాయణుని వలననే కలుగుచున్నది.

5. అట్లు తనను తాను దమించుకొనుట కొరకు సరియైన శిక్షణ కావలెను. శిక్షణవలన మనస్సు, యింద్రియములు, క్రమశిక్షణ పొంది పరిశుద్ధి యగును. కనుక అట్టి క్రమశిక్షణ కూడా నారాయణుని అంశయే.

6,7. నారాయణుడు జీవుల మనస్సునకు, సంఘ ధర్మమునకు, శాసనమునకు అధిపతియై యున్నాడు. జీవులందరి మానసిక ప్రవృత్తులు అయన యధీనము. అనగా ఇందరి మనస్సులలోను ఒక్కటిగా పనిచేయుచున్న సంఘధర్మమే నారాయణుడు. కనుక ఆయన ఈ సంఘ ధర్మమును ఎవరునూ తప్పించుకొనలేరు. అందరునూ తప్పని సరిగా బద్ధులైయుందురు. కనుక ఆయన సమస్తమును భరించగల శక్తి సామర్థ్యములు గలవాడు.

8. ప్రభుత్వము, అధికారము, చట్టము, శాసనము, మున్నగునవి మానవులు ఏర్పరుచుకొని జీవించుచున్నారు. అట్లు ఏర్పరుచుకొనిన మానవుల మనస్సులద్వారా నారాయణుడే సంకల్పించుచున్నాడు కనుక నారాయణుడే జీవులను శాసించుచున్నాడు.

9. దీనిని గమనించగా నారాయణుడు సర్వ నియామకుడనియూ ఏ పేరుతోనైననూ జీవులను నియమించు చున్నాడనియూ తెలియుచున్నది.

10. ఇట్లు పనిచేయుచున్న మహాప్రజ్ఞ వలన జీవులు ఒకరి దుష్టత్వమును ఇంకొకరు ఎదిరించుచున్నారు. ఇట్లు ఎచ్చట అన్యాయము జరిగిననూ

ఎదిరించువారు ఎప్పుడునూ ఉందురు. జీవులయందున్న ఇట్టి క్రమశిక్షణను కలిగించువాడు యముడు. అట్టి యముడు నారాయణుని రూపము.

93. శ్లో|| సత్త్వవాన్ సాత్త్వికః సత్యః సత్యధర్మపరాయణః
అభిప్రాయః ప్రియార్హోఽర్హః ప్రియకృత్ప్రీతివర్ధనః ||

**ప్రతిపదార్థము :-** 1. సత్త్వవాన్ = సత్వస్థితియందుండువాడు, 2. సాత్త్వికః = మనస్సు, స్వభావము మున్నగునవన్నియూ సత్వస్థితి యందున్నవాడు, 3. సత్యః = సత్యమయినవాడు, 4. సత్యధర్మపరాయణః = సత్యమునకునూ, ధర్మమునకునూ అంకితమైనవాడు, 5. అభిప్రాయః = కోరదగిన మానసిక స్థితి, 6. ప్రియార్హః = అర్చింపబడుటకు యిష్టమైనవాడు, 7. అర్హః = పూజింపబడువాడు, 8. ప్రియకృత్ = ఇష్టమైన పనులను చేయువాడు, 9. ప్రీతివర్ధనః = ప్రీతిని వృద్ధి పొందించువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను సత్వస్థితిగా మరియూ మనస్సు స్వభావమూ సాత్త్వికమైనవానిగా, సత్యముగా, సత్యధర్మముల కంకితమైనవానిగా, మనయందు ప్రియముగల అభిప్రాయముగా, ధ్యానము చేయవలెను. ఆయనను అట్టి అభిప్రాయముగానే అర్చన చేయవలెను. ఆయన అర్చనగనే తెలియబడుచున్నాడు. ఆయనకు అర్చన వలననే జీవులపై ప్రీతి కలుగుచున్నది. అంతేగాక ఇతరులకు తనయందు ప్రీతి కలుగుచున్నది. మరియు ఇతరులకు తనయందు ప్రీతిని కలిగించి దానిని వృద్ధిపొందించుచున్నాడు.

**వివరణ :-** 1. సత్వమనగా రజస్సు, తమస్సుల సామ్యము.

2. సాత్త్వికమనగా ఇతర విషయములయందు ఆసక్తి నశించి భగవంతుని విషయములయందు ఆసక్తి పెరుగుచున్నదని భావము. అట్టి వారికి మిగిలిన వానిపై లక్ష్యముండదు. ఇతరులు తనను గౌరవించుట, నిందించుట అను విషయముల యందు ఆసక్తి యుండదు.

3. ఇట్టి సాత్త్విక స్థితిని సాధన చేయువానికి సత్యత్వము కలుగును. సత్యత్వమనగా సత్యముగానుండుట. అందరి జీవులయందలి సత్యము నారాయణుడే. దీనినుపాసన చేయువారికి సత్వస్థితి అప్రయత్నముగా కలుగును.

4. సత్యమును, ధర్మమును ఆచరించుటవలన జీవులలో ధర్మము స్థాపింపబడుచున్నది. ఇట్లు ధర్మమును అప్రయత్నముగా ఆచరించుచూ జీవితము నంకితము చేసినవారు నారాయణునితో సమానులు. ఎందుకనగా సత్యము, ధర్మము అను పేర నారాయణుడే యున్నాడు.

5. ప్రపంచమున జీవులెందరు గలరో అభిప్రాయములన్నిగలవు. ఏ ఇద్దరి అభిప్రాయములూ పూర్తిగా కలువవు. అట్లే ప్రతివారికి ఎవనికి వానికి అసంఖ్యాకములైన అభిప్రాయములున్నవి. సత్యమునకు యివి యన్నియూ అసత్యములు. అనగా పునాదిలేని మేడలవంటివి. మనమొకరిని గూర్చి ఒక అభిప్రాయముకలిగి యున్నామనగా అది అతనిని గూర్చిన మన అభిప్రాయమే యగునుకాని వానియందు సత్యముకాదు. వానియందలి అంతర్యామి యొక్కడే సత్యముకాని మిగిలినవన్ని అసత్యములు. అట్టి అంతర్యామిని గూర్చిన అభిప్రాయమొక్కటే సత్యమైన అభిప్రాయము. ఈ అభిప్రాయము మాత్రము జీవులందర కొక్కటే.

6. పరమాత్మకు పూజయన్నచో మిక్కిలి ప్రాణము. ఆయన తనను పూజించువారియందు ప్రీతి కలిగి యుండును. భగవంతుని పూజించుచున్న సమయములందు భక్తుడు నారాయణుని కల్యాణగుణముల గూర్చి చింతించుచుండును. మనస్సు దేనిని భావన చేయుచుండునో హృదయము దానియందు లగ్నమగును. కనుక పరమాత్మను కీర్తించుచున్నంతసేపు భక్తుడు భగవంతుడుగా నుండును. కనుకనే పూజ మిక్కిలి అవశ్యకము. పూజయనగా స్తోత్రములు చదువుట మాత్రమే గాక, సంకీర్తనములు చేయుట, పాటల పాడుట, సద్గ్రంథములు చదువుట పూజ యందలి భాగములే. ఆయా సమయములందు తాను వేరుగానుండక భక్తుడు నారాయణునియందే నారాయణునిగా నుండును.

7. అట్లు అర్చన చేయుటవలన జీవులకు పరమాత్మ సాన్నిధ్యము సిద్ధించుచున్నది. కాని ఈ అర్చన యన్నది కూడా నారాయణుని వలననే కలిగినది కనుక నారాయణుడే అర్చనగా దిగివచ్చెను. నిజమునకు అర్చన యనగా సమీకరణము. పటము, పూజా ద్రవ్యములు, స్తోత్రము చేయుట,

మున్నగునవాని సమీకరణమువలన అర్చన జరుగుచున్నది. పూజ యనగా ఆయా వస్తువులు కూర్చుట గాక అట్లు కూర్చుచున్నప్పుడు మన మనస్సున్నట్టి స్థితి. తాను భగవంతుని అర్చించుచున్నానన్న భావమే పరమాత్మ సాన్నిధ్యమును మనస్సునకు కల్పించుచున్నది. ఎందుచేతననగా ఈ పటము, పూలు, పండ్లు మున్నగునవి దుకాణములో నున్నను, ఆ దుకాణమువానికి మనస్సులో అమ్మకము, దానివలన కలుగు లాభమే యుండును కాని భగవంతుడుండడు. అట్లమ్మునప్పుడు కూడా అతడు భగవంతుని పేరు చెప్పి వాని యర్చనకే యివి యన్నియూ కొన్నచో మీకు త్వరగా ముక్తి కలుగునని హామి యిచ్చుచుండును. కాని వానికి మాత్రము మనస్సులో పూజలేదు. భక్తునకు మనస్సులో పూజయున్నది కనుక నారాయణుడుండును.

8,9. అట్లు పరమాత్మ సాన్నిధ్యమును పొందిన మనస్సు ప్రసన్నమై ఉల్లాసమగును. ఇట్లు ఉల్లాసముగానుండుట అభ్యాసమైన కొలది ఇష్టత, అయిష్టత అనునవి క్షీణించును. అన్నియూ ఇష్టమైనవే యగును. ఇతరులతో మధురముగా సంభాషించుట, వారి మనస్సు నొచ్చుకొనకుండునట్లుగా ప్రవర్తించుట, వారియందలి నారాయణుని చూచి వారిని సేవించుట, సహజ లక్షణములగును. దీనినే మధుర భక్తియందురు.

94. శ్లో|| విహాయసగతి ర్జ్యోతిః సురుచిర్హుతభుగ్విభుః
రవిర్విరోచనః సూర్యః సవితా రవిలోచనః ||

**ప్రతిపదార్థము** :- 1. విహాయసగతిః = వాయువే తన మార్గమైనవాడు, 2. జ్యోతిః = కాంతి, 3. సురుచిః = చక్కని వెలుగైనవాడు, 4. హుతభుక్ = హవిస్సును భుజించువాడు, 5. విభుః = తన తేజస్సుచే నియమించువాడు, 6. రవిః = విశ్వమునందలి కాంతియే తన ఉచ్ఛారణగా నున్నవాడు, 7. విరోచనః = సమస్తమును చూచు నేత్రము, 8. సూర్యః = సమస్తమును ధారణ చేయువాడు లేక ప్రేరణ చేయువాడు, 9. సవితా = సమస్తమును సృష్టించువాడు, 10. రవిలోచనః = కాంతియే నేత్రముగా కలవాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను కాంతితో కూడిన వాయు మార్గముగా తేజోవంతునిగా, తనకాంతిచే సమస్తమును నియమించువానిగా, హవిస్సును

స్వీకరించువానిగా, ధ్యానము చేయుము. ఉచ్చరింపబడిన వాక్కే తన కాంతిగా సమస్తమును దర్శించి ధరించువానిగా, మరియూ సృష్టించువానిగా నున్నాడు. సూర్యుడే తన నేత్రముగా కలిగియున్నాడు.

**వివరణ** :- 1. ఈ సృష్టి సమస్తమూ అణువులుగా పరమాణువులుగా మరియూ గ్రహగోళములుగా వర్తించుచున్నది. ఇవి యన్నియూ చోటులో నిరాధారముగా తేలుచున్నవి. తేలుచూ పరిభ్రమణము చేయుచున్నవి. అణువు మొదలు జీవులూ, సౌరమండలము వరకు అందరు యిట్లే తేలుచూ ప్రయాణించుచున్నారు. కనుక గాలిలో తేలుచున్నారనియూ పక్షులువలె పరిభ్రమించుచున్నారనియూ చెప్పబడినది.

2. సౌర మండలమునందలి సమస్తమూ సూర్యుని వలననే కలుగుచున్నది. అనగా సూర్యుని వాక్కుగా సృష్టి జరుగుచున్నది. కనుక పరమాత్మయను వెలుగు సూర్యుని ద్వారా వ్యక్తమగుచున్నది.

3. ఆ వెలుగే మనయందు ప్రాణశక్తిగా పనిచేసి కంటికి చూపుగా పని చేయుచున్నది. అనగా సూర్యుని వలననే మనయందు ప్రాణశక్తి మరియూ చూపు ఏర్పడుచున్నవి. కనుక అవి చక్కని శుభప్రదమైన వెలుగుగా దర్శింపబడినవి.

4. ఇట్లు సమస్తమూ సూర్యుని వలన కలుగుచూ మరల సూర్యుని యందే లీనమగుచున్నవి. అనగా అణువుల సముదాయము వలన ఏర్పడు భౌతిక ద్రవ్యము మరల అణువులుగనూ, అణువులు శక్తిగనూ విడిపోయి శక్తి చోటునందంతర్లీనమగుచున్నది. ఇట్లు సమస్తమునూ తనలోనికి స్వీకరించువాడు గనుక పరమాత్మ హుతభుక్ అని వర్ణింపబడినాడు. ఇదియే ప్రళయమగును. సూర్యుడు ప్రళయకారకుడగు శివుడుగనూ వర్ణింపబడుచున్నాడు.

5,6. రవి అనగా రవము లేక శబ్దము చేయువాడు. సూర్యుడు తన వాక్కుగా వెలుగును ఉచ్ఛరించుచున్నాడు గనుక రవి అని పిలువబడినాడు. అనగా సూర్యుడు సమస్త గ్రహములనూ ప్రాణకోటిని తన వాక్కుగా ఉచ్ఛరించుచు తనకిరణములచే నియమించుచున్నాడు.

7. కనుక ఈ భౌతిక సృష్టియందలి ప్రతిరేణువు సూర్యుని ప్రతిబింబించుచున్నది. అనగా ప్రతి పదార్థమునందునూ ఆయా గుణములుగా ధర్మములుగా సూర్యుడే ప్రకాశించుచున్నాడు గనుక సమస్తమునూ చూచుశక్తిగా వర్ణింపబడినాడు.

8. సూర్యుడనగా ధరించువాడు. లేక గర్భధారణ చేయువాడు. నిజమునకు ఈ సౌరమండలమంతయూ సూర్యుని గర్భమే. ఇందు ఆయన సమస్త జీవులనూ, గ్రహములనూ ధరించుచున్నాడు. అనగా విష్ణువుగానగుచున్నాడు విష్ణువు ఈ లోకములన్నింటినీ సౌరమండలములతో సహా తన గర్భమున ధరించియున్నాడు. ఈ విశ్వమే ఆయన గర్భము. కనుక సూర్యునిగా విష్ణువే పని చేయుచున్నాడు.

9. సవితుడనగా ఇచ్చువాడు లేక సృష్టించువాడు. సూర్యుడు సమస్తమును సృష్టించుచున్నాడు గనుక సృష్టికర్త గూడానగుచున్నాడు.

10. సూర్యుడు అంతర్యామి యొక్క ఒక భౌతిక వ్యక్త రూపమేగాని ఆయనయే పరమాత్మ కాదు. పరమాత్మ సమస్త సృష్టికి అతీతముగానుండి తనలో నొక భాగముగా ఈ విశ్వమును ధరించి యున్నాడు. అట్టి ఈ విశ్వమునందలి అనేక కోట్ల మంది సూర్యులలో మన సూర్యుడొకడు. అట్లని సూర్యుడు వేరు, అంతర్యామి లేక పరమాత్మ వేరు కాదు. పరమాత్మకు సూర్యుడు ఒక కన్నుగా పనిచేయుచున్నాడు. పురుష సూక్తమునందు పరమాత్మ 'సహస్రాక్షః సహస్రపాత్' అని వర్ణింపబడినాడు. అనగా వేలాది కన్నులు గలవాడని అర్థము. మన సూర్యుడు పరమాత్మకు గల అనేక కన్నులలో యొక కన్ను.

95. శ్లో అనంత హుతభుగ్భోక్తా సుఖదోనైకజో ఽగ్రజః
అనిర్విణ్ణః సదామర్షీ లోకాధిష్ఠాన మద్భుతః ॥

**ప్రతిపదార్థము** :- 1. అనంతః = అంతులేనివాడు, 2. హుతభుగ్ = హవిస్సును తినువాడు, 3. భోక్తా = భుజించువాడు, 4. సుఖదః = సుఖము నిచ్చువాడు, 5. నైకజః = అనేకముగా పుట్టువాడు, 6. అగ్రజః = మొట్టమొదట పుట్టువాడు లేక సృష్టియందందరికి అన్నయైనవాడు, 7.

అనిర్వణ్ణః = సంభ్రమము పొందనివాడు, 8. సదా = ఎల్లప్పుడూ, 9. అమర్షీ = ద్వేషము లేనివాడు, 10. లోకాధిష్ఠానమ్ = అన్ని లోకములను అధిష్ఠించి యున్నవాడు, 11. అద్భుతః = ఇంతకుముందు ఎప్పుడూ లేనిది లేక జరుగనిది.

**తాత్పర్యము** :- పరమాత్మను అంతులేనివానిగా, నిరంతరమూ తినువానిగా, హవిస్సును భుజించువానిగా, సుఖము నిచ్చువానిగా, సృష్టి సమస్తమునకూ పెద్ద సోదరునివంటి వానిగా ధ్యానము చేయుము. ఆయనకు సంభ్రమము లేదు. ద్వేషము లేదు. ఆయన సమస్త లోకములకూ నివాసమై యున్నాడు. అది అద్భుతమై యున్నది.

వివరణ :- 1. సృష్టియందలి జీవులకు మరియూ సృష్టికి ప్రారంభము, అంతము ఉన్నది. సృష్టికి ప్రారంభము కలదు. కనుక అంతము కూడా నుండును. కనుక అందలి జీవులకు కూడా యిది వర్తించును. కానీ సృష్టిగా దిగివచ్చిన పరమాత్మకు ప్రారంభము, చివర అనునవి లేవు. మనకు మన ఊహ ఎట్టిదో భగవంతునికి సృష్టి యట్టిది. మనయూహయందలి సత్యత్వమును గమనింపలేము గనుక ఊహకు భౌతికమైన అస్తిత్వముండదు. కాని పరమాత్మ తన యందలి వెలుగుగా తానేయుండి, దానియందలి సత్యత్వమును గుర్తించును గనుక ఆయన సృష్టి భౌతిక రూపము దాల్చును. అనగా ఆయన సృష్టి ఆయనకు తన నుండి వేరైనదికాదు కాని మనకు సృష్టి వేరు గనుక భౌతికము. మనయూహయందు పరమాత్మ యున్నాడు గనుక వానికిగూడా మరల భౌతికమే యగుచున్నది. అనగా సత్యము అసత్యము అను రెండు స్థితులుగా ఈ సృష్టి పరమాత్మ యందున్నది.

2,3,4. సుఖమనునది ఎవరి అభిప్రాయము ననుసరించి వారికి కలుగుచున్నది. ఆత్మయొక్క సాన్నిధ్యము వ్యక్తులకు అనేక జన్మల వెంబడి క్రమేణా కలుగుచున్నది. తానేది చేసిననూ సుఖపడుటకొరకే యనునది తెలియుటకు అనేక జన్మలు పట్టును. మరల ఆ సుఖమును సాధించుకొనుట కొరకు జీవితమంతయూ సంఘర్షణయై సుఖము లోపించును. కనుక నిజమైన సుఖమును భౌతిక విషయములయందు మాత్రమే పొందుట ఎండమావులయందు

దాహము తీర్చుకొనుటగా యోగసాధకుడు గుర్తించును. అనగా భౌతిక విషయములద్వారా తాను సుఖపడుటకు ప్రయత్నించుచున్నాననియూ అవి అక్కరలేకయే సుఖమును పొందవచ్చుననియూ తెలియును. అట్లని భౌతిక విషయములను పరిహరించుటకు యత్నించు వాడు తనకు తెలియకయే వానిని ద్వేషించుచున్నాడు. కనుక మరల సుఖము లోపించును. అట్లుగాక భౌతిక విషయములతో సంబంధము లేకయే ఆనందముగా నుండుట అభ్యసించువానికి సుఖ సంతోషములు తరుగని సంపదలగును. ఒక దేవాలయమున నొక గాయకుడు భగవంతుని సంకీర్తనము చేయుటకు జీతమిచ్చి నియమింపబడినచో వానికి భగవంతుని సంకీర్తనము, జీవనమార్గము రెండునూ అప్రయత్నముగా సిద్ధించుచున్నవి. ఇట్లే తన కర్తవ్యమును యితరుల యందలి పరమాత్మకు సమర్పణముగా నాచరించువానికి భౌతిక సంపద, సుఖము, ఆనందము అనునవి వెంటవచ్చును. ఇట్లు కారణమక్కరలేని సంతోషమునే భగవంతుడని పిలుచుచున్నారు.

5. జీవులందరూ పరమాత్మయొక్క రూపములే యైననూ జీవుల దృష్టిలో ఎవరి రూపముల వారివి. ఇది ఇట్లుండుటకు కారణము మాయ. మాయయే జీవులను ఎవరికి వారు వేరుగానున్నట్లు కల్పించుచున్నది. తల్లి బిడ్డను ప్రేమించుట, భార్యా భర్తలు ఒకరి నొకరు ప్రేమించుకొనుట, ఇతరులకు సేవచేసి సంతోషపడుట మున్నగునవి సృష్టియందలి మాయవలననే కలుగుచున్ననూ అవి జీవుల యానందమునకే కారణములగుచున్నవి.

6. జీవులు పుట్టుచున్ననూ ప్రతివానికన్నా ముందు పుట్టినవారున్నారు. అంతేకాక ఎవరు పుట్టిననూ ఈ సృష్టి యందంతర్యామిగా నున్న పరమాత్మ యందే పుట్టవలెను. తాను పుట్టుటకు ముందుగా పరమాత్మ యున్నాడు గనుక అతడు మొదటివాడు అగుచున్నాడు. కనుక జీవులందరికి భగవంతుడు మొదటివాడగుచున్నాడు.

7. సంభ్రమము చెందుట, గందరగోళపడుట అనునవి మనస్సునకు సంబంధించిన ప్రవృత్తులు. భగవంతుడు మనస్సున కతీతమైనవాడు. మనస్సు ఆయనలో భాగము మాత్రమే కనుక మనస్సునందలి వికారములు ఆయనపై

వర్తించవు. కనుక పరమాత్మను ధ్యానము చేయువారికి మనసునందు వికారము అప్రయత్నముగా నశించును.

8,9. ద్వేషము పరమాత్మకు లేదు. తనని మించిన వారిని చూచినచో మానవునికి ద్వేషము కలుగును. పరమాత్మకు మించువారు లేరు, ఇతరులునూ లేరు. కనుక ద్వేషము లేదు. ఇతరులయందు తామే. యున్నామని గుర్తించువానికి ద్వేషముండదు.

10. భగవంతుడు లోకములన్నియు తానే అధిష్టించియున్నాడు. లోకములన్నియు భగవంతునియందే యున్నవి గనుక ఆయనయే అన్నిటికి అధ్యక్షుడు.

11. ఆశ్చర్యమనగా మనకంతకుముందు ఊహయందు లేదని యర్థము. తాననుకున్నట్లుగాక మరియొక సంఘటన అకస్మాత్తుగా జరిగినచో మనస్సు పని చేయుట ఆగిపోవును. భగవంతుడు మనస్సున కతీతుడు గనుక ఆయన సాన్నిధ్యము మనస్సున కతీతము. అనగా మనస్సు లీనమయిన తరువాతనే భగవంతుని సాన్నిధ్యము కలుగును. పరమాత్మ అనుభవము చేతనే తెలియదగిన వాడుకాని మనస్సు చేత తెలియదగిన వాడు కాదు. భగవద్గీతలో కృష్ణుడు యిట్టిస్థితిని గూర్చి ''దీనిని ఒకరు ఆశ్చర్యముగా చూచుచున్నారు. మరియొకరు ఆశ్చర్యముగా వినుచున్నారు'' అని చెప్పెను. కంటిచూపు, కన్ను, చూడబడు వస్తువు, ఈ మూడిటివలన చూచుట జరుగుచున్నది. అనగా చూచుట, దాని వలన కలుగు అనుభూతి పైన చెప్పిన మూడిటి యందు లేదు. ప్రకృతి దృశ్యమును చూచి యొకడు సంతోషపడినచో, అక్కడ ప్రకృతియందు కాని, కంటియందు కాని, చూచు శక్తియందు కాని లేని క్రొత్త విషయము మనస్సునకు ఆనందముగా లభించుచున్నది. అనగా ఈ మూడిటి సమీకరణమున కలుగునది కనుక దీనియందు మనస్సు పని చేయదు. ఇటుల మనస్సునకతీతమయిన విషయము మనస్సునందు అనుభవమను పేర ప్రతిబింబించుచున్నది. ఈ అనుభవము మనస్సునకు నూతనము కనుక ఆశ్చర్యము. ఇట్లు ఎన్నిసార్లు జరిగిననూ మనస్సు ఆశ్చర్యపడుచునే యుండును. అనగా ఆ కొద్ది సేపు మనస్సుయొక్క ప్రవృత్తి నిలిచిపోవును. కనుక నారాయణుడు అద్భుతః అని వర్ణింపబడినాడు.

96. శ్లో॥ సనాత్సనాతనతమః కపిలః కపిరవ్యయః
స్వస్తిదః స్వస్తికృత్ స్వస్తి స్వస్తిభుక్ స్వస్తి దక్షిణః ॥

**ప్రతిపదార్థము** :- 1. సనాత్ = కుమారసర్గము (సనకుడు, సనందుడు సనత్కుమారుడు, సనత్సుజాతుడు) 2. సనాతనతమః = అందరికన్నా పూర్వీకుడు, 3. కపిలః = సృష్టియందలి పరిపూర్ణత్వము మరియు ప్రకృతి యందలి సాంఖ్యమున కధిపతి, 4. కపిః = నీటిని త్రాగువాడు (నీటిని ఆవిరిగా మార్చి పరిశుద్ధి చేయువాడు), 5. అవ్యయః = వ్యయము కానివాడు, 6. స్వస్తిదః = అందరికి శుభము నిచ్చువాడు, 7. స్వస్తికృత్ = అందరికి శుభము కలిగించువాడు, 8. స్వస్తిః = శుభము, 9. స్వస్తిభుక్ = శుభమును పొందువాడు, 10. స్వస్తిదక్షిణః = సత్కర్మాచరణము తరువాత జీవులకు శుభము కలిగించువాడు.

**తాత్పర్యము** :- పరమాత్మను మిక్కిలి పూర్వీకునిగా, బ్రహ్మ, కుమార సర్గముల కన్నా ముందున్న వానిగా, మరియూ కపిలావతారముగా, సృష్టియందలి సాంఖ్య శాస్త్రమున కధిపతిగా ధ్యానము చేయుము. అతడు భూమి యందలి నీటిని ఆవిరి చేసి పరిశుద్ధ మొనరించు సూర్యునిగా, అవ్యయునిగా లేక తరిగిపోని వానిగా, శుభమును కలిగించువానిగా మరియూ తానే శుభమైనవానిగా నున్నాడు. మరియూ శుభమును అనుభవించువానిగా, సత్కర్మాచరణ చేసినవానికి శుభమును పంచిపెట్టువానిగా ధ్యానము చేయుము.

**వివరణ** :- 1,2. చతుర్ముఖ బ్రహ్మ సృష్టికర్తగా పరమాత్మ నుండి దిగివచ్చెను. ఆయన మనస్సు నుండి నలుగురు కుమారులు పుట్టిరి, వారే సనకుడు, సనందుడు, సనత్కుమారుడు, సనత్సుజాతుడు అను పుత్రులు. వీరు బ్రహ్మ యొక్క నాలుగు ముఖములుగా సృష్టియందు పనిచేయుచున్నారు. బ్రహ్మ సృష్టియందలి జీవులకు వారి జీవత్వము తొలగించి. పరిపూర్ణత్వము కలిగించి, మరల అంతర్యామియందు లీనమగునట్లు చేయుటయే వారి పని. వారట్లు చేయగలుగుచున్నారనగా వారియందలి పరమాత్మయే దీనికి కారణము. లేనిచో సృష్టియందలి ప్రజ్ఞలుగా నున్నవారికి అంతర్యామిని గూర్చి భావన కలుగుట, ఇతరులకు కలిగించుట ఎట్లు సాధ్యము. అనగా వారియందలి పరమాత్మయే

వారి భావనయందు పనిచేసి వారి మనస్సుగా తానే యుండి, కర్తవ్యమును వారి సంకల్పములుగా తానే ఉపదేశించి, నడుపుచున్నాడని అర్థము. కనుక నారాయణుడే అందరికన్నా పూర్వీకుడు.

3 నుండి 10 వరకు : ఇతరులకు శుభమును కలిగించు పనులు, మార్గములు, ఏవి యైననూ అవియన్నియూ పరమాత్మ యొక్క మార్గములే. నిజమునకు ఏ పని యైననూ స్వార్థబుద్ధి లేక ఇతరుల క్షేమము దృష్టిలో నుంచుకొని ఆచరించినచో అది భగవంతున కంగీకారమే యగును. మనము చేయు నిత్యకృత్యములే ఇట్టి భావనతో చేసినచో భగవంతుడు మనద్వారా పనిచేయుటకు సందేహము లేదు. అది మనయొక్క గొప్ప తనమును బట్టి కాక పనియొక్క మంచిపై ఆధారపడియున్నది. దుష్టబుద్ధి కలవాడైననూ మంచి పని చేయుచున్నచో భగవంతుని కంగీకారమేయగును. అనగా వాని దుష్టబుద్ధిని తొలగించి మంచి మనసు యిచ్చు భారము నారాయణుడు చూచుకొనును. ఇదియే నారాయణునివలన జీవులకు కలుగు నిజమయిన శుభము. అంతేకాక భౌతిక సుఖమును, శాంతిని కూడా సత్కర్మాచరణకు వరములుగా నిచ్చును. ఇచ్చట సత్కర్మాచరణమే ప్రధానము గాని మంచి బుద్ధి తప్పనిసరి కాదు. ఎందుచేతననగా ఇతరులకు సుఖమును, క్షేమమును కలిగించుటకు ఒకడు పాటుపడుచున్నాడనగా అతడు యితరుల రూపమున కలిగించునది భగవంతునికే కదా ! అతనికి ఆ దృష్టి లేకున్ననూ చేయునది వానికే గనుక భగవంతుడే వాని మనస్సును వాని సేవకు ప్రతిఫలముగా మార్చుచున్నాడు. ఏ దృష్టితో చేసిననూ స్వీకరించి జీవుని రక్షించుటయే పరమాత్మ సంకల్పము. ఆయనకు దుష్టబుద్ధి, మంచిబుద్ధి అను భేదము లేదు. ఆచరించుట యొక్కటే భేదము. ఆచరించువాడు తనవాడగుచున్నాడు. మంచిపేరు సంపాదించుట కొరకు చేసిననూ ఆ సంకల్పము దుష్టము కాదు గనుక, ఆ మంచి పేరుపై వానికిగల వ్యామోహమును తొలగించి, మంచిపనులు సహజముగానే నిర్వర్తించు మంచి మనస్సు వానికి దక్షిణగా యిచ్చుచున్నాడు. అనగా దుష్టుడైనను, పనియందు దుష్టసంకల్పము లేనిచో, వానిని నారాయణుడు రక్షించును. ఒక ముక్కోపి

అన్నదానము చేయుచున్నచో పరమాత్మ వాని సేవకు ఫలితముగా, వాని కోపమును పోగొట్టును.

97. శ్లో|| అరౌ ద్రః కుండలీ చక్రీ విక్రమ్యూర్జిత శాసనః
శబ్దాతిగః శబ్దసహః శిశిరః శర్వరీకరః ||

**ప్రతిపదార్థము :-** 1. అరౌద్రః = భయంకరము కానివాడు, 2. కుండలీ = చుట్టలుగా చుట్టుకొని యుండువాడు, 3. చక్రీ = చక్రమును ధరించినవాడు, 4. విక్రమీ = జయించి ఆక్రమించువాడు, 5. ఊర్జితశాసనః = తన వాక్కు శాసనమైనవాడు, 6. శబ్దాతిగః = వాక్కునకు, శబ్దమునకు అతీతమయినవాడు, 7. శబ్దసహః = శబ్దమును సహించువాడు లేక శబ్దమును పుట్టించువాడు, 8. శిశిరః = చల్లనివాడు, 9. శర్వరీకరః = రాత్రిని కలిగించువాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను భయంకరము కానివానిగా, చుట్టలుగా చుట్టుకొని యున్నవానిగా, చక్రమును ధరించినవానిగా, ధ్యానము చేయుము. ఆయన సమస్తమునూ జయించి ఆక్రమించును. ఆయన వాక్కు శాసనము. ఆయన తనవాక్కుకతీతముగా నుండి తానుచ్చరించిన ప్రపంచమును తన యందే ధరించును. చల్లదనము, మరియు రాత్రి కూడా ఆయన రూపములే.

**వివరణ :-**1. రుద్రులు పదకొండు మంది. వారు అయిదు జ్ఞానేంద్రియములు. అయిదు కర్మేంద్రియములు, ఒక మనస్సుతో కూడి పదకొండు ఇంద్రియ ప్రజ్ఞలకు అధిపతులగుచున్నారు. తమ ప్రవృత్తులకు లేక పనులకు ఆటంకమేర్పడినచో వారు దేహమునందుండి గొప్ప శబ్దము చేయుదురు. ఆ శబ్దమే మనము ఏడుపుగా పిలిచెదము. సంస్కృతమున దీనిని రోదనము అందురు. రుద్రులవలన పుట్టుచున్నది గనుక రోదనము పిలువబడుచున్నది. ఇచ్చట పరమాత్మ రౌద్రుడు కానివానిగా చెప్పబడినాడు. అనగా రోదనమనునది ఆయన రౌద్రము లేక భయంకర రూపము కాని సత్యము కాదు. కాని జీవులు దానినే సత్యముగా చూచుచున్నారు.

2. కుండలము లేక అవర్తనమనగా సుడిగుండమువంటిది. తన చుట్టు తాను తిరుగుట వలన అపారమయిన శక్తి అచ్చట వ్యక్తమగుచున్నది. కాలము, దేశము, లేక చోటు అను రెండిటివలన చోటునందు కుండలములు లేక

సుడులేర్పడి గోళములు కట్టుకొనుచున్నవి.

3. చక్రము అనగా ప్రకృతివలన కలుగు మరియొక నిర్మాణ ప్రక్రియ. దీని వలన గ్రహము లేర్పడుటయు అందు జీవులేర్పడుటయు జరుగును.

5. ఆయన సృష్టియందలి ధర్మమునే తన శాసనముగా కలవాడు. ఏదియైననూ తన ధర్మమును తానతిక్రమించలేదు. కనుక సమస్త ధర్మములుగా పరమాత్మయే సృష్టిని శాసించుచున్నాడు. నీటికి ప్రవహించుట ధర్మముకాని అగ్నివలె దహింపలేదు. అనగా భగవంతుని శాసనమును అతిక్రమించలేదని అర్థము.

6. భగవంతుడు ''ఓం'' కారమునుచ్చరింపగా జీవులుగా అందుండి పుట్టిరి. మనము గమనించు ఈ సమస్త జగత్తంతయు '' ఓం'' కారముయొక్క భౌతిక వ్యక్తరూపము. నారాయణుడు ఇందలి భాగమేయైనను దాని కతీతముగా కూడా నున్నాడు.

7. అట్లుచ్చరించుచున్న సృష్టిని పరమాత్మ మరల తానే ధరించుచున్నాడు. గనుక సమస్తమునకూ మొదలు, చివర కూడా ఆయనయే.

8,9. చల్లదనము మరియు రాత్రి అను రెండునూ సృష్టి నశించి ప్రళయస్థితిలో నుండుటను గూర్చి తెలుపును. ఇదియే అసత్ అనియు నిద్రయనియు చెప్పబడినది. సృష్టి ఏ స్థితిలోనున్ననూ ప్రళయమే అన్నిటికి చివరిస్థితి. అదియే చల్లదనముగా, రాత్రిగా వర్ణింపబడినది. భగవంతుడు ఆ రెండింటియందునూ తానే యుండి జీవులకు ప్రళయస్థితిని కల్పించుచున్నాడు.

98. శ్లో॥ అక్రూరః పేశలో దక్షో దక్షిణః క్షమిణాం వరః
విద్వత్తమో వీతభయః పుణ్యశ్రవణ కీర్తనః ॥

**ప్రతిపదార్థము :-** 1. అక్రూరః = క్రూరుడు కానివాడు, 2. పేశలః = మృదువుగా మధురముగా నుండువాడు, 3. దక్షః = సామర్థ్యము కలవాడు, 4. దక్షిణః = యజ్ఞమునందు పంచిపెట్టబడు దక్షిణ, 5. క్షమిణాంవరః = క్షమించు వారియందు శ్రేష్టుడు, 6. విద్వత్తమః = తెలిసినవారిలో గొప్ప వాడు, 7. వీతభయః = భయమును పోగొట్టువాడు, 8. పుణ్యశ్రవణ కీర్తనః

= తనను స్తోత్రము చేయువారిని లేక ఆ స్తోత్రమును వినువారిని పవిత్రము చేయువాడు.

**తాత్పర్యము :-** భగవంతుని క్రూరత్వము తొలగించువానిగా, మధురమైనవానిగా, మృదువైనవానిగా, ధ్యానము చేయుము. ఆయన అందరికన్నా మించిన సామర్థ్యము కలవాడు. యజ్ఞము చివర పంచి పెట్టబడు దక్షిణగా తానే యున్నాడు. క్షమించు వారియందు ఉత్తముడు. తెలిసినవారియందు అనగా జ్ఞానులయందు శ్రేష్ఠుడు. ఆయన భయమును తొలగించి తనను గూర్చి స్తోత్రము చేయువారిని మరియూ ఆ స్తోత్రములను వినువారిని పవిత్ర మొనర్చుచున్నాడు.

**వివరణ :-** 1. భగవత్తత్వము నుండి మరుగుపడినవారికి క్రూరత్వము కలుగును. కనుక క్రూరత్వము నశింపవలెనన్నచో పరమాత్మను ధ్యానము చేయవలెను. క్రూరత్వము చూచువారి దృష్టి యందున్నది కాని పనియందు లేదు. ఒకనిని ఆహారము లేకుండా నుంచినచో చూచువారికి అది క్రూరత్వము, అదియే తప్పనిసరి కారణములవలన ఒకనిని భోజనమునకు పోనీయక ఆపినచో అది క్రూరత్వముకాదు. అట్లే భగవంతుని దృష్టిలో తప్పనిసరియగు కారణములవలన మనము క్రూరముగా వ్యాఖ్యానించునట్టి సంఘటనలు జరుగును, కానీ ఈ సంఘటనల వలన బాధపడువాని మనస్సు పరిశుద్ధమగును. కనుక అంతర్యామి దృష్టిలో ఇది అవశ్యకము కావచ్చును. మరియూ జీవునియందు క్రూరత్వము తొలగవలెనన్నచో దానివలన కలుగు బాధలు అతనికి తెలియవలెను. ఆహారములేక బాధపడిన వానికి మనసు పరిశుద్ధమై తరువాత జన్మలలో ఆహారము లేకుండా బాధపడు ఇతరులను చూచినచో వీనికప్రయత్నముగా జాలి కలుగును. ఈ జీవి పూర్వజన్మయందలి సంఘటనలు జ్ఞాపకము వచ్చుటచే గాక, తానట్టి బాధపడుట వలన తనయందేర్పడిన ఆర్ద్రతచేత ఎదుటివాని బాధను గుర్తింపగలుగు సామర్థ్యము కలుగును. ఇట్లు గుర్తించుట మనస్సుచేతగాక, హృదయము చేత అనుభవముగా గుర్తింపబడును. ఇదియే జాలియనియూ, సానుభూతి యనియూ పిలువబడినది. కనుక జీవులకు ఇట్టి సామర్థ్యము కలుగవలెనన్నచో ముందరి జన్మల అనుభవములు అవశ్యకములు. దీనిని తెలిసిన వానికి సంఘటనలు అన్నియు జీవులకు శిక్షణములే యగుచున్నవి.

2. భగవంతుడు కళలద్వారా తెలియబడుచున్నాడు. లలితకళలు భగవంతుని సులభముగా చేరుటకు మార్గములు. వానివలన మనస్సు లలితమై మధురముగా నగును. ఇట్లు సున్నితత్వము మనస్సునకు నారాయణుడే కలిగించుచున్నాడు.

3,4. ఇంతకు ముందు చెప్పబడినవి.

5,6,7,8. క్షమించుట దైవలక్షణము. విషయములను తెలియుట వలన పండితుడు కావచ్చును కాని భగవంతుని చేరుటకు అది చాలదు. క్షమించువాడు తనయందు అపచారము చేసినవారిని ప్రేమగా చూచుచున్నాడు గనుక భగవంతునితో సమానమగుచున్నాడు. పండితులు ఈర్ష్య, అసూయ, ఇతర పండితులను ద్వేషించుట, క్రోధము పొందుట, మొదలగు వికారములకు లోనగుచున్నారు గాని, క్షమాగుణము గలిగిన సజ్జనుడు అట్టి వికారములకు లోనుగాడు. అట్టి సజ్జనులు నిరంతరము ఆ నారయణుని కీర్తించి స్తోత్రము చేయుదురు. అట్లు స్తోత్రములు చేయుటవలన వారి మనస్సు అప్రయత్నముగా నారాయణుని యందుండును. అంతేగాక ఆ స్తోత్రములను విను వారికి సహితము అట్టి అనుభవమును కలిగించుచున్నారు. నారాయణుడు తన నామముగా కూడా నున్నాడు గనుక ఆ శబ్దమునుచ్చరించిన వారియందును మరియు వినువారియందును శబ్దస్వరూపుడుగా నున్నాడు. అట్లు తన స్వరూపము జీవులయందు కనిపించును గనుక వారికి భయము తొలగిపోవుచున్నది.

99. శ్లో॥ **ఉత్తారణో** దుష్కృతిహా పుణ్యో దుస్స్వప్ననాశనః
వీరహా రక్షణ స్సంతో జీవనః పర్యవస్థితః ॥

**ప్రతిపదార్థము :-** ఉత్తారణః = జీవులను మోక్ష స్థితిలోనికి ఉద్ధరించువాడు, 2. దుష్కృతిహాః = చెడు పనులను నశింపచేయువాడు, 3. పుణ్యః = మంచి పనుల రూపమయినవాడు, 4. దుస్స్వప్న నాశనః = చెడుకలలను నాశనము చేయువాడు, 5. వీరహాః = వీరులను చంపువాడు, 6. రక్షణః = రక్షణ కలిగించువాడు, 7. సంతః = సజ్జనుల కొరకు, 8. జీవనః = జీవనము, 9. పరి అవస్థితః = చిట్టచివరకు జరిగినది.

**తాత్పర్యము :-** పరమాత్మ చెడ్డ పనులను తన మంచి పనుల రూపమున నశింప చేయుచూ జీవులను మోక్ష స్థితిలోనికి పంపువాడు. చెడు పనులను నశింపచేసి రాక్షసవీరులను సంహరించి సత్కర్మ ఫలితములను మరియూ సత్పురుషులను రక్షించువానిగా, జీవనమే తానైనవానిగా ఇతరుల ఆలోచనలకు, పనులకు ఫలితముగా వారికిచ్చు జీవనము తానేయైనవానిగా, ధ్యానము చేయుము.

**వివరణ :-** 1. సంసారమనునది ఒక పెద్ద సముద్రమువంటిది. మన కోరికలు మరియూ అభిప్రాయములే పెద్ద కెరటములై నావలను అందలి మానవులనూ ముంచివేయంగలిగియుండును. దీనినుండి మానవుని రక్షింపగలిగినవాడు నారాయణుడొక్కడే. అతడు జీవునికి ఆత్మ వికాసము కలిగించి ఉద్ధరించును.

2. చెడ్డ పనులు చేయుటయనునది సంసారమున చిక్కు కొనుటవలన కల్పింపబడుచున్నది. అట్టి బుద్ధి పోవలెనన్నచో జీవునియందు వాని సంకల్పమునందు నారాయణుడు దిగిరావలెను. అనగా నారాయణుని సంకల్పము మనయందు వాని స్మరణగా మేల్కొనును. ఒకసారి పుట్టిన తరువాత వ్యాపించుట దాని లక్షణము. నారాయణుని స్మరణ మనస్సునందు విస్తరించుచున్నకొలది దుష్టబుద్ధి దమింపబడుచుండును. ఇటుల తన యందలి దుష్ట గుణములు దమింపబడుట వలన జీవుడు చెడ్డపనులను చేయుటకు కారణములను నశింపచేసుకొనుచున్నాడు.

3. అట్లు మనస్సునందు నారాయణుని స్మరణ మేల్కొనినవారికి అప్రయత్నముగా మంచి పని చేయవలెనని బుద్ధి పుట్టును. క్రమేణా అట్టి మంచి పనులు ఏ ప్రతిఫలము అక్కరలేక చేయు స్థితి వచ్చును.

4. చెడ్డ కలలు, చెడు తలంపులు కోరికల వలన కలుగును. భగవంతుని స్మరణ కలిగిన వారికి అట్టి తలంపులుండవు గనుక చెడు కలలురావు.

5. దుర్మార్గులైనవారు ఒక్కొక్కసారి బలమైన వారిగా వీరులుగా నుందురు. ఇది ఇతరులలోనున్న సద్గుణములను తీర్చిదిద్దుటకే. దుష్టులైనవారు వీరులై విజృంభించినచో బలహీనులైన సజ్జనులు తప్పని సరియై భగవంతుని తలచెదరు.

వారిలో రావలసిన మార్పులు వచ్చిన తరువాత నారాయణుడు వీరులైన దుష్టులను సంహరించును.

6. రక్షణ యనునది ఊహయేకాని సత్యము కాదు. ఎవరికెప్పుడు ఏది జరుగవలెనో క్రమము ననుసరించి జరుగుచునే యుండును. అవియే కర్మ ఫలితములు, దుష్కర్మలాచరించుట మాని సత్కర్మలాచరించువారికి వారి సత్కర్మయే నిజమైన రక్షణ. కనుక మనము చేయు మంచిపనుల రూపమున నారాయణుడే మనకు రక్షణ కల్పించుచున్నాడు.

7,8. మంచివారి జీవనము వారికి సంకల్పము లేకుండగనే సిద్ధించుచున్నది. అనగా వారికి జీవించుట సంకల్పము గాక సత్కర్మయే సంకల్పము. అట్టివారు సత్కర్మ కొరకు జీవించుదురు. సత్కర్మ భగవంతుని స్వరూపము కనుక వారి జీవనమే నారాయణుని రూపము.

9. నారాయణుడు కర్మ ఫలితములుగా జీవులలోనికి అవతరించును. పనులు వాటి ఫలితములు జీవుని మనస్సు పరిశుద్ధము చేసి పవిత్రము చేయును. మనస్సునందలి దుష్టలక్షణములు తొలగి సత్కర్మయందు అభిలాష కలిగించును. అట్టి అభిలాషగా భగవంతుడే జీవుల మనస్సులలోనికి దిగివచ్చుచున్నాడు. కనుక పనులు వాటి ఫలితములు మున్నగు వాని రూపమున నారాయణుడే యున్నాడు.

100. శ్లో॥ అనంత రూపో ఽనంత శ్రీర్జితమన్యుర్భయాపహః
చతురశ్రోగభీరాత్మా విదిశో వ్యాదిశోదిశః ॥

**ప్రతిపదార్థము** :- 1. అనంతరూపః = అనంతమయిన రూపములు కలవాడు, 2. అనంతశ్రీః= అనంతమయిన వైభవము కలవాడు, 3. జితమన్యుః = కోపమును జయించినవాడు, 4. భయాపహః = భయమును పోగొట్టువాడు, 5. చతురస్రః = చతురస్రము, 6. గభీరాత్మా = గంభీరమయిన ఆత్మ కలవాడు, 7. విదిశః = దిశలయందలి అంతర్దిశలు, 8. వ్యాదిశః = అనేకదిక్కులుగా వ్యాపించినవాడు, 9. దిశః = దిక్కులు.

**తాత్పర్యము :-** నారాయణుని అసంఖ్యాకమైన రూపములుగా, వైభవము గలవానిగా, జీవులలోగల కోపమును జయించినవానిగా ధ్యానము చేయుము. చతురస్రమై, భయమును పోగొట్టు లోతైన ఆత్మ గలిగి, అన్ని దిశలయందు వ్యాపించి, అన్ని దిశలయందు, అంతర్దిశలయందు వ్యాపించుటయే గాక, అన్ని దిక్కులకు తానే దిక్కుగా నుండువాడు.

**వివరణ :-** 1. సృష్టియందు ప్రారంభమునుండి అంతము వరకూ అనేక రూపములు పుట్టి నశించుచున్నవి. ఈ రూపములు ఒక రూపమును పోలి మరియొక రూపముండదు, అనగా రూపములన్నియూ ఎన్ని పుట్టుచున్ననూ దేనికది రెండవదానినుండి వేరుగా నున్నది. ఈ రూపములన్నియూ పరమాత్మ యొక్క వ్యక్త రూపములే.

2. అట్లే సృష్టియందు సంపదలు, వైభవములు అనంతములు అనగా తరుగనివి. పాడి, పంట, ఫలములు మున్నగునవి జీవులకు సంతోషముకలిగించు నిజమైన సంపద. ఈ సంపదల రూపమున, వైభవముల రూపమున భగవంతుడే యున్నాడు.

3. కోపము అసురలక్షణము. అనగా జీవునియందు అహంకారముగా పనిచేయుచుండును. జీవప్రజ్ఞ నీచలోకములలో నున్నప్పుడు కోపము మున్నగునవి కలుగును. అంతర్యామిని తనకు కోపము కలిగించు కారణమునందు స్మరించినచో కోపము తొలగిపోయి పరమాత్మ నిలుచును.

4. అట్లు స్మరణ అంతర్యామియందు నిలిచినవారికి కోపముతోబాటు భయము కూడా తొలగిపోవును. అనగా భయపడవలసిన కారణము కనిపించదు.

5. చతురస్రము (Square) ధ్యానము చేసినవారికి అభయము, రక్షణ కలుగును. మనస్సును నాలుగు వాక్కులుగా ధ్యానము చేయుటకు ఇదియే సాధనము. అవి పర, పశ్యంతి, మధ్యమ, మరియు వైఖరీ వాక్కులు. అవి ఈ చతురస్రము మూలలపై నిలిచియున్న విధముగా ధ్యానము చేయవలెను. Square standing on one of its corners with its diagonals joined. ఇదియే ఇంద్రుని వజ్రాయుధముగా చెప్పబడినది. పురాతన దేవాలయములపై అనేక చిత్రమైన రీతులలో ఇది చెక్కబడి భక్తులకు అభయము,

రక్షణ, కలిగించినది. కొన్ని దేవాలయములుల పునాదుల యందు, దేవతావిగ్రహముల ప్రాణప్రతిష్టయందు ఈ యంత్రము స్థాపన చేయబడును. అట్టి దేవాలయములను దర్శించువారికి అభయము, రక్షణ కలుగును.

6. జీవునియందు లోతైన అంతరము గలదు. ఈ అంతరమే జీవ ప్రజ్ఞ. ఈ జీవ ప్రజ్ఞయందు మిక్కిలి లోతుగా లేక సూక్ష్మముగా అంతర్యామి యున్నాడు. ఈ అంతర్యామి అంశయే జీవునికి బ్రహ్మాండమునందలి అంతర్యామితో అనుసంధానము కలిగించుచున్నది.

7,8,9. హృదయమున తానను కేంద్రమునుండి తూర్పుదిశగా తిరిగియుండి, ముందు వెనుకలు, ఎడమ, కుడి అను జంటలను కలుపుచూ చోటులోనికి వ్యాపించిన అనంతమైన రెండు రేఖలను ఊహించుకొనవలెను. అవి రెండునూ హృదయమునందు ఒకదానినొకటి ఖండించుకొనును. అట్లు ఖండించుకొనునప్పుడు అక్కడ నాలుగు సమాన కోణము లేర్పడుచున్నవి. They form as cross, cutting at least and streatching into four directions of East and West, and North and South ఈ నాలుగు సమకోణములలో ఒక్కొక్క దానిని రెండు సమభాగములుగా ఖండించుచున్న మరిరెండు అనంతమైన రేఖలను ఊహించుకొనవలెను. అవి ఈశాన్యము, నైఋతి అట్లే వాయువ్యము, ఆగ్నేయములను కలుపుచున్న అనంతమైన రేఖలు. ఇవి కూడా హృదయమునందే మొదటి రెండు ఖండించుకొను బిందువునందే ఖండించుకొనును. ఇట్లు తనచుట్టూ నున్న చోటును ఎనిమిది సమభాగములుగా విభజించిన ఊహారేఖలను దిశలు, విదిశలు అందురు. మిట్టమధ్యాహ్నము నడినెత్తిపై సూర్యుడుండు బిందువు నుండి అర్థరాత్రి 12 గం. భూమిక్రింద సూర్యుడుండు బిందువు వరకూ ఒక అనంతమైన రేఖను ఊహించుకొన్నచో అది కూడా తన హృదయమునందు మొదట చెప్పబడిన స్థానమునందే ఖండించుకొనును. A vertical line passing through centre of head, through least and joining centre of earth and extend infinitely. ఈ రేఖలను వ్యాదిశలందురు. ఈ యంత్రమును, లేక రేఖల రూపమును తన హృదయమునుండి అనంతమైన విశ్వములోనికి వ్యాపించు విధమును ధ్యానము చేయువానికి అప్రయత్నముగా అంతర్యామి ప్రజ్ఞయందు మనస్సు

నిలచును. ధారణ, ధ్యానము, సమాధి అను మూడింటివలన ఈ స్థితి జీవులకు సాధ్యమగుచున్నది.

101. శ్లో॥ అనాధిర్భూర్భువో లక్ష్మీః సువీరో రుచిరాంగదః
జననో జనజన్మాది ర్భీమో భీమ పరాక్రమః ॥

**ప్రతిపదార్థము** :- 1. అనాదిః = ప్రారంభము లేనివాడు, 2. భూర్భువః = మొదటి రెండు లోకములు, 3. లక్ష్మీః = లక్ష్మీదేవి, 4. సువీరః = గొప్పవీరుడు, 5. రుచిరాంగదః = కాంతివంతమైన ఆభరణములు ధరించినవాడు, 6. జననః = పుట్టుక, 7. జనః = జనులు, 8. జన్మాది = భూతముల పుట్టుకకు మొదలు, 9. భీమః = భయము కలిగించువాడు, 10. భీమ పరాక్రమః = భయము కలిగించుకార్యము కలవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను అన్ని భూతముల పుట్టుకకూ ప్రారంభకునిగా, తనకు తాను ప్రారంభము లేనివానిగా, లక్ష్మిగా, స్వయముగా ప్రకాశించు ఆభరణములు ధరించిన గొప్ప వీరునిగా, సమస్తమునకు మొట్టమొదట వానిగా, మరియు పుట్టుకలకు కారణమైనవానిగా ధ్యానము చేయుము. ఆయన రూపము భయము కలిగించును. ఆయన భయంకరమైన పరాక్రమము కలవాడు.

**వివరణ :-** 1. ప్రారంభమగుట, అంతమగుట అనునవి సృష్టియందలి విషయములు, నారాయణునకు ఇవి రెండునూ లేవు.

2. ముల్లోకములలో మొదటి రెండు లోకములు భౌతిక, శక్తిమయ లోకములు ఇవి రెండునూ పరమాత్మ వైభవమును భౌతికముగా వ్యక్తము చేయును. భౌతిక సృష్టి మార్పులు చెందుచూ అస్థిరముగా నుండును. ప్రతి క్షణముననూ కణములయందు, అణువులయందు అనేకమయిన మార్పులు సంభవించుచున్నవి. ఈ మార్పులవలన ప్రకృతి మనోహరముగా, శోభాయమానముగా నుండి జీవులకు ఆహ్లాదము కలిగించుచున్నది. ఇదియే పరమాత్మ యొక్క మహిమ. మొక్క పూవుగా వికసించి పరిమళము వెదజల్లి మరుసటి దినము రాలిపోవుచుండగా, మరల మరియొక పుష్పము వికసించుచున్నది. ఇట్లు క్షణక్షణమునకూ అనేక మార్పులు జరుగుచున్నను ప్రకృతి సౌందర్యము చెడక అట్లే నిలిచి భగవంతుని మహిమను చాటుచున్నది.

3 నుండి 5 వరకు :- ఇట్లు ప్రకృతివలన మనకు తెలియబడు భగవంతుని అస్తిత్వమే లక్ష్మియని చెప్పబడినది. లక్ష్మియనగా ధనము, నగలు, ఆస్తులు మున్నగునవికాదు. బంగారము, నగలు, ఆభరణములు అనునవి లక్ష్మీ స్వరూపములని భావింతురు. అవియాభరణములగుట సత్యమే కావచ్చునుగాని అయాభరణములు భౌతికములు మాత్రమే. నిజమయిన ఆభరణములు మంచివాని సద్గుణములు. అవి వాని పరోక్షమున కూడా ప్రకాశించుచుండును, కనుకనే నారాయణ కవచమునందు ''భూషణాయుధ లింగాఖ్యాధత్తే శక్తీః స్వమాయయా'' (పరమాత్మ భూషణములు, ఆయుధములను పేర తన మాయచేత తన శక్తినే ధరించుచున్నాడు) అని కీర్తింపబడినది.

6. సమస్తమూ నారాయణునినుండి పుట్టుచుండుట వలన ఆయన జగత్తునందు పుట్టుట యను ధర్మముగా మేల్కొని యున్నాడు.

7,8. జననమూ మరియూ దానికి కారణము అను రెండునూ బ్రహ్మలోకములనుండి గర్భధారణము వరకూ పనిచేయుచున్నవి. అనగా బ్రహ్మ ఎట్లు సృష్టించుచున్నాడో, అట్లే భౌతిక సృష్టి కూడా జరుగుచున్నది. కాని బ్రహ్మకు తాను సృష్టించుచున్నానన్న భావము లేదు.

9. నారాయణుడు భౌతిక లోకములయందు మాత్రమే నివసించువారికి భయము కలిగించుచున్నాడు. అనగా జీవులు నిత్య జీవితమునందలి సంఘటనలను గూర్చి, వానికి కారణములు పైలోకములలో నున్నవని తెలిసి తమ జీవితమును తదనుగుణముగా మలచుకొననిచో వారికి ఆ సంఘటనలు భయకారణములగును.

10. అట్లు తన జీవితము క్రమశిక్షణతో సరిదిద్దుకొననివానిని నారాయణుడు తన పరాక్రమముతో శిక్షించి సరిదిద్దును.

102. శ్లో|| ఆధార నిలయో ధాతా పుష్పహాసః ప్రజాగరః
ఊర్ధ్వగః సత్పథాచారః ప్రాణదః ప్రణవః పణః ||

**ప్రతిపదార్థము** :- 1. ఆధారనిలయః = ఆధారమే తన నిలయముగా గలవాడు, 2. ధాతా = సృష్టికర్త, 3. పుష్పహాసః = పుష్పముల వికాసమే

తన చిరునవ్వుగా గలవాడు, 4. ప్రజాగరః = సమస్తమునందు ఎల్లప్పుడూ మేల్కొని యుండువాడు, 5. ఊర్ధ్వగః = పైకి ప్రయాణము చేయువాడు, 6. సత్పధాచారః = మంచి మార్గమే తన ఆచారముగా గలవాడు, 7. ప్రాణదః = ప్రాణశక్తి నిచ్చువాడు, 8. ప్రణవః = ఓంకారము, 9. పణః = మూల్యము.

**తాత్పర్యము :-** నారాయణుని, ఈ సృష్టి ఆధారమే తన నివాసమైన వానిగా, మరియూ అన్ని లోకములకూ ఆధారముగా, ధ్యానము చేయుము. పుష్పము వికసించుటవంటి తన చిరునవ్వుతో సృష్టిని భౌతిక లోకముల లోనికి వ్యక్తీకరించువాడు. అన్నిటియందు నిరంతరమూ మేల్కొని యుండువాడు. జీవులలో మంచిపనులు చేయు ఆచారమే తన మార్గముగా పైకి ప్రయాణము చేయువాడు. ప్రాణశక్తి నిచ్చువాడు. శ్వాసను, వాక్కును, సృష్టియొక్క మూల్యమును కూడా నిచ్చువాడునై యున్నాడు.

**వివరణ :-** 1. జీవునికి వెన్నెముక చివరనున్న మూలాధారమే ఆధారమైయున్నది. అణువునందునూ, కణములయందునూ వాటి కేంద్రమే (న్యూక్లియస్) ఆధారమై పనిచేయుచున్నది. సూర్యుడు ఈ సౌర మండలమునకు ఆధారము. మన పాలపుంత యందలి తారలకు మూలా నక్షత్రమే ఆధారము. ఈ సృష్టి మొత్తమునకు మూలప్రకృతి ఆధారమై యున్నది. ఇవి యన్నియూ పరమాత్మకు ఆధారములు. అనగా నారాయణుడే ఇవి యన్నియూ వ్యక్తమగుటకు ఆధారమై యున్నాడు.

2,3. పూవు వికసించుట సృష్టికి మూలముగా పురాణములయందు వర్ణింపబడినది. బ్రహ్మ పద్మమునుండి పుట్టినాడు. ఆ పద్మమునకు మూలము నారాయణుడు. అనగా పూవువికసించుటయే బ్రహ్మయొక్క తత్వము. పూలు వికసించుట, గింజ మొలకెత్తుట మున్నగునవి గమనించినచో, విశ్వమునందు బ్రహ్మ నిర్వహించు కార్యక్రమము తెలియును. ఈ ప్రజ్ఞయే విశ్వమునందు తారలు గుంపులు గుంపులుగా పుట్టి వెలుగుటకు కారణమగుచున్నది. కనుకనే తారల గుంపులు, మరియూ జీవుని వెన్నెముక యందలి కేంద్రములు పద్మములుగా వర్ణింపబడినవి.

4. నిద్ర భౌతిక, మానసిక మరియు ఇంద్రియముల స్థితులకు వర్తించును. కాని జీవిలోనున్న అంతర్యామికి నిద్రలేదు. నిజమునకు నిద్రయనగా పై మూడును జీవునిలో కరగి ఆత్మగా మాత్రమే మేల్కొని యుండు స్థితి. కనుక నారాయణుడు జీవులు నిద్రించుచున్ననూ తాను వారి యందు మేల్కొనియే యున్నాడు.

5. అణువులయందు, కణములయందు అంతర్లీనమై యున్న దైవప్రజ్ఞ చైతన్యము పొంది పశువులుగా, మానవులుగా, మేల్కొనుటకై చేయు ప్రయాణమే ఊర్ధ్వగమనము. మానవునియందు ఇది కాలక్రమమున మేల్కొని పైకి ప్రయాణము చేయును. ఇట్లు అణువులనుండి పరమాత్మ వరకూ ప్రజ్ఞచేయు ప్రయాణమే ఊర్ధ్వగమనము లేక ఉత్తరాయణము. పరమాత్మ నుండి సృష్టిగా దిగివచ్చు ప్రయాణమే అధోగమనము లేక దక్షిణాయనము. ఆ రెండును కలిపినచో ఒక అయనమగును. ఇదియే పరమాత్మయొక్క ప్రయాణము. అనగా జలములుగా నున్న ప్రజ్ఞచేయు ప్రయాణము గనుక నారముయొక్క ఆయనము అని చెప్పబడినది. ఇట్లు ప్రయాణము చేయు ప్రజ్ఞయే నారాయణుడు. నారాయణుడు, ప్రజ్ఞయొక్క ప్రత్యేకతలు నశించి అంతయు ఒకే అనుభూతిగా కరిగియున్న మహాప్రజ్ఞ గనుక, జలస్థితిలో నున్న ప్రజ్ఞగా వర్ణింపబడినాడు. ఆ నీటియందు తేలుచున్న పెద్దవి, చిన్నవి, మరియు అనేక రూపములుగా నున్నవియగు మంచు ముక్కలే జీవులు. వీరు మరల పరమాత్మలోనికి జలములుగా కరగిపోయి తమ ప్రత్యేకతలు అంతర్యామియందు కరగించుకొను ప్రయాణమే ఊర్ధ్వగమనము. అట్లు జీవులుగా ప్రయాణము చేయుచున్నవాడు నారాయణుడు.

6. మంచిపనులనగా మనస్సును వికసింపచేసి క్రమశిక్షణలో నుంచునవి, సూర్యోదయమునకు పూర్వమే లేచి స్నానముచేసి దైవప్రార్థన చేయుటవలన మనస్సు దినమంతయూ ప్రసన్నముగా నుండును. ఉద్వేగములకు లోనగుట తగ్గును. మరియూ ఉదయముననే కొంతసేపు సద్గ్రంథపఠనము చేయుటవలన మనస్సు ఉల్లాసమై దినమునందు తన కర్తవ్యమును నిర్వహించుటలో శ్రమ తెలియకుండా ఆనందముగా పనిచేసుకొన గలుగు సౌలభ్యము మనస్సు కలవడును. సాయంత్రము మరల ఇట్టి కార్యక్రమమే నిర్వహించుట వలన దినమునందలి పనుల భారముచే ఉత్సాహము తగ్గిన మనస్సు మరల తేజోవంతమై

ప్రసన్నమగును. దాని వలన రాత్రి నిద్రపట్టకుండుట, కలతనిద్ర, భయమును కలిగించు కలలు మున్నగునవి తొలగిపోయి చక్కని సుఖనిద్ర కలుగును. అట్లే పూజ, ఆహారము నియమిత వేళకు తీసుకొనుట, ఆరోగ్యవంతమైన ఆహారము తీసుకొనుట, ప్రతిదినము నియమిత వేళకు నిద్రలేచుట మరియూ పరుండుట అనువానివలన భౌతికదేహము ఆరోగ్యవంతమై నిలచును. యోగసాధనకు ఈ రెండును అత్యావశ్యకములే. భౌతిక ఆరోగ్యములేని వానికి మానసికముగా ఎంత ఉల్లాసముగా నున్ననూ అనారోగ్యము మనస్సును చికాకుపరచి క్రిందికు దిగలాగుచుండును. యివియే పతంజలిచే, యమము, నియమము అను మొదటి రెండు అంగములుగా చెప్పబడినవి, కనుక యిట్టి క్రమశిక్షణతో కూడిన కార్యక్రమమును సదాచారము అందురు. భారతీయ జీవిత విధానము ఇట్టి సదాచారములతో కూర్పు చేయబడి యోగ సాధన అందరికి అప్రయత్నముగా జరుగునట్లు ఏర్పాటు చేయబడినది. కలి దోషము సోకిన కొందరు ప్రబుద్ధులు కొన్ని దురాచారములను వీనియందు చొప్పించుట, దుర్వ్యాఖ్యానములు చేయుట సంభవించెను. కాని విజ్ఞులైన వారు మరల ప్రమాణ గ్రంధములైన వేదములను, పురాణములను, ఉపనిషత్తులనూ ఆశ్రయించి, తమ వివేకమునుపయోగించి ఎప్పటికప్పుడు ముళ్ళ తీగెల వంటి దురాచారములను ఖండించి, మరల సదాచారములతో కూడిన పూల బాటను నిర్మించుకొనవలసియుండును. ఇట్టి సదాచారములతో కూడిన మంచి మార్గమే నారాయణుడు.

7. ప్రాణశక్తి వలన మనలో ఉచ్ఛ్వాస నిశ్వాసములు ఏర్పడుచున్నవి. మనలో శ్వాసగా తెలియబడుచున్న స్పందనమును ధ్యానము చేయు మనస్సు ప్రాణశక్తిగా పని చేయుచున్న అంతర్యామి యందు లీనమగును. ఆయన వలననే జీవులకు శ్వాస ఏర్పడుచున్నది.

8. అట్లు ప్రాణశక్తిని శ్వాసగా ధ్యానము చేయునప్పుడు ''సోహం'' అను మంత్రము శ్వాసయందు పుట్టును. శ్వాసయందు ఈ మంత్రము అంతర్లీనముగా పని చేయుచున్నది. శ్వాసలోపలికి తీసుకొనునప్పుడు ఊపిరియందు 'సో' అను శబ్దము అజ్ఞాతముగా పుట్టును. అట్లే శ్వాస బయటకు విడచునప్పుడు ''హం'' అను శబ్దము అజ్ఞాతముగా పుట్టుచున్నది.

ఈ రెండింటిని కలిపినచో ''సోహం'' అను మంత్రము మన యందు మేల్కొనుచున్నది. ఈ ''సోహం'' అను మంత్రమే తండ్రి నుండి కుమారునకు ఉపదేశింపబడి కుమారుని యందు మేల్కొనుచున్నది. ఈ ఉపదేశమునకు తల్లియే ద్వారమగుచున్నది. ఈ మంత్రమునందు ''స'' కారము పురుషబీజము. ''హ'' కారము స్త్రీ బీజము. ఈ రెండిటి యందు ఇమిడి యున్న '' ఓం'' కారము తల్లి దండ్రుల దాంపత్యము యొక అనుభూతియై కుమారునిగా దిగి వచ్చుచున్నది. ఒక జీవినుంచి మరియొక జీవి దిగివచ్చుటకు ఈ '' ఓం'' కారమే మూలకారణమగుచున్నది. మండుచున్న ఒక పుల్ల మరియొక పుల్లను వెలిగించుచున్నప్పుడు జరుగు విశేషమును గమనించినచో తండ్రి తేజస్సు నుండి కుమారుని తేజస్సు పుట్టుట యందలి రహస్యము తెలియును. ఇట్లు ఒక వెలుగు నుండి ఇంకొక వెలుగు వెలిగింపబడుటకు మూలకారణముగా పని చేయుచున్న నిజమైన వెలుగే '' ఓం'' కారము. ఇది అన్ని జీవుల యందునూ ప్రాణుల యందునూ, అణువులయందునూ వేరువేరుగా ప్రకాశించుచున్ననూ అవ్యక్తముగా అంతయూ ఒకే మహా తేజస్సుగా వెలుగు చున్నది. అట్లు చోటు నందు అంతర్లీనముగా ఉచ్చరింపబడు '' ఓం'' కారమే జీవులందరి యందునూ వేరువేరుగా ప్రతిధ్వనించుచుండుట వలన అనేకములైన ''ఓం'' కారములుగా, లేక ''నే'' నను ప్రజ్ఞలుగా భాసించుచున్నది.

9. మూల్యము అనునది ఒక వస్తువు యొక్క ప్రయోజనముపై నాధారపడి యుండును. అనగా అది కలిగించు సుఖశాంతులు లేక భౌతిక అవసరములైన ఆకలి దప్పులు మున్నగునవి నివారించుటపై దాని విలువ ఆధారపడి యుండును. కానీ ఈ ప్రయోజనములు మున్నగునవి వస్తువుల యందు పరమాత్మచే కల్పింపబడుచున్నవి కనుక అన్నిటికిని నిజమైన మూల్యము భగవంతుడే అనగా అన్ని వస్తువులునూ అంతర్యామితో సమానమైన విలువ కలిగినవియే అగుచున్నవి.

103. శ్లో॥ ప్రమాణం ప్రాణనిలయః ప్రాణభృత్ప్రాణజీవనః
తత్త్వంతత్త్వ విదేకాత్మా జన్మ మృత్యుజరాతిగః ॥

**ప్రతిపదార్థము :-** 1. ప్రమాణం = సరియైన కొలత, 2. ప్రాణనిలయః = ప్రాణస్పందనకు స్థానము, 3. ప్రాణభృత్ = ప్రాణ స్పందనము భరించువాడు, 4. ప్రాణజీవనః = ప్రాణస్పందనమే జీవనమైనవాడు, 5. తత్త్వం = అది అని పిలువబడునది, 6. తత్త్వవిత్ = అన్నిటియందలి అది అని పిలువబడు దానిని తెలిసినవాడు, 7. ఏకాత్మా = ఒక్కటియైన ఆత్మగలవాడు, 8. జన్మ మృత్యుజరాతిగః = పుట్టుక, చావు మరియు ముసలితనము అను వాటిని దాటినవాడు.

**తాత్పర్యము :-** భగవంతుని సరియైన కొలతగా, ప్రాణస్పందనకు స్థానముగా ధ్యానము చేయుము. ఆయన మన యందలి ప్రాణస్పందనముగా ఆ స్పందనమును భరించువానిగా మరియూ ఆ స్పందనమునందలి అంతరాత్మగానున్నాడు. ఆయన ''అది'' అని పిలువబడునదిగా మరియూ ''అది'' అని పిలువబడు వాని నన్నింటిని తెలుసుకొనిన వానిగా నున్నాడు. కనుక పుట్టుకను, చావు, మరియూ ముసలితనమునూ దాటుచున్నాడు.

**వివరణ :-** 1. నిజమయిన ప్రమాణము లేక కొలత ఏ వస్తువు నైనను కొలువగలిగియుండును. అనగా సృష్టి యందలి సమస్త వస్తువులనూ దానిలో ఇమిడి పోవలసియుండును. అట్టి కొలత ఈ సృష్టిని భావన చేయగలిగిన మహా మనస్సు. దానినే ''బ్రహ్మ'' అని కూడా పిలుతురు. బ్రహ్మ యనగా సృష్టిని భావించువాడు. బ్రహ్మనుండి భౌతిక సృష్టి వ్యక్తమైనది కనుక ఆయన ఈ సృష్టికి కొలత లేక ప్రమాణము. అట్లే ప్రతివాడునూ తన మనస్సునందలి విషయములకు ప్రమాణమగుచున్నాడు. ఇందరి రూపమున నిజమైన ప్రమాణము వీటన్నిటిలో నున్న నారాయణుడే.

2. జీవము ''ఓం'' కారము నుండి పుట్టును. ప్రాణశక్తి ''సోహం'' నుండి పుట్టును. ప్రాణస్పందనమనగా ''ఓం'' కారముగా నున్న తేజస్సు. అనగా తేజస్సు భౌతిక శక్తిగా వ్యక్తమగుచుండగా ''ఓం''కారము మాత్రము నిశ్చలమై, స్పందనలకు అతీతమై యుండును. అనగా అన్ని శక్తులు '' ఓం'' కారము నుండి పుట్టునేకాని ''ఓం'' కారమునకివి యంటవు. దీనియందున్న అన్ని వర్ణములు, శక్తులు కలిసిపోయి నిశ్చలత్వము నందును. అక్కడ సమస్తము

కలిగియుండి పరిపూర్ణముగా నుండును. దీనినే పూర్ణమందురు. నారాయణుడు యిట్టి లోకమందు ఉండునని చెప్పబడెను.

3. కనుక, ప్రాణశక్తి యనగా '' ఓం'' కారమే తన శక్తిగా మన శ్వాసయందు మేల్కొనుచున్న మహాశక్తి. దీని వలననే ''సోహం'' అను మంత్రము మనయందు పుట్టి మనచే శ్వాస తీయించుచూ మనలను చైతన్యవంతులుగా చేయుచున్నది. కనుక ఈ ప్రాణశక్తిగానున్న భగవదీతుడే మన శరీరమును భరించియున్నాడు.

4. మనయందు జీవించువాడు అహంకార రూపుడైన జీవుడు. అట్టి జీవుడుగా నున్నది ఆత్మ. ఈ జీవితము, అందు జీవించువాడు అను రెండునూ సముద్రము కెరటములవంటివి. అనగా సముద్రమున్నంతకాలము కెరటములుండును. నారాయణుడున్నాడు కనుక సృష్టి యుండును. జీవులందరు నశించుట, మరల పుట్టుట అనునవి ఒకదాని వెనుక నొకటి మార్చిమార్చి సంభవించుచునే యుండును. కనుకనే సముద్రము నందలి కెరటములుగా సృష్టి చెప్పబడినది. నిజమునకు అవి రెండునూ ఒక్కటియే కదా ! కానీ రెండుగా కనిపించుట చిత్రము. అదియే పరమాత్మ సృష్టి. ఇవి రెండునూ ఒకటి శాశ్వతము రెండవది దాని ప్రతిబింబము. ఒకటి సత్యము లేక సత్త్వము రెండవది దాని చెదరుబాటయిన రజః తమస్సులు.

5. మనచే ''అది'' అని పిలువబడునది, చెప్పబడునదంతయూ నారాయణుడే. మనచుట్టూ నున్న వాటిని అదియని, ఇదియని ఫలానా వస్తువని చెప్పుదుము. ఇవియన్నియూ పేర్లే తప్ప వస్తువు మాత్రము ఒక్కటే.

6. అట్లు మనయందు ధ్యానము చేసి ''అది, ఇది'' అని పిలువబడుచున్న సమస్తమూ తానేయని తెలుసుకొనువాడు జీవునియందలి పరమాత్మ.

7. ఇన్నిటియందునూ నేనే యున్నానని తెలుసుకొనుట వలన నారాయణుని సాన్నిధ్యము కలుగుచున్నది.

8. పుట్టుక, ముసలితనము, మృత్యువు అనునవి జీవునికి పరమాత్మ వలననే కలుగుచున్నవి. నారాయణుని సంకల్పము లేనిదే ఇవిలేవు. అనగా

సృష్టియే లేదు. సృష్టికి పుట్టుక ఎట్లో అంతము కూడా నట్లే. మానవునిక కూడా ఇవియన్నియూ సహజ పరిణామములే. మనకు శిరస్సు, పాదములు, ఎట్లో జీవితమునకు చావు పుట్టుకలట్టివి. శిరస్సులేనిదే పాదములు లేవు. అట్లే ప్రారంభము లేనిదే అంతములేదు. ఈ రెండునూ తెలిసిన వానికి అన్నియు ఒకే విషయమునందలి భాగములుగా గోచరించును.

104. శ్లో॥ భూర్భువస్సువస్తరుస్తారః సవితాప్రపితామహః
యజ్ఞో యజ్ఞపతిర్యజ్వా యజ్ఞాంగో యజ్ఞవాహనః ॥

**ప్రతిపదార్థము:-** 1. భూర్భువస్సువః = భూ, భువ, సువర్లోకములు, భౌతిక, శక్తి, ప్రజ్ఞాలోకములు, 2. తరుః = సృష్టియను మహావృక్షము, 3. తారః = తరింపచేయువాడు, 4. సవితా = సృష్టికర్త, 5. ప్రపితామహః = ముత్తాత, 6. యజ్ఞః = యజ్ఞము, 7. యజ్ఞపతిః = యజ్ఞమునకు అధిపతి, 8. యజ్వా = యజ్ఞము చేయువాడు, 9. యజ్ఞాంగః = యజ్ఞములో భాగము, 10. యజ్ఞవాహనః= యజ్ఞమునకు వాహనము వంటివాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను భౌతికము, శక్తి, ప్రజ్ఞాలోకములుగా ధ్యానము చేయుము. ఆయన సృష్టి వృక్షముగా, తరింపచేయువానిగా మరియూ సృష్టికర్తగా నున్నాడు. ఆయన అందరికి ముత్తాతవంటివాడు. ఆయనయే యజ్ఞము, యజ్ఞమును రక్షించువాడు, యజ్ఞమును చేయువాడు. మరియూ యజ్ఞమునకు ప్రతిబింబము. ఆయన ఈ సమస్త యజ్ఞమున కంతటికి వాహనము వంటివాడు.

**వివరణ :-** 1. ఈ సృష్టి మొత్తము స్థూలముగా మూడు లోకములుగా నున్నవి. అవి ద్రవ్యము, శక్తి, మరియూ ప్రజ్ఞాత్మకములు.

2. ఈ మూడు లోకములు సృష్టియను మహావృక్షమునకు కొమ్మలు, బోదె, మరియు వ్రేళ్ళుగా నున్నవి. అందు భౌతిక జగత్తు కొమ్మలై క్రింది బాగమున నున్నది. ప్రాణశక్తి చెట్టు బోదెగా ఏర్పడియున్నది. ప్రజ్ఞాలోకము కారణము మరియు వ్రేళ్ళుగా నేర్పడియుండును. మన పాదముల క్రిందనున్న భూమి భౌతిక జగత్తు. మనచుట్టు నున్నచోటు ప్రాణమయ జగత్తు. మన శిరస్సుపైన సూర్యుడు ప్రజ్ఞాలోకమునకు కారకుడు. ఇట్లు సృష్టిగా దిగివచ్చిన

మహావృక్షము పైకి వ్రేళ్ళు, క్రిందకు కొమ్మలు, ఆకులు కలిగియున్నది. భగవద్గీతలో పదిహేనవ అధ్యాయములో పరుషోత్తమ ప్రాప్తి యోగమునందు ఈ సృష్టి వృక్షమును గురించి చక్కగా వివరింపబడియున్నది. (ఊర్థ్వ మూలమధశ్శాఖం అశ్వర్థం ప్రాహురవ్యయం)

3. పరమాత్మ జీవులయందు తానను ప్రజ్ఞగా మేల్కొని పై మూడు లోకములనూ నాటించుచున్నాడు, అనగా వానియందలి అంతర్యామిత్వము నందు మేల్కొనుటవలన జీవులకు మిగిలిన లోకములన్నియు నశించుచున్నవి.

4. సూర్యుడు తాను కిరణములద్వారా సృష్టిని కల్పించుచున్నాడు. ఆయన తానను ప్రజ్ఞగా జీవుల నేర్పరచి వారిని సూర్యమండలమునందు వారి వారి స్థితులలో నిలుపుచున్నాడు. ఒక మహా అగ్నిజ్వాలనుండి అనేక చిన్న చిన్న జ్వాలలు, రవ్వలు పుట్టుచున్నట్లు సూర్యునినుండి జీవులు పుట్టుచున్నారు. కనుక నారాయణుడు సూర్యుని రూపముగా సౌరమండలమునందు సృష్టించుచున్నాడు.

5. అట్లు సృష్టింపబడుచున్న జీవులు భౌతిక దేహమును ధరించి మరల జీవుల శరీరములు పుట్టుటకు కారణమగుచున్నారు. ఇట్లు జీవులు ఒకరికొకరు మనుమలు, మునిమనుమలగుచుండగా వీరికందరకూ నారాయణుడే పెద్ద ముత్తాత యగుచున్నాడు.

6,7. సృష్టి భగవంతునినుండి పుట్టి మరల ఆయన లోనికే లీనమగుచున్నది. ఈ సృష్టికి ప్రయోజనమేమికలదు? నిజమునకు ఏమియు లేదనియే చెప్పవలయును. అందుచేతనే సృష్టించుట భగవంతుని క్రీడగా చెప్పబడినది. ఆడుకొనుచున్న పిల్లవానిని పిలచి, ఆడుకొనుటలో నీకు గల ప్రయోజనమేమిటి? అని అడిగినచో, పిల్లవాడు తెలివి గలవాడైనచో, ఆడుకొనుటయే నా ప్రయోజనము, అని చెప్పును. చెప్పలేని వాడైనచో చిరునవ్వు నవ్వి మరల పోయి ఆడుకొనును. భగవంతుడు సృష్టిని ఇట్లే సృష్టించెను. ఆయన జీవులను సృష్టించుచూ ఆడుకొనుచున్నాడు. జీవులు కూడా భగవంతునితో నాడుకొనుచున్నారు గాని వారికది తెలియదు. ఇట్లు సృష్టి ఏ ఒక్కరినీ ఉద్దేశించిగాక దేనికదే ప్రయోజనమై నడుచుచున్నది. జీవులు కాని, పరమాత్మ

కాని ఈ సృష్టి ప్రయోజనమునకు బాధ్యులు కారు. సృష్టి యందలి జీవులకు తాత్కాలికములుగా చిన్నచిన్న ప్రయోజనము లున్ననూ సృష్టి మొత్తమునకు వేరే ప్రయోజన మనునది లేదు. అంతర్యామియందే ఈ సృష్టి జరుగుచున్నది. గనుక వానికది వినోదవేంగాని, వానికి ప్రయోజనవు లేదు. అట్టి ప్రయోజనమునకు మించిన పరమార్థమునే యజ్ఞమని అందురు.

8. భగవంతుడు సృష్టికతీతుడై సృష్టిని నడుపుచున్నాడు. ఆయన యజ్ఞమునకు అధిపతియైయున్నాడు. మరియు సృష్టియందు సమస్తమునూ నిర్వహించు వాడు కూడా తానే. జీవులుగానూ, గ్రహములుగానూ, దివ్య శక్తులుగానూ, తానే వర్తించుచున్నాడు.

9,10. సృష్టియందలి సమస్త భాగములు పరమాత్మయందలి భాగములు. కనుకనే ఈ సృష్టియను యజ్ఞము భగవంతుని శరీరభాగములనుండి దిగి వచ్చినది. సూర్యుడు కన్నులుగను, మనస్సు చంద్రుడుగనూ, నోరు ఇంద్రుడుగను, మరియు అగ్నిగాను మున్నగు విధములుగా ''పురుష సూక్తము'' నందు వర్ణింపబడినది. ఆయన శ్వాసయే సృష్టి, కనుకనే సుపర్ణుడు తన రెక్కలపై సృష్టిని మోసుకుని వచ్చుచున్నట్లు సుపర్ణసూక్తము లందు వర్ణింపబడినది. పరమాత్మ యొక్క ఉచ్ఛ్వాస నిశ్వాసములే వాని రెక్కలు.

105. శ్లో॥ యజ్ఞభృద్యజ్ఞకృద్యజ్ఞీ యజ్ఞభుగ్యజ్ఞసాధనః
యజ్ఞాంత కృద్యజ్ఞ గుహ్యమన్నమన్నాద ఏవచ ॥

**ప్రతిపదార్థము :-** 1. యజ్ఞభృత్ = యజ్ఞమును భరించువాడు, 2. యజ్ఞకృత్ = యజ్ఞమును చేయువాడు, 3. యజ్ఞీ = [illegible] కలవాడు, 4. యజ్ఞభుక్ = యజ్ఞమును అనుభవించువాడు, 5. యజ్ఞసాధనః = యజ్ఞమును సాధించువాడు, 6. యజ్ఞాంతకృత్ = యజ్ఞము పూర్తి చేయువాడు, 7. యజ్ఞగుహ్యం=యజ్ఞమునందు రహస్యముగా నున్నవాడు, 8. అన్నం = తినబడువాడు, 9. అన్నాదః ఏవచ= మరియు అన్నమును భుజించువాడు.

**తాత్పర్యము :-** నారాయణుని యజ్ఞము భరించువానిగా, కర్తగా, యజమానిగా, మరియు అనుభవించువానిగా, ధ్యానము చేయుము. ఆయన సృష్టికి లయకారకుడుగా నున్నాడు. ఆహారము తినువారియందు, తినబడు ఆహారము

నందునూ, తానే యజ్ఞ స్వరూపుడై దాగియున్నాడు.

**వివరణ :-** 1. భగవంతుడు ఈ సృష్టికంతకూ సర్వాంతర్యామిగా నుండి నడుపుచున్నాడు కనుక సృష్టి నిలిచి యున్నది. కనుక ఆయన సృష్టిని భరించుచున్నాడు.

2. సృష్టిని పరమాత్మ పుట్టించుచున్నాడు కనుక ఆయన కర్తయగుచున్నాడు. కాని సృష్టిపుట్టకముందు ఆయన కర్తకాడు. వాక్కునుచ్చరించునపుడు నీవు నుచ్చరించువాడి వగుచున్నావు. అనగా కర్తవు. ఉచ్చరించుటకు ముందు నీవు నీ వాక్కునకు కర్తవు కావు. అట్లే నారాయణుడు తన వాక్కుగా ఈ సృష్టి యజ్ఞమును నిర్వహించుచున్నాడు.

3. సృష్టి వ్యక్తమయిన పిదప నారాయణుడు దీనికి యజమానిగా నున్నాడు. అనగా నీ శరీరభాగములకు, నీకేశములకు నీవెట్లు యజమానిగా నున్నావో అట్లే తననుండి పుట్టిన ఈ సృష్టికి పరమాత్మ తానే యజమాని.

4. అట్లే ఈ సృష్టిని అనుభవించువాడు నారాయణుడే యగుచున్నాడు. కవి తాను రచించిన పద్యమును తానే చదువుకొని సంతోషపడునట్లు నారాయణుడు తన సృష్టిని తానే అనుభవించును.

5. మనయందలి భావములను వాక్యములు, మాటలుగా, మనము సాధించుకొనునట్లు నారాయణుడు ఈ సృష్టిని సాధించుచున్నాడు.

6. మనము చెప్పదలుచుకొన్న విషయమును చెప్పి పూర్తి చేయునట్లు నారాయణుడు సృష్టిని పూర్తిచేసి లయమును కల్పించును.

7. నీవు ఉచ్చరించిన విషయముకన్నా నీవు వేరుగా నున్నావు. అనగా నారాయణుడు సృష్టియందే తాను వేరుగా దాగియున్నాడు.

8,9. సృష్టియందు ఒకదానికొకటి ఆహారము లగుచు సృష్టిని నడుపుచున్నవి. మొక్కలు జంతువులకూ, మానవులకు ఆహారమగుచున్నవి. అనగా సృష్టియందు కొంతభాగము మిగిలిన భాగములకు ఆహారమగుచుండగా ఈ సృష్టి నడచి పోవుచున్నది. కనుక ఈ సృష్టి యందు నారాయణుడే తినుచున్నాడు. తినబడుచున్నాడు.

106. శ్లో|| ఆత్మయోనిః స్వయంజాతో వైఖానస్సామగాయనః
దేవకీ నందనః స్రష్టా క్షితీశః పాపనాశనః ||

**ప్రతిపదార్థము :-** 1. ఆత్మయోనిః = తనయందు తానే పుట్టుక గలవాడు, 2. స్వయం జాతః = తననుండి తానే పుట్టినవాడు, 3. వైఖానః = తననుండి తనను త్రవ్వుకొనువాడు, 4. సామగాయనః = తన పాటను తానే పాడువాడు, 5. దేవకీనందనః = దేవకీదేవి నందనుడు, 6. స్రష్టా = సృష్టించువాడు, 7. క్షితీశః = ఈ భూమికి అధిపతియైనవాడు, మరియు భూమి నశించుటకు కారణముగా నున్నవాడు, 8. పాపనాశనః = పాపమును నశింప చేయువాడు.

**తాత్పర్యము :-** నారాయణుని తనయందే తాను పుట్టుక గలవానిగా, మరియూ తనకు తానే పుట్టువానిగా, తనను తాను తనలోనుండి త్రవ్వుకొనువానిగా, తన గానముగా తనను సృష్టించుకొనుచున్న వానిగా ధ్యానము చేయుము. ఆయన ఈ లోకవములన్నిటికి సృష్టికర్త, అధిపతి, రక్షించువాడు, మరియు నశింపచేయువాడు, ఆయన పాపములను నశింపచేయు దేవకీదేవి కుమారుడు.

**వివరణ :-** 1. ఈ సృష్టికి మూలముగా అంతర్యామి యున్నాడు. ఆయనే ఈ సృష్టిని పుట్టించుచున్నాడు. కనుక తనకుతానే పుట్టుకయైయున్నాడు. అనగా పుట్టుక యనునది కూడా ఆయననుండి పుట్టినదే.

2,3,4. కనుక నారాయణుడు తననుండి తానే పుట్టుచున్నాడు. చోటునందలి తరంగములవలన అణువులు ఏర్పడి వానినుండి అన్ని వస్తువులు తయారగుచున్నవి. కనుక నారాయణుడు తనను తానే త్రవ్వుకొని వ్యక్తము చేయుచున్నాడు. అట్లు చేయుటలో ఈ సృష్టియంతయూ ఒక్కటే ప్రణాళికగా తన వైభవములను తానే గానము చేయుచున్నాడు.

5. శ్రీకృష్ణుడు అన్ని లోకములయందు సమముగా వ్యక్తమగుచున్నాడు. కనుక భీష్ముడు శ్రీకృష్ణునే నారాయణునిగా స్తుతించెను.

6. నారాయణుడు సృష్టికర్తకూడా. ఆయన మహాభారత యుద్ధమునకు పూర్వము రాజులందరి విషయములను, వారి సంబంధ బాంధవ్యములను సృష్టించినవాడు.

7. అనేకమంది రాజులు ఈ భూమిని పరిపాలించి మృతి చెందిరి. వారందరూ యుద్ధములలోనే గాక సామాన్యముగా కూడా చనిపోయిరి. కనుక ఆయన అందరి కథలను తానే కల్పించువాడు.

8. పరమాత్మ యుద్ధమునకు మరియు నాశనమునకు కారణముగా నున్నాడు. అనగా తనవలన అవి జరుగుచుండగా తాను నిజమునకు కారణమగుట లేదు. ఎందుచేతననగా తనకు వాటియందు ఇవి ఇట్లు జరగవలెనను సంకల్పము లేదు. ఆయన చూచుచుండగా జరుగుటయేగాని, జరిగించుటగాని, ఆపుటగాని యుండదు. కనుకనే ఆయన నారాయణుడయ్యెను. అంతేగాక తనను వేయి లోకముల యందుండు శక్తిగా ధ్యానము చేయువారు కలరు. అట్టివారి పాపములను తానే పోగొట్టి వారిని రక్షించుచున్నాడు.

107. శ్లో॥ శంఖభృన్నందకీ చక్రీ శార్ఙ్గధన్వా గదా ధరః
రథాంగపాణి రక్షోభ్యః సర్వప్రహరణాయుధః ॥

**ప్రతిపదార్థము :-** 1. శంఖభృత్ = శంఖమును ధరించువాడు, 2. నందకీ = నందకమను పేరుగల ఖడ్గము కలవాడు, 3. చక్రీ = చక్రమును ధరించినవాడు, 4. శారధన్వా = శార్గమను ధనుస్సును ధరించినవాడు, 5. గదాధరః = గదను ధరించినవాడు, 6. రథాంగపాణిః = తన చేతియందు రథచక్రమును ధరించినవాడు, 7. అక్షోభ్యః = క్షోభింపచేయుటకు సాధ్యము కానివాడు, 8. సర్వ ప్రహరణాయుధః = సరిగా కొట్టగలిగిన సమస్త ఆయుధములను ధరించినవాడు.

**తాత్పర్యము :-** పరమాత్మను, శంఖమును, ఖడ్గమును, చక్రమును, ధనుస్సును, గదను ధరించినవానిగా ధ్యానము చేయుము. ఆయన రథచక్రమును చేత ధరించుటచే క్షోభింప చేయుటకు అలవికానివానిగా యున్నాడు. ఆయన తన ఆయుధములతో చక్కగా కొట్టగలిగినవాడై యున్నాడు.

**వివరణ :-** 1. నారాయణుని శంఖము పేరు పాంచజన్యము. అనగా ఐదు విధములుగా శబ్దముల నుచ్చరించు జీవాత్మ. ఈ ఐదు పంచేంద్రియములు ఐదు పవిత్రమయిన సాధకములుగా శరీరమునందలి అంతర్యామికి లోబడి పనిచేయుచున్నవి.

2. నందకము నారాయణుని ఖడ్గము. ఖడ్గము చీల్చును అనగా సత్పురుషునికి వివేకము ఖడ్గముగా పనిచేయును. చిక్కు సమస్యలను తీర్చి మార్గము చూపును.

3. నారాయణుని చక్రము పేరు సుదర్శనము. అనగా చక్కని దర్శనము. ఇది శిరస్సునందలి గ్రహణ శక్తికి సంకేతము.

4. శారము భగవంతుని ధనుస్సు. కనుబొమ్మలే వింటి వంపులు. దీనిని ధ్యానము చేయువానికి వానిలో అంతఃకరణము మేలుకొనును.

5. శిరస్సు, వెన్నుపాము కలిపినచో అది నారాయణునికి గదయగుచున్నది. దీని నుపయోగించి భగవంతుడు శత్రువులను నశింపచేయుచున్నాడు.

6. మన శరీరమే రథము. అందలి ప్రతి భాగము భగవంతునకు ఆయుధమే. ప్రతి దినము, నెల, మరియూ సంవత్సరము, జీవితరథమునకు చక్రములు అందలి ఆకులు.

7,8. ఈ రథము భగవంతుడు తానే నడుపుచున్నాడు. గనుక ఆయన క్షోభింపబడడు. కనుక ఈ పంచేంద్రియములతో కూడిన రథమే ఆయనకు అయిదు గుఱ్ఱములు పూన్చిన జీవిత రథము. ఇందు ఆయనే ప్రయాణము చేయుచూ గురి తప్పని తన ఆయుధములతో శత్రువులను కొట్టుచున్నాడు.

108. శ్లో॥ వనమాలీ గదీశారీ శంఖీ చక్రీ చ నందకీ
శ్రీమాన్నారాయణో విష్ణుర్వాసుదేవో భిరక్షతు ॥

**ప్రతిపదార్థము** :- 1. వనమాలీ = వనపుష్పములతో కూడిన మాలను ధరించినవాడు, 2. గదీ = గదను ధరించినవాడు, 3. శారీ = ధనుస్సును ధరించినవాడు, 4. శంఖీ = శంఖము ధరించిన వాడు, 5. చక్రీ = చక్రమును ధరించిన వాడు, 6. నందకీ = నందకమను శక్తిని ధరించినవాడు, 7. శ్రీమాన్నారాయణః = జలములే తన మార్గముగా గలిగి వైభవముతో కూడినవాడు, 8. విష్ణుః = అంతటనూ వ్యాపించియుండువాడు, 9. వాసుదేవః = వసుదేవుని కుమారుడు, 10. అభిరక్షతు = అన్ని దిక్కులనుండి రక్షించుగాక.

**తాత్పర్యము** :- నారాయణుని వన పుష్పములతో కూడిన మాలను ధరించినవానిగా, గదను, విల్లును, శంఖమును, చక్రమును, ఖడ్గమును, ధరించి తన వైభవమును లేక మహిమలను వెదజల్లువానిగా, జీవశక్తి యను జలములకు అధిపతియైన వానిగా, వ్యాపించుట అను శక్తికధిపతిగా, మనయందు వాసుదేవుడను పేర నివసించువానిగా ధ్యానము చేసినచో అతడు అన్ని వైపులనుండి మనలను రక్షించును.

**వివరణ** :- 1. పై ఐదు ఆయుధములు ధరించి నారాయణుడు వేలనామములు గలవానిగా, ధ్యానించుటవలన ఆయన రక్షించును. పంచేంద్రియములే ఈ అయిదు ఆయుధములు. అనగా మనమేది తెలుసుకొన్ననూ పంచేంద్రియముల ద్వారానే తెలుసుకొనవలసియుండును. పంచేంద్రియములు లేనిదే భౌతిక సృష్టి లేదు. కనుకనే ప్రపంచమని పేరు వచ్చినది. అనగా పంచేంద్రియములవలన తెలియబడునది అని అర్థము. తన ప్రజ్ఞను నారాయణునికి సమర్పణ చేసినవారికి ప్రపంచమంతయూ ఆ నారాయణుని రూపముగా గోచరించును. జీవుల నామములే వాని నామములుగా ధ్యానము చేయువానికి ప్రత్యేకముగా ధ్యానము చేయుట అక్కరలేదు. ఇరవైనాలుగు గంటలూ వానికి ధ్యాన సమయమే. ప్రపంచమే ధ్యాన మందిరము. కనులు మూసుకున్ననూ, తెరచిననూ ఒక్కటే. వానికి నిరంతరము నారాయణుని సాన్నిధ్యముండును. అనగా వ్యక్తిగత జీవితము ఆ నారాయణోపాసనగా మారిపోవును. కనుక వానిని నారాయణుడే రక్షించును. అంతేగాక వాని సమస్త బాధ్యతలు తానే స్వీకరించును. ఈ చివరి మంత్రమునందు మరియొక రహస్యమున్నది. ఇంతవరకు విష్ణువు నామములను చెప్పి ఇప్పుడు ఈ శ్లోకమునందు అభిరక్షతు అని పూర్తి చేయుటవలన ఈ నామములు గలవాడు ధ్యానము చేయువారిని లోపలనుండి బయటనుండి కూడా రక్షించునని అర్థము. అంతేకాక ఒక్కొక్క నామమునకు అభిరక్షతు అని చేర్చి కూడ ధ్యానము చేసుకొనవచ్చును. అనగా విశ్వం అభిరక్షతు (విశ్వముగానున్న పరమాత్మ రక్షించును) ''విష్ణుః అభిరక్షతు'' (విష్ణువుగా నున్న పరమాత్మ రక్షించును) అని వేయి నామములనూ విడి విడిగా ధ్యానము చేయుట వలన సృష్టియందలి ఆయా గుణ విశేషములుగా వ్యక్తమగు పరమాత్మను ధ్యానము చేసి సిద్ధింప

చేసుకొనవచ్చును. అట్లే ఇంకొక విధానముగా కూడా చేయవచ్చును. "వాసుదేవః అభిరక్షతు" అను మంత్రమునకు ఒక్కొక్క నామమునకు చేర్చినచో ఆ నామముగల పరమాత్మ వ్యక్తమై రక్షించుగాక యని అర్థము వచ్చును. "విశ్వం వాసుదేవో అభిరక్షతు" విశ్వముగా నున్న పరమాత్మ వాసుదేవుడై అనగా జీవులరూపమున నున్న పరమాత్మయై నన్ను రక్షించుగాక యని అర్థము. ఇట్లే విష్ణుః వాసుదేవో అభిరక్షతు, వషట్కారో వాసుదేవః అభిరక్షతు అని వేయినామములను కూడా ధ్యానము చేయవచ్చును.

చిట్టచివరగా ఇంకొక విశేషమున్నది. నారదుడు వేదవ్యాసునికి భాగవత రహస్యమునుపదేశించెను. దానివలన వ్యాసునికి మనస్సు స్వచ్ఛమై తోటి జీవులలో నారాయణుని చూచి ఆయా జీవులు తరించుటకు సూటియైన, సులువైన మార్గము విశదమయ్యెను. అట్లు విశదమగుటకు కారణము నారదుడు. ఉపదేశించినది మూడు నామములతో కూడిన ఉపాసన. అవియే ఒకటి విష్ణూపాసన, రెండు వాసుదేవోపాసన, మూడు నారాయణోపాసన. అందు విష్ణూపాసన సృష్టియందలి సకల జీవులలోను, పరిసరములలోను విష్ణువును చూచి వానికి సమర్పణముగా జీవించుట యగును. అన్ని వస్తువులు, జీవులు, ప్రాణులు విష్ణుని రూపములే యగును. ఇట్లుపాసించువానికి తనవి, ఇతరు..యగు వస్తువులుండవు. జీవితము విష్ణూపాసనగా నడచును. విష్ణువే సమస్తమున.. అధిపతిగా నుండును.

వాసుదేవో..నయనగా జీవుల ప్రవర్తన రూపమున వ్యక్తమగు పరమాత్మ అనగా తనను నిందిం..ని యందు, మెచ్చుకొనువారి యందు వాసుదేవుని చూచుట. అట్లు చూచి మ..ను సరిపెట్టుకొనుటగాక నారాయణుడే తనను నిందించువారి రూపమున పరీక్ష..చున్నాడని తెలియవలెను. ఆయన మన మనస్సునందలి రాగద్వేషములను, ఈ..యలను, బయటకు లాగి మనకే చూపించును. కనుక ఈ ఉపాసన మనస్సు..సర్ది చెప్పుకొనుట వల్లగాని, ఊహలను అణచిపెట్టుకొనుట వలనగాని సాధ్య.. వాసుదేవుడే ఆయా జీవుల రూపమున వర్తించుచూ తనతో పరిహాసమా.. తెలుసుకొని, హృదయపూర్వకముగా నమ్ముకొని యున్నవారికి, తాను హే..డని ..యైనప్పుడు,

ఎదుటి వారెటుల నవ్వుచూ వినోదింతురో తానునూ అట్లే వారితో కలిసి వినోదించగలిగి యుండవలెను. ఇదియే నిజమైన వాసుదేవోపాసన.

నారాయణోపాసన యనగా ఈ సమస్త సృష్టిని నారాయణుడను మహాచైతన్యము లేక ఆనందము యొక్క స్పర్శగా అనుభవించుట. ఆనందమను మహాసముద్రము నుండి పైకి లేచిన కెరటమే భౌతిక సృష్టి. ఆ సృష్టియందు తానం వేరుగా నున్నానను భావము నశించి నారాయణుని ఆనందమయలోకమునందు నిరంతరమూ ఏ కారణమక్కర లేకయే నివసించువారికి పైన చెప్పబడిన ఉపాసన లన్నియూ లీనమై, జీవిత మాధుర్యమను దివ్య సంస్పర్శయందు మనస్సు నిలిచి, ఆ మాధుర్యమే నిరంతర అనుభవముగా నిలచి పోవును. అనగా వారికి వ్యక్తిగత జీవితము, ఉపాసనలు, సాధనలు నారాయణుడు. విష్ణువు మున్నగు అనేకస్థితులు వుండవు. తుదకు తాను కూడా నుండడు. అంతయూ ఆనందమను ఒకే స్థితిలో కరగి యుండును. తనకు తాను ఆనందముగా నుండుటయేగాని వేరుగా తెలియుట యుండదు. భేదములు మరియు లోకములు లేని ఒకే అనుభవముగా తెలియుచుండును. ఆనందించుచుండుటయే నిలిచిపోవును.

## డాక్టర్ పిడూరు జగన్మోహనరావు గారిచే రచింపబడిన ఇతర గ్రంథముల వివరములు

1. **మహానారాయణోపనిషత్తు** (మొదటి భాగము)

సాధారణ ప్రతి 58/-

మేలు ప్రతి 85/-

ఇందలి మంత్రములు పెక్కు భాగము నిత్య జీవితము నందు ఎక్కువ ఉపయోగపడగలవు. యోగసాధనకు సంబంధించిన రహస్యములు, మంత్రములు, ధ్యాన పద్ధతులే కాక స్నానము, భోజనము, జలపానము, వ్యవహారము మున్నగు సమయముల యందు తానుండవలసిన విధానముల గూర్చియూ, అందలి దోషములను తొలగించు విధానములు మొదలగు విషయాలు ఈ మంత్రముల యందు కలవు. అన్నింటికీ సమగ్రమైన వ్యాఖ్య కూర్పు చేయడమైనది.

2. **మహానారాయణోపనిషత్తు** (రెండవ భాగము ) - (అచ్చులో నున్నది)

3. **పతంజలి యోగ సూత్రములు** - ప్రథమ సంపుటము -15/

యోగసాధన గూర్చి మిక్కిలి సమగ్రమైన వివరణ నిత్యజీవితమున మరియు నేటి నవ నాగరిక ప్రపంచమున జీవించుచునే యోగసాధన ఎట్లు ...కొనవలయునో ఈ సూత్రముల వ్యాఖ్యానము నందు వివరింపబడినది.

4. **పతం... యోగ సూత్రములు** - ద్వితీయ సంపుటము - 15/

ప్రథమ సంపు... నందున్నవి కాక మరికొన్ని ముఖ్య సూత్రములకు సమగ్ర వ్యాఖ్య.

6. **పూర్ణిమా ధ్యానము**

...యముద్రణ అచ్చులో నున్నది.

ప్రతి పూర్ణిమ దినము యోగసా... ...లి అనుకూలమైన సమయము.

పన్నెండు పూర్ణిమలలోనూ ధ్యానము చేసుకోవలసిన మంత్రములు, ఉపాసన చేసుకోవలసిన విషయములు, యోగవిద్యా రహస్యములు వివరింపబడినవి.

6. **ప్రజ్ఞా విలాసము**

సాధారణ ప్రతి 45/-

మేలు ప్రతి 55/-

మానవ దేహకోశముల యందలి ప్రజ్ఞాకేంద్రములను గూర్చి చక్కని వివరణ. షట్చక్రములు, సహస్రారము, వాటి అదిష్ఠాన దేవతలు మొన్నగునవియే కాక యోగసాధన జరుగునప్పుడు ఏయే స్థితులలో యోగికి ఏయే కేంద్రములు వికసించి పని చేయునో మిక్కిలి సులభశైలిలో వ్రాయబడినది.

## MEDITATION OF SUN IN HEART
## (ADITYA HRIDAYAM)

What is a SUN? Is it a mere inert globe of flames or a Spiritual Personality?

What is the most easy way of practical meditation?

What is the relation between the SUN and the Heart?

In a lucid commentary on the text of "Aditya Hridayam" an extract from Ramayana in Sanskrit, the author answers the above Questi besides explaining various Sanskrit termes involved.

Many startling facts about the birth of SUN and his activi space are revealed in this book.

Deluxe Edition : 35/-

Ordinary Edition : 25/-